డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం.

# భాషాశాస్త్ర పరిచయము





నాగలక్ష్మి గ్రంథమాల
నరసరావుపేట, 522601.

# భాషాశాస్త్ర పరిచయము




రచయిత :

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం, యం. ఏ., పిహెచ్. డి.

రీడర్ : తెనుగు విభాగం, నాగార్జున విశ్వవిద్యాలయం

నాగార్జున నగర్ - 522 510

ప్రచురణ :

నాగలక్ష్మి గ్రంథమాల

నరసరావుపేట - 522 601

ప్రథమ ముద్రణ :
వేయి ప్రతులు

మూల్యం :
~~సాదా ప్రతి రు. 22-00~~
మేలు ప్రతి రు. 25-00



ప్రతులకు : శ్రీమతి అంకా నాగలక్ష్మి
అంగరవారి వీధి
నరసరావుపేట – 522 601

ముద్రణ :
శాంతి ప్రింటర్స్, నరసరావుపేట
వెల్‌కం ప్రెస్, గుంటూరు.

# * అంకితం *

వ్యావహారిక భాషోద్యమ సారథి

కీ.శే. గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారికి

శాసనం కాదు, వర్ణనమే
వ్యాకరణమన్న విజ్ఞాని;

సవర భాషకు వ్యాకరణం
సవదరించిన శాస్త్రజ్ఞుడు;

వృత్తిచేత కాకున్నా ప్ర
వృత్తిచేత భాషాభిజ్ఞుడు;

ఆంగ్లాంధ్ర వాఙ్మయాంబుధుల్ని
ఆపోశించిన అగస్త్యుడు;

శిష్ట వ్యవహారంలోనే
తుష్టిగా రచనలు సర్వం

నిర్వహింపబడాలంటు
నిర్విరామంగా పోరాడి

కట్టకడకు విజయించిన
దిట్ట 'వేంకటరామమూర్తి'

'గిడుగు - పిడుగు' ప్రఖ్యాతుడు
తడబాటెరుగని మనీషి

స్మృతి చిహ్నంగా గ్రంథం
సమర్పింతు సముచితమతి."

"రచయిత"

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం
తెనుగు విభాగం : నాగార్జున విశ్వవిద్యాలయం

నాగార్జున నగర్,
22–3–82

# మున్నుడి

పదునాలుగేండ్లకు పైగానే యం. ఏ., తెనుగు విద్యార్థులకు, ఎవరికో ఒకరికి భాషాశాస్త్రం బోధిస్తునే ఉన్నాను. వీరికోసం ప్రణాళికాను గుణంగా సిద్ధం చేసుకొన్న వ్రాతే ఇప్పుడీరీతిగా గ్రంథ రూపం వహించింది.

తెలుగు వారికి భాషాశాస్త్రాన్ని పరిచయం చేసే గ్రంథం ఇంతవరకు రాలేదు. ఆ శాస్త్రాన్ని గూర్చిన ప్రాథమిక పరిజ్ఞానాన్ని ఏ కొంతైనా ఈ పుస్తకం చేకూరిస్తే నా ప్రయత్నం సఫలం.

ఆచార్యవర్యులు విద్వాన్ గంటి జోగి సోమయాజిగారు మాత్రం నన్నాశీర్వదించారు. వారి శిష్యవాత్సల్యానికి నమోవాకాలు.

ఈ గ్రంథాన్ని శ్రమకోర్చి ముద్రించిన నాగలక్ష్మీ గ్రంథమాల – నరసరావుపేట వారికి నా మెనరు.

రచయిత

**Prof. G. J. SOMAYAJI,** Vidwan M, A,. L.T.
Kalaprapurna, Hony Dr. (Andhra)
Chairman (Retd) Commission for Scientific and
Technical Terminology Ministry of Education NEW DELHI

Head of the Dept, of Telugu
Andhra Uuiversity (Retd).
formerly

CHAIRMAN [Academic
Sub-Committee] Board of
Governers Telugu Academy
HYDERABAD.

PRABHATAM.
Official Colony 16-2-8
VISAKHAPATNAM - 2

Date. 15-3-82

# పరిచయం

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తంగారు తెలుగు వ్యాకరణం, ప్రాచీన అర్వాచీన భాషా శాస్త్రాలు బాగుగా అలవరచుకొన్న పండితులు. ఈ శాస్త్రాలు యం. ఏ., తరగతులకు బోధిస్తూ ఉన్నారు.

వీరు వ్రాసిన 'తెనుగు వ్యాకరణ వికాసము' రెండు సంపుటాల గ్రంథం. పి హెచ్. డి. పట్టమునకు ద్ధాంత వ్యాసంగా సమర్పించిన పరిశోధన పయిని అధారపడింది. ప్రా న తెలుగు వ్యాకరణాలను, వాక్యపదీయం మొదలైన సంస్కృత వ్యా రణ గ్రంథాలతో కలిపి తులనాత్మకంగా, అను సృతుల నిరూపణతో గూడ జరిగిన రచన అది.

ఇపుడు యూనివర్సిటీలలో 'భాషాశాస్త్రం' ఆంగ్లంలోని గ్రంథాలాధారంగా బోధిస్తున్నారు. ఇందులో ముఖ్యంగా అమెరికన్ భాషాశాస్త్ర గ్రంథాల సారమున్నది. దానిని చెప్పేవారు దాని వివరణలు, ఉదాహరణలు కూడా ఆంగ్లంలోనే ఇస్తున్నారు. ఇవి తెలుసుకోలేని విద్యార్థులు, బోధకులు కూడా తికమక పడుతున్నారు. ఒక నిర్దిష్ట ప్రణాళిక కూడ స్పష్టపడలేదు. ఆలోటు తీర్చటానికి ప్రకృత గ్రంథం 'భాషాశాస్త్ర పరిచయం' అనే పేరుతో వెలువరించినారు, పురుషోత్తంగారు.

ఇందులో భాషోత్పత్తి, భాషా కుటుంబాల విభజన, ధ్వని, వర్ణ పదాంశ వాక్య విజ్ఞానాదులు, తులనాత్మక పరీక్ష, మాండలికాలు మొదలైన విషయాలన్నీ తేట తెలుగులో స్పష్టంగా నిరూపించారు.

ఏ శాస్త్రానికైనా కొన్ని మూల సిద్ధాంతాలుంటాయి. వాటిపైనే విచారణలు పెరుగుతూ శాస్త్రం వృద్ధి అవుతుంది. పై మూలములలోని వైరుధ్యాలు సమన్వయం చేయగలిగిన వాడే పండితుడు. ఏ విషయం తెలుసుకోవాలన్నా దానిలోని లేశాలు విచారించాలి. అంగజ్ఞానం పూర్ణంగా తెలియాలి అంటే అంగియొక్క జ్ఞానంకూడా తెలియక తప్పదు. అందుచేత భాషాశాస్త్ర సామాన్య విజ్ఞానం కూడా అత్యవసరం తెలుగు విద్యార్థులకు.

1931 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో తెలుగు యం. ఏ., కు పఠనీయం అయిన విషయానికీ నేటి భాషాశాస్త్ర విజ్ఞానానికీ చాలాభేదం ఉంది. ఆనాటి ప్రాథమిక విషయాలే కాక, ఆ తరువాత తెలిసిన క్రొత్త విషయాలు, ఏబది వర్షాల పెరకువ ఉపాదేయమే అయింది.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో చదువుల ఆకుమడిలో వేసిన అంతేవాసి రూప జ్ఞాని బీజాలు మహావృక్షాలయి శాఖోప శాఖలుగా అడయారులోని వట వృక్షం వలె అవ్యయమైన అశ్వత్థం వలె, దేశ దేశాంతరాలలో ఖండాంతరాలలో వ్యాపించాయి. ఆంగ్లాది భాషల్లోను ఫలరూపమైన గ్రంథాలు విశేషంగా ఆవిర్భవించాయి.

అట్టి మహావృక్షాలలో పురుషోత్తంగారు ఒక విశిష్ట స్వరూపాన్ని పొందినారు. తమ జ్ఞానాన్ని తెలుగులో వెలయించారు. ఆనాడు కేవలం 'ఆంధ్రభాషావికాసం' మాత్రమే మూలంగా ఉండేది. తెలుగు విద్యార్థుల కది అనివార్యంగదా ! ఇక ఉత్తరోత్తర విషయాంత రాభిలాష ప్రజలలో మేలుకొంది. ఆ అభిలాషను తీర్చడానికి ఈ పుస్తకం తెలుగు వారికి ముఖ్య సాధనం. యం. ఏ., పరీక్ష చదువరులకు, తరువాతి పరిశోధనకూ ఈ గ్రంథం చాలా ఉపకారకం. వీరికి నా ఆశీస్సులు. శుభం.

విద్వాన్ సోమయాజి.

# విషయ విన్యాసం

| | | పుటలు |
|---|---|---|
| **1.** | **భాషా శాస్త్రి పరిచయం** | **1-35** |
| 1-1 | భాష అంటే ఏమిటి ? | 2-5 |
| 1-2 | భాన వివిధ శాస్త్రాలు | 5-8 |
| 1-3 | భాషోత్పత్తి వాదాలు | 8-14 |
| 2-0 | భారతీయుల భాషాకృషి | 14-24 |
| 3-0 | ప్రాచీన కాలంలో పాశ్చాత్యుల భాషాకృషి | 25-28 |
| 4-0 | ఆధునిక భాషాశాస్త్రా విర్భావాభివృద్ధులు | 28-25 |
| **2.** | **భాషల వర్గీకరణం** | **35-57** |
| 5-7 | జాతీయ వర్గకరణం | 37-43 |
| 8-10 | భారతదేశంలోని భాషా కుటుంబాలు | 43-47 |
| 11-16 | పదాంశ విభజనం | 48-57 |
| 17-0 | పదాంశ వుభజనలోని లోపాలు | 57 |
| **3.** | **ధ్వని విజ్ఞానం** | **58-92** |
| 18 | భాషాధ్వనుల ఉత్పత్తి అవస్థలు | 58-62 |
| | ధ్వన్యుత్పత్తిలో పరోక్ష భాగస్వాములు | |
| | పత్యక్ష భాగస్వాములు | |
| 19 | వాగింద్రియముల అనువర్ణనం | 63-70 |
| 20-21 | ప్రయత్న భేదాలు | 70-78 |
| 22-23 | స్వరములు : తెనుగు స్వరవర్ణనం | 78-82 |
| 24 | ఐ. పి. ఏ. చరిత్ర | 82-83 |
| 25 | ప్రపంచ భాషా గత ధ్వని వర్ణనం | |
| **4.** | **వర్ణ విజ్ఞానం** | **92-122** |
| 26 | పృథ గ్వర్ణ నిర్ణయం | 92-94 |
| | వర్ణధ్వని - వర్ణ - సవర్ణం | 94-101 |

సంశ్లిష్ట వర్ణాలు లేక అర్థాంశిక వర్ణాలు 101-108
వర్ణ, సవర్ణ నిర్వచనాలు 108-109
వర్ణ స్థాపన 110-111
కనిష్ఠ పదయుగళాలు 111-116
వర్ణం - భిన్నదృక్పథాలు 116-119
ధ్వన్యాత్మక - వర్ణాత్మక లేఖనాలు 119-122

5. పదాంశ విజ్ఞానం 123 137

27 పదం - పదాంశం, పద్ధాంశం - సపదాంశం, 123-128
అర్థశూన్యపదాంశం-మరికొన్ని పదాంశాలు 128-132
ధాతువు - ప్రాతిపదిక 133-134
శబ్దాశ్రయ, రూపాశ్రయ సపదాంశాలు 135-136
పదాంశాలు - పరిసర భేదాలు 136
పదాంశ స్థాపన సైడా సూచనలు 136-137

5-ఎ. 28 వాక్య విజ్ఞానం 137-147

6. విపరిణామ విజ్ఞానం 148-1 3

30 త్రివిధ విపరిణామాలు శబ్దవిపరిణామ
హేతువులు, రీతులు 148-166
31 ధ్వని సూత్రాలు 166-173
32 అర్థ విపరిణామం 174-183

7. 33 తులనాత్మక విజ్ఞానం 184-193

8. మాండలిక విజ్ఞానం 194-253

34 మాండలిక మంటే ఏమిటి ? 194-230
మాండలికాలేర్పడ టానికి హేతువులు -
తెలుగులోని మాండలికాలు-మాండలికాల్లోని
అర్థశబ్దభేదపరిశీలన-తెలుగుభాషా మాండలికాలు-

| | | |
|---|---|---|
| | మాండలిక భౌమిక శాస్త్రం-మాండలిక పదసేకరణ పద్ధతులు- | |
| 35 | భాషాభేదాలు : ప్రమాణీకరణ సమస్యలు | 230-253 |

9. ప్రాతిదేయ విజ్ఞానం 254-284

| | | |
|---|---|---|
| 36 | ప్రతిదేయత్వ హేతువులు- | 254-262 |
| 37 | త్రివిధ ప్రతిదేయత్వాలు- | 262-284 |

10. భాషాప్రయోజనాదిక విజ్ఞానం 285-313

| | | |
|---|---|---|
| 38 | జాతి – భాష | 285-291 |
| 39 | భాషా ప్రయోజనాలు | 291-294 |
| 40 | జీవితం – భాష – వాఙ్మయం | 295-308 |
| | అంతర్జాతీయ భాషలు | 308-313 |
| | ధ్వన్యాత్మక లేఖనం | 315-317 |
| | ప్రపంచభాషలలోని కొన్ని ముఖ్యధ్వనులు | 318-319 |

THE ORGANS OF SPEECH 320

# 1. భాషా శాస్త్ర పరిచయము

1.0. భాషను అభివర్ణించే శాస్త్రమే భాషాశాస్త్రం. భాష సహజమైన వ్యవస్థ అంటే కట్టుబాటు. ఇది మృదువైనది, స్థిరమైనదికూడా. పరిణామ శీలం కలది. వ్యవహారంలో ఇది సజీవంగా విలసిల్లుతుంది. ఇటువంటి దీని స్వరూప స్వభావాల్ని, ఎటువంటి పూర్వాభిప్రాయాల మీద ఆధారపడకుండా, పరిశీలన ప్రధానంగా నిర్ణయించే శాస్త్రం-భాషా శాస్త్రం.

జీవ శాస్త్రంవలె ఇదికూడా వర్ణనాత్మక శాస్త్రం. (descriptive science) శాస్త్రం అంటే ఏమిటో కాదు-మనకున్న సామాన్యజ్ఞానాన్ని సుశిక్షితంగా వ్యవస్థీకరించు కోటమే. ( Science is nothing but systematised common sense). వర్ణనాత్మక శాస్త్రం అనటం చేత నిర్మాణం (structure) పరిసరాలు, జాతినిర్ణయం, కుటుంబ నిర్ణయం మొదలైనవి భాషా శాస్త్రానికి చాలముఖ్యం. అందుకు విషయ సేకరణం (Collection of material or data), వర్గీకరణం (Clasification), విషయ విశ్లేషణం (analysis),(వ్యాకరణమంటే అర్థమిదే,) సామాన్యీకరణం (generalisation) ఈ శాస్త్రానికంగాలు. ఎటువంటి విశేషణం ముందు చేర్చకుండా భాషా శాస్త్రం అంటె-వర్ణనాత్మక భాషా శాస్త్రమనే (Descriptive Linguistics)అర్థం. ఇదే ఇప్పుడు ప్రచురం. సమకాలీన భాషను వర్ణించే శాస్త్రం కాబట్టి దీన్ని Synchronic Linguistics అని అంటారు.

భాష పరిణామ శీలం కలదన్నాం కదా ! అటువంటి పరిణామ గతుల్ని నిరూపిస్తే అది 'చారిత్రక భాషా శాస్త్ర' మౌతుంది (Historical Linguistics) వివిధ కాలాలలోని భాషను నిరూపించేది కాబట్టి Diachronic Linguistics అనీ దీనికి పేరు.

భాషల సమాన ధర్మాల్ని పురస్కరించుకొని, కొన్ని కుటుంబాలుగా నిర్ణయం చేస్తాం. అటువంటి కుటుంబాలకు చెందిన సోదర భాషలతో (Cognate Languages) ఒక భాషలోని రూపాల్ని పోల్చి అధ్యయనం చేస్తే అది 'తులనాత్మక భాషాశాస్త్ర' మౌతుంది.

ఈ పుస్తకంలో ఈ త్రివిధ భాషా శాస్త్రాలు పరిచయం కావింప బడతాయి. దీనికి ముందు 'భాష' అంటే ఏమిటి? దాని పుట్టు పూర్వోత్తరాలు దానికి గల వివిధ నిర్వచనాలు, దానికి ఇతర శాస్త్రాలతో గల సంబంధాలు కొంతవరకు చర్చించుదాం.

1.1. భాష అంటే ఏమిటి ? భాషింప బడేది భాష. భాషించటమంటే మనోగతభావాల్ని కంఠధ్వనులద్వారా అభివ్యక్తం చేయటం. ఇందుకు ప్రధానంగా ఉపయోగపడే అవయవం-నాలుక. అందుకే ఆంగ్లంలో భాషకు టంగ్ (tongue) అనే పర్యాయపదం.

అయితే ఇక్కడింకో సందేహం. పశువులకు, పక్షులకు కూడా నాలుకలున్నాయి. అవీ తమ భావాల్ని కంఠధ్వనుల ద్వారా తెలియజేస్తాయి కదా! అప్పుడు వాటిని భాషలని అనాలి కదా! పూర్వకాలంలో విజ్ఞులైన కొంతమంది వ్యక్తులకు పక్షుల భాషలు తెలిసినట్లు కథల్లో వింటుంటాం. హితోపదేశం, పంచతంత్రం వంటి కథల పుస్తకాల్లో జంతువులు మనవలె మాట్లాడతాయి. నిజమే. ఇవన్నీ కాల్పనిక జగత్తుకు సంబంధించిన విషయాలు.

పశు పక్ష్యాదుల కంఠధ్వని సంకేతాల్ని భాషలని వ్యవహరించరు. ఎందుకంటే వాటికి మానవ భాషల్లాగా ప్రాంతీయతా వైవిధ్యం లేదు. వాటి కంఠధ్వనులు చాల పరిమితాలు. ప్రపంచంలోని ఆయా జాతి పశు పక్ష్యాదులొకేరీతిగా కంఠధ్వనులు చేస్తాయి. పరిమిత కంఠధ్వనుల్ని అపరిమితంగా, ఆయా సన్నివేశాల కనుకూలంగా ఉపయోగించుకొని, అనంత రూపాలతో భాషా సృష్టి చేయగల నేర్పు, తీర్పు, మానవుని కున్నట్లు (to make an infinite use of finite means) పశు పక్ష్యాదులకు లేవు కాబట్టి వాటిని భాషలుగా పరిగణించం. ఈ విషయమింకా మీద మీద విదిత మౌతుంది.

1.11. కొన్ని నిర్వచనాలు-ఇతర శాస్త్రాలతో సంబంధం : అనంతము, సజీవము అయిన భాషను, అనుభవంలో విదితమౌతున్న దాన్ని నిర్వచన పంజరాల్లో బంధించటం సాధ్యం కాదు. అలాంటి అసాధ్యాల్ని సాధ్యం చేయటానికి యత్నించటం, మానవులకు సర్దా. వాటిని

పరిశీలించటంవల్ల భాషను గూర్చిన మన దృక్పథం, అవగాహన మెరుగు పడతాయి. అందుచేత కతిపయ నిర్వచనాల్ని పరిశీలిద్దాం.

1.12 "అలవోకగా ఉత్పన్నమయ్యే కంఠ ధ్వనుల సాధనాలతో, కేవలం మానవతా సంబంధమైె సహజాతేతర పద్ధతి ద్వారా, మానవోద్రేకాల్ని, ఆలోచనల్ని, వాంఛల్ని, తెలియ జేసేదే "భాష" అని అంటాడు సఫీర్.[1]

సహజాత మంటె పుట్టుకతో వచ్చేగుణం. కామం, క్రోధం మొదలైనవి. భాష అలాంటిది కాదు. పశుపక్ష్యాది మానవేతరం కావించే భావప్రకటనలు భాష అనిపించుకోవు. మనస్తత్త్వ శాస్త్రానుకూలమైన నిర్వచనమిది.

1.13 "వక్త తన ధ్వన్యుత్పత్త్యయవవాల సాయంతో కావించే ధ్వనుల పరంపరే భాష. వీటిని శ్రోత తన శ్రవణేంద్రియం ద్వారా స్వీకరిస్తాడు. ఈ విధంగా వక్తకు శ్రోతకు మధ్య నాడీమండలంతో, మేధతో పెక్కు సర్దుబాట్లు గావించు కొంటు కొనసాగే ఉన్నత సంక్లిష్ట సూత్రజాలా వలయం భాష" అంటాడు సైమన్ పాటర్ (Language in the Modern world– page *10*) ఇది మానవ శరీర శాస్త్ర సంబంధంగా కావించింది (physiological). పశు పక్ష్యాదులకిట్టి నిర్మాణంలేదు.

1.14 ప్రజలు మాట్లాడుకొనే తీరే భాష. అంతేకాని ప్రజలిట్లా మాట్లాడాలని నిర్దేశించే తీరు కాదంటారొకరు.[2] ఇందులో వ్యవహారానికి ప్రాబల్య ముంది. తప్పొప్పుల నిర్దేశాలు తగవని, ప్రజలు మాట్లాడింది భాష అని గుర్తించాలంటుంది నిర్వచనం.

"పరిమిత సాధనాల్ని, అపరిమితంగా వాడుక చేసేది భాష" (Language makes an infinite use of finite means) . ఏ భాష లోనైనా వర్ణాలు పరిమితంగానే వుంటాయి. వాటి కలయికలే అనంతంగావుంటాయి.

---

[1] "Language is a purely human and non-instictive method of communicating ideas, emotions, and desires by means of a system of voluntarily produced symbols" – *Language page 8* -

[2] A Language is the way people talk, not the way some one thinks they ought to talk.

అంతటి సంస్కృత భాషకు వర్ణాలు ఏభై మాత్రమే. ఈ విషయాన్ని మాఘకవి తన శిశుపాల వధలో ఇలా పేర్కొంటాడు-

"వర్ణైః కతిపయై రేవ
గ్రథితస్య స్వరై రివ
అనంతా వాఙ్మయ స్యాహో !
గేయస్యేవ విచిత్రతా !" (2-72)

సంగీతమంతా ఏడుస్వరాల్లో విచిత్రంగా ఇమిడి ఉన్నట్లుగానే అనంత వాఙ్మయం కతిపయ వర్ణాలతోనే కూడి ఉండటం మహాశ్చర్యం. భాషయొక్క అనంతోపయోగవైభవాన్ని సూత్రప్రాయంగా ఈ నిర్వచనం సూచిస్తుంది.

1.15. "అలవాట్ల సంక్లిష్ట వ్యవస్థే భాష" అని హాకెట్ (A course in Modern Linguistics "A language is a complex system of speech habits" పుట 137) భాష సామాన్య వ్యవస్థకాదు. అనేకవ్యవస్థలతో కూడింది (systemic) అందుకే అది సంక్లిష్టం. అనుకరించి, అలవరచుకొనేది భాష. భాష సంపాదితమనే సిద్ధాంతవాసన ఇందులో వుంది.

1.16. దేని ద్వారా మానవులు తమ అభిప్రాయాల్ని నివేదించుకొంటు ఒకరితో ఒకరు సహకరించుకొంటుంటారో, అటువంటి వారి కంఠ ధ్వనుల స్వతంత్ర వ్యవస్థనే భాష అని నిర్వచించవచ్చు[1]. మానవులు ఆంగిక చేష్టాదులతో (gestures) కన్న, భాషద్వారా మిన్నగా సహకరించుకోవచ్చునని యిది సూచిస్తుంది. సహకరించు కోవటమంటే వ్యతిరేకించుకోటానికి కూడా భాష ఉపయుక్తమని చెప్పినట్లే.

మానవుడు చేసే కంఠ ధ్వనులన్నీ భాషాపరిధిలోనికి రావు. అనేక ధ్వన్యనుకరణ శబ్దాలు చేస్తుంటాడు. ఇవి అర్థవంతాలు కావు. ఉదాహరణం:

---

1. A language may be defined as a system of arbitrary vocal sounds by means of which human beings communicate and co-operate with one another —Simeon Potter.

*(Modern Linguistics-page 37)*

ధణధణ, టకటక, ఫెళఫెళ మున్నగునవి. ఆయావాక్యాల్లో కలసి అర్థవంతమైనట్లు భాసిస్తాయి.

ఈ ధ్వన్యనుకరణ శబ్దాల్ని కూడా బాగా రసవత్తరంగా ఉపయోగిస్తారు కొందరు కవులు.

ఉదా :- (క) "ఉష్ణాని హోమాగ్ని నూద నొల్లడు గాని
విరహజ్వరార్తుడై వెచ్చ నూర్చు"
(పాండురంగమాహాత్మ్యం- 3-12)

(చ) ఈ కడజాతి నాతి కిహిహీ మహిదేవుడు చిక్కెనంచు
(పాండురంగమాహాత్మ్యం 3-95)

మానవులంటే ఒక ప్రాంతములోని మానవులనే గ్రహించాలి. ఒక సమాజసభ్యులనీ అనవచ్చు. అపుడు భాష ఒకానొక సాంఘిక శాస్త్రంగా (social scienec) పరిగణింప బడుతోంది.

కంఠధ్వనులనటం చేత ఆంగిక చేష్టలు, లేఖన చిహ్నాలు, భాషాపరిధిలోనివికావు. అవి వేరే శాస్త్రం క్రిందికి వస్తాయి.

1.2 ఈ విధంగా పరిశీలిస్తే భాషకు ఇరువురు వ్యక్తులనివార్యం. ఒకడు వక్త, ఇంకొకడు శ్రోత. మానవ శారీరక శబ్దోత్పత్తి గ్రహణ యంత్రాలన్ని సక్రమంగా వుంటేనే భాషా వ్యవహారం సరిగా సాగుతుంది. అందుచేత భాషా శాస్త్రానికి మానవశరీర శాస్త్రంతో అనివార్యమైన సంబంధముంది. ఆ శాస్త్రపరిజ్ఞానం భాషాశాస్త్రానికి తోడ్పడుతుంది. అయినా ఆ వివరాలతోనే కాలయాపన చేయకుండా, ముఖయంత్రం, స్థానకరణ సంయోగాది సామాన్య విషయావగాహనలతోటే చాలమంది భాషాశాస్త్రాధ్యయనం చేస్తుంటారు.

1.21 మనస్తత్త్వ శాస్త్రం : (Psychology) భాషా శాస్త్రానికి దీనితో బాగా సంబంధముంది. మానవ మనోగత భావాలకు కంఠధ్వనులు సంకేతాలు.

వ్యక్తి నిత్య జీవితంలో అనేక పరిస్థితుల్ని ఎదుర్కొంటుంటాడు. తగినట్లు ప్రతిచర్యలు చేస్తుంటాడు.

పరిస్థితి - వ్యక్తి - ప్రతిచర్యలు

  

ఒకడు చెంపదెబ్బ కొట్టాడు - వ్యక్తి - తిరిగి చెంపదెబ్బ కొట్టాడు

ఈ పరిస్థితి, ప్రతిచర్యల స్థానంలో 'భాషణం' పని చేస్తుంది.

తిట్టటం (భాషణం) → వ్యక్తి → తిరిగి తిట్టటం (ప్రతిభాషణం)

ఎదుటివాడు తిట్టినపుడు తనలో తాను వీడికి మాటకు మాట, బాగా బదులు చెప్పాలని అనుకొని తిరిగి తిడితే ఈరీతిగా ఉంటుంది.

భాషణం → స్వగతభాషణం → ప్రతిభాషణం

మానవునకు భాష మంచి ఉపకరణం. అనేక క్లిష్ట సమస్యల్ని భాష ద్వారా సులువుగా పరిష్కరించుకొంటాడు. భాషవల్ల ఎంతో లాఘవాన్ని సంపాదించుకొన్నాడు. ప్రవాహంలో ఎవడైన కొట్టుకు పోతుంటే, భాష లేక పోతే, మానవుడేం చేస్తాడు? అవతలివాడ్ని రక్షించమని కోరటానికి ఏ సంజ్ఞలు చేస్తాడో వూహించలేం. కేకలు పెట్టి రక్షింపమని భాషద్వారా తన ఆర్తిని సులభంగా వ్యక్తంచేసి మేలు పొందుతాడు.

మనస్తత్త్వ శాస్త్రం కూడా ఇంకా ప్రయోగ దశలోనే వుంది. అందు చేత ఏ మనస్తత్త్వ శాస్త్ర సిద్ధాంతాలపై ఆధారపడకుండగానే భాషా పరిశీలనం చేస్తుండాలని బ్లూమ్‌ఫీల్డ్ అనే భాషా శాస్త్రజ్ఞుని హెచ్చరిక.

1.23 సాంఘిక శాస్త్రాలు : భాషకూడా ఒక సాంఘిక శాస్త్రమే కాబట్టి ఇతర సాంఘిక శాస్త్రాలైన చరిత్ర, సాంఘిక శాస్త్రాదులతో దానికి సన్నిహితత్వం ఉంటుంది. చరిత్ర కేవలం గతకాలానికి సంబంధించింది. ప్రాచీన భాషా స్వరూప గ్రహణానికిది కొంత తోడ్పడుతుంది. సమాజ తత్త్వ శాస్త్రం, సంఘంలోని వర్తమాన స్థితిగతుల్ని పరిశీలిస్తుంది. మారుతున్న ఆచార వ్యవహారాలకు భాషా రూపాలెట్లా ఏర్పడుతున్నవి ఈ శాస్త్రం ద్వారా తెలుసుకోవచ్చు.

చరిత్రకారులు శ్రద్ధవహించని సాంస్కృతిక చరిత్రను గూర్చి మానవ శాస్త్రజ్ఞులు కృషి చేస్తున్నారు. వీరు సంస్కృతికి విశేషప్రాముఖ్య మిస్తారు. భాషను అంతగా పరిగణించరు.

ఈ శాస్త్రజ్ఞులందరికి భాష ఒక పరికరం మాత్రమే. భాషా చరిత్ర, శాస్త్రం చరిత్ర కందని అనేక సత్యాల్ని నిరూపిస్తుంది. కాబట్టి ప్రత్యేకంగా అధ్యయనం చేయక తప్పదు.

వివిధ శాస్త్రి విషయాలు భాషద్వారానే వెలువడుతున్నాయి. అందరు భాషను గూర్చి ఎంతో కొంత శ్రద్ధవహించక భాష ఒక్కొక్కరికి ఏరీతి సాధనమో ఈ క్రింది రీతిని గ్రహించ

| | |
|---|---|
| సామాన్య మానవుడు : | తన భావాల ప్రకటనకు సాధనం |
| భాషాధ్యాపకుడు : | భాషోపయోగంలో ప్రజల కవరోధాలు లేకుండా చేసేది. |
| వాఙ్మయోపాసకుడు : | కవితా సౌందర్యావగాహన కొక సాధనం - చిత్రకారుడికి రంగుల్లాగా |
| మనస్తత్వశాస్త్రజ్ఞుడు : | మానవ ప్రవర్తనను ఇతర జంతు ప్రవర్తనల నుండి వేఱు పఱచు కోటాని కుపయుక్తమయ్యే ప్రముఖము శక్తిమంతమునైన ఉపకరణం. |
| మానవ శాస్త్రజ్ఞుడు : (anthropologist) | "తానధ్యయనంచేసే సంస్కృతి" లో ఒక భాగం |
| మత ప్రచారకుడు : | వివిధోపదేశోపయోగి |
| చరిత్ర కారుడు : | శాసనాల్ని రికార్డుల్ని చూచి |

చరిత్ర నిర్మించటానికి పనికి వచ్చేది.

(8) వేదాంతి : తర్కవిషయ చర్చకు, తార్కిక వాక్య యోజనాన్ని తెలుసుకోవటానికి పనికి వస్తుంది.

(9) ఇంజనీరు (కమ్యూనికేషన్స్) : వార్తల్ని, లిఖితంగా గాని వాగ్రూపంలో గాని, అందచేయటానికుపకరిస్తుంది.

(10) భాషా శాస్త్రజ్ఞుడు : భాష ద్వారానే భాషా విషయ వివేచనం చేయించేది.

భాషా శాస్త్రజ్ఞునకు భాషే సాధనం, సాధ్యం కూడా. తక్కిన వారికది కేవలం సాధనం మాత్రమే.

## 1.3 భాషోత్పత్తి వాదములు

భాషయొక్క పుట్టు పూర్వోత్తరాల్ని గూర్చి ప్రాక్ప్రతీచీ పండితులనేకోహలు చేసారు. అందులో పాశ్చాత్యుల వాదాల కన్న భారతీయ సిద్ధాంతాలే భాషా పరంగా ఉత్తమమైనవి.

1.31 బౌవే వాదం : ఆదిమ మానవులు తమ చుట్టునున్న శునకాది జంతు జాలం చేసే ధ్వనుల ననుకరించుటం చేత భాష ఏర్పడిందని మాక్స్ముల్లర్ వాదం.

### 1.32 డింగ్ డాంగ్ వాదం : (Pathogenic theory)

శబ్దానికి దాని అర్థానికి అతీంద్రియమైన సంబంధం. ప్రాచీన కాలంలో మనుష్యునకున్న ఒకానొక స్వాభావిక శక్తిచేత బాహ్య వస్తువులన్ని అతని అంతరంగంలో వాగ్రూపాల్ని పొందాయి. మానవ హృదయం ఒక గంట వంటిది. వాగ్రూపాలిందులో ధ్వనించగా భాష పుట్టిందట.

## 1.33 ఆశ్చర్య వాదం : (Interjectional theory)

మానవుడు సుఖదుఃఖాది భావాల్ని వెలిబుచ్చే సందర్భాలలో 'ఆహా' 'వహ్వా' 'భళి' 'అయ్యో' మొదలైన శబ్దాలుచ్చరిస్తాడు. ఇటువంటి ఆశ్చర్యార్థకాలనుంచి భాష జనిస్తుంది. ఈ వాదాల కేవిధమైన విలువ లేదు. ఇవన్నీ ధ్వన్యనుకరణ శబ్దోత్పత్తినే సూచిస్తున్నాయి. ఇవి పాశ్చాత్యులు చేసినవి.

## 1.34 ధాతు వాదం : (Root theory)

క్రీ.శ 5 వ శతాబ్దానికి చెందిన యాస్కాచార్యుడు భాషకు మూలం కొన్ని ధాతువులే (roots) అని, ధ్వన్యనుకరణం వల్ల ఏర్పడ్డ కితవ, దుందుభి, కృకవాకాది పదాలు కూడా కొన్ని వున్నాయని పేర్కొన్నాడు. కాత్యాయను డీ వాదాన్ని బలపరచాడు.

ధాతువులు క్రియారూపాలా ? నామ రూపాలా ? అనే వివాదం. గార్గ్యాదులు నామ బోధకాలు కూడా ఉన్నాయని వాదించారు. విశేషంగా ధాతువులు క్రియా బోధకాలే అని శాకటాయనాదుల వాదం. ఆధునికులు రెండు వాదాల్ని ఆమోదిస్తారు.

ఈ ధాతువాదం ఆధునికులకు గూడా ఆమోదంగా వుంది. సెమెటిక్ భాషల్లో మూడేసి వర్ణాల ధాతువులుంటే, ఇండో యూరోపియెన్ భాషల్లో ఏకాక్షర ధాతువులే ఉన్నాయి. ద్రావిడ భాషల్లో మధ్యమ పురుష క్రియలుగా ఉపయుక్త మౌతున్నాయి. రసాయనిక శాస్త్రంలో మూలకాల (elements) వంటివే ధాతువులని భాషా శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. చైనీయులు ఇటువంటి ధాతువులతోనే భాషా వ్యవహారం సాగిస్తారు.

## 1.35 క్రమపరిణామ వికాస వాదం : (continuous theory)

మానవుడు ప్రాచీన జంతుజాలంనుండి పరిణమించాడని, అతని ఆకారం, శరీర నిర్మాణం, ప్రవృత్తులు క్రమంగా పరిణమించాయనే సిద్ధాంతం స్థూలంగా అందరు అంగీకరించారు. మానవునకు భాష కూడా,

తక్కిన వాటివలెనే, ఇతర జాంతవిక అభిప్రాయ నివేదన పద్ధతుల క్రమ పరిణామంగా సంక్రమించాయనే వాదమిది.

మానవులకు పరిణామంలో సన్నిహితమైన వానర జాతులు-గిబ్బన్లు, చింపాంజీలు, గొరిల్లాలు మొదలైనవి. ఇవి ధ్వని సంకేతాల ద్వారానే తమ భావ ప్రకటనలు కావిస్తాయి. ఈ విషయమై ఆధునిక మనస్తత్త్వ శాస్త్రజ్ఞులు ఎంతో ఆసక్తికరంగా పరిశోధనలు సాగిస్తున్నారు.

పది, పన్నెండు కోతులున్న బోనులో శబ్దాల్ని రికార్డుచేసే యంత్రం ఉంచుతారు. పరిశోధకులు దగ్గరుండి ఏయే సందర్భాల్లో ఆధ్వనులు చేస్తున్నాయో గమనిస్తారు.

తరువాత ఆ రికార్డుల నన్నింటిని ఫోనుమీద త్రిప్పుతు-ఒకే 'మూడ్'లో కోతులు చేసిన శబ్దాలన్నీ ఒకేరకంగా వుంటాయో లేదో గమనిస్తారు. వాటినిబట్టి శబ్దాల భావాలు, అర్థాలు నిర్ణయిస్తారు. ఈ పరిశోధనకోసం న్యూయార్కులో ఆచార్య గార్నల్ ఆరు నెలలు కోతుల్లో కోతియై తిరిగాడట.

మాస్కోలో ఒక శాస్త్రజ్ఞుడు అతని అనుచరు లారుగురు, ఎనిమిది నెలలు కోతుల సాహచర్యం చేసి, వాటి ఇకిలింపులు, సకిలింపులు, గుర గురలు, బెరబెరలు-ఒక్కటీ పోనీకుండా పట్టుకొని వారి బుర్రలో వేసు కొన్నారు.

వీరందరు చేసిన పరిశోధనల వల్ల తేలిందేమంటే-కోతుల భాషలో 3 నుండి 50 మాటలవరకు ఉంటాయని ; చిన్నతనంలో కోతులకు మూడు, నాలుగు మాటలే రావడంచేత, వాటినే అవి ఏకరువు పెడుతూ వుంటాయని వాటి వయసు పెరిగిన కొద్ది భాష కూడా పెరుగుతుందని. ముసలి కోతులకు మంచి పాండిత్య ముంటుందట. ఏభై మాటల్ని క్షుణ్ణంగా మాటలాడ గలవట!

వేరు వేరు రకాల జాతుల కోతులకు, మానవులకు లాగానే వేరు వేరు భాషలుంటాయి ! అంతే కాక ఒక జాతి కోతుల్ని విడదీసి కొంతకాలం వేరుగా వుంచితే, అవి వేరు భాష అలవరచు కొంటాయని స్విట్జర్‌లాండ్‌లో ఇటువంటి చిత్రం కనుగొన్నారని కృష్ణాపత్రిక (1944 సం. సంపుటి) లో చదివాను.

"లాస్ ఏంజల్సులో ఏడు సంవత్సరాల వయసుగల చింపాంజీకి మాటలు నేర్పి, అది మనుష్యులతో సంభాషించేటట్లు చేశారు. దానికి మొత్తం 130 మాటలు నేర్పారు. కోతి భాషను కాకుండా అది తన పిల్లలకు మానవ భాషను నేర్పుతుందని, ఆతరం చింపాంజీలు మనుష్యులతో కొంత వరకు మాట్లాడ గలవని దానికి చదువు చెప్పిన అలెన్ గార్డినల్, ఆమె భర్త భావిస్తున్నారు. వీరిద్దరు నెవాడా విశ్వవిద్యాలయంలో ప్రసిద్ధ మనస్తత్వ వేత్తలు" (ఆంధ్రప్రభ–వారపత్రిక 10–5–72)

పై రెండు ఉదంతాలకు భిన్నంగా"కెల్లాంగ్"దంపతులు ఒక చింపాంజీని తెచ్చుకొని, పెంచుకొని దానిమీద పరిశోధనచేసి 1933 లో **The Ape and the child** అనే పుస్తకం వ్రాసి ప్రకటించారు. అందులో ఆ కోతి పిల్లకి మనుషుల అలవాట్లను తాము ఎంత త్వరగా నేర్పగలిగిందీ వివరించారు. కాని భాషను మాత్రం నేర్పలేక పోయామని అంగీకరించారు. వానరాలు భాషను నేర్చుకోలేక పోవటానికి వాటి ఉచ్చారణావయవాల లోపం కాదు. వానరాల ఉచ్చారణావయవాలు మానవులుచ్చరింవ గలిగిన ధ్వనులను ఉచ్చరించటానికి సమర్థమైనవే నని హూటన్ (Hooton) అనే శాస్త్రజ్ఞుని అభిప్రాయం."మానవుడి దగ్గర్నుంచి కొన్ని అలవాట్లను నేర్చుకో గల్గిన వానరాలు మానవుల భాషను నేర్చుకోలేక పోతున్నాయ" ని డాక్టర్ చేకూరి రామారావుగారు 'భాషా శాస్త్రంలో పరివర్తన సిద్ధాంతము' నే వ్యాసంలో పేర్కొన్నారు.

ఒకవేళ బలవంతంగా అంతో ఇంతో నేర్పినా, నాలుగైదేండ్లకే భాషోత్తీర్ణత (linguistic majority) పొందిన మానవ బాలుడిలాగా ఏ వృద్ధ వానరం భాషించలేదు. అనంత విధాలుగా వాక్య నిర్మాణం చేసే దక్షత (Competence) మానవునకు లభించినట్లు వానరాలకు లభించదు. అందు చేత ఈ వాదం ఆమోద యోగ్యం కాదు. భాషనేది క్రమవిచ్ఛిత్తి వాదాను కూలంగానే (discontinuous theory) మానవునకు ప్రాప్తించింది.

చిలుకలు, మైనాక పక్షులు మానవ కంఠ ధ్వనుల్ని అనుకరించ గలవే కాని అనంత విధాల భాషించలేవు. 'రామ రామ' అనే రామ చిలుక గొంతును గుడ్లగూబ పిసుకుతుంటే కీచు కీచు మనే అరుస్తుంది.

డాల్ఫిన్ చేపలు కుక్కలకంటె చింపాంజీలకంటె ఎక్కువ తెలివైన వని, అవి తమలో తాము మాట్లాడుకొంటాయని 'మియామి' ప్రయోగ శాలలో డాల్ఫిన్ సహజ భాషను రికార్డుచేసిన ఒక పరిశోధకుడు వాటికి తన ఆంగ్లభాషలో 12 పదాలు నేర్పినట్లు తెలుస్తుంది. (చూ. ఆంధ్ర ప్రభ 23-3-80 ఇంగ్లీషు మాట్లాడే డాల్ఫిన్స్-అండాళ్ళమ్మ వ్యాసం).

ఇవన్ని ఎంతో చిత్రంగా వున్నా, వివక్షాధీనంగా భాషించటం నేటి మానవునకు మాత్రమే సాధ్యం. భాష మానవునకు సహజ లబ్ధం (innate) కాక పోతే పశు పక్ష్యాదులకు కొన్నింటికి భాష సంపాదితం కావచ్చు. వీటి నుండి మానవునకు భాష సంక్రమించింది అనజాలం.

## 1:36 సంపాదన వాదం (The theory of acqusition)

ఈ వాదానికి తత్త్వశాస్త్రంలో 'అనుభవవాదం' (empiricism) నేపథ్య ఆధారం. విజ్ఞానం జన్మసిద్ధం కాదని, అనుభవమే విజ్ఞానానికి మూలమని, ఈ వాదం తెలుపుతుంది. శూన్యంగావున్న మానవుని మనస్సుపై అనుభవ జ్ఞానముద్ర వేస్తుందని అనుభవవాదుల అభిప్రాయం.

మానవుడు పుట్టినప్పు డతని పుర్రెలో భాషా విషయక వాసనలేమాత్రం లేవు. అంతా వినుకలితో, పెద్దల్ని అనుకరించి, భాష నభ్యసించి సంపా దిస్తాడు. ఇదే సంపాదన వాదం. సైకిల్ తొక్కటం మొదలైన విద్యలు, ప్రయత్న వైఫల్యాలద్వారా (trial and error) ఏ విధంగా నేరుస్తున్నాడో, అదేరీతిగా భాషను కూడ మానవుడు కైవశం చేసుకుంటున్నాడనే, సంపాదన సిద్ధాంతం, అనుభవ వాద మాధారంగా వ్యాపించింది.

అనుభవవాద ప్రతిరూపమే మనస్తత్త్వ శాస్త్రానికి చెందిన ప్రవృత్తి వాదం (behaviourism). ఇంద్రియాల ద్వారానే జ్ఞానాన్ని సంపాదిస్తా మని, ప్రేరణల స్పందనల మూలాన (Stimuli and responses) ఏర్పడ్డ అలవాట్లే (habits) జ్ఞానం. భాషా సముపార్జనం కూడా ఇటువంటిదే అని ఈ వాదం వారి నమ్మిక. ఈ విషయాన్నిగూర్చి B. F. Skinner అనే మనస్తత్త్వ శాస్త్రజ్ఞుడు (verbal behaviour) అనే గ్రంథాన్ని కూడా రచిం చాడు. బ్లూంఫీల్డు, ఆతని అనుయాయులనేకులు ఈవాదానికి చెందినవారు.

## 1.37 స్వతస్సిద్ధ వాదం : (innate theory)

అనుభవవాద పురస్కృతమైన సంపాదన వాదాన్ని 'ఛామ్స్కి' ఖండించి, హేతువాద (rationalism) నేపథ్యంతో స్వతస్సిద్ధ వాదాన్ని (innate theory) ప్రతిపాదించి భాషా శాస్త్రంలో విప్లవాన్ని సాధించాడనవచ్చు.

పుట్టుకతోనే మానవుడు స్వతస్సిద్ధ భావోపేతుడని, అనుభవం ఆ భావాలకు కేవలం ఉద్దీప్తిని మాత్రమే కల్గిస్తుందని హేతువాదం అంటుంది. మానవుడు గ్రహించే విజ్ఞానస్వభావాన్ని జన్మగత స్వతస్సిద్ధభావాలు (innate ideas) చాలవరకు నిర్ణయించగలవని హేతువాదుల నమ్మిక.

హేతువాదాన్ని స్వీకరించి, భాషకూడ జన్మసిద్ధమంటాడు 'ఛామ్స్కి' ఏ భాషలోనైనా ఐదారేండ్లకే పిల్లలకు భాష పూర్తిగా వస్తుంది. భాష, జన్మసిద్ధాంతగతం కాక పోతే ఈవిధంగా అందరికి సమానంగా భాష రావటం అసంభవం. అట్లా కాకపోతే ఒకరికెక్కువ, ఇంకొకరికి తక్కువ రావాలి. భాషా సంబంధమైన సూత్రాలు పుట్టుకతో రాబట్టి భాష అందరికి సమానంగా సాధ్యమౌతున్నది. ఈ జన్మగత భావాలు మానవులకు మాత్రమే వుంటాయి. తిర్యక్కులకుండవు. లెక్కలు, జాగ్రఫీ మొదలైనవి కొందరికెక్కువగాను, కొందరికి తక్కువగాను, కొందరికసలే లేకుండాను వుంటుంటే భాషలో ఇటువంటి భేదాలుండటంలేదు. కాబట్టి భాష జన్మసిద్ధమని అంగీకరించక తప్పదు.

ఇంతకు పూర్వం భాషా శాస్త్రజ్ఞులు ఆయా భాషావ్యవహర్తలనుండి వాక్యాలు, పదాలు సేకరించి, వాటిసాయంతో ధ్వనులు, వర్ణాలు పదాంశాలు వాక్యనిర్మితి నిర్ణయించి ఆయా భాషలకు వ్యాకరణాలు రచించే పద్ధతి కలవాటుపడ్డారు. కాని ఈ ఛామ్స్కి సిద్ధాంతం వ్యాపించిన తరువాత, భాషా సామగ్రి (corpus ) ని పూర్తిగా సేకరించటం అసంభవమని తేలింది. వ్యవహర్త ఆయా సన్నివేశాల్లో అనంత రీతుల్లో భాషిస్తాడు. భాషను కేవలం మాట్లాడటమే కాక, ఎలా మాట్లాడాలో ఊహించే నేర్పు కూడా ఉందతనికి. భాషా శాస్త్రజ్ఞుడొక భాషను అభివర్ణించేటప్పుడు ఆయా సన్నివేశాలు కూడా ఊహించి మాట్లాడిన భాషకే కాక, మాట్లాడ గలిగే భాషను ఊహించి, దాని స్వరూప స్వభావాలు కూడా సూచింపగల్గే ప్రతిభావంతుడు కావాలని భాషా

శాస్త్రంలో పరివర్తన సిద్ధాంతాన్ని (transformationl theory) వ్యాప్తి చెందించాడు.

ఈ రచనకు ముఖ్యంగా ఉపయోగపడ్డవ్యాసం, "భాషా శాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం: డాక్టర్ చేకూరి రామారావు, శారదామంజీరము ప్రచురణ: గోలి ఈశ్వరయ్య సికిందరాబాద్, 1970.

# 2. భారతీయుల భాషా కృషి.
# (లేదా)
# భారతీయ భాషా శాస్త్ర చరిత్ర

2.0 ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు వాగ్వ్యవహారంలోని భాషకే విశేష ప్రాముఖ్యాన్ని ఇస్తారు. యావత్ప్రపంచంలోను మొట్టమొదటి వాఙ్మయ మనదగిన ఋగ్వేదం, దాని తరువాతివగు యజుస్సామాథర్వణాలు ఇప్పటికి వాగ్వ్యవహారంలోని గురుపరంపరాభిముఖంగా నిల్చి ఉండటం ఆశ్చర్య కరం. ఇందుకు ముఖ్యకారణం అవి స్వర ప్రధానాలు కావటమే. అంతేకాక శిక్షా వ్యాకరణ ప్రాతిశాఖ్య నిరుక్తాదులు ప్రధానంగా వేద పరిరక్షణకే ఏర్పడ్డాయి.

"భారత దేశంలో జరిగిన ఈ భాషా విజ్ఞాన కృషి భాషను గూర్చిన యూరోపియన్ భావనలో తప్పక విప్లవాన్ని చేకూర్చగలద"ని [1] బ్లూమ్ ఫీల్డు అభిప్రాయం. హైందవ వ్యాకర్తలే యూరోపియనులకు శబ్ద విభజనాన్ని నేర్పారని; శబ్ద విభజనాన్ని నిర్దుష్టంగా చేయ గలగటం వల్లనే, వివిధ భాషారూపాల్లో సరిగా గుర్తించలేని విభాగాల్ని ఇప్పుడు దోషరహితంగా, స్పష్టంగా పోల్చుకోగల్గారని కూడా ఆ భాషా శాస్త్రాచార్యు డభిభాషించాడు. [2]

---

(1) "It was in India, however, that there arose a body of knowledge which was destined to revolutionalise European ideas about language." Language – Page 10

(2) The Hindu Grammar taught Europeans to analyze speech-forms. when one compared the constituent parts, the resemblances, which hitherto had been vaguely recognized, could be set forth with certainty and precision." Ibid – P. 12

2.1 ప్రాతి శాఖ్యలు : వేదాల్లోని ప్రతి శాఖకు సంబంధించినవి. ఇవి అసంఖ్యాకంగా ఉండాలి. అయినా ప్రకృతం అయిదారు మాత్రమే నిల్చి ఉన్నాయి. అవి (1) ఋక్ ప్రాతిశాఖ్య. ఇది శౌనక ఋషి కృతం. ఋగ్వేదంలోని అశ్వలాయన శాఖాసంబంధి. ఇందులో మూడధ్యాయా లున్నాయి.ఒక్కొక్క అధ్యాయానికి ఆరు పటలాలు.ఛందస్సులో విరచితం. దీన్ని అశ్వలాయన ప్రాతి శాఖ్య అని అంటారు. (2) తైత్తిరీయ ప్రాతి శాఖ్య. ఈ శాఖకు చెందిన ఆచార్యులందరు దీన్ని వృద్ధి చేసారు. వర్ణాలు– వాని లక్షణాలు, ఉచ్చారణ, సంధి మార్పులు రెండధ్యాయాల్లో 12 ప్రకర ణాల్లో నిరూపితం. దీనికి రెండు వ్యాఖ్యలు–సోమయాజుని త్రిభాష్య రత్నం, గోపాల యజ్వ వైదికాభరణం. (3) వాజసనేయ ప్రాతి శాఖ్య– కాత్యాయనఋషి కృతం, శుక్ల యజుర్వేద సంబంధి. పాణినీయంతో పోలిక లున్నాయి. ఎనిమిదధ్యాయాలు. వర్ణోత్పత్తి విభాగం, సంహిత విష యాలు. (4) అధర్వ ప్రాతి శాఖ్య : శౌనక ఋషికృతం. చతురధ్యాయి (5)ఋక్ తంత్ర ప్రాతి శాఖ్య : శాకటాయన కృతం. ఐదధ్యాయాలు– 287 సూత్రాలు. పాణినీయానికి పూర్వమా ? పరమా ? సందేహం. దానితో పోలికలున్నాయి. ఉవ్వటుని కుమార వ్యాఖ్యానం క్రీ. శ. 12 శతాబ్దిలో వచ్చింది. (6) మైత్రాయణీయ ప్రాతిశాఖ్య–అముద్రితం. అశ్వలాయన, వాష్కల, నారాయణ ప్రాతి శాఖ్యల నుపలబ్ధాలు. ఇతరత్ర శ్రుతములు.

ప్రాతి శాఖ్యలకే 'పార్షద' లేక పారిషదములనీ వ్యవహారం. 'పరిషది భవం పార్షదమ్' వేద సభల్లో పండితులు గావించిన చర్చల సారాంశం. ఇవి వ్యాకరణ రచన కుపయుక్తమయ్యే ప్రాథమిక రచనలు. అయినా ఇవి పాణినీయ ప్రభావానికి లోనై విస్మృతి గాంచినవి.

2.2 శిక్షలు : ధ్వని శాస్త్రానికి (Phonetics) భారతీయ వ్యవహారమే శిక్ష. శిక్షలు చాల ఉన్నాయి. కాని 'పాణినీయ శిక్ష' మాత్రం సుప్రసిద్ధం. ఇది సంక్షిప్తధ్వని శాస్త్రం. ఇది పాణిని కృతం కాదని, పాణిని అనుయాయు లెవరో రచించి వుంటారని అంటారు. పింగళముని అని కొందరు.

శిక్షాధ్యయనం, వ్యాకరణాధ్యయనానికి ఏంతో సహాయకారి. అత్యంత ప్రాచీన కాలంలోనే భారతదేశంలో ధ్వనిశాస్త్రం, స్వతంత్రంగా

'శిక్షల' నే పేరుతో వ్యవహృతం కావటం గమనార్హం. ఇవి ఏ ఒక్కదానికి సంబంధించినవికావు. ప్రాతి శాఖ్యలకు పూర్వమో పరమో నిర్ణయించటం కూడా కష్టం.

అపిశాలికా శిక్ష, నారదీయ శిక్ష, భారద్వాజ శిక్ష, యాజ్ఞవల్క్య శిక్ష, శిక్షా సంగ్రహం మొదలైనవి, పాణినీయానికి పూర్వమందున్నవని, పాణినీయ శిక్ష వర్గంలోనిదని అంటారు. ప్రాతి శాఖ్యలు సింహ సదృశాలని, శిక్షలు మృగీ సదృశాలని భావన.

'శిక్షా స్వరవర్ణోపదేశ శాస్త్రమ్'. స్వరమంటే ఊనిక (accent). వర్ణం (phoneme) మాత్ర-హ్రస్వ దీర్ఘ ప్లుతములు ( quantity) బలం-వర్ణోత్పత్తి క్రమం. సంతానం-వర్ణముల కలయిక, అందలి మార్పులు (euphonic changes) అనే ఐదు విషయాలతో కూడిందని శిక్షావల్లి.

స్వర శిక్షలు, ధ్వని శిక్షలు అని యివి ప్రధానంగా రెండు రకాలు.

## 2.3 నిరుక్తములు :

పదాలకు ధాతువులు నిర్ణయించి, వాని వ్యుత్పత్తు నిర్వచించే గ్రంథాలు నిరుక్తములు. ఇవి వ్యాకరణానికి పూరకాలు. ఉపమన్యు, శాకటాయన, శాకపూని; శాకపూర్తి మున్నగు వారు నిరుక్త రచనలు చేసినా, యాస్కాచార్యుని నిరుక్తమొక్కటే నిలిచింది.

యాస్కుడు పాణినికి పూర్వుడు. క్రీ. పూ. 6 వ శతాబ్ది అంటున్నారు; శిక్షా కల్ప వ్యాకరణం ఛందో జ్యోతిషాలతోపాటు నిరుక్తం వేద పరిరక్షకు అవసరం.

భాషకు మూలం ధాతువులనే యాస్కుని సిద్ధాంతం త్రోసిపుచ్చ రానిది. ధాతువులు క్రియార్థాన్నే ఇస్తాయని యాతని అభిప్రాయం. నిరుక్త ప్రతిపాదన పైనే పాణిని వ్యాకరణం ఆధారపడింది.

ఆధునికంగా అభివృద్ధిగాంచిన తులనాత్మక భాషాధ్యయనానికి నిరుక్తాలు (Etymologies) చాల అవసరం.[1] ఆధునికులు ధాతువులు

---

(1) "It is indeed the postulate (Pre-requisite) of modern philology" – Systems of Sanskrit Grammar – P. 8 – Belvalkar

క్రియార్థాన్నే ఇవ్వాలని అనరు. పదముల పూర్వరూపాల నిర్ణయమే నిరుక్తం[1]. నాల్గు విధాలుగా యాస్కుడు పదజాలాన్ని ఇలా విభజించాడు.

"తద్యేతాని చత్వారి పదజాతాని
నామా ఖ్యాతేచ
ఉపసర్గ నిపాతాశ్చ
తానీమాని భవన్తి"

మొదట పేర్కొనటాన్ని బట్టి నామాఖ్యాతాలు ప్రధానాలు. ఇవి స్వతంత్రమైనవి. ఆధునికులు వీటిని స్వతంత్ర పదాంశాలంటారు. (Fr morphemes) ఉపసర్గ, నిపాతాలు అస్వతంత్రాలు. (Bound morphemes) అర్థవంతమైన శబ్దాలన్నీ పదాంశాలే (morphemes). ఈ ఆధునిక భావానికి కొంత ఆధారం ఇందులో సూచితం. యాస్కుని పదవిభాగం, అరిస్టాటిల్ కావించిన పదవిభజనం కన్న ఆధునిక భాషాశాస్త్రానికి మార్గదర్శకం.

నిరుక్తంలో ఐదధ్యాయాలున్నాయి :

(1) వైదిక పదాలు, వాని సమానార్థకాలు (1–3)
(2) కొన్ని క్లిష్టమైన వైదిక పదాలు (4)
(3) వేదాలలోని దేవతల పేళ్ళు (5)

నిరుక్తానికెన్నో వ్యాఖ్యలున్నా, దుర్గాచార్య వ్యాఖ్య ప్రచురమైంది.

2.4 **వ్యాకరణములు:** (వి + ఆ + కృ) వ్యాకరించునది–విభజించునది, వ్యాకరణము. ప్రకృతి ప్రత్యయ విభజన పరిజ్ఞానం కలిగించేది. వేదాంగములగు– శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిషాలలో మూడవది అయినా, వేదార్థ జ్ఞానంలో దీనికి ప్రథమస్థానం. విద్వాంసులలో అగ్రతాంబూలం వైయాకరుణులదే : "ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః."

వేదాలనుండే వ్యాకరణశాస్త్ర మావిర్భవించిందని పతంజలి ఈ బుక్కు పేర్కొన్నాడు.

---

1...... the etymology of a speech – form is simply its history and is obtained by finding the older forms in the same language and the forms in related languages which are divergent variants of the same parent forms" *'Language' Bloomfield p. 15*

"చత్వారి శృంగాస్త్రయోఽస్య పాదాః
ద్వేశీర్షే స_ప్తహస్తాసో అస్య
త్రిథా బద్ధో వృషభో రోరవీతి
మహాదేవో మర్త్యా ఆవివేశ ॥(ఋ. 3-8-3)

"రెండుతలలు, నాల్గు శృంగముల్ చెలువొంద
మూడు కాళ్ళు, చేతు లేడు గల్గి
త్రివిధ బద్ధమైన వృషభ రావము మహా
దేవుడై ప్రజాళి నావహించు."

నాల్గు కొమ్ములు——నామాఖ్యాతోపసర్గ నిపాతములు.
రెండు తలలు——నిత్యానిత్య శబ్దములు
ఏడు చేతులు——ఏడు విభక్తులు ; హృత్కంఠ శిరస్థాన బద్ధము
(తె. వ్యా. వి. పుట 1017)

లభ్యమాన వ్యాకరణములలో ప్రాచీనతమమైంది–పాణిని 'అష్టాధ్యాయి.' పాణిని తనకు పూర్వం ఉన్న వ్యాకర్తల్ని పేర్కొన్నాడు. వారిలో ఆపిశలి, శాకటాయన, గార్గ్య, శాకల్య, కాశ్యప, భారద్వాజ, గాలవ, స్ఫోటాయన, వ్యాడి మున్నగువారు ప్రముఖులు.

2.41 పాణిని : క్రీ. పూ. 3 వ శతాబ్దివాడని అంచనా. వైదిక లౌకిక సంస్కృతాలను రెంటిని సాధించిన మహామేధావి. ఇతనే ప్రాంతం వాడో, తలిదండ్రు లెవరో కులగోత్రాలెట్టివో తెలియవు. 'శాలాతురం' స్వగ్రామమని తక్షశిల విశ్వవిద్యాలయంవాడని అంటున్నారు. 'అష్టాధ్యాయి' అనే ఇతని వ్యాకరణంలో 1. సంజ్ఞా పరిభాషలు ; 2. సమాస కారకములు ; 3. ధాతు ప్రత్యయాలు ; 4. కృదంత రూపనిష్పాదనం ; 4.5. స్త్రీ ప్రత్యయములు, తద్ధిత సమాసాంతములు ; 6.7 స్వర విధులు; 8. సంధులు మొత్తం నాల్గు వేల సూత్రాల్లో నాల్గు పాదాల్లో ఎనిమిదధ్యాయాలుగా ఉన్నాయి.

ఇది ప్రపంచంలోనే ప్రప్రథమ సమగ్ర వర్ణనాత్మక వ్యాకరణం. భాషా పరిశీలనం ప్రాతిపదికగా సాగింది. ఇందులోని ప్రత్యాహార పద్ధతి, అల్పాసల్ప సముచిత సంజ్ఞా పరిభాషా పరికల్పనం, షడ్విధ లక్షణోపేత

సూత్రరచన[1], నియతానియత గణ నిర్ణయం, ప్రత్యయార్థ నిర్ణయాదులు, పాణిని నిశితాఖండ ప్రజ్ఞా ప్రాభవాలకు నిదర్శనం.

అందుచేతనే ఆధునిక భాషాశాస్త్ర పితామహుడు బ్లూమ్ ఫీల్డు ఇలా ప్రశంసించాడు.

"సుమారుగా క్రీ. పూ. 350-250 మధ్యలో వెలసిన ఈ వ్యాకరణం మానవ మేధాసంపద కొక గొప్ప కీర్తి స్తంభం. ఇది తత్కర్త భాషలోని ప్రతి సూక్ష్మాంశాల్ని, ప్రతి ప్రత్యయాన్ని, నిష్పన్న రూపాన్ని కారకాన్ని అభివర్ణిస్తుంది. ఏ యితర భాష కూడ ఇంతవరకు ఇంత సమగ్రంగా అభివర్ణితం కాలేదు[2]."

"ఈ భారతీయ వ్యాకరణం, ప్రప్రథమంగా ఐరోపియనులకు తన నిర్దుష్ట సమగ్ర స్వరూపంతో, సిద్ధాంత ప్రాతిపదికపైగాక, పరిశీలన ప్రధానంగా సాక్షాత్కరించింది. అంతేకాక సంస్కృత భాషాన్వేషణ మూలంగా తులనాత్మక భాషాధ్యయనానికి దారి చూపింది[3]."

జూనియర్ హెచ్. ఎ. గ్లీసన్ ప్రశంస:

"అత్యంత విజయోపేతము, సమగ్రము అయిన వర్ణనాత్మక వ్యాకరణం, ఇప్పటి వరకు బహుశః పాణిని, అతని అనుయాయులు రచించిన

---

[1]సంజ్ఞాచ, పరిభాషాచ, విధిర్నియమ ఏవచ
అతిదేశోఽధికారశ్చ,షడ్విధం సూత్రలక్షణమ్.

[2]This Grammar, which dates from somewhere round 350 to 250 B.C., is one of the greatest monuments of human intelligence. It describes, with the minutest detail every inflection, derivation, and composition and every syntactic usage of its author's speech. No other langnage, to this day has been so perfectly described"
*Language - p. 11*

[3]"The Indian grammar presented to European eyes, for the first time, a complete and accurate description of a language, based not upon theory but upon observation. Moreover the discovery of Sanskrit disclosed the posibility of a comparative study of languages." – *Ibid p. 11*

సంస్కృత వ్యాకరణమేనని గుర్తించటం వల్ల ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు వినయవంతు లౌతారు. సంస్కృత వ్యాకరణం వీరిని ఒక లక్ష సంవత్సరాలు వెనక బడవేస్తుంది[1]."

"సంస్కృతం పట్ల భాషా శాస్త్రజ్ఞులకు చాలా అభిమానం. ఎందు కంటే, క్రీ. పూ. 4వ శతాబ్దికి చెందిన పాణిని వ్యాకృతిలో వర్ణనాత్మక రచనా విధానం బాగా పరిపూర్ణత వహించింది; అంతే కాదు, సంస్కృత భాషా పరిచయం వల్లనే పాశ్చాత్య భాషా పాండిత్యం అభివృద్ధి చెందటానికి తగిన ప్రేరణ కల్గి ఆధునిక భాషా శాస్త్రా విర్భావానికి కారణమైంది[2]."

"సంస్కృత భాషకు సమగ్రమైన విభజనాన్ని సమకూర్చడం ద్వారా మానవ మేధకు శాశ్వత కీర్తి ధ్వజమనదగిన వ్యాకరణాన్ని విరచించిన పాణిని (క్రీ. పూ. 3/4) స్థాయిలో, తన్ను చూచుకొంటాడు ఆధునిక భాషా శాస్త్రజుడ" నే సైమన్ పాటర్[3] ప్రశంసనుబట్టి పాశ్చాత్య భాషా శాస్త్రజ్ఞు లందరు పాణినికి ఏకలవ్య శిష్యులని అవగతం కాక పోదు.

---

[1]...... And it should be a source of humility to modern linguists to recognize that the most successful and complete description is very probably still the Sanskrit Grammar of Panini and his associates – antedating modern descriptive linguists by a millinnia - *An Introduction to descriptive Linguistics p, 211*

[2]Sanskrit is of great interest to linguists because of the high devolopement of descriptive linguistic techenique, culminating in the work of Panini in the fourth century B. c. and because of the stimulus which the introduction of Sanskrit to western scholorship gave to the developement of modern linguistic science. *Ibid – P. 462*

[3]The modern linguist is putting himself back into the position of Panini, who gave a complete analysis of Sanskrit in 4 th or 3 rd century before Christ and thus produced a document, which has been well described as one of the greatest monuments of human intelligence" - *Language in the Modern World - p. 11.*

"సంస్కృత భాష కంతకు క్రియాధాతువే ఆధారమని, దాని మీద వివిధ ప్రత్యయాలు చేరటం చేత విశేష్య విశేషణ రూపాలేర్పడతాయనే హేతువాదం మీదనే పాణిని తన రచన సాగించాడు. ఎంతో శ్రమ చేసి, ప్రాచీన కాలంలో మరెవ్వరు చేయలేనంతగా భారతీయ పవిత్ర భాష నంతా సమగ్రంగా, విపులంగా, వివేక విశిష్టంగా అభివర్ణించాడా మహనీయుడు. భాషకు తర్కంతోటి, తత్త్వంతోటి సంబంధ మున్నదని నిరూపించటానికి యత్నించిన గ్రీకులకన్న శాస్త్రీయతలో పాణిని రచన మిన్న అనటంలో ఎట్టి సందేహం లేదంటాడు పీటర్. "ఆధునిక భాషాశాస్త్ర ఉషోదయం ఆలస్యంగా 18 వ శతాబ్దంలో జరిగింది. అది సముచితంగా, పాణినీయ భాష పునరన్వేషింపబడిన వెంటనే తత్ఫలితంగా ఏర్పడింద"ని అంటాడు పాటర్[2].

"భారతీయ వ్యాకరణంలోని శాస్త్రీయ సంక్షిప్తీకరణం (scientifc condensation) సమగ్రత (completness) భాషా శాస్త్రజ్ఞులకు ఆరాధనీయమైన లక్షణాలు. ప్రతి ప్రత్యయం, సమాసం, నిష్పన్నపదం, అందులోని ధ్వని మార్పులు, (ఉచ్చారణతో గూడ) ఆ వ్యాకరణంలో పరిశీలించకుండ విడిచిపెట్టింది లేదు"[3] అంటాడొక చోట బ్లూమ్‌ఫీల్డు.

---

[1]Panini proceeded on the rational assumption that the verbal root was the basis of Sanskrit speech, upon which, nouns and adjectives were built by means of suffixes. His painstaking description of the sacred language of India was more detailed and discriminative than any other attempted in antiquity. It was more scientific than anything produced by the Greeks, who had already shown considerable interest in the relation of language to Logic and Philosophy. (*Ibid*-*P* 144)

[2]The dawn of modern linguistics came late in the eighteenth century and most appropriately, it came as an immediate result of the rediscovery of the language of Panini. (*Ibid* - *P.* 145)

[3]Bloomfield - Language p.274 (1929)

సమకాలీన భాషాదృష్టి (synchronic view) బాగా కలవాడు పాణిని. ఆ భాష నభివర్ణించటంలో అతడనుసరించిన విధానం, ఎక్కడైనా పొతపడి నట్లున్నా, చాలాచోట్ల అత్యంతం ఆధునికం, అఖండ శక్తిమంతం, అమిత సూక్ష్మం. సూత్రీకరణం వ్యాకరణానికి ముఖ్యమని భావించేవారికి పాణిని పరమగురువు[1]

వ్యాకరణాంశాల్ని అభివర్ణించటంలో ఆధునిక పాశ్చాత్య భాషాశాస్త్రజ్ఞు లిప్పుడిప్పుడే హైందవ వ్యాకర్తలతో పోటీపడుతున్నారు. కాని ఏమాత్రం మించలేక పోతున్నారంటాడు-ఎమెనో అనే భాషాశాస్త్రజ్ఞుడు[2]

2.5 **వార్తికాలు :** "ఉక్తానుక్తదురుక్తానాం,చింతాయత్ర ప్రవర్తతే తంగ్రంథం వార్తికం ప్రాహుః" - పాణిని సూత్రాల్ని సరిదిద్దటానికి గాని సవరించటానికి గాని, పూరించటానికి గాని కావింపబడ్డ రచనలు-వార్తికాలు. ఇవి 150C. పాణిని తరువాత 200 ఏండ్లకు వచ్చాయి. ఈ మధ్య కాలంలోని సంస్కృత భాషాస్వరూపం ఇందులో తెలుస్తుంది. ఇవి గద్య పద్యాత్మకం గాను ఉన్నాయి. వార్తికకారులు : 1) కాత్యాయనుడు 2) భారద్వాజుడు 3) సునాగుడు 4) క్రోష్ట 5) వాడవుడు 6) వ్యాఘ్రభూతి 7) వైయాఘ్ర పద్యుడు మొదలైనవారు.

కాత్యాయను డొక్కడే వార్తికకారుడని కొందరు, పద్యరచన లితనివి కావని కొందరు. ఇతడు క్రీ. పూ500-350మధ్యవాడని, దాక్షిణాత్యుడని ప్రతీతి.

2.6 **మహాభాష్యం :** వార్తికాల తరువాత 500 సంవత్సరాలకు మహాభాష్యం వెలిసింది. కర్త పతంజలి. ఇతడు శుంగవంశ మహారాజైన పుష్య మిత్రుని పురోహితుడంటారు. క్రీ. పూ, 150. తక్షశిల విశ్వవిద్యాలయ విద్యార్థి. వైదిక వాఙ్మయాన్ని ఆపోశనం పట్టాడు.

---

[1]L. Renon, Panini - Current Trends in linguistics. (p.48)

[2]The Hindu achievements in morphological description were a kind that we have only just begun to rival in modern western Linguistics and that we have not yet bettered. *India and Liugustics*
*P* - 191 (Collected papers - Annamalai University Publication.)

ఇతని భాష్యం పరమ ప్రామాణికం. ఇది వ్యాకరణ విజ్ఞానఖని. వార్తి కాలతో సమన్వయిస్తు పాణిని సూత్రాలకు వ్యాఖ్యానం కావించాడు పతంజలి. 'ఉత్తరోత్తర మునీనాం ప్రామాణ్యమ్' అంటారు. 85 ఆహ్నికాలున్నాయి. ఒక పగలు కావించిన చర్చ-ఆహ్నికం. ఈ భాష్యంపై టీకలు, టిప్పణులు, దీపికలు, ప్రకాశికలు, వ్యాఖ్యలు, స్ఫూర్తులు, వృత్తులు, ప్రదీపలు ఎన్నో వెలసినాయి. ఇందులో 'కయ్యట ప్రదీపిక' ప్రసిద్ధం, సమగ్రం.

"సూత్రస్థమ్ పదమాదాయ
వాక్యైః సూత్రాను కారిభిః
స్వపదానిచ వర్ణ్యన్తే
భాష్యమ్ భాష్యవిదో విదుః"

సూత్రాల్లోని పదాలు స్వీకరించి, సూత్రానుకూలంగా స్వపదాలతో వివరించటం భాష్యం. "మహాభాష్యం వా పాఠయేత్, మహారాజ్యం వా పాలయేత్" సూక్తి. ఈ భాష్యం అనేక సామాన్య భాషావిషయిక చర్చలతో గూడింది. ఇది చదివితే భాషావిజ్ఞానం ఎంతో చేకూరుతుంది. భాష్యాంత వైయాకరణు డంటే దేశంలో ఎంతో గౌరవం.

క్రీ. శ. 7వ శతాబ్దిలో వామనుడు, జయాదిత్యుడు అనేవారు, 'కాశికా వృత్తి'ని అష్టాధ్యాయికి వెలయించారు.

విషయానుగుణ ప్రకరణాలుగల పాణినీయానికి ప్రక్రియానుగుణ రచనలెన్నో వచ్చాయి. అందులో క్రీ. శ. 17వ శతాబ్దికి చెందిన 'సిద్ధాన్త కౌముది' ప్రసిద్ధి కెక్కింది. కౌముది కంఠస్థమైతే భాష్య పరిశ్రమం వృథా.

2.7 ఆర్థిక గ్రంథాల్లో (Philosophy of Grammar) భగవాన్ భర్తృహరి విరచిత "వాక్యపదీయం" గొప్పది. ఇందులో (i) పదకాండ (ii) వాక్యకాండ (iii) సంకీర్ణకాండ అని మూడుభాగాలు. దీనికి పుణ్యరాజ హేలరాజకృత వ్యాఖ్యాన మొకటి. ఇందులోని స్ఫోట వాదం జర్మన్ పండితుల్ని ఆకర్షించింది. ఛామ్స్కీ వాదానికి, స్ఫోటవాదం మూలం కావచ్చు.

సంస్కృత వ్యాకరణం 8 విధాలు :

"ఇంద్రః చంద్రః కాశకృత్స్నా పిశలీ శాకటాయనః
పాణిన్యమరజైనేంద్రాః భవన్త్యష్టాది శాబ్దికాః"

పాణినీయ పద్ధతికి చెందిన ఇతర వ్యాకరణాలు - చాంద్ర, జైనేంద్ర, శాకటాయన సారస్వతాలు.

కాతంత్ర పద్ధతికి చెందినవి— హైమ శబ్దాను శాసనం. ముగ్ధబోధ, సంక్షిప్త సారసారస్వతాలు.

## 2.8 నిఘంటు రచన (Lexicography)

భాషా విషయిక కృషిలో వ్యాకరణాదులవలె నిఘంటు రచన ప్రత్యేక శాఖ. ఇప్పు డకారాది క్రమ నిఘంటు రచన ప్రచురం. విషయ క్రమ నిఘంటువులు (Thesaurus) విద్యార్థికి భాషను కైవశం చేసుకోటాని కెంతో ఉపయోగం. ఇటువంటి వనేకం సంస్కృతానికి విరచితం. అందులో 'అమరకోశం' బాగా ప్రసిద్ధి గాంచింది. "అష్టాధ్యాయీ జగన్మాతా, అమర కోశో జగత్పితా" అనే సూక్తి. మనకందరకు తల్లిదండ్రు లున్నట్లుగానే పదాలకు తల్లిదండ్రులున్నారని పై సూక్తి సూచిస్తుంది. ప్రతి పదానికి చరిత్రకూడా వుంది. (Every word has its own history)

సంస్కృతానికి శబ్దలింగం ఉంది. దాన్ని గ్రహించాలంటే నిఘంటు సహాయం అనివార్యం. 'విధా'శబ్దం కొన్ని నిఘంటువుల్లో స్త్రీ లింగంగా నిరూపితం. కొన్ని 'విధః' అని పుంలింగంగా పేర్కొంటున్నాయి. అందుచేతనే 'లింగమశిష్యం, లోకాశ్రయత్వాత్ లింగంస్యాత్' అని హెచ్చరిక. వాడుకను బట్టిగ్రహించాలి. 'శబ్దకల్పద్రుమం' అమరం తరువాత ప్రసిద్ధం. ఏకాక్షర, ద్వ్యక్షర నిఘంటువులు, నానార్థ నిఘంటువులు సంస్కృతాని కనేకంగా వున్నాయి.

ఆంగ్లభాషకు చారిత్రక నిఘంటువులుండటం (Historical lexicons) గమనార్హం. ఏపదం ఎప్పు డేఅర్థంలో వాడింది ఇందులో నిరూపితం. ప్రతి భాషకు ఇటువంటివి రావాలి.

## 3. 0 ప్రాచీనకాలంలో పాశ్చాత్యుల భాషాకృషి :

3. 1 **గ్రీకులు :** వీరు ప్రాచీనుల్లో చాలా తెలివైన వాళ్ళుగా కనిపించే వారు. అన్యులవలె ఏ విషయాన్ని అంధప్రాయంగా అంగీకరించక, సంభ్రమాశ్చర్యాలతో ప్రశ్నించి అవగాహన చేసుకొనే నైపుణ్యం కలవారు. అందుచేత ఇతర ప్రజల్ని అనాగరికులుగా భావించేవారు. ఇతర భాషల పట్ల నిరసన ప్రకటించటంచేత వీరు కూపస్థ మండూకాలైనారు.

భాషోత్పత్తి, భాషాచరిత్ర, పదముల వ్యుత్పత్తులపట్ల ధైర్యంగా కొన్ని ఊహలు చేసేవారు. పాశ్చాత్య సంప్రదాయ వ్యాకరణాల మీద వీరి ఊహాప్రాబల్యం అధికం.

సమ్మెటికస్ (Psammeticus) అనే ఈజిప్టు ప్రభువు ప్రపంచంలో ప్రాచీన భాషాపదం ఏమైఉంటుందో అని గ్రహించటానికో ప్రయోగం చేసాడట. అప్పుడే పుట్టిన శిశువుల్ని ఇద్దర్ని దూరంగా తోటలో ఉంచాడట. వారు మాట్లాడటం ప్రారంభించినపుడు 'బేకస్' (bekos) అని ఉచ్చరించారట. అంటే ఫ్రీజియన్ భాషలో రొట్టె అని అర్థం. ఈ కథను హెరొడోతస్ (క్రీ. పూ. 5 శతాబ్ది )తెలియ చేసాడు.

ప్లాటోతన సంభాషణల్లో పదాలవ్యుత్పత్తుల్ని గురించి,పదపదార్థ సంబంధాన్ని గూర్చి విశేషంగా చర్చించేవాడట. సోక్రటిస్ పేళ్లు స్వాభావికంగానే ఏర్పడతాయని, కొన్ని సంకేతాలుకూడా ఉన్నాయని భావించేవాడు.

మొత్తంమీద ఆ కాలంలోని వివాదాల్ని పురస్కరించుకొని ఇరు తెగల వారేర్పడ్డారు. (i) నియత వాదులు : (analogists) భాష స్వభావసిద్ధమని, అది మౌలికంగా క్రమబద్ధము, తర్కసహిష్ణమని భావించేవారు (ii) అనియత వాదులు : (anomalists) పై వాదాన్ని అంగీకరించక, భాషకో క్రమంలేదని వాదించేవారు.

గ్రీకులు తమ భాష నుండే సకల భాషలు జనించాయని విశ్వసించే వారు.ఇప్పటికి సంస్కృత పండితులు సంస్కృతమే అన్నిభాషలకు జనయిత్రి అంటుంటారు. ఈ విశ్వాసంతోనే వారి వ్యాకరణ వ్యాసంగం జరిగింది. అది భాషాప్రాతిపదికపై కాక, తత్త్వ ప్రాతిపదికపై కొనసాగింది.

పద విభజనం ఇటువంటిదే. పదాలు సంయోగించి వాక్యాలేర్పడ్డా యంటారు (Syntactic constructions). కర్త కర్మ క్రియల విభజనం కాని, లింగ వచన విభక్త్యాదులు కాని, అర్థ విచక్షణతోనే చేసేవారు. వ్యాకర ణంలో శబ్దం ప్రధానం. అది గుర్తించినవారు భారతీయులు.

గ్రీకులు తమ పవిత్ర గ్రంథాలైన ఇతిహాసాల్ని అర్థం చేసుకోటానికి అనుకూలంగా రచనలు చేసారు. వారిలో అరిస్టార్కస్ (Aristarchus-216-144 B. C.) ప్రముఖుడు.

గ్రీకులు లక్ష్యముల నుండి లక్షణనిర్మాణానికి కాక (Inductive Method-from particular to general), లక్షణం నుండి లక్ష్యాలూహించటంలో (Deluctive Method - from general to particular) విశేషాసక్తి ప్రదర్శించారు. సారాంశం ఏమంటే-గ్రీకులకు, భారతీయులకు కొన్ని సమాన లక్ష్యాలున్నాయి. కాని వారి భాషాధ్యయన విధానంలో ప్రధానమైన భేదముంది. ఒక్కమాటలో చెప్పాలంటే-గ్రీకులు భాషనుగూర్చి కొన్ని ఊహలు కావించారు. భారతీయులు భాషనభివర్ణించారు.[1]

3.2 **రోమనులు :** గ్రీకు వ్యాకరణాల రీతిలోనే రోమనులు లాటిన్ వ్యాకరణాలు రచించారు. దొనతస్ (క్రీ. శ. 4) ప్రీషియన్ (క్రీ. శ. 6) మున్నగువారు వ్రాసిన వ్యాకృతులు మధ్యయుగం దాకా వాడుకలో ఉన్నాయి.

రోమన్ సామ్రాజ్య పతనంతోపాటు లాటిన్ వ్యాకరణ ప్రామాణ్యం పతనం కాజొచ్చింది. శిష్ట లాటిన్ (classical Latin) పరిరక్షణానికి పం తులు కృషిచేశారు. ప్రజలెట్లామాట్లాడాలో నిర్దేశాలు వెలువడ్డాయి. ఈ శి లాటిన్ వ్యాక ణం ఆర్శంగా ఐరోపియన్ భాషలకు వ్యాకరణాలు విరచి మైనవి. హీ , అరబిక్, మరికొన్ని ప్రాంతీయ భాషలు క్రమంగా ప్రాముఖ్య  ్ని అందుకొన్నాయి.

---

[1] Although they (Greeks and Indians) had certai goods in common ...... their respective approches to the study o language were fundamentally different. By and large, the Gre ks specu - lated about language, whereas the Indians described .

*(Waterman - p 2)*

గ్రీకులకు లాగానే రోమనులకుకూడా పదం నుండి ప్రకృతిని విడగొట్టడం తెలియదు. కాని భారతీయులీ విషయంలో విస్పష్టమైన పరిజ్ఞానం కలవాళ్లు. నిష్పన్న పద స్వరూపాలనుండి ప్రకృతిని స్పష్టంగా వేఱు పఱిచేవారు. ప్రకృతికి ప్రత్యయాలుచేరేటపుడు కల్గేమార్పులన్నింటికి సూత్రాలేర్పచారు. వృత్తి (కృత్త ద్ధిత సమాసాలు) లక్షణాలు నిరూపించారు[1].

## 3.3 గవేషణయుగం : (The Era Of Exploration)

అనేక భాషల్ని గూర్చిన సామాన్య జ్ఞాన సముపార్జనం ఈయుగ లక్షణం. దేశాటనం అధికం కావటంతో ఆయా దేశ భాషా పదజాతాలపరిచయం అవసరమైంది. మతప్రచార వ్యామోహం, అన్య భాషాగ్రహణానికి ప్రేరకమైంది. మతగ్రంథానువాదాలు ఆయాదేశభాషల్లో వెలసినాయి. దేశభాషా వ్యాకరణాలు, నిఘంటువులు విరచితమైనాయి. వీటిమీద లాటిన్ వ్యాకరణ ప్రభావం బాగావుంది.

వ్యాపార దేశాటనల అభివృద్ధితోపాటు సన్నిహిత భాషలకు సమాన నిఘంటువులు, వ్యాకరణాలు రచించటానికి పండితులుద్యమించారు.

పాలస్, పి. యస్. (1741–1811) క్రీ. శ. 1786 లో రష్యా చక్రవర్తిని కాథరన్ ఆజ్ఞపై యూరోపియన్, ఆసియాలకు చెందిన 280 భాషలకు చెందిన 285 పదాలకు సమానార్థబోధకమైన పదాలు సంతరించబడ్డాయి. 1791 లో ఇది ద్వితీయ ముద్రణం పొందింది. లీబ్నిజ్ (Leibmitis) అనే తత్త్వవేత్త హీబ్రూభాష మూలమనే వాదం ఖండించి, యూరప్ ఆసియా భాషలొకే వర్గానికి చెందినట్లు పేర్కొన్నాడు.

---

1 "The Romans did not know how to derive the stem of the word from a comparison of the various inflectional forms, and the Greeks in this respect were no wiser. But the Indian Grammarians were never capable of floundering in such confusion. They derived the stem correctly from inflected forms, the root from the several groups of the related words; they ascertained the laws of derivation and compositions and so forth"

—*Holger Pederson*

*The Discovery of Language- pp22- 23.*

జె. సి. అడెలంగ్ (Adelung), జె. యస్. వాటర్ (J. S. Vater) 500 భాషలలోనికి నాల్గు సంపుటాలుగా దైవప్రార్థనల్ని అనువదించారు. కతిపయ పండితులు స్వకీయ భాషలో ప్రాచీన గ్రంథాలపై కృషి సాగించారు. 18 వ శతాబ్దంలో పండితుల భాషా పరిజ్ఞానం విశేషంగా తాత్త్వికంగా సాగింది. వివిధ భాషల్లో నిర్మాణ భేదాల్ని (Structural differences) వీరు గుర్తించారు. భాషాధ్వనుల్ని లేఖన చిహ్నాలను అభేదంగా పరిగణించారు. అందుచేత వారి కృషి కొంత పెడదారి పట్టింది. శిష్టజనోపయుక్తమైన భాష ప్రాచీనము, పరిశుద్ధమునైనదని, పామరుల వ్యవహారం గ్రామ్యమని (Vulgarism) ఇది పతన భాష అనే విశ్వాసం. వ్యాకర్తలు తర్క ప్రామాణిక బుద్ధితో వ్యాకరణాలు రచించారు. భాషకు మాండలికాలున్నాయని గుర్తించినా, భాషా ప్రవంతిలో పెక్కు మలుపులున్నాయని గుర్తించినా, భాషల్లో కొన్ని పోలికలున్నాయని తెలిసినా 'భాషా పతన సిద్ధాంతం' (the doctrine of linguistic decay) వాటిని పరిగణించటానికి ఉపక్రమించలేదు.

'అడెలంగ్' తొలిసారిగా ఇండో-యూరోపియన్ భాషాకుటుంబాన్నేర్పరచాడు. హెర్వాస్ (Hervas) పద పట్టికల కన్న భాషల సంబంధాన్ని నిర్ణయించటంలో వ్యాకరణం చాలా ముఖ్యమని భావించాడు.

మధ్య దేశాల్లో అరబ్బులు, కొరాన్ భాషకు వ్యాకరణం రచించుకొన్నారు. పదాల్లోగల ప్రధాన భాగానికి 'రూట్' అని వ్యవహరించారు.

దూర ప్రాచ్య దేశాల్లో చైనాకు కోశ నిర్మాణం జరిగింది. జపాన్ వ్యాకరణం స్వతంత్రంగా అభివృద్ధి గాంచింది.

## 4 0. ఆధునిక భాషాశాస్త్రావిర్భావాభివృద్ధులు :

## [The origin and development of Modern Linguistics]

4.1. 19 వ శతాబ్దారంభంలో యూరపు ఖండంలోను, అనంతరం అమెరికాలోను భాషాశాస్త్రంలో నూతన కృషి ప్రారంభమైంది. అదే ఆధునిక భాషాశాస్త్రంగా పరిగణింపబడుతున్నది. లాటిన్ భాషా వ్యాకరణాభ్యాసం మూలంగా గల్గిన నూతన దృష్టి, సంస్కృత భాషాధ్యయనపలం మూలంగా పాశ్చాత్యులకు గల్గిందని వారే భావించారు.

భాషల నిర్మాణ క్రమ పరిశీలనం; ఇతర భాషలతోడి తారతమ్య వివక్ష; భాషల పరస్పర సంబంధభాంధవ్యనిర్ణయుం; వాని వర్గీకరణం; భాషారూపాల్ని, వ్యాకరించటమే కాక వాని పూర్వ పూర్వ రూపాల్ని,మూల భాషా పునర్నిర్మాణం కావించటం (the reconstruction of the proto-language), క్రొత్త భాషల్ని అన్వేషించి, వానికి వర్ణనాత్మక వ్యాకరణాన్ని రచించటం ఆధునిక భాషాశాస్త్ర ప్రధాన లక్ష్యాలు. ఇందులోని విశేషాంశాలు సంస్కృతభాషాధ్యయనం మూలానే పాశ్చాత్యుల కవగతమైనాయి.

మొదటిలో ఐరోపియన్ భాషలు కూడ సంస్కృతమునుండే లభించాయనే నమ్మకముండేది. కాని అచిరకాలంలోనే సంస్కృతం, లాటిన్, గ్రీకు మొదలైన భాషారూపాలు, ప్రాక్ చారిత్రకరూపాలకు చెందిన ఒకానొక మూల భాషనుండి (Proto formist-language) ఏర్పడినవనే ఒకానొక ముఖ్య శాస్త్రీయమైన నిర్ణయం వ్యాపించటంతో పూర్వాభిప్రాయాలు రూపుమాసాయి. ఈ అభిప్రాయాన్ని తొలుత సర్ విలియం జోన్సు (Sir William Jones: 1746-1794) అనే ప్రథమ ఐరోపియన్ సంస్కృత పండితుడు 1783 లో ఒక ఉపన్యాసంలో సూచించాడు.ఈ సూచన మాధారంగా శాస్త్రజ్ఞులు విశేష కృషిగావించి, శబ్దజాలాన్ని సేకరించి తులానాత్మక వ్యాకరణాలు రచించారు. వీరికి గ్రీకు, లాటిన్ భాషా పాండిత్యంతోపాటు, జర్మానిక్ భాషల్లో ఒకటి వారికి మాతృభాషగా ఉండేది. సంస్కృత శబ్దాలకు తుల్యరూపాల్ని వారు సేకరించారు. ప్రాక్ చారిత్రకభాషా నిర్మాణంలో (Proto-language) వారెన్నో క్లేశాల నెదుర్కొన్నారు. అప్పుడప్పుడవ మార్గాలు కూడ త్రొక్కారు. కారణం, సంస్కృతానికిలాగా యూరోపియన్ భాషలకు నిర్దుష్టము, శాస్త్రీయము అయిన వ్యాకరణం లేకపోవటమే. అలా వున్నట్లయితే తులానాత్మక కృషి ఎంతో వేగంగా జరిగేది. అయినా ఐరోపియనుల నిరంతర కృషి ఫలితంగా చారిత్రక, తులనాత్మక భాషా కృషి విజయోపేతంగా సాగింది-19 వ శతాబ్దిలో.

4.2 తులానాత్మక పద్ధతి మొదటినుండి సుస్పష్ట ప్రాతిపదిక పైన జరిగింది. సామాన్యంగా సోదరభాషల్లో (cognates) కనిపించే సమాన లక్షణాలు, వాని పైతృక భాషలో (parent language) ఉంటాయి. కొన్ని భాషల్లో ధ్వని మార్పులతో ఉంటాయి. ఈ మార్పులు క్రమబద్ధంగా వుండటంచేత

వీటిని ధ్వని సూత్రాలంటారు. (phonetic laws) వీటిని గూర్చి ముందు ప్రత్యేక ప్రకరణం వస్తుంది.

సంస్కృత క్రియా విభక్తుల్ని గ్రీకు, లాటిన్, పర్షియన్, జర్మానిక్ భాషల్లోని క్రియా విభక్తుల్ని క్రీ.శ.1816 లో ఫ్రాన్జ్‌బాప్ (Franz Bopp) కావించిన తులనాత్మక పరిశీలనంతో తచ్ఛాస్త్రానికి బీజావాపమయింది.

క్రీ.శ.1818లో రాస్‌మస్‌క్రిస్టియన్ రాస్క్ (Rasmas Kristian Rask) జర్మానిక్ భాషాపదాలకు, ఇతర యూరోపియన్ భాషాపదాలకు, ధ్వనుల్లోని మార్పు నియతమని నిరూపించాడు. ఉదా:- ఇతర యూరోపియన్ భాషల్లో 'ప' కారముంటే జర్మానిక్ భాషల్లో 'ఫ' కారముంటుంది. పాతర్ — ఫాదర్ ఇత్యాదులు.

క్రీ.శ. 1819 లో జాకోబ్ గ్రిమ్ (Jacob grimm) జర్మానిక్ భాషలకు (గోథిక్, స్కాండినేవియన్, ఇంగ్లీషు, ఫ్రీషియన్, డచ్, జర్మను భాషలు) తులనాత్మక వ్యాకరణములోని ప్రథమసంపుటాన్ని ప్రచురించాడు. 1822లో రెండవ సంపుటం వచ్చింది. జర్మానిక్ భాషలకు, ఇతర యూరోపియన్ భాషలకు అందులో తుల్యవ్యంజన పట్టిక ప్రదర్శింపబడింది. (correspondences of consonants) వీనికే 'గ్రిమ్సులా' అనే వ్యవహారం.

ఈ తులానాత్మక పట్టికలు చారిత్రక వివరాలతో కూడినవి. ధ్వన్యుచ్చారణం నియమరహితం కాదని, అది ఒక క్రమవిధానంలో మార్పు చెందుతుందని గ్రిమ్ నిరూపించాడు. అతని నిరూపణలివ్వటికి సాటిలేనివి. 1826, 1831, 1837 లో మరి మూడు సంపుటాలు వచ్చాయి. కాని వాక్యనిరూపణానికి సంబంధించిన ఐదవ సంపుటం రాకపోవటం దురదృష్టం.

1833 లో బాప్ ఇండో-యూరోపియన్ భాషలకు సమగ్ర తులానాత్మక వ్యాకరణాన్ని ప్రచురించట మారంభించాడు.

1833—36 మధ్యకాలంలో అగస్ట్ ఫెడరిక్ పాట్ (August Friedrich Pott) 'నిరుక్త పరిశోధనలు' (Etymological Investigations) అనే గ్రంథం ప్రచురించాడు. 'నిరుక్తి' అంటే క్రియార్థక ధాతు నిర్ణయమే చేయాలని లేదు. 'నిరుక్తి' అంటే పదచరిత్ర. శబ్దపరిణామ క్రమం. ఒక్కొ

ఒక మూలభాషకు చెందిన సోదర భాషల్లోని తుల్యరూపాల చరిత్ర కూడా[1]. అర్థంలో ఈషద్భేదాలుండవచ్చు. ఇండో యూరోపియన్ భాషలకాధునిక నిరుక్తాచార్యుడు 'పాట్'.

బాప్ గ్రంథాన్నతిగమించి అగస్ట్ ష్లైచర్ (August Schleicher) (1823-63) The compendium of the comparative grammar of the Indo-European Languages అనే గ్రంథాన్ని ప్రచురించాడు.

కారల్ బ్రగ్‌మన్ (karl Brugman) బెర్‌థోల్డ్ డెల్‌బ్రక్ ( Berthold Delbruck ) (1842-1922) అనేవారి "Outline of the comparative grammar of the Indo - Europen Languages" అనేపుస్తకం వచ్చింది. దీని ద్వితీయ ముద్రణం కూడా 1916 లోగా రావటంతో దీని ప్రామాణ్యం నిరూపితం.

4.21 1856 లో బిషప్ కాల్డ్వెల్ ద్రావిడ భాషలకు తులనాత్మక వ్యాకరణం రచించి, వాటి ప్రత్యేకకుటుంబకతను నెలకొల్పాడు. స్లావిక్ భాషలకు తులనాత్మక వ్యాకరణం ఫ్రాంజ్ వాన్ మిక్లోసిచ్ (Franz Von Miklosich 1813-1891) రచించాడు. కెల్టిక్ భాషలకు జోహన్ కాస్పర్ జూస్ 1853లో (Johann Kaspor ss1806-1856) వ్యాకరణం రచించాడు. ఈ విధమైన తులనాత్మక రచనలు శాస్త్రీయ పద్ధతులపై విరచితంకాగా భాషలొకే మాతృక నుండి జనిస్తాయని, అవి కుటుంబాలుగా వుంటాయని, ధ్వనుల మార్పులు నియతరీతి నుంటాయని, శాస్త్రీయమైన ఆలోచనలభివృద్ధి పొందాయి. నిరాధారపుటూహలు రూపు మాసాయి. లక్ష్య-లక్షణ పద్ధతి ( Inductive method ) బాగా వ్యాపించింది[2]. భాషను గూర్చిన సామాన్యీకరణాలు బహులక్ష్య పరిశీలనమాధారంగా చేయటాని కవకాశమేర్పడింది.

---

1 "...... the etymology of a speech-form is simply its history, and is obtained by finding the older forms in the same language and the forms in related languages which are divergent variants of the same parent form. (*Language-Bloomfield-P.15*)

2 "The only useful generalisations about language are inductive generalisations ...... When we shall have adequate data about many languages, we shall have to return to the problem of general grammar and to explain these similarities and divergences, but this study, when it comes, will be not speculative but inductive." (*Bloomfield P-20*)

4.22 విలియం విట్నీ (William Dwight Whitney : 1827-94) అనే అమెరికన్ పండితుడు "భాష-భాషాధ్యయనం" (Language and the Study of Language) అనే గ్రంథాన్ని; భాషాజీవితము, తదభివృద్ధి (The life and growth of language) అనే గ్రంథాని 1874లో రచింపగా, ఇవి వివిధ యూరోపియన్ భాషల్లోకి అనువదింప బడ్డాయి. నేటికివి కొంత పాతవడ్డా, భాషాధ్యయన సామాన్య నియమావగాహనకివి తోడ్పడతాయి.

1880లో హెర్మన్‌పాల్ (Herman Paul) రచించిన భాషాచారిత్రక నియమావళి (The principles of Linguistic History) ఐదుముద్రణాలు పొందిందంటే చారిత్రక భాషాశాస్త్ర పరమైన దాని ప్రామాణికత్వం విదితం. ఇండో యూరోపియన్ భాషల్లోని చారిత్రక ధ్వని పరిణామాల్ని ఈగ్రంథం బాగా నిరూపించింది.

విశేష పరిచయంలేని ఇండో యూరోపియన్ భాషలకు వర్ణనాత్మక పద్ధతిని రచనలు రాసాగాయి. అగస్టు లిస్కన్ (August Liskien:1840-1916) స్లావిక్, బాల్టిక్ భాషల నభివర్ణించాడు.

విలిహెం వాన్ హమ్‌బోల్టు (1776-1835) రచించిన సామాన్య భాషా శాస్త్ర గ్రంథం 1836 లో ప్రచురితం. ఇందులో అనేక భాషల సామాన్య లక్షణాలు, పదనిర్మాణాల రీతుల్ని గూర్చిన వివరాలు చాలా ఉన్నాయి. హేయంగా పరిగణింపబడే మాండలికాలకు ప్రాముఖ్యం వచ్చింది. వ్యవహారమాత్రభాషలకు విలువ లభించింది. ముఖాముఖి పరిశీలనం ఎక్కువైంది. దీనితో వర్ణనాత్మక వ్యాకరణాలు ఏర్పడటం మొదలైంది.

4.23 1916లో దససూరె (Ferdinand de Saussare: 1857-1913) ఉపన్యాసాలు పుస్తకరూపందాల్చి గొప్ప సంచలనాన్ని కల్గించాయి.

అమెరికా ఖండములో అజ్ఞాతంగా ఉన్న అసంఖ్యాక రెడ్ ఇండియన్ భాషలనభివర్ణించే ఉద్యమం ముమ్మరంకాజొచ్చింది. దీనితోవర్ణనాత్మక భాషా శాస్త్రానికి విశేష ప్రాముఖ్యం వచ్చింది. ఈ శాస్త్రానికి "క్షేత్ర కృషి" (Field work) ప్రాణం.

భాషా వ్యవహర్తతో (informant) ప్రత్యక్ష సంబంధాన్ని ఏర్పరచుకొని అతనిముఖతః సేకరించిన భాషను(దీన్నే Corpus అంటారు)వ్యాకరించి

వర్ణనిర్ణయం, పదాంశ నిరూపణం, వాక్య స్వరూప స్వభావ పరిశీలనాదులు గావించటమే వర్ణనాత్మక భాషాశాస్త్రపద్ధతి. దీనికి మార్గదర్శకులు ( i ) బౌజ్ (ii ) ఎడ్వర్డుసఫీర్ (iii ) బ్లూమ్ ఫీల్డ్. వీరి కనేకశిష్యు లున్నారు. వీరు యధాశక్తి నీ పద్ధతి నభివృద్ధి చేసారు.

ఈ పద్ధతినే "ఏకకాలిక భాషాశాస్త్రం" అని అంటారు. ( Synchronic Linguistics, Syn = with, chronos = time--the study of language, as it appears at a given period) ఒక కాలానికి, ఒకదశకు చెందిన భాషాభివర్ణనం కావించే శాస్త్రం.

భాషాపరిణామ వికాసాల్ని తెలియజేసే శాస్త్రం చారిత్రక భాషాశాస్త్రం. (Historical Linguistics ) దీన్నే "అనేకకాలిక భాషాశాస్త్రం" అంటారు. (Diachronic Linguistics : dia = across, chronos = time)

లాటిన్ భాష రొమాన్సు భాషలుగా ఎట్లా పరిణమించాయో; ప్రాకృతాలు ఆధునికార్యభాషలెలా అయినాయో; ఆంగ్లో-సాక్సన్ భాష ఆధునిక ఆంగ్లంగా ఎలామారిందీ నిరూపించే శాస్త్రం.

అనేక, ఏకకాలిక భాషాశాస్త్రాల్ని ఏకంచేసి అంటే బాగా అనుసంధానం చేస్తే చారిత్రక భాషాశాస్త్రం ఏర్పడుతుంది. ఈ భాషాశాస్త్రం విశేషంగా వర్ణనాత్మక భాషాశాస్త్రం మీద ఆధారపడి వుంటుంది[1]. కాబట్టి వర్ణనాత్మక భాషాశాస్త్రం—సంస్కృతానికి పాణినీయంలాగా ప్రథమంగా విరచితంకావాలి.

150 సంవత్సరాల అవిరళ కృషిఫలితంగా ఇండో-యూరోపియన్ భాషలకు తులనాత్మక భాషాశాస్త్రం ఏర్పడ్డది. తక్కిన భాషాకుటుంబాలలోని భాషలకు సరియైన చారిత్రక కృషిలేని కారణంగా తులనాత్మక భాషాశాస్త్రం వాటికేర్పడలేదు.

వర్ణనాత్మకభాషాశాస్త్రం→ చారిత్రకభాషాశాస్త్రం→ తులనాత్మకభాషాశాస్త్రం ఇది సూత్రం.

---

[1]The success of historical linguistic study depends on the state of descriptive lingustics (Lehmann's Historical Linguistics. P.13)

## 4.3 భాషాశాస్త్రంలో విభిన్న దృక్పథాలు : (Schools in Linguistics)

భాషా శాస్త్రం నూతనంగా ఏర్పడ్డా ప్రాంతీయ భేదాల్ని అనుసరించి, ఆశయ భేదాల్ని బట్టి, అవసరాల్నిబట్టి దృక్పథాల్లో భేదాలు కల్గినాయి. వాటిని స్థూలంగా చూద్దాం.

## 4.31 అమెరికన్ దృక్పథం (The American School of Linguistics)

ఇందు వర్ణనాత్మక పద్ధతి ప్రధానం. ఈ ఖండంలో ఆదివాసు లసంఖ్యాకంగా ఉన్నారు. వారి భాషకు లిపిలేదు. వాగ్వ్యవహారమే ఆధారం. అందుచేత వర్ణనాత్మక పద్ధతి తప్ప అన్యవిధానం ఇక్కడ సరిపోదు. ఈ భాషాపరిశీలనభారం భాషాశాస్త్రజ్ఞులు వహించారు.

అమెరికన్ భాషాశాస్త్రజ్ఞులు రెండుతెగలు. (1) ఎడ్వర్డు సపీరు-అతని అనుయాయులు-వీరు ముఖ్యంగా మానవశాస్త్రజ్ఞులు (anthropologists) (2)లియోనార్డ్ బ్లూమ్‌ఫీల్డు-అనుయాయులు: వీరు మానవ ప్రవర్తన వాదులు. (behaviourists) వీరి అనుయాయుల్లో ముఖ్యులు— కె. యల్. పైక్, నైడా, ఎమెనో, హారిసన్ మొదలైనవారు. వీరిలో వీరికి సూక్ష్మ భేదాలుండ వచ్చు. వీరంతా భాష సంపాదితమంటారు. అర్థం కన్న శబ్దం వీరికిప్రధానం. వర్ణ విజ్ఞానం (phonemics) వర్ణసమ్మేళనం (structure) పదాంశ విజ్ఞానం (morphemics) వీటికత్యంత ప్రాముఖ్యమిస్తారు. నూత్న పరిభాషా కల్పనంలో వీరికి మక్కువ ఎక్కువ.

## 4.32 లండన్ దృక్పథం (London School of Linguistics)

ఈ దృక్పథంపై భారతీయ భాషాశాస్త్ర ప్రభావం అత్యధికం. ఇందులో అక్షరానికి (Syllable) అత్యధిక ప్రామాణ్యం. వీరికెక్కువగా చారిత్రక దృష్టి. ఆర్. యల్. టర్నర్, యం. యం. విల్‌సన్, మోనియర్ విలియమ్స్, జె. ఆర్. ఫర్త్, టి. బరో, పామర్ మున్నగువారు ఇందులో ముఖ్యులు.

నైఘంటిక రచనపై (Lexicography) ప్రత్యేకాసక్తి.

4.33 ప్రేగ్ దృక్పథం (Prague School of Linguistics)

ఇందులో విశేషంగా నిర్మాణానికి (structures) అధిక ప్రాముఖ్యం. సాహిత్యానికి కూడా వీరు ప్రాముఖ్యమిస్తారు.

ఇంకా రష్యన్ దృక్పథం, కోపెన్ హాగన్ దృక్పథం సూక్ష్మ భేదాలతో ఉన్నాయి.

# 2. భాషల వర్గీకరణము.

## (Classification of languages)

5.0 ఇప్పుడు ప్రపంచంలో ఎన్ని భాషలు వ్యవహృత మౌతున్నాయో చెప్పలేం. కొన్నివేల సంవత్సరాలనుండి అసంఖ్యాకాలైన భాషలు వాడుకలో వున్నాయి. కొన్నిభాషలున్నట్లు వినికిడేగాని తద్భాషా వ్యవహర్తలు లేరు. వారి భాషలు లిఖితం కాకపోవటంచేత వాటి వివరాలు తెలియవు.

కొన్ని స్వతంత్ర భాషలా? ఏ భాషకైనా మాండలిక భేదమా? తెలుసుకోటం కష్టం. ఉదా॥ సార్డీనియన్ భాష. ఇది స్వతంత్రమని కొందరు, ఇటాలియన్ భాషామాండలికమని కొందరు. "స్విజరిక్" అనేది వాస్తవికంగా జర్మన్ భాషామాండలికం.

ఇటువంటి సమస్యల కేదోరీతిని సమాధానపడి, పరిగణనం చేస్తే, ప్రపంచంలో సుమారుగా నాలుగువేల భాషలదాకా ఉన్నాయి. ఇవి ధ్వని, వర్ణ, వ్యాకరణాంశ, వాక్య నిర్మాణాదుల్లో, మరికొన్ని భాషలతో పోలికలు, మరికొన్నింటితో చీలికలు కల్గి ఉన్నాయి.

ఇన్నివేల భాషల లక్షణాలు వేరువేరుగా తెలుసుకోవాలంటే సాధ్యం కాదు. అందుచేత వీటిని విభజించుకొని, వర్గీకరించుకొంటే భాషాధ్యయనం సుకరమౌతుంది.

భాషల వర్గీకరణంలో రెండు పద్ధతులు స్థూలంగా ప్రాముఖ్యాన్ని గడించాయి.

(i) భాషల పుట్టుకనుబట్టి (ఇదేజాతి) వాటిని వివిధ కుటుంబాలుగా నిర్ణయించటం. దీన్నే "జాతి వర్గీకరణం" (Geneticl geneological classification)

(ii) పదపదాంగ నిర్మాణం లేక వ్యాకరణాంశ నిర్మాణాన్ని బట్టి భాషల్ని వర్గీకరించటం. (Structural or morphological classification)

ఈ రెండు పద్ధతులు పూర్తిగా సమగ్రం అనలేం. అయినా స్థూలంగా ఈ రీతిగా విభజించవచ్చు. యూరప్‌లోను, ఆసియాలోను గల భాషలకు సన్నిహిత సంబంధమున్నట్లు అనేక స్థాయిల్లో సాక్ష్యాలు లభించాయి. ముఖ్యంగా దైనందినోపయుక్తమైన ప్రాథమిక పదజాతంలో (Basic vocabulary) ఉదా : సంబంధ వాచకాలు, పెంపుడు జంతువుల, పక్షుల పేర్లు, తినుబండారాలు, రంగులు, రుచులు, సంఖ్యావాచకములు, సర్వనామములు, శరీరావయవాలు మొదలైనవి. వీటిలో ఉన్న తౌల్యాన్నిబట్టి, సన్నిహితత్వాన్నిబట్టి, నూటయాభై సంవత్సరాలకు పూర్వమే ఒక పెద్ద భాషా కుటుంబాన్ని తొలుత భాషాశాస్త్రజ్ఞు లేర్పరచారు. అదే ఇండో-యూరోపియన్ భాషాకుటుంబం.

ప్రపంచంలోని భాషలన్నీ పరస్పరం భేదిస్తూనే వుంటాయి. కాని యిందులో కొన్ని మరికొన్నింటికన్న విపరీతంగా భేదిస్తాయి. ఈ భేదాలు, వ్యాకరణాంశాలవలన ఏర్పడుతున్నాయి. కాబట్టి వ్యాకరణాంశాల్ని పురస్కరించుకొని కొన్నికుటుంబాలను ఏర్పరచవచ్చును.[1] (morphological classification) ఈ ద్వివిధమైన వర్గీకరణాల్ని గూర్చి, వాటి గుణలోపాల్ని గురించి, వివరంగా తెలుసుకోవాలి. అప్పుడనేక భాషల స్వరూప స్వభావాల్ని అధ్యయనం చేసిన వాళ్ళ మౌతాము. బహుభాషా వ్యవస్థల్ని అవగాహనం చేసుకోటంవల్ల భాషా సామాన్య లక్షణాలు బోధపడతాయి. భాషాశాస్త్రజ్ఞుడీరీతి అవగాహన నెంతగానో పెంపొందించు కోటానికి ఉద్యుక్తుడౌతాడు.

---

1...... all languages differ from one another, but certain ones differ far more than others. This is tantamount to saying that it is possible to group them into morphological types" Sapir-

(*Language- P. 121*)

జాతీయ వర్గీకరణల (Geneological classification
enetic classification)

18 వ శతాబ్ది ఉత్తరార్థం వరకు బైబిల్‌కు మూలభాషయైన హీబ్రూ ప్రపంచ భాషలకన్నింటికి మూలభూతమైందిగా పరిగణింపబడింది. . 1767 లో ఫ్రెంచి జెసూట్ అర్చకుడు పెరిగాస్టన్ లారెంట్ కోరెన్‌డన్ Gaston Laurent Coeurdonx) సంస్కృతానికి, యూరోపియన్ ‌కు కొన్ని పోలికలున్నట్లు గుర్తించాడు. ఆ తరువాత రెండు దశాబ్దా ‌ర్ విలియం జోన్స్ జాతి విభజన పద్ధతికి పునాది వేసాడు. దీనితో 19వ లో తులనాత్మక లిఖిత భాషాపరిశీలనం (Philology) అభివృద్ధిగాం ఈ తులనాత్మక పద్ధతి వల్ల భాషాకుటుంబాల మౌలిక భాషల్ని inal or Primitive Languages) పునర్నిర్మాణం (reconstruction) కి ప్రయత్నం ప్రబలింది.

ఒకే కుటుంబాలలో భాషలకన్న, ఉపకుటుంబాలలోని భాషలకు ంత సన్నిహితత్వం ఉంటుంది. అంతకన్న ఒకశాఖకు, అంతకన్న ఖకు చెందిన భాషల్లో అత్యంతాతిశయ సన్నిహితత్వం ఉంటుందని ‌కులు నిర్ణయిస్తూ వచ్చారు. ఈ కృషి అనుకున్నంత సులువుగా నెరవేర అనేక తీవ్రవాదోపవాదాలు చెలరేగాయి. పరిష్కృతమైనట్లు ‌న్న కొన్ని సమస్యలు తిరిగి తలెత్తుతున్నాయి. ఉదా: ద్రావిడభాషలు ‌న్ మహాభాషా కుటుంబానికి చెందినట్లు కాల్డ్వెల్ కావించిన ప్రతిపాద కొందరు ఖండించారు. స్టెంకొనౌ దానిని పునరుద్ధరించాడు.

జాతి వర్గీకరణంలో పరిగణింపదగిన అంశాలు : (i) భౌగోళిక సన్ని ‌వ్యం (Geographical affinity) చాల వరకు సజాతీయ భాషలు భౌగోళి ‌క సన్నిహితంగానే ఉంటాయి. అయితే అలా సన్నిహితం కానంత ‌న, సజాతీయ భాషలు కావనటం పొరపాటు. ఇందుకు పాకిస్తాన్‌లోని ‌రా ఈ, కురఖ్, మాల్తోభాషల్ని గ్రహించవచ్చు.

(ii) నిత్యవ్యవహారోపయోగ పదజాలం, శబ్దార్థ సామ్యాన్ని కల్గి ఉం ఈ సామ్యం యాదృచ్ఛిక మాత్రం కారాదు. అంటేఇంగ్లిషులోని ‌ తెలుగులోని 'మూతి'. అట్లాగే ప్రాప్-ప్రాపు; నీట్-నీటు, వంటి

కతిపయశబ్దాల యాదృచ్ఛికత్వాన్ని బట్టి ఆంగ్లము, ఆంధ్రము, సజాతీయ భాషలనటం హాస్యాస్పదం. అసంఖ్యాక శబ్దజాలంలో సామ్యం గోచరించాలి. శరీరావయవ వాచకాల్లో, సంబంధ బోధక పదాల్లో, గృహోపకరణ సామగ్రి పదాల్లో, రంగుల్లో, రుచుల్లో,సర్వనామాల్లో సంఖ్యావాచకాదులో శబ్దార్థ సామీప్యం స్పష్టంగావుండాలి.

అంతేకాకుండా వర్ణయోజనంలో ధాతునిర్మాణంలో (Structure: Cvcv (C) (ᵛ)) క్రియారూపాలోను, విభక్తిప్రణాళికలోను లింగవచనాల్లోను,సమాసాల్లోను, కృతద్ధిత రూపాలలోను, వాక్యరచనలోనుసమానత్వంఉండాలి.

## 5.4 భాషా కుటుంబాలు

ఒక అంచనా ప్రకారం నేడు ప్రపంచం అంతటా వ్యాప్తమై ఉన్న భాషల సంఖ్య 2,796. భాషావైజ్ఞానికు లీభాషల్ని పదికుటుంబాలుగా విభజించారు : జనాభా ఇప్పుడెక్కువగ ఉండవచ్చు.

1. ఇండో యూరోపియన్........ 130 కోట్లు
2. సైనో టిబెటన్.................. 64 కోట్లు
3. యూరల్ ఆల్టాయిక్............ 13 కోట్లు
4. సెమిటో హెమైట్....... ........ 12కోట్లు
5. ఆస్ట్రిక్........... ....................10కోట్లు
6. బంటూ................................10కోట్లు
7. ద్రావిడ భాషలు....................10కోట్లు
8. జపానీస్............................ 9కోట్లు
9. అమెరికన్ ఇండియన్... ............1కోటి
10. బస్కూ..................... ....0. 1కోటి

ఈ పదికుటుంబాలలో, వాని వాని విశిష్టలక్షణాల్నిబట్టి ఎన్నో ఉపకుటుంబాలుంటాయి. ఉపకుటుంబాలలో శాఖలు, శాఖలకు ఉపశాఖలు ఉంటాయి. ఉపశాఖలకు వర్గాలు, వర్గాలకుఉపవర్గాలు ఉంటాయి. ఇలా చిత్రించవచ్చు.

## కుటుంబం




ఈ విధంగానే తక్కిన ఉపకుటుంబాలకు శాఖోపశాఖలుండవచ్చు. పై నుండి క్రిందికి దిగేకొలది భాషాధ్యయనం సూక్ష్మాతి సూక్ష్మంగా (micro-scopic) ఉంటుంది. క్రిందినుండి పైకిపోయేకొలది స్థూలంగా ఉంటుంది. (Macroscopic)

పాశ్చాత్య భాషలు చాలవరకు, ఉత్తర భారతీయార్య భాషలు, 'ఇండో యూరోపియన్' భాషాకుటుంబానికి చెందుతాయి. ఇది మహావృక్షాన్ని పోలి శాఖోప శాఖలుగా విస్తరించింది. టిబెట్టు, చీనా, బర్మీస్, కాంబోడియా, వియత్నాం భాషలు 'సైనో - టిబెటన్' భాషాకుటుంబానికి చెందుతాయి.

ఫిన్నిష్, ఉగ్రియన్, హంగేరియన్, తుర్కి, మంచు, మంగోలియన్, కొరియన్ భాషలు 'యూరల్ - ఆల్టాయిక్' భాషాకుటుంబంలోవి.

అరబిక్, పాలెస్తైనా, ఇజ్రాయిల్, మున్నగు మధ్య ప్రాచ్య భాషలు; హిబ్రూ, ఈజిప్టియన్, ఇథోపియన్ మొదలైనవి 'సెమెటో - హెమైట్' కుటుంబానికి చెందుతాయి.

ఇండోనేషియన్, ఆస్ట్రోఏషియాటిక్ భాషలు 'ఆస్ట్రిక్' కుటుంబం లోనివి.

'బంటూ' కుటుంబానికి చెందినవి-జులు, స్వహిలి, ఉగాండా మున్నగనవి. ఇవి భూమధ్య రేఖకు దక్షిణంగా ఉన్నాయి.

ఎస్కిమో మొదలైనవి 'అమెరికన్-ఇండియన్' కుటుంబంలోవి.

పిరనీస్ పర్వతశ్రేణి ఉభయ సానువులలో నివసించే అనాగరక ప్రజలు మాట్లాడే భాషలు 'బస్క్యూ' కుటుంబానికి చెందుతాయి.

6.0 ఇండోయూరోపియన్ భాషాకుటుంబం చాల పెద్దది. దిక్కుల్ని బట్టి దీన్ని (i) తూర్పు (ii) పడమర అని రెండు విభాగాలు చేయవచ్చు.

6.1 తూర్పుశాఖకు (i) ఇండోయిరానియన్ (ii) బాలు-స్లావిక్ అనే ఉపశాఖలు. ఇండోయిరానియన్ ఉపశాఖ రెండుగా చీలింది. (i) ఇండిక్: (వైదిక సంస్కృతం) ఇందులోనుండే సంస్కృతం జనించింది. సంస్కృతం నుండి పాలి, ప్రాకృతం అని రెండు కొమ్మలు. ప్రాకృతం నుండి అపభ్రంశాలు- అందులో నుండి హిందీ, బెంగాలి, గుజరాతి, మరాటి, పంజాబి, కాశ్మీరి, ఒరియా అనే ఔత్తరాహిక భాష లావిర్భవించాయి.

6.2 ప్రాచీన ఇరానీ భాషనుండి జురాష్ట్రియన్ మతగ్రంథం వెలసిన అవెస్తన్ భాష; ప్రాచీన పర్షియన్ భాషలు ఏర్పడ్డాయి.

మధ్య ఇరాని నుండి మధ్య పర్షియన్‌భాష; అందులోనుండి సార్డి యన్, సిథియన్ భాషలు జనించాయి. సార్డియన్‌నుండి సింహళి, ోమని (జిప్సి) భాషలు; సిథియన్ నుండి బెలూచి, పస్తు అనే ఆఫ్గనిస్థాన్ ాషలు జనించాయి.

.3 బాల్టో స్లావిక్ విభాగం: ఇందులో రెండు శాఖలు. (క) బాల్టిక్ చ) స్లావానిక్. బాల్టిక్ శాఖనుండి లిథుయేనియన్, లాటిన్, ప్రష్యన్ ాషలుత్పన్నంకాగా, స్లావానిక్ నుండి బల్గేరియా, జక్, పోలిష్, స్లావిక్, ష్యన్ ఏర్పడ్డాయి. దీన్ని బట్టి రష్యన్ జక్, పోలిష్ భాషలకు డమటి శాఖకు చెందిన ఇతర యూరోపియన్ భాషలకు దగ్గర సంబంధం దని గుర్తించాలి.

.4 పడమటి విభాగం తూర్పు విభాగం కన్న చాల పెద్దది. ఇందులో ప్రధానంగా నాల్గుశాఖలు (i) హెలినిక్ (ii) ఇటాలిక్ (iii) కెల్టిక్ (vi) జర్మనిక్ (ట్యుటానిక్)

.41 ఇందులో హెలినిక్‌నుండి శాస్త్రీయగ్రీకు, అందులోనుండి ఆధునిక గ్రీకు ఆవిర్భవించాయి.

.42 ఇటాలిక్ నుండి లాటిన్ జనించింది. లాటిన్ నుండి స్పానిష్, పోర్చుగీసు, ఫ్రెంచి, ఇటాలియన్, రుమేనియన్ భాషలు పుట్టాయి.

6.43 కెల్టిక్ శాఖనుండి కానిష్, వెల్ష్, బ్రెటాన్, ఐరిష్, గేలిక్ మొదలైన భాషలుత్పన్నమైనాయి.

6.5 పై శాఖల కన్న చాలపెద్దది జర్మనిక్. దీనికి మూడు ఉప శాఖలు.

(i) తూర్పు జర్మనిక్ : ఇందులోనుండి గోథిక్ భాష పుట్టింది.

(ii) పడమటి జర్మనిక్: దీనిలోనుండి ఆంగ్లోసాక్షన్, ప్రాచీనసాక్షన్, ఆధునిక జర్మన్ భాషలేర్పడ్డాయి.

ఆంగ్లో సాక్షన్ నుండి మధ్యఇంగ్లీషు, ఆధునిక్ ఇంగ్లీషులు జనించాయి.

(iii) ఉత్తరజర్మనిక్ నుండి ప్రాచీననార్స్; నార్సునుండి నార్విజియన్, స్వీడిష్, డెనిష్, ఐస్‌లాడింక్ అనే భాషలు ప్రభవించాయి. ఈవిధంగా శాఖోపశాఖా సముపేతమైన మహా వటవృక్షం వంటిదిగా ఈ ఇండో-యురోపియన్ భాషాకుటుంబాన్ని సంభావించవచ్చు.

## 7.0 యూరల్-అల్టాయిక్ భాషాకుటుంబం

ఈ భాషాకుటుంబాన్ని "సిథియన్" "తురేనియన్" "ఫిన్నిష్" "ఫిన్నో-ఉగ్రియన్" భాషాకుటుంబం అని కూడా వ్యవహరిస్తారు.

యూరప్, ఆసియా ఖండాల్లోని ఉత్తర భాగంలో నివసించే అనాగరికులకు "సిథియన్లని" వ్యవహారం. ద్రావిడ భాషలుకూడ ఈ సిథియన్ భాషాకుటుంబానికి చెందినవని రాస్క్‌పండితుడు తొలుత అభిప్రాయ పడ్డాడు. కాల్డ్వెల్ ఈ అభిప్రాయాన్ని సమర్థించాడు.

7.1 ఈ కుటుంబం రెండుగా చీలింది.

(i) యూరలిక్ ఉపకుటుంబం. (ii) అల్టాయిక్ ఉపకుటుంబం. యూరలిక్ విభాగంలో రెండుభాగాలు:

(i) ఫిన్నో-ఉగ్రిక్ విభాగం. (ii) సెమొయెట్ విభాగం.

ఫిన్నో-ఉగ్రిక్ విభాగంలో రెండుశాఖలు.(i) పశ్చిమఫిన్నో (ii) ఉగ్రిక్.

పశ్చిమ ఫిన్నో శాఖనుండి-ఫిన్నిక్, ల్యాప్పిష్, వోల్గాయిక్, పెర్మియన్ భాషలేర్పడాయి.

7.2 టర్కి, మంగోలియన్, కొరియన్, మంచు భాషలు అల్టాయిక్ ఉపకుటుంబం నుండి ఏర్పడ్డవి.

7:3 జనాభాను బట్టి ఈ భాషాకుటుంబానికి తృతీయ స్థానం. అమెరికన్ జాతీయ రక్షణ విద్యాశాఖవారు ఈ కుటుంబ భాషలపై పరిశోధనకు విశేషంగా ప్రోత్సాహమిస్తున్నారు. ఎందుకంటే ఈ భాషావ్యవహర్త లెక్కువగా రష్యా సరిహద్దుల్లో నివసిస్తున్నారు. రష్యాలోని ఆరు రిపబ్లిక్కులలో ఈ కుటుంబ భాషలు వ్యవహృతం. చైనా రష్యాల మధ్యగల ఔటర్ మంగోలియాలో

కు భాష వ్యవహృతం. ప్రాచీన సంస్కృతిగల ఇరాన్, అరేబియా, యీజిప్టు దేశాలయాలలోను ఈ భాషలు వ్యవహృతం. ఆధునిక, సాంఘిక, చారిత్రక పరిస్థితుల అవగాహనానికి ఈ భాషాపరిజ్ఞానం అవసరం.

యూరల్- ఆల్టాయిక్ భాషావ్యవహర్తలు అమెరికాలో విశేషంగా ఉన్నారు. ఫిన్లండ్ దేశీయులు, ఎస్టోనియనులు, హంగేరియన్లు, టర్కీ ప్రజలు, మంగోలియనులు అమెరికాకు వలసపోయి స్థిరపడ్డారు. అమెరికా సాంఘిక వ్యవస్థలో వీరికిగల స్థానాన్ని నిర్ణయించటానికి ఈ భాషాధ్యయనం తోడ్పడుతుంది.

పదనిర్మితిని బట్టి యీ కుటుంబం సంయోగాత్మకమైంది. (agglutinative)

ఉదా: ఎవె - ఎవెలర్ - ఎవెలర్‌దెన్ - టర్కిష్‌భాష.

(ఇల్లు) (ఇండ్లు) (ఇండ్లను)

బబ- బబలర్- బబలర్‌దెన్

(తండ్రి) (తండ్రులు) (తండ్రులను)

## 8.0 భారత దేశంలోని భాషా కుటుంబాలు

భారత దేశంలో వ్యవహృత మౌతున్న భాషల్ని గ్రియర్‌సన్ పండితుడు పరిశోధించి, Linguistic Servey of India అని పది సంపుటాలు గా ప్రచురించాడు. ఇందులో నాల్గవ సంపుటాన్ని స్టెంకెనో ప్రధానంగా సంతరించాడు.

భారతదేశం వివిధ జాతి వక్షాలకు, జంతువులకు, వివిధములైన వారికి ఏరీతిగా ప్రదర్శనశాల అని పేరుమోసిందో, అదే విధంగా వివిధ భాషాకుటుంబాలకు కూడ ఖ్యాతి గాంచింది.

ఈ సంపుటాలలో 179 భాషలు, 544 మాండలికాలు సర్వే చేయబడ్డాయి. భారత దేశంలో నాలుగు భాషాకుటుంబాలు ముఖ్యంగా ఉన్నాయి. అందులో పెద్దది హిందార్యభాషా కుటుంబం.

8.22 మధ్య ద్రావిడ భాషలు : (1) కుఇ, (2) కువి (3) కుడి (4) కోయ (5) కోలామి (6) గోండ్ (7) గదబ (8) పర్జి (9) పెంగో (10) మండా (11) నాయికి (12) ఒల్లారి (13) తెలుగు

8.23 దక్షిణ ద్రావిడ భాషలు : (1) తమిళము (2) మలయాళము (3) కన్నడము (4) తుళు (5) కొడుగు (6) తుద (7) కోట

8.24 కాల్డ్వెల్ నాటికి 13 ద్రావిడ భాషలే యెరుక. అనంతర కాలంలో ఉపకుటుంబాలు నిర్ణయింప బడ్డాయి. ఇంకా కొన్ని ద్రావిడ భాషలున్నట్లు కనుగొంటున్నారు.

తెలుగు భౌగోళికంగా దక్షిణ ద్రావిడ శాఖకు చెందింది. ఆ శాఖా లక్షణాలు ధ్వనుల్లో ఎక్కువగా తెలుగు కలిగి వుంది. కాని వ్యాకరణాంశాల్ని పురస్కరించుకొని తెనుగు, మధ్య ద్రావిడభాషా ఉపకుటుంబానికి చెందిందిగా ఆచార్య బరో, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య పి. యస్. సుబ్రహ్మణ్యాదులు నిరూపించారు.

8.25 తమిళానికి క్రీ.శ. 1 వ శతాబ్ది నుండి; కన్నడానికి క్రీ.శ. 450 నుండి; తెలుగు భాషకు క్రీ.శ. 575 నుండి, మలయాళానికి క్రీ.శ. 9 శతాబ్దినుండి శాసనాలున్నాయి. తమిళానికి క్రీ.శ. 1 వ శతాబ్దినుండి; కన్నడానికి క్రీ.శ. 8 వ శతాబ్దినుండి; తెలుగునకు 11 వ శతాబ్దినుండి; మలయాళానికి 12వ శతాబ్దినుండి సారస్వతం ఉంది. ఈ నాల్గు భాషలే రాజ్యాంగం చేత గుర్తింప బడ్డాయి. తుళు, కొడగు, నాగరిక వ్యవహారం కలవి. తక్కిన 17 భాషలు అనాగరిక భాషలు.

కాల్డ్వెల్, కిట్టెల్, జ్యూల్స్ బ్లాక్ మొదలైన ప్రముఖులీ భాషల ఏక కుటుంబకతను సోపపత్తికంగా నిరూపించారు. టి. బరో, యం. బి. ఎమెనో, భ. కృష్ణమూర్తి, పి. యస్. సుబ్రహ్మణ్యం మున్నగు వేత్తలు ఈ కుటుంబంలోని భాషల్ని పరిశోధించి, మూల ద్రావిడ భాషా పునర్నిర్మాణం చేయటానికి యత్నిస్తున్నారు.

9.0 ఆస్ట్రిక్ భాషా కుటుంబం

దీనికే "మలయో-పోలినీషియన్" కుటుంబమని వ్యవహారం. భారత దేశంలో ఈ క్రింది భాషలీ కుటుంబానికి చెందినవి వ్యవహృతం :

(1) సంతాలీ (31 లక్షలు) (2) ముండారి (7.5 ల.) (3) సవర (3 ల.) (4) ఖరియా (2 ల.) (5) భూమిజ్ (1.5 ల.) (6) ఖామతీ (2 ల.) (7) గదబ (50 ల.) (8) జ్యూఙ్ (16 ల.) (9) కోర్కిన్ (3 ల.) వీనికే ముండా భాషలని ప్రసిద్ధి.

బెంగాల్, ఒరిస్సా, మధ్యప్రదేశ్, బీహార్, ఆంధ్రప్రదేశ్, మన్య ప్రాంతాల్లో ఈ భాషా వ్యవహర్తలున్నారు.

ఈ భాషల ప్రభావం సంస్కృత, ద్రావిడ భాషలపై కూడా ఉందని అనుమానింప బడుతున్నది. గంగా, తాంబూల, కదళీ, వాల, కంబళాది పదాలు ఈ భాషల్లోనుండి సంస్కృతంలోకి చేరాయంటారు అచార్య బరో. ప్రాకృతాల్లోని దేశ్య శబ్ద జాతంలో ఈ భాషా పదాలు కొన్ని చేరాయని కొందరు పేర్కొన్నారు. క్రీ.శే. గిడుగు రామమూర్తి పంతులుగారు సవర భాషకు వ్యాకరణం రచించారు.

10.0 సైనో టిబెటన్ భాషా కుటుంబం: ఈ కుటుంబానికి చెందిన భాషలు అస్సాం రాష్ట్రంలో కోటిమంది చే వ్యవహృతం. ఇందలి భాషలు కొన్ని : అక్మక, బోడో, నాగా, లుషాయ్, మికిర్.

అక్మక భాష బ్రహ్మపుత్రా నదీ ప్రాంతంలోను, బోడొ భాష అస్సాం లోయలోను, నాగా భాష మణిపూర్ సంస్థానంలోను; లుషాయ్ భాష మణిపూర్ పరిసరాల్లోను; మికిర్ భాష అస్సాంలోని సిబ్ సాగర్ జిల్లాలోని పాపి కొండల్లోను వ్యవహృతం. ఈ భాషపై గ్రియర్సన్ విశేషంగా కృషి చేసినట్లు ప్రసిద్ధి.

అండమాన్, నికోబార్, దీవుల్లోని భాషలకు పద పట్టికలు తయారు చేయబడ్డాయి. కాని, ఇవి ఏ భాషా కుటుంబానికి చెందినవో ఇంకా నిర్ధారణ కాలేదు.

11.0 పదాంశ విభజనము ( **Morphological or typological Classification)**

పదాల పుట్టుకను బట్టి కాకుండ, పదనిర్మితిని, వ్యాకరణాంశాల్ని, వివిధ పదాంశ స్వభావాల్ని బట్టి భాషల్ని విభజించే పద్ధతికే 'పదాంశ విభజనం' లేదా 'వ్యాకరణ విభజనం' లేక 'శబ్ద విభజనం' అని వ్యవహారం.

జాతి విభజనం కంటె, ఈ విభజనం విశేషంగా సమర్థనీయమని భాషాభిజ్ఞుల అభిప్రాయం. చారిత్రక భాషా శాస్త్రం అభివృద్ధి అయ్యే కొద్దీ వ్యాకరణానుకూల విభజన ప్రయత్నం అధికం కాజొచ్చింది.

11.1 క్రీ.శ. 1818లో అగస్ట్ వాన్ ష్లెగెల్ (August Von Schlegal) ఈ పదాంశ విభజనాన్ని ప్రతిపాదించాడు. ఇతడు ప్రపంచ భాషల్ని ద్విధా విభజించాడు. : (i) విశ్లేషాత్మక భాషలు (analytic languages) చైనా భాష. (ii) సంశ్లేషాత్మక భాషలు :(synthetic languages) గ్రీకు, లాటిన్

11.11 ఇతని సోదరుడు ఏ. డబ్లు - ష్లెగెల్ మూడు విధాలైన విభజనాన్ని ప్రతిపాదించాడు : (i) ధాతువులు మార్పుచెందే సంస్కృతం వంటి భాషలు : భూ–భవతి, భవతః; కృ–కరోతి, కురుతః (ii) చరిత్ర తెలుసుకోటానికి వీలైన ప్రత్యయాల్ని ఉపయోగించే భాషలు : చేత, (చేయి సప్తమ్యర్థకం) అందు (స్థలవాచకం) తెలుగు మొదలైన ద్రావిడ భాషల్ని పేర్కొనవచ్చు.

(iii) చైనాభాష వంటి ప్రత్యయ విరహిత భాషలు:

11.12 ష్లెగెల్ విభజనం సరికాదని ఫ్రాంజ్ బాప్ ఈ క్రింది రీతిని ప్రపంచ భాషల్ని విభజించాడు:

(i) ధాతువులు మాత్రమే ఉండి, ధాతుప్రత్యయ సంయోగంలేని చైనాభాషవంటి భాషలు. ఈ భాషల్లో వాక్యంలోని పదాల సంబంధం, వాని ఉనికిపైనే ఆధారపడి ఉంటుంది.

(ii) ఏకాచ్క ధాతువులు కలిగి, వ్యాకరణ నిర్మాణం అంతా ధాతు ప్రత్యయ సంయోగం మీదనే ఆధారపడి యున్న భాషలు.

(iii) ద్వ్యచ్క ధాతువులు కలిగి ప్రతిపదంలో మూడుహల్లులు తప్పక కల్గియున్న సెమెటిక్ భాషలు.

ఈ రీతిగా ఈ విభజనంలో శాస్త్రజ్ఞులు తమ అభినివేశం చూపుతూ వచ్చారు. క్రమంగా నాల్గు విధాలుగా పదాంశ విభజనం ప్రశస్తి వహించింది. ఈ విభజనంకూడా పూర్తిగా నిర్దుష్టం కాకపోయినా, అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలతో కూడినా, స్థూల వ్యవహారానికి తోడ్పడుతున్నది. వాటిని క్రమంగా వివరిస్తాను.

## 11.2 విశ్లేషాత్మక భాషాలక్షణాలు:

## (Isolating Language features)

(i) విశ్లేషాత్మక భాషల్లో భావప్రకటనం అచ్చగా అవికారమైన శబ్దాలచేతనే జరుగుతుంది. ఆశబ్దాలేవిధమైన వ్యాకరణ కార్యాలకు లోనుగావు. అంటే ఈ భాషల్లో శబ్దవిభాగం (Parts of speech) — నామములు క్రియలు, విశేషణాలు అనేవి ఉండవు.

(ii) ఈ భాషలు అధికంగా ఏకాచ్కాలైన (monosyllabic) ధాతువుల్ని కలిగి వుంటాయి. ఇవి అపరివర్తనాలు. ఈ ధాతువులు భిన్న స్వరాలతో ఉచ్చరింప బడతాయి.

సమస్వరంగా (level tone) ఉచ్చరిస్తే ఒకఅర్థం. ఉచ్చగా అంటే ఉదాత్తంగా ఉచ్చరిస్తే (rising tone) ఇంకో అర్థం; ఆరోహణంగా అంటే అనుదాత్తంగా (dipping tone) ఉచ్చరిస్తే వేరొక అర్థం; నీచంగా ఉచ్చరిస్తే (falling tone) అన్యార్థం గోచరిస్తాయి. ఎట్టి స్వరం లేకుండా పలికితే అన్నింటికన్నా భిన్నార్థం కల్గవచ్చు.

ఉచ్చారణ స్వరసంఖ్యలో భేదం, ఈ వర్గనికి చెందిన భాషల్లో వేరు వేరుగా ఉండవచ్చు. ఒక భాషలోని మాండలికాల్లోను భేదాలుండవచ్చు. కాంటోనీస్ చైనీస్ భాషలోను, సయామీస్ భాషలోను ఆరు స్వరాలు ఉన్నాయి. బర్మీస్ భాషలో రెండే స్వరాలు.

సినో — టిబెటిన్ భాషాకుటుంబంలోని భాషలు విశ్లేషాత్మకాలు, ఇంచుమించుగా 500 నుండి 700 వరకు అసంఖ్యాకంగా ఉన్న ఆఫ్రికన్ భాషలు ఈ వర్గములోనివి.

11.21 పదక్రమమే ఈ భాషలకు వ్యాకరణం. (Word order is the grammar)

ఉదా: వో చిన్ చిహ్

నేను చూడు ఆమె — నేను ఆమెను చూచితిని.

చిహ్ చిన్ వో

ఆమె చూడు నేను — నేను ఆమెను చూచాను.

వాంగ్ పో మిన్

రాజు రక్షించు ప్రజలు — రాజు ప్రజల్ని రక్షిస్తాడు.

మిన్ పో వాంగ్

ప్రజలు రక్షించు రాజు — ప్రజలు రాజును రక్షిస్తారు.

11.3 ప్రత్యయాత్మకమైన భాషఅయిన ఆంగ్లంలోను ఈ విశ్లేషాత్మక భాషా లక్షణాలు అక్కడక్కడ పొడగట్టుతాయి.

I love fish ; Fish I love

సంయోగాత్మక భాష అయిన తెలుగులో ఇటువంటి లక్షణం:

గాలి వీచెను చల్లగా ; చల్లగా వీచెను గాలి

వీచెను గాలి చల్లగా ; వీచెను చల్లగా గాలి

గాలి చల్లగా వీచెను ; చల్లగా గాలి వీచెను

ఈ విధంగా ఒక వర్గానికి చెందిన భాషా లక్షణాలు అన్యవర్గానికి చెందిన భాషల్లోను కనిపిస్తుండటంచేత ఈ విభాగం పూర్తిగా నిర్దుష్టం కాదంటారు.

12. 0. సంయోగాత్మక భాషలు : (Agglutinative languages)

వేరు వేరు అర్థాలు గల వివిధ శబ్దాలు-అంటే ప్రకృతులు, అనుబంధాలు, ప్రత్యయాదులు గొలుసు కొక్కాలవలె ఒకదాని కొకటి చేరి ప్రత్యేకార్థాన్ని ఇస్తాయి. ఇవే సంయోగాత్మక భాషలు.

12. 1 ప్రకృతికి చేరే ప్రత్యయాల్ని బట్టి (affixes) ఈ వర్గంలోని భాషల్ని మూడు విధాలుగా వింగడించ వచ్చు.

12. 11 పరానుబంధ సంయోగాత్మక భాషలు: (Suffix agglutinative languages)

ద్రావిడ భాషలు: తెలుగు-

పెర్
పెర్ + ఉ
పెరు + గు
పెరుగు + చు
పెరుగుచు + ఉన్న
పెరుగుచున్న + అది=
పెరుగుచున్నది.

తుర్కిష్:

Oda-గది
odalar-గదులు
odadan-గదినుండి
odalardarn-గదులనుండి

యూరల్ ఆల్టాయిక్ భాషలు, జపనీస్ భాషలు, బస్కూ భాషలిట్టివి.

12. 12 పూర్వానుబంధ సంయోగాత్మక భాషలు: (Prefix agglutinative languages) ధాతువునకు పూర్వం ప్రత్యయాన్ని చేర్చటం. దక్షిణాఫ్రికాలోని బంటూకుటుంబానికి చెందిన భాషలో-

గండ - ప్రజలు
లుగండ - భాష
బగండ - జాతి
ఉగండ - దేశం
(సం) వి + హార-విహార

సం + హార - సంహార
ఆ + హార - ఆహార
పరి + హార - పరిహార
ఉప + హార - ఉపహార

12. 13 అంతరానుబంధ సంయోగాత్మక భాషలు: (infix agglutinative languages) ధాతువుల మధ్యలో ప్రత్యయాలు చేరే భాషలు.

సంతాలి: దల్ (కొట్టు)
దపల్ (కొట్టించు)
అరబ్బీ: క్త్బ్=వ్రాయు
కితబ్=పుస్తకం
ల్స్న్=నాలుక
లిసన్=భాష
నేర్=దర్శించు
నజర్=చూపు
నజిర్=పర్యవేక్షకుడు
నజరానా=బహుమతి (ప్రదర్శితమయ్యేది)

12. 14 ప్రకృతి ప్రత్యయాల్ని వేరుచేయటానికి వీలుగా సంయోగాత్మక భాషారూపాలుంటాయి. ప్రత్యయాత్మక భాషలో ఆరీతిగా సులభంగా విభజింపలేము. ఉదా:

| | తుర్కిష్ | లాటిన్ |
|---|---|---|
| ప్రథమావిభక్తి | సు | అక్వ |
| షష్ఠి | సు-నుమ్ | ఆక్వే |
| ద్వితీయ | సు-యు | ఆక్వమ్ |
| పంచమి | సు-దన్ | అక్వా |

లాటిన్ భాషలో పంచమి, షష్ఠి విభక్తుల్లో ప్రత్యయాలు బాగా సంసక్తమైనాయి ప్రకృతులతో. చారిత్రక పరిజ్ఞానంతోకాని వాటిని వేరు చేయటానికి వీలుపడదు. అందుచేతనే 19వ శతాబ్దపు భాషావేత్తలు ప్రత్యయాత్మకదశ సంయోగాత్మకదశ నుండి పరిణమించిందని భావించారు. సంయోగాత్మక భాషాగత వాక్యాలలోని పదాలు వ్యాకరణ కార్యాలకు లోనవుతాయి.

ఉదా: రాముడు ఇంటికి వెళ్లాడు, కృష్ణుడు రాముడింటికి వెళ్ళాడు, రాముడు రావణుడ్ని సంహరించాడు.

2. 15 సంశ్లేష విశ్లేషాత్మక భాషలకన్న సంయోగాత్మక భాషలే అధిక సంఖ్యలో ఉన్నాయి. ప్రస్తుతం నశించిన ప్రాచీన సుమేరియన్ సారస్వత భాష, ఎలమైట్ భాష, యూరల్-ఆల్టాయిక్ భాష, కాకేషియన్ భాష, ద్రావిడ భాషలు ఈ వర్గానికి చెందినవే. జపనీస్ భాష, కొరియన్ భాష ఇందులోవే.

పసిఫిక్ భాషలైన పాపన్ మొదలైనవి, ఆస్ట్రేలియన్ భాషలు, సడనీస్ హాట్టన్‌టొ-బుష్‌మన్ మున్నగు ఆఫ్రికన్ భాషలు; అమెరికా దేశీయ భాషలు, ఎస్కిమో భాషాకుటుంబానికి చెందిన భాషలు, ఈ సంయోగాత్మక భాషావిభాగానికి చెందినవే.

ఈ భాషల్లోని ప్రత్యయాలు చాలవరకు విజ్ఞాత చరిత్ర కలవి.

13. 0 ప్రత్యయాత్మక భాషలు : (Inflexional languages)

(i) ఈ భాషల్లో పదాలు పనిచేసే తీరును వ్యాకరణ శాస్త్రం వివరిస్తుంది. పదాలు పనిచేసేతీరు వానికి చేరే ప్రత్యయాలపై ఆధారపడి వుంటుంది. ప్రత్యయ మంటే (affix) పూర్వప్రత్యయం (Prefix) అంతర్ ప్రత్యయం (infix) అంత్యప్రత్యయం (suffix) కావచ్చును.

ప్రత్యయాలు చేరేటప్పుడు ఆంతరంగికమైన సంధి మార్పులు (Internal changes) కలవచ్చు. నామాలకు విభక్తులు చేరేటప్పుడు కల్గే మార్పుల్ని నామవికరణమని (declension); ధాతువులకు క్రియావిభక్తులు చేరేటప్పుడు కల్గేమార్పుల్ని ధాతు వికరణమని అంటారు (conjugation)

(ii) ఈ భాషల్లోని ప్రత్యయాలు చాల వరకు అవిజ్ఞాత చరిత్ర కలవి.

13. 1 ఈ భాషల్లోని ధాతువులు నిర్మాణాన్ని బట్టి రెండు తెగలు.

(i) ఉద్వర్తనక్షమాలు: మార్పునకు లోనయ్యే ధాతువులు గల సంస్కృతాది భాషలు:

బుధ్ – బోధ్

గమ్ – గచ్ఛ మొదలైనవి.

(ii) అంతర్వ్యపరిణామ ధాతు భాషలు: (Intermutative root languages) ఉదా: అరబ్బీ, హిబ్రూ మొదలైనవి. ఇవి హల్ ప్రధాన భాషలు.

ల్‌స్‌న్=జిహ్వ
లిసన్=భాష
లసన్=అభిభాషకుడు
లిసనియత్=భాషాశాస్త్రం

13. 2 వ్యవహారంలో తెలుగుభాష సంయోగాత్మక దశ నుండి ప్రత్యయాత్మక స్థితి నందుకొంటున్నట్లు కనిపిస్తుంది.

వచ్చుచున్నవాడు - వచ్చుచున్నాడు - వస్తున్నాడు
చేయవలయును - చేయాలి.
తిననిమ్ము - తిననీ మొదలైనవి.

ప్రత్యయాత్మక భాషల సంఖ్య సంయోగాత్మక భాషల సంఖ్య కన్న చాలా తక్కువ. కాని ఇండో యూపిరోయన్ భాషలు, సెమిటిక్ భాషలు ఈ వర్గానికి చెందినవే.

కాని అనేక ప్రత్యయాత్మక భాషలలో విశ్లేష, సంయోగాత్మక లక్షణాలు కనిపిస్తు ఉండటంచేత, ఈ విభజనానికి కొంత అస్పష్టత తప్పని సరి అవుతున్నది.

14.0 బహుంఘా సంశ్లేషాత్మక భాషలు : (poly-synthetic or Incorporative languages)

వాక్యంలోని అనేక పదాలు ఒకే పదంగా కలిసి పోవటం, లేదా కుదించుకు పోవటం. అమెరికాలోని రెడ్ ఇండియన్ భాషలిట్టివి.
ఉదా: ఎస్కిమోభాష.

'ఒనీదా' oneida=నేను గ్రామం కోసం చూస్తున్నాను అని అర్థం

మాంటిజూమా (montezuma) నాయకుడాగ్రహిస్తే స్వర్గానికి పోయేటట్లు కాలుస్తాడు.

15. 0 ఫినిక్ పండితుడు అష్టవిధ విభజనాన్ని ఈ క్రింది రీతిగా సూచించాడు. (Finck's eight fold classification)

(1) ధాతు విశ్లేషాత్మక భాషలు : (root-isolating) చైనా.
(2) ప్రాతిపదిక విశ్లేషాత్మకములు : (stem-isolating) సమోన్
(3) ధాతు సంశ్లేషాత్మకములు : (root-inflected) అరబిక్
(4) ప్రాతిపదిక సంశ్లేషాత్మకములు : (stem-inflected) గ్రీకు
(5) సమూహ సంశ్లేషాత్మకములు : (grcup-inflected) జార్జియన్
(6) పార్శ్వవర్తి సంయోగాత్మకములు : (juxtaposing agglutinative) సుబియా
(7) సంయోగాత్మకములు : (agglutinative) టర్కిష్
(8) విలీనములు : (poly-synthetic) ఎస్కిమో

16. 0 భాషలలోని ధ్వనులనుబట్టి కావించే భాషా విభజనాన్ని 'ధ్వని సంబంధ విభజన'మంటారు. (phonological classification) ఈ విధమైన విభజనానికి కొందరు యత్నించారు.

(i) త్రిస్వరభాషలు: అరబిక్ మున్నగునవి: ఇ ఉ
అ

(ii) పంచస్వరభాషలు: తెలుగు మున్నగునవి: ఇ ఉ
ఎ ఒ
అ

(iii) సప్తస్వరభాషలు : ఆధునిక లాటిన్ ఇ ఉ
ఎ ఒ
ఎ ఒ
అ

16. 1 మొత్తం మీద భాషా విభజనం త్రివిధ స్థాయిల్లో చేయవచ్చు.

(i) ధ్వని సంబంధి విభజనం. (Phonological classification)
(ii) పదాంశ సంబంధి విభజనం (morphological classification)
(iii) వాక్యయోజన సంబంధి విభజనం (syntatcical classification)

ఈ మూడుస్థాయిల్లో పదాంశ విభజనమే విజయోపేతమైందని లెహ్మన్ పండితుని అభిప్రాయం[1].

17. 0 పదాంశ విభజనంలోని లోపాలు:

(i) ఇది పాతపడ్డ విభజనం. ఎందుకంటే విశ్లేషాత్మక భాషగా పరిశీలింప బడుతున్న చైనా భాష ఒకప్పుడు సంయోగాత్మక భాషగా ఉన్నట్లు తెలుస్తుంది.

(ii) చైనా భాష కేవలం ఏకాచ్కంకాదు. ఇందులో ద్వ్యచ్క శబ్దాలతో గూడిన సమాసాలున్నాయి.

(iii) సినో-టిబెటన్ కుటుంబానికి సంబంధించిన అనేక భాషలు పాక్షికంగా సంయోగాత్మకాలు, పాక్షికంగా విశ్లేషాత్మకాలు.

(iv) ఇండో - యూరోపియన్ కుటుంబానికి చెందిన అనేకభాషలు ప్రత్యయాత్మక స్థితి లేక సంశ్లేషాత్మక స్థితి నుండి విశ్లేషాత్మకత నధిగమిస్తున్నాయి. ఆంగ్లభాష ఈ విషయంలో ముందంజ వేస్తున్నది.

ఉదా : (we love fish, drive slow)

(v) ప్రత్యయాత్మకమైన ఆంగ్లభాషలో సంయోగాత్మకత విశేషం News paper man, nine fold, latchkey, etc.

(vi) "ఒకేభాష-సంయోగాత్మకం, ప్రత్యయాత్మకం అవుతున్నది లేదా ప్రత్యయాత్మకం బహుధా సంశ్లేషాత్మకం - అవుతున్నది ; లేదా బహుధా సంశ్లేషాత్మకం-విశ్లేషాత్మకం అవుతున్నదని" సపిర్ పండితుని అభిప్రాయం. అంటే ఖచ్చితమైన నియతి లేదని తెలుస్తుంది.

(vii) ప్రత్యయాత్మకమైన సంస్కృత భాషలో వ్యతిరేకార్థం స్వతంత్ర పదంచేత అభివ్యక్తం. అంటే సంయోగ తి. సంయోగాత్మకాలైన తెలుగు మొదలైన ద్రావిడ భాషల్లో అంతః ప్రత యంతో ఈ అర్థం ప్రకటింపబడుతున్నది. అంటే ప్రత్యయాత్మకత నందు ంటున్నది[2].

---

[1] "Of the three linguistic levels, for which classification has been attempted, that for the morphological level is clearly the most successful." p.60 'Historical Linguistics-An Introduction' Lehmann

[2] "A language may be both agglutinative and inflective: inflective and polysynthetic: or even polysynthetic and isolating" — Language: p. 1

(సం) న శోచతి, న కాంక్షతి

(తె) శోకింపడు, కాంక్షింపడు

(viii) విశ్లేషం, సంశ్లేషం, బహుధా సంశ్లేషం–ఈ మొదలైన పదాలు భాషల్లోని పరిణామ తరంగాల్ని (drifts) సూచించేవేకాని, ఒకానొక నిర్దుష్ట స్థితిని తెల్పవని సపిర్ పండితుని అభిప్రాయం[1].

(ix) ఏదైనా భాష బాగా మార్పుచెందిచెంది విశ్లేషస్థితినైనా అందుకో వచ్చు. లేదా ఘనీభవించి విశ్లేషాత్మక స్థితినుండి బహుధా సంశ్లేషాత్మక స్థితి నందుకోవచ్చునని కూడ సపిర్ పండితుని భావన[2].

(x) farmer, goodness, thicker, thickest, books, booking మొదలైన ఆంగ్ల పదాల్లో సంయోగాత్మకలక్షణాన్నే చూడవచ్చు.-er,-ness, est,-s,-ing మొదలైన పదాంశాల్ని సులభంగా విడదీయవచ్చు. కాని man-men, deep-depth,height మొదలైన వాటిలో పై రీతిగా పదాంశాల్ని విడగొట్టలేం. తొలివాటిలో ప్రత్యయాలు అంతాగమాలు. మలి వాటిలో ప్రత్యయాలు సమైక్యాన్ని పొందాయి. ఇట్టి ఉదాహరణల్లోనే సంశ్లేషాత్మక మాంగ్ల భాష, అంటే సరిపోతుంది.

ఈ రీతిగా ఈ విభజనం అతివ్యాప్తిఅవ్యాప్తి దోషాలకు గురి అవుతున్నది. అయినా భాషల లక్షణాల్ని స్థూలంగా వ్యవహరించు కోటానికి ఈ పదాలు వాడుక చేస్తుంటారు. ఈ విభజనం వల్ల భాషల్ని పరిశీలించటానికి కొంత దృక్పథం ఏర్పడుతుంది. కాబట్టి భాషాశాస్త్రంలో ఈ పరిగణనం అనివార్యమైంది.

---

[1] "I believe the terms are more usefull in defining certain drifts than as absolute counters." Language, P. 128

[2] "It is often illuminating to point out that a language has been becoming more and more analytic in the course of its history or that it shows signs of having crystallised from a simple analytic base into a highly synthetic form" — Language: P. 128

# 3. ధ్వని విజ్ఞానము (Phonetics)

18.0 ధ్వనుల ఉచ్చారణాన్ని అభివర్ణించి, అవి ఏ వర్గానికి చెందుతాయో, అట్టి ఉచ్చారణానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను తోడ్పడే మానవ శరీరావయవాలెట్టివో నిరూపించేది ధ్వని విజ్ఞానం (Phonetics). ఒకానొక భాషలోని ధ్వనుల్ని, వాటితో ఏర్పడ్డ వర్ణాల్ని, వర్ణక్రమాన్ని వివరించేది భాషావిశిష్టధ్వని పరిజ్ఞానం (Phonology)

మానవుని సంపూర్ణాభిప్రాయం వాక్యం మూలంగా ప్రకటితమౌతుంది. శాబ్దికులీవాక్యం నుండి పదాల్ని ఉద్ధరిస్తారు. పదాలనుండి వర్ణాలుద్ధరింపబడతాయి. వర్ణంలో ఒకటిగాని, అంతకెక్కువగాగాని ధ్వనులుంటాయి. కాబట్టి భాషలోని మిక్కిలి కనిష్ఠాంశం "ధ్వని" (Sound) అని చెప్పవ . మానవుల ఏడ్పులు, నవ్వులు, ఈలలు మొదలైనవి భాషాధ్వనుల బడవు. వానివల్ల కొంత భావప్రకటనం జరగవచ్చు. అయినా అవి ఈ వరి లోవి కావు.

భాషాశాస్త్ర విద్యార్థికి ఈ ధ్వనిపరిజ్ఞానం చాల అవసరం. ధ్వని పరిజ్ఞాన ప్రాతిపదికపైనే అతని భాషాశాస్త్ర పాటవం ఆధారపడి వుంటుంది. అందుచేత ధ్వని పరిజ్ఞానంలో శిక్షణ అత్యంతావసరము.

పూర్వం సారస్వత భాషకే ప్రాముఖ్యం. అందుకే వ్యాకరణాలు విశేషంగా విరచితం. ఇప్పుడు వ్యవహారంలో ఉన్న భాష, దాని మాండలిక భేదాలు, అందులోని ఉచ్చారణ భేదాలు; ధ్వనుల్లో నియతంగా గల్గే మార్పులు, భాషావ్యవస్థావగాహనానికి బాగా తోడ్పడుతాయి. కాబట్టి దీని ప్రాముఖ్యం త్రోసిపుచ్చరానిది.

18. 1 ధ్వని విజ్ఞానం వల్ల ఈ క్రింది ప్రయోజనాలు చేకూర్తుతాయి:

(i) స్వభాషలో పరిశోధనలు చేసి, ఇతః పూర్వం గుర్తింపని అనేక ధ్వని భేదాల్ని గుర్తించవచ్చు. అవి ప్రధాన ధ్వనులో, అప్రధాన ధ్వనులో నిర్ణయించవచ్చు.

ఉదా: 'మామ' అని వ్రాస్తున్నా మాఁవఁ అని ఉచ్చరిస్తాం. ఇట్లాగే మాఁవిఁడి, మాఁవ్ఁ నఁవ్ఁ అనే ఉచ్చారణాల్ని బట్టి 'వ్ఁ' అనే ధ్వని భేదాన్ని గుర్తించి, ఇది ఏ వర్ణానికి చెందుతుందో నిర్ణయించవచ్చు.

(ii) అపరిష్కృత భాషాపరిశీలనం కావించేటప్పుడు ఆ భాషాధ్వనుల పరివర్తనాన్ని బట్టి వర్ణనిర్ణయం చేయవలసి ఉంటుంది.

(iii) భాషాధ్వనుల వర్గీకరణం మీదనే లిపి నిర్ణయం ఆధారపడి వుంటుంది. ప్రధాన ధ్వనులకే ప్రత్యేక లిపి చిహ్నాలవసరం. అప్రధాన ధ్వనుల కవసరం లేదు. 'మామ' అనివ్రాస్తున్నా, ఉచ్చారణభేదం పైన చూపాం గదా!

(iv) భాషాబోధనకు, భాషావ్యాప్తికి తోడ్పడుతుంది.

(v) వర్ణనాత్మక వ్యాకరణ రచనకే కాక చారిత్రక, తులనాత్మక వ్యాకరణాలకు కూడ ఈ విజ్ఞానం తోడ్పడుతుంది.

(vi) సాంకేతిక శాస్త్రజ్ఞులకు ధ్వని విజ్ఞానమెంతగానో సహకరిస్తుంది. షార్టుహాండు, టైపు రైటింగ్ నిస్తంత్రీ సంకేతాలు నిర్ణయించటంలో ఈ విజ్ఞాన మవసరం.

## I8. 2 భాషా ధ్వనులెట్లు ఉత్పన్న మౌతాయి?

మానవ శరీరంలోని వాగింద్రియాల తోడ్పాటు వల్ల (organs of speech) భాషా ధ్వనులుత్పన్నమౌతాయి. వీనినే ధ్వని లేక వాక్, లేక ఉచ్చారణోత్పత్త్యవయవా లంటారు.

ఊపిరి తిత్తులనుండి పెదవుల వరకు గల ఈ విభాగాన్ని 'ధ్వన్యుత్పత్త్యవయవ విభాగం' అంటారు.

వాగింద్రియాల ప్రధాన వ్యాపారం వాగుత్పత్తికాదు. శ్వాసనం (ఊపిరి పీల్చటం) ఆహార స్వీకారాదులు వీని ముఖ్యవ్యాపారం. ఇది సర్వసాధారణమైన జంతు లక్షణం. ఈ వ్యాపారాన్ని నిర్వహిస్తూనే మానవుడీ విశిష్టలక్షణాన్ని కూడ నిర్వహిస్తున్నాడు.

వాగుత్పత్తి లేకుండ గూడ మానవుడు మనగలడు. మూగవాళ్ళను మనం చూస్తునేవున్నాం.అత్యంత ప్రాచీనకాలంలో మానవులందరు జంతువుల

లాగానే ధ్వనులు చేస్తు, ఆహార సముపార్జనాదులు కావిస్తు చెట్ల తొఱ్ఱలలో, కొండగుహలలో జీవిస్తుండే వారని, క్రమంగా వీరికి భాష, నాగరికత అ వడ్డాయని అంటారు. భాష సంక్రమిత వ్యాపారమని, శ్వసనాదులు సహ వ్యాపారాలని కొందరు భావిస్తారు.

18. 3 గాలిని లోనికి పీల్చిన తరువాత అది వెలికి నిర్గమించే టప్పుడు ఆ ప్రవాహగతిలో అస్య భాగావయవాలు కదలించటం లేక మార్పు చేయటం వల్ల ధ్వనులుత్పన్న మౌతాయి. కాబట్టి శ్వాసప్రవాహం గట్టిగా ఉంటేనే భాషాధ్వన్యుత్పత్తి సంభవం.

ధ్వని అమూర్తపదార్థం. వినగలమేకాని కనలేం. దీని ఉత్పత్తి కాధారమైన కొన్ని అవయవాలు మాత్రమే కనిపిస్తాయి.

18. 4 భాషాధ్వనికి గల అవస్థలు మూడు:

(i) ఉత్పత్తి: వక్త వాగుత్పత్త్యవయవ చలనంవల్ల ధ్వని ఉత్ప త్తిల్లుతుంది. ఈ ఉత్పాదనక్రమం దృశ్యాదృశ్యం.

(ii) తరంగరూపం: ఉచ్చారితమైన ధ్వనులు పెదవుల్నిదాటి గాలిలో కలిసి పోతాయి. అవి శ్రోత చెవికి చేరేలోపల శబ్దం 'తరంగ రూపం'లో ఉంటుంది.

(iii) శ్రవణం: చెవికి సోకిన ఈ వాయుతరంగాలు శ్రోత కర్ణేంద్రి యాల్లో ఉన్న కర్ణభేరి లోపలి భాగంచే స్వీకరింప బడి, అందులోని సందేశ వాహకాలైన నరాలద్వారా మెదడుకు చేరుతాయి. ఈ శ్రవణావస్థ అగోచరం.

పై మూడు అవస్థలలో ఏఅవస్థనైనా ఆధారంగా స్వీకరించి, భాషా ధ్వనుల్ని వర్గీకరించవచ్చు. ఉత్పత్తి ఆధారంగా చేసే ధ్వని వర్గీకర ణాన్ని 'ఉత్పత్తిధ్వని విజ్ఞాన' మంటారు, **(Articulatory Phonetics)**

తరంగ రూపమైనదాన్ని "తరంగధ్వని విజ్ఞానం" అంటారు. **(acoustic Phonetics)** దీనికే ప్రయోగధ్వని శాస్త్రమనిపేరు. **[Laboratory phonetics]** ఇంకా ప్రయోగాత్మక ధ్వని శాస్త్రం **[experimental phonetics]** యాంత్రిక ధ్వనిశాస్త్రం **(instrumental phonetics)** అని భిన్నవ్యవహారా లున్నాయి.

వినికిడిని బట్టి ధ్వనుల్ని వర్గీకరించే దాన్ని "శ్రవణ ధ్వని విజ్ఞాన" మంటారు. (auditory phonetics)

ఈ మూడింటిలో దేన్ని ఆశ్రయించి అయినా భాషాధ్వనుల్ని వర్గీకరించవచ్చు. ఇట్టి శాస్త్రీయమైన విజ్ఞానానికే "ధ్వని విజ్ఞానం" అని వ్యవహారం[1].

కాని పై మూడింటిలో సుకరమైనది ఉత్పత్తివిధానమే అనక తప్పదు. తరంగ విధానంవల్ల భౌతికశాస్త్ర పరిజ్ఞానం కావాలి. శ్రవణ విధానం తరంగ విధానంకంటె కూడ క్లిష్టం. శ్రవణేంద్రియాలలోని మార్పులు దృగ్గోచరం కావు. యంత్రసాయం అందరికి అందుబాటు కాదు.

18.5 ఉత్పత్తినిబట్టి భాషాధ్వనుల వర్గీకరణం:

ముఖయంత్ర స్వభావం కొంతవరకు మనకు పరిచయమే. ఇందులోని అవయవాల్ని రెండుగా విభజించ వచ్చు.

(i) ప్రత్యక్ష భాగస్వాములు: (direct participants) (ii) పరోక్ష భాగస్వాములు. (indirect participants) అన్ని అవయవాలు అవసరమైనవే. ఇందులో ఏది పాల్గొనక పోయినా ధ్వన్యుత్పత్తి ఆగిపోతుంది. అయినా ప్రత్యక్ష భాగస్వాముల్ని బట్టి ధ్వని విభజనం జరుగుతుంది. పరోక్ష భాగస్వాముల్ని అనుసరించి భాషాధ్వని విభాగమే లేదు.

18.51 పరోక్ష భాగస్వాములు: (Indirect participants)

ఊపిరి తిత్తులు, శ్వాసకోశాలు, మెదడు, మెదడునుండి జ్ఞానేంద్రియాలకు గల నరాల నిర్మాణం.

ధ్వనికి అత్యంత ప్రధానమైంది శ్వాసప్రవాహం. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సరిగా లేకపోతే ధ్వన్యుచ్చారణమే సరిగా ఉండదు. వీనికి సంబంధించని ధ్వనులు ప్రపంచంలో ఏ భాషలోను లేవు.

---

1 "Phoneties is that branch of Science which is concerned with the study, analysis and classification of speech sounds from the point of view of their production or transmission or perception,,.

మెదడు ఆదేశంలేనిది వాగింద్రియాలుకాని, ఇతర అవయవాలుగాని పనిచేయవు. నరాలు కూడా పనిచేయవు. సందేశవాహకాలైననరాలు ధ్వన్యుచ్చారణకు సంబంధించినవి కాకపోయినా ఇవిలేనిది ఉచ్చారణ లేదు.

పరోక్ష భాగస్వాములు కేవలం నేపథ్యంలో ఉండి వాగుత్పత్తి కుపయోగపడుతాయి.

18.52 ప్రత్యక్ష భాగస్వాములు (Direct participants)

ఇవి పెదవుల నుండి కృకాగ్రం వరకు శరీర భాగమందు విస్తరించియున్న అవయవాలు, అవయవ భాగాలు.

పెదవుల నుండి జిహ్వామూలం వరకు ఉన్న విభాగాన్ని 'ఆస్యం' (Oral chamber) అంటారు. ఇందులో రెండు పెదవులు, ఉభయదన్తశ్రేణి, దంతమూలం, కఠినతాలు భాగం, స్నిగ్ధ లేక మృదుతాలువు, లంబిక, నాలుక ఉంటాయి.

జిహ్వామూలంనుండి కృకాగ్రం లేక కాకరకం (larynx) వరకు ఉన్న భాగాన్ని "ఆస్య బహిర్భాగ" మంటారు. ఇందులో సప్తపథ, కృకాగ్రంలోని స్వరపేటిక (sound box), ఇందులోని నాదతంత్రులు (vocal chords) చాల ముఖ్యమైనవి.

నాసికాంతర్భాగం (nasal cavity) ఆస్య పైభాగంలో జిహ్వామూలావధిక ప్రదేశాన్ని ఆవరించి, ధ్వనుల ఉచ్చారణానికి అనునాసికతను చేకూరుస్తుంది. వ్యక్తిభాషణాన్నంతా ఇది మార్చ గలదు.

18.6 ఈ అవయవాల్ని శాస్త్రకారులు 'స్థానము' "కరణము" అని రెండు విధాలుగా వింగడించారు. స్థానములంటే ఉచ్చారణ స్థానములు. (points of articulation) కరణములంటె ఉచ్చారణ కావించేవి. (articulators)

స్థానాలు ప్రాయికంగా కదలనివి. కారణాలు కదలిక కలవి. నోటిలోని పై భాగంలో ఉన్నవి స్థానములు. క్రింది భాగంలోనివి కరణములు 'సప్తపథ' స్థానమే. స్వరపేటికలోని నాదతంత్రులు - స్థానములు, కరణములు కూడ అవుతాయి. నాసికా రంధ్రం స్థానమే.

ఏ అవయవాలకు, ఏ అవయవాంతర స్పర్శ వల్ల ధ్వన్యుత్పత్తి కలుగు ుందో చెప్పాలి. శ్వాస ప్రవాహగతిలో మార్పు కల్గించినప్పుడే ఉచ్చారణ ఏర్పడుతుంది. స్థానకరణాలకు సంపూర్ణంగానో, అసంపూర్ణంగానో స్పర్శ ంటేనే ధ్వన్యుచ్చారణం సంభవం.

ఉత్పన్నమైన ధ్వనుల్ని శాస్త్రకారుడు సమగ్రంగా అభివర్ణింపగల్గి ప్పుడే "ధ్వనిశాస్త్రం" ఉపయుక్తం. ప్రాచీన భారతీయులు స్థానానికే ప్రాముఖ్యమిచ్చి, తాలవ్యాలని, దంత్యాలని, మూర్ధన్యాలని పేర్లు పెట్టారు. ధునిక భాషాశాస్త్రం స్థానకరణ ప్రయత్నాదుల కన్నింటికి తుల్య ప్రాధా ్యన్ని ఇస్తుంది.

## .1 వాగింద్రియముల అనువర్ణనం

## (Description of Organs of speech)

ధవులు: (i) క్రింది పెదవి / ఓష్ఠము / అధరము (Lower lip)
(ii) పై పెదవి / ఓష్ఠము (upper Lip)

వాగుత్పత్తి కివి అత్యవసరాలు. శిశువు మొదటనే ఈ అవయవాల పయోగిస్తుంది. పాలు పీల్చటంచేత (milk sucking) పెదవులు గట్టిపడి ప్ప, అమ్మ వంటి శబ్దోచ్చారణలో ఇవి తోడ్పడుతాయి. పెదవుల నిర్మా ంలో లోపముంటే ఉచ్చారణం సుష్ఠుగా ఉండదు.

ఉచ్చరింపబడే ధ్వనులు: పెదవుల సంపూర్ణ స్పర్శమున్నపుడు ఫ బ భ మ" అనే ధ్వనులుచ్చరింప బడుతాయి. వీనికే "ఓష్ఠ్యము"లని వహారం. ప్రాచీనులు "ఓష్ఠజముల"న్నారు.

పెదవుల్ని గుండ్రంగా కుంచించటం చేత "ఉ, ఊ, ఒ, ఓ" లు అనే రాలు ఉచ్చరితాలు. నవీన శాస్త్రజ్ఞుల దృష్టిలో ఈ స్వరాలు "ఓష్ఠజాలు" ). ఆస్య పృష్ఠభాగంలో ఉచ్చరిత మయ్యే స్వరాలు (Back Vowels)

II సంస్కృతంలో "వ" కారం దంత్యోష్ఠ్యం (labio - dental) తస్థం. ఆంగ్లంలో "ఫ్" దంత్యోష్ఠమే. క్రింది పెదవి కరణం, పై దంత ల వెనుకభాగం స్థానం. ఆంగ్లంలో ఫ, వ లు దంత్యోష్ఠ్యాలే కాక ష్మాలు కూడ. జపనీస్ భాషలో ఉభయోష్ఠ్యము, ఊష్మమునైన వింత

ధ్వని ఉన్నది. ఇది స్పర్శంకాదు. ఇరుకైన దారి ద్వారా గాలి నిర్గమనం కలవి ఊష్మాలు. (Fricatives) జర్మను భాషలో ఉభయోష్ఠ్యోష్మం, నాదం, మహాప్రాణం అయిన ధ్వని ఉన్నది.(చూ.I P A)

మకారం : ఉభయోష్ఠానునాసికం (bilabial nasal) కొన్ని భాషల్లో దంత్యోష్ఠ్యానునాసిక మకారం ఉన్నది. (labio-dental nasal) పైదంత శ్రేణి నాసిక స్థానాలు.

19.12 ఇ, ఈ, ఎ, ఏ లను ఉచ్చరించేటప్పుడు పెదవులు, సెలవుల వైపు విస్తరిస్తాయి. కాబట్టి ఇవి విస్తారిత స్వరాలనబడతాయి. ఫ్రెంచి, జర్మన్, తమిళ భాషల్లో నిరోష్ఠ్యమైన ఉ వర్ణం ఉంది (ఱ) అదు. పెదవుల్ని విస్తారితం చేసి ఉచ్చరిస్తారు.

19.2 ఉభయ దంతశ్రేణి: ఇవి మొత్తం 32.

వీటిలో ముందు పండ్లు మాత్రమే ఉచ్చారణకు ప్రధానం. వీటినే భేదక దంతాలు లేక కొరకుడుపండ్లు (cutters) అంటారు. వీటిలో అగ్రచ్ఛేదక దంతాలు నాలుగు. (పైవి 2 + క్రిందివి 2) వీని ప్రక్కల, క్రింద, పైన, కుడి, ఎడమల నాలుగు పార్శ్వచ్ఛేదక దంతాలు. వీని ప్రక్కనున్నవి కోరపండ్లు. ఇవి క్రింద, పైన, కుడి ఎడమల్లో ఉంటాయి. ఇవే ఏక శిఖరితాలు (Single pointed carrines) వీని ప్రక్కనున్నవి-ద్వంద్వ శిఖరితాలు. (double pointed carrines) మిగిలినవి తిరుగలి పండ్లు. (molar teeth) ఇవి మూడు. మూడోదాన్నే "జ్ఞానదంతం" (wisdom tooth) అంటారు.

దంత భాగాల్లో కొన్నింటిని శాస్త్రజ్ఞు లుచ్చారణస్థానాలుగా పేర్కొన్నారు. ఇందులో ప్రాధాన్యం వహించినవి మూడుపండ్లు. ఇవి లేకపోతే వాక్కు స్పష్టంగా, సుష్ఠుగా ఉండదు.

19.21 దంతములు స్థానంగా ఉచ్చరితమయ్యే ధ్వనులు - దంత్యాలు. (dentals) ఉదా: తెలుగులోని తవర్గాక్షరాలు. సం.లోని తవర్గం, ౡ,ల,స. (ౡ తు ల సానాందన్త్యాః) నాలుక కొన పైదంతముల వెనుక భాగాన్ని స్పృశిస్తుంది.

సం. లోని 'వ'; ఆంగ్లంలోని వ, ఫలు, దంత్యోష్ఠ్యాలు. ఉభయ
త శ్రేణిలో నిమిత్తంగల ధ్వనుల్ని (Inter-dental fricatives) 'అంత
త్యోష్ఠ్యాలంటారు. ఆంగ్లంలోని 'think, thank' వంటి పదాలలోని ఆది
ని 'థీటా' అని;though, this,that, thine వంటి వాటిలోని ఆదిధ్వనిని
ట్రా' అని అంటారు.

దంత నిర్మాణం సరిగా లేకపోతే దంత్య ధ్వనులేకాక మొత్తం ధ్వన్యు
రణం సరిగాఉండదు. పలువరుస సరిగా లేకపోతే గాలి నిర్గమనం సరిగా
డదు. అందువల్ల ఉచ్చారణం దెబ్బతింటుంది. భాషావ్యవహర్తను
ormant) ఎన్నుకొనేటప్పుడు దన్తలోపం లేనివాడుగా చూడాలి.

3 దంతమూలము/వర్త్స్యము (teeth ridge or alveolar ridge)

ఇది కఠిన తాలు భాగానికి, పై దంతాలకు మధ్యనుండే భాగం. అంటే
దంతాల వెనుక ఉబ్బెత్తుగా ఉండే భాగం.

దంత మూలం స్థానంగా ఉచ్చరింపబడే ధ్వనుల్ని 'దంతమూలీయ
ము' లేక 'వర్త్స్యజములు' (alveolar sounds) అంటారు. తెలుగులో-
ఱ, ల, ళ్ళ, న.

తెలుగులో దన్త్యనకారముంది. ఇదిదంత్యస్పర్శములకు(dental stop)
ర్వమందు వచ్చినపుడు 'దంత్యానునాసికం' అవుతుంది, ఉదా: ఎన్దరు
). తదితర ప్రదేశాల్లో, అంటే పదాదిలోను, పదాంతంలోను, ద్విత్వస్థితి
ు నకారం దంతమూలీయం-నేను, నన్ను మొదలైనవి. సంస్కృతంలో
స, లు దంత్యాలు. దేఫమూర్ధన్యం. తెలుగులో ర, ఱ, లు దంతమూలీ
లు. ఆంగ్లంలో దంతమూలీయాలు: t, d, n, r, l, s.

4 కఠిన తాలువు: (hard palate). మూర్ధానికి, దంతమూలీయానికి
ధ్యగల ఉబ్బెత్తుభాగం. కఠిన తాలువు స్థానంగా ఉచ్చరింపబడే ధ్వనులు
లవ్యాలు. కరణం-జిహ్వోపాగ్రం.

సంస్కృతంలో (i) చవర్గీయ ధ్వనులు తాలవ్య స్పర్శాలు. (palatal
ps) (ii) ఇ, ఈ, ఏ, లు య, శ, లు. (ఇచుయశానాంతాలుః)

తెలుగులోని చ, జ లు తాలవ్య స్పర్శాలు కావు. తాలవ్యస్పృష్టోష్మాలు (Palatal affricates). స్థాన కరణాల సంపూర్ణస్పర్శ, దాని పశ్చాద్భాగంలో వాయు స్తంభనం. వాయు స్తంభన కాలంలో స్పర్శయుండదు. వాయుస్ఫోటన (మోక్షణ) కాలంలో వాయునిర్గమనం.

తెలుగులో చ, జ లనుచ్చరించేటప్పుడు స్థాన కరణాలు కొద్దిగా విడిపోయి, ఒత్తిడితో కూడిన గాలి నిర్గమిస్తుంది.

ఇ, ఈ, ఎ, ఏ లుతాలవ్య స్వరాలు. [Front vowels] య-తాలవ్యం, ఈషత్ స్పృష్టం, గాలి ఒత్తిడితో నిర్గమించదు. ఒత్తిడితో నిర్గమిస్తే 'శ' అవుతుంది.

19. 5 మూర్ధము (dome cacuminal region)

వక్త్రవివరోపరిభాగంలో అత్యున్నత స్థానం. ఇదిస్థానంగా ఉచ్చరింబడే ధ్వనులు-మూర్ధజములు లేక మూర్ధన్యములు. (cerebrals or cacuminals)

కరణం-పరివేష్టిత జిహ్వాగ్రం. సంస్కృతంలో-ఋ, ౠ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ష. తెలుగులో-ట, డ, ణ, ళ, ఱ. ఆంగ్లంలో-wish, push, wash, ఇత్యాదుల్లోని షకారం. ఈషకారం మూర్ధన్య ద్రోణీ కోష్మం. (retroflex groove fricative) (ద్రోణీకాకృతి దాల్చిన నాలుక కొన కరణం) మూర్ధన్యస్పర్శాలైన ట, ఠ, డ, ఢ, ణ లు భారతీయ భాషల్లో తప్ప ప్రపంచ భాషలలో లేవు.

19. 6 స్నిగ్ధ తాలువు లేక హనుమూలం (velar)

మూర్ధన్యానికి లంబికకు మధ్యగల తాలుభాగం. ఇందుండి ఉత్పన్నమయ్యే ధ్వనుల్ని 'హనుమూలీయాలం'టారు. (velars)

జిహ్వామూలం కరణంగా, మృదు తాలువు స్థానంగా జనించే ధ్వనుల్ని ఆధునికులు 'జిహ్వామూల, హనుమూలీయ స్పర్శము' అంటారు (dorso-velar stops)

(తె)-క, గ, ఙ (ఆంగ్లం) క, గ.

(సం) క, ఖ, గ, ఘ, ఙ.-వీటిని కంఠ్యాలనటం స్థూల వ్యవహారం

అ, ఆ లు: వీటిని కంఠ్యాలనటం పొసగదు. తెలుగులో 'క, గ' ఉచ్చరించే స్థానంకంటె ముందు భాగంలో ఉచ్చరితాలు.

హ: కంఠ్యం. దీన్ని కొందరు 'కంఠమూలీయ' మంటారు.

19. 7 లంబిక. (uv lea) (కొండనాలుక)

దీన్నే 'అధిజిహ్వ' అని కూడ అంటారు. ఇది మృదు తాలువుయొక్క విస్తృత భాగం. (extension of velum) లంబిక సరిగా పనిచేయకపోతే అనునాసిక, నిరనునాసిక భేదం తెలియదు. కంఠంనుండి వచ్చేగాలి, నాసికద్వారా పంపబడితే అనునాసికాలుచ్చరింప బడతాయి. కొండనాలుక నాసికా ద్వారాన్ని మూస్తే, నిరనునాసికా లుచ్చరింప బడతాయి. అనునాసిక నిరనునాసిక భేదాన్ని కల్గించేది కొండనాలుక.

అరబ్బీ భాషలో క, గ, లు హనుమూలీయాలే కాక (velar sounds) జిహ్వ మూలం కరణంగా, కొండనాలుక స్థానంగా ఉచ్చరితాలు. వీటినే 'పరహను మూలీయ ధ్వనులు' లేక 'అధిజిహ్వీయములు' అంటారు. (uvelar or post velar sounds)

19.8 జిహ్వ (Tongue)

ధ్వన్యుత్పత్తిలో అన్ని అవయవాలకంటె అత్యంత ప్రముఖమైంది. కొన్ని భాషల్లో 'టంగ్' అంటె నాలుక అనేకాక 'భాష' అనికూడ అర్థం కావటాన్ని బట్టి దీని ప్రాముఖ్యం విదితం.

ఆంగ్లం : He uses a bag tongue = language

ఫ్రెంచి : Lingua = tongue, language

అరబి : LSN = tongue

Lasan = language

జిహ్వ కరణం. (articulator) చలించే స్వభావం కలది. పెదవుల నుండి సప్తపథ వరకున్న ధ్వన్యుత్పత్త్యవయవాలతో దీనికి సంబంధం ఉంది. ఆస్యభాగమంతా వ్యాపించివున్నది. జిహ్వ బర్సం (కొన) పెదవుల దాకారాగలదు.

దీన్ని ఐదుభాగాలు చేయవచ్చు.

(i) జిహ్వాబర్సం : tip of the tongue

(ii) జిహ్వాగ్రం : blade of the tongue

(iii) జిహ్వామధ్యం : middle or centre of the tongue

(iv) జిహ్వామూలం : back of the tongue

(v) జిహ్వాపృష్ఠం : root of the tongue

ఈ అయిదు భాగాలకు వక్త్రవివరోపరి భాగాలతో సంబంధమున్నది. ఇందులో "నాలుకకొన" చాలాముఖ్యమైంది. ధ్వనుల్లో ఎక్కువ భాగం జిహ్వా ప్రమేయం కలవి. అయినా ఇదికరణం కావటం చేత, దీనిపేరట ఒక్కసంజ్ఞను గూడ మనవారేర్పాటు చేయలేదు.

19. 81 నాలుక కొనకు 'apex' అంటారు. దీని తోడ్పాటుతో ఉత్పన్న మయ్యే ధ్వనులు apecal sounds. స్థాన కరణాల్ని రెంటిని కలిపి వర్ణిస్తే దన్త్యాలను apeco-dentals అనాలి.

జిహ్వకు 'dorsum' అనికూడ వ్యవహారం. ఇది కరణంగాగల ధ్వనులు 'dorsal sounds' అంటారు. జిహ్వామూలం కరణం, హనుమూలం స్థానంగా గలధ్వనులు (dorso-velar sounds).

19. 82 నాలుకతో నిమిత్తంగల మరికొన్ని ధ్వనులు- ల, ళ. ల–దంత మూలీయం; ళ-మూర్ధన్యం. వీటిని ఉచ్చరించే టప్పుడు నాలుక ఇరుప్రక్కల నుండి గాలి నిర్గమిస్తుంది. అందుచేనివి 'పార్శ్వకములు' (laterals)

రేఫం–దన్తమూలీయ తాడితం : alveolar trill. ఱకారం–అనేక రేఫముల ఉచ్చారణం.

19. 83 అచ్చుల నుచ్చరించటంలో నాలుక ఎత్తును బట్టి అమెరికన్ భాషాశాస్త్రజ్ఞులు వాటిని పలురీతుల వర్గీకరించారు. (చూ. అనుబంధంలో పట్టిక)

ఉన్నత స్వరాలు (high vowels) ఇ, ఈ, ఉ, ఊ లు. నత స్వరాలు (low vowels) అ, ఆ. మొత్తం ఏడు ఎత్తుల్ని వారు నిరూపించారు.

నాలుకతో సంబంధం లేని ధ్వనులు–ఓష్ఠ్యాలు. నాదతంత్రులలో ఉత్పన్నమైన ధ్వనులకు నాలుకతో పనిలేదు.

19. 9 నాసికాంతర్భాగం (Nasal cavity)

ఇందులోనుండి ఉచ్చరింపబడే ధ్వనులంటు వేరేలేవు. ఆస్యభాగంలో ఉచ్చరింపబడే ధ్వనులకు అనునాసికత అనేవిశిష్టలక్షణాన్ని ఆపాదించే వ్యాపారాన్నిది నిర్వహిస్తుంది.

అనునాసిక ధ్వన్యుచ్చారణంలో తొంబది శాతం గాలి నాసికనుండి వెళ్తుంది. నాసికద్వారా శ్వాసనిర్గమనంగల ధ్వనులు అనునాసికాలు.

వర్గధ్వనుల లాగా స్థానకరణ సంయోగం అనంతరం నిశ్వాసం నాసిక ద్వారా పోతే అది అనునాసిక ధ్వని అవుతుంది.

వర్గపంచమాక్షరాల్ని (ఙ, ఞ, ణ, న, మ,) అనునాసికాలంటారు. ఫ్రెంచి భాషలో అనునాసిక స్వరాలున్నాయి. అ, అఁ, ఆ, ఆఁ, ఉ, ఉఁ మొదలైన రీతిగా. తెలుగులో కొన్ని అచ్చులు-ఆఁ ఊఁ వంటివి అనునాసికంగా ఉచ్చరింపబడి, ప్రశ్నార్థకాన్ని, సమ్మతిని తెలియజేస్తాయి. ఉచ్చస్వరంతో పలికేటప్పుడు, అనునాసికతకల్గుతుంది. ఉప్పు, పెరుగు, పాలు అమ్మేవారు కేకలు పెట్టేటప్పుడు వినవచ్చు.

ముక్కుపొడి ఎక్కువగా పీల్చేవారి భాషణమంతా అనునాసికరంజకంగా ఉంటుంది. 'ఏఁ రోఁ యేఁ ఎప్పుడు వఁ చ్చాఁ వ్ఁ'. ఆధునికులు అనునాసిక చిహ్నంగా ఖండ బిందువు నుపయోగించటం హిందీ సినిమా పేర్లలోను, హనుమాన్ చాలీసాలోను చూడవచ్చు.

19. 10 కంఠమూలం : దీనిదగ్గర ఉచ్చరింపబడే ధ్వని-హ. ఇది కంఠమూలీయోష్మం.

19. 11 సప్తపథ : జిహ్వాపృష్ఠానికి గళవివరకుడ్య భాగానికి మధ్యగత దానికి సప్తపథ అని వ్యవహారం. ఇది ఉచ్చారణావయవం కాక పోయినా అందుకు తోడ్పడేది.

19. 12 గళబిలం : (glottis)

19. 13 కృకాగ్రం లేక స్వర పేటిక (Soud box)

ఇది కృకాగ్రంలోని అవయవం. ఇందులోచాల నాదతంత్రులతోగూడిన రెండుపెదవుల వంటి కండరాలుంటాయి. ఈ నాదతంత్రులు ఒకదానికొకటి

దగ్గరగావచ్చి ద్వారాన్ని మూయటం, కొంతమూయటం, లేక పూర్తి దూరంగా వుండటం సంభవిస్తుంది.

కృకాగ్రం లేక కాకరం నుండి ధ్వన్యుత్పత్త్యవయవాలు ప్రారంభం దీన్నే 'శరీరవీణ' అని సంగీత రత్నాకరం పోల్చింది. ఇదిలేకపోతే ధ్వన్యుత్పత్తే లేదు. బూరలోని పీకవంటి దిది.

నాదతంత్రులు రెండు స్థాన కరణాలే - వాయుస్తంభనానంతర విస్ఫోటనం చేస్తే ఒకవిధమైన ధ్వని పుడుతోంది. దీన్నే glattol stop [? అంటారు. ఈ ధ్వని తెలుగులో హ్రస్వ దీర్ఘాల మధ్య ఉన్నా, దీన్ని వ్యాక లెవ్వరు గుర్తించ లేదు. వాడికి అ?అలు రావు. కొండదొర భాషలో (అర లోయిలోని గిరిజనులు) ఇట్టి ధ్వని ఉంది.

నాదతంత్రులు వీలైనంత ఎడంగా ఉన్నప్పుడుచ్చరిస్తే, ఉచ్చరి మైన ధ్వనులు 'శ్వాసములు' [surds]. నాదతంత్రుల కలియిక చాలా దగ్గరక వచ్చిన స్థితిలో, అనగా సమీప స్థితిలో ఉచ్చరితమైన ధ్వనులు నాదము [sonants] పూర్తిగా దగ్గరకు వచ్చినప్పుడు గ్లోటల్ స్టాప్ ఉచ్చరితం.

## 20. 0 ప్రయత్నము (Manner or Method of articulation)

ధ్వన్యుత్పత్తికి స్థాన కరణాలతో పాటు ప్రయత్నం కూడ ముఖ్యం స్థానకరణ సంయోగం ఏరీతిగా జరుగుతున్నది వివరించటమే ప్రయత్నం.

20. 1 ప్రాచీన లాక్షణికులు ప్రయత్నాన్ని రెండు విధాల పేర్కొన్నారు

(i) అభ్యంతర ప్రయత్నం:- పెదవుల నుండి జిహ్వామూలం వరకు ఉన్న ఆస్యభాగంలో జరిగేప్రయత్నం.

ఇదినాలుగు విధాలు: (క) స్పృష్టము (చ) ఈషత్స్పృష్టము (ట) సంవృతము (త) వివృతము

(ii) బాహ్యప్రయత్నం:- ఆస్య బహిర్భాగంలో జరిగే ప్రయత్నం. జిహ్వామూలంనుండి కృకాగ్రం వరకుగల భాగం ఆస్య బహిర్భాగం.

1. శ్వాసము - 2. నాదము

3. అల్పప్రాణము 4. మహాప్రాణము

5. సంవారము 6. వివారము
7. ఘోషము 8. అఘోషము
9. ఉదాత్తము 10. అనుదాత్తము
11. స్వరితము

20. 2 అభ్యంతర ప్రయత్నభేదాలు:

20. 21 స్పృష్టము: స్పర్శప్రయత్నమే స్పృష్టము. ఇందు స్థాన. కరణముల సంపూర్ణ స్పర్శ ఉంటుంది. తొలుత వాయు స్తంభనము, పిమ్మట వాయుస్ఫోటనము. ఇక్కడ ప్రధానముగా స్పర్శమే చెప్పబడింది. ఈ లక్షణములు గల ధ్వనులను స్పర్శములు (contact sounds) అంటారు, ఉదా:-5 × 5=25 వర్గాక్షరములు.

20. 22 ఈషత్ స్పృష్టము: కొలదిపాటి స్పర్శకల్గిన ధ్వనులు. వీనిని దుస్పృష్టములనియు అంటారు. 'దుస్పృష్టమీషత్ స్పృష్టమిత్యర్థః. స్పర్శయుండియు ఉండనట్లు పరిగణింపబడును. స్థానకరణములకు కొద్దిపాటిస్పర్శ ఉదా: య, ర, ల. వ, లు(loose contact sounds).

అర్థస్పృష్ట ధ్వనులు - శ, ష, స, హ (half contact sounds]

అస్పృష్టములు (Non-contact sounds) అచ్చులు స్థానకరణములు చాలాదగ్గరగా వచ్చునే కాని తగలవు.

ప్రాచీనులు పై రెండు భేదములు పేర్కొనలేదు. ఇది వేరొక పరిభాషలో నిరూపితము.

20.23 సంవృతము (closed sounds) ఆవరింపబడినదని శబ్దార్థం. వేనియొక్క సంవృత్వం? ఆస్యసంవృతం. ఆస్యం సంవృతమైనపుడు ఉచ్చరింపబడే ధ్వనులు నాలుకలోని ఏ భాగమైనా వక్త్రోపరితలానికి వీలైనంత దగ్గరగా వెళ్ళటాన్ని 'సంవృత' మంటారు. అట్టిస్థితిలో ఉత్పన్నమయ్యే ధ్వనులు—ఇ, ఈ, ఉ, ఊలు. సంవృత స్వరాలు (closed vowels)

ఇ - ఈ: నాలుక మధ్యభాగం కఠినతాలువు వైపుకు పోతుంది. "అగ్ర స్వరాలు" (Front vowels) తాలవ్య స్వరాలు (palatal vowels) అనే వాటిలోను ఇవి చేరుతాయి.

ఉ - ఊ: జిహ్వామూలం స్నిగ్ధతాలువు వైపుకు పోగా ఉచ్చరింపబడేవి. తాలుకయొక్క పశ్చాద్భాగాన్ని కప్పటంచేత ఇవి పృష్ఠాచ్చులు (back vowels); రెండు పెదవులు వీని ఉచ్చారణంలో గుండ్రం కావటంచేత వర్తుల స్వరాలు (round vowels)అని; రెండుపెదవుల ద్వారా గాలినిర్గమించటంచేత "ఓష్ఠ్యస్వరాలు" (bilabial vowels) అని వ్యవహారం.

20.24 వివృతము (open): ఆస్యం వివృతమైనపుడు ఉచ్చరింపబడే ధ్వనులు. ఉదా॥ అ,ఆ. ఏ ఇతర ధ్వనుల ఉచ్చారణంలోను ఆస్యమింత గా వివృతం కాదు. నాలుక యథాస్థానంలో-అంటె క్రింది పలు వరుస స్థాయిలో ఉంటుంది. ఆస్యాన్ని సంపూర్ణంగా వివృతం చేసే ప్రయత్నం-వివృత ప్రయత్నం.

ప్రాచీనులు "వివృత మూష్మాణాం, స్వరాంచ" అన్నారు కాని అన్ని స్వరాలు వివృతాలు కావు కదా!.

20.30 బాహ్య ప్రయత్నాలు:

20.31 శ్వాసత (unvoicing)

నాదతంత్రులు వీలైనంత దూరంగా ఉన్నస్థితిలో జరిగే ప్రయత్నం. ఉదా॥ వర్గప్రథమ, ద్వితీయ వర్ణాలు.

శ, ష,స,హ,లు (5+5+4=14) వీటికే "శ్వాసములు" (Surds) అని వ్యవహారం. తెలుగులో పరుషములనే వ్యవహారం. వర్గ ప్రథమాక్షరాలకే పరిమితం. ఆంగ్లంలో వీటిని hard consonants అంటారు. c, f, h, k, p, q, s, t, x, th (తీటా).

20.32 నాదత (Voicing)

నాదతంత్రులు స్పర్శించుకొనకుండ సమీప స్థితిలో ఉన్నపుడు గళబిలము (glottis) ద్వారా నిర్గమించు శ్వాసప్రవాహానికి కంపనం సంక్రమిస్తుంది. నాదతంత్రుల కంపన ఫలితే నాదత. ఈ లక్షణం గల ధ్వనులే నాదములు. (voiced consonants) ఉదా॥ వర్గతృతీయ, చతుర్థ పంచమాక్షరాలు, అంతస్థములు, స్వరములు. వీటినే మృదు వ్యంజనాలు (soft consonants) అంటారు. నాదాక్షరాలు (sonants) అనీ అంటారు.

తెలుగులోని సరళసంజ్ఞ వర్గతృతీయాక్షరాలకే పరిమితం. ఆంగ్లంలో a,b,d,e,g,i,j,l,m,n,o,r,u,v,w,y,z, delta.

20.33 అల్పప్రాణము ( unaspiration)

ధ్వనుల నుచ్చరించటానికి నిర్ణీతమైన వాయుపరిమాణం అవసరం. అల్పమైన వాయుపరిమాణ మున్నప్పుడు అవి అల్పప్రాణములవుతాయి. ఉదా: వర్గ ప్రథమ, తృతీయ, పంచమాక్షరములు.

స్వరములు, అంతస్థములు

ఆంగ్లంలో- a, b, c, d, e, g, i, j, k, l, m, n, o, p, q, r, s, t, u, v, w, x, y, z. delta (th) 's' విషయంలో మత భేదముంది.

తెలుగు సంస్కృతాలలోని సకారం, ఆధునికుల దృష్టిలో అల్పప్రాణమే. ఊష్మతా ప్రయత్నాన్ని బట్టి సంస్కృతాభిజ్ఞులు 'మహాప్రాణంగా' పరిగణించారు.

20. 34 మహాప్రాణము (aspiration)

నిర్ణీతమైన వాయుపరిమాణం కంటె అధిక పరిమాణంలో ఉచ్చరింపబడే ధ్వనులు మహాప్రాణములు. వాయు పరిమాణాతిశయంచే మహాప్రాణత కల్గుతుంది.

ఉదా: వర్గ ద్వితీయ, చతుర్థములు, హ శ, ష, స, ల విషయం వివాదాస్పదం. సంస్కృతంలో ఇవి మహాప్రాణాలే.

20. 35 సంవారము 20. 36 వివారము

ఇవి గళ భాగం యొక్క సంకోచవ్యాకోచాలకు సంబంధించినవి.

సంవారము - తక్కువగాలి యుండుట

వివారము - ఎక్కువగాలి యుండుట

తటస్థించును. ఇది ప్రయోగశాలలో నిర్ధారించుకొనవలసిన విషయం.

20. 37 ఘోషము 20.38 అఘోషము

గళ భాగంలోని అవయవాలు - అనగా సప్తపథాగ్రం, కృకాగ్రం, జిహ్వావృష్ఠం వీటి బిగింపువల్ల ఘోషం, సడలింపువల్ల అఘోషం కల్గుతుం

దన్నారు. సంవార,వివార, ఘోషా ఘోషాలను మనపూర్వులు స్పష్టంగా వివరించలేక పోయారు.

20. 39 ఉదాత్తము.

ఇదివైదిక సంస్కృతంలోను, గ్రీకుభాషలోను ప్రాధాన్యం వహించింది. స్వరంలో (tone) ఇది ఒక విధానం. నాల్గు వేదాల్లోను, అరణ్యకాల్లోను ఈ స్వరభేదాలు పాటింప బడతాయి.

"వర్ణం చేతగాని, స్వరం చేతగాని, దుష్టమైన శబ్దాన్ని వాడి ఆశబ్దం సరియైన అర్థాన్నీయక ప్రయోగించిన వానికే బెడిసి కొడుతుం 'ఇంద్ర' 'శత్రు' శబ్దాల్ని ఉచ్ఛరించేటప్పుడు స్వరంలో పొరబడినందువ వృత్రాసురుడు నాశమైనాడు. కాబట్టి దుష్టశబ్దాల్ని ప్రయోగించకుండ ఉ టానికి వ్యాకరణాధ్యయనం చేయాలని" మహాభాష్య ప్రబోధం.*

ఇంద్రుడ్ని చంపాలని వృత్రాసురుడు అభిచారహోమం చే "ఇంద్రశత్రుర్వర్ధస్వ" అనేమంత్రం పఠించాడట. 'ఇంద్రస్యశత్రు శాతయితా - ఇంద్రశత్రుః :- షష్టీతత్పురుష సమాసం. ఉత్తర పదా ప్రాధాన్యాన్ని బట్టి శత్రు శబ్దం చివరి అచ్చును ఉదాత్తంగా పఠించా అది తెలియక వృత్రుడు 'ఇంద్ర' శబ్దంలోని తొలిఅచ్చును ఉదాత్తం పఠించాడు. అప్పుడది బహువ్రీహి అయింది. 'ఇంద్రః, శత్రుః శాతయి యస్యసః' - ఇంద్రుడు నాశకుడుగా కలవాడవుకమ్మని అర్థం వచ్చిం ఇంద్రుడు విజృంభించి, వృత్రుడ్ని సంహరించాడు.

"ఉచ్చైరుదాత్తః" (అష్టా. 1-2-29) స్వరోచ్చారణ స్థానాలై ఆయాతాల్వాది స్థానాల్లో మిక్కిలి ఊర్ధ్వభాగంలో ఉచ్చరిస్తే ఉదాత్త

*"దుష్టః శబ్దః స్వరతో వర్ణతోవా
మిథ్యా ప్రయుక్తో నత మర్థమాహ
సవాగ్వజ్రో యజమానం హినస్తి
యథేన్ద్ర శత్రుః పర్వతోఽపరాధాత్"

దుష్టాన్ శబ్దాన్ మాప్రయుక్ష్మ హిత్యధ్యేయా వ్యాకరణమ్-పతంజ మహాభాష్యం, పశ్పశాహ్నికమ్

## బాహ్యాభ్యంతర ప్రయత్నాల పట్టిక

| ఆ. ప్ర. | స్పృష్టము స్పర్శలు | | | | ఈషత్ స్పృష్టము అన్తస్థములు | వివృతము ఊష్మలు | వివృతము స్వరాలు | సంవృతము హ్రస్వాకారము |
|---|---|---|---|---|---|---|---|---|
| | క | ఖ | గ–జ | ఘ | య | శ | అ | ప్రయోగంలోని |
| | చ | ఛ | జ–ఞ | ఝ | ర | ష | చ్చు | అకారం |
| | ట | ఠ | డ–న | ఢ | ల | స | లు | |
| | త | థ | బ–మ | ధ | వ | హ | | |
| | ప | ఫ | | భ | | | | |
| | అ. ప్రా. | మ. ప్రా. | అ. ప్రా. | మ. ప్రా. | అ. ప్రా. | మ. ప్రా. | అ. ప్రా. | అ. ప్రా. |
| బా. ప్ర. | వివారము శ్వాసము అఘోషము | | సంవారము నాదము ఘోషము | | సంవారము నాదము ఘోషము | వివారము శ్వాసము అఘోషము | సంవారము నాదము ఘోషము | సంవారము |

ఈ పట్టిక కౌముదీ శరదాగమం నుండి స్వీకృతం,

అంటే ప్రయత్న ప్రేరితమైన వాయువు తాల్వాది స్థానాల్లో ఊర్ధ్వభాగ
స్పృశించి, అచ్చును పుట్టించి నపుడా అచ్చు ఉదాత్తం.

20. 40 అనుదాత్తము.

"నీచైరనుదాత్తః" (అష్టా. 1-2-30) ప్రయత్న ప్రేరితమైన వాయ
తాల్వాదిస్థానాలలో అధోభాగాన్ని స్పృశించినపుడు పుట్టినఅచ్చు అనుదా

20. 41 స్వరితము.

"సమాహారస్వరితః" (అష్టా. 1-2-31) సమానంగా ఉచ్చరించ
అంటే ఉదాత్తానుదాత్తములనే ధర్మాలు రెండు ఏ అచ్చులో
ఉంటాయో, ఆ అచ్చుస్వరితం. తాల్వాది స్థానాలయొక్క ఊర్ధ్వాధో భాగ
క్రమంగా స్పృశించే వాయువుచే ఉత్పన్నమైన అచ్చుస్వరితం.

21. 0 ఆధునికులు నిరూపించిన కొన్ని ప్రయత్న భేదాలు:

ప్రాచీనులు పేర్కొన్న బాహ్యాభ్యంతర ప్రయత్నాలకు సంబంధిం
ఆధునికులు కొన్ని క్రొత్త ప్రయత్న భేదాల్ని పేర్కొన్నారు. అవి

21. 1 అనునాసిక ప్రయత్నం (Nasalisation) నాసికకు అను
మైన ప్రయత్నం. ధ్వన్యుచ్చారణ కాలంలో నాసికాంతర్భాగం నుండి శ
నిర్గమించటాన్ని అనునాసిక్యమంటారు.

ఙః జిహ్వామూల హనుమూలీయాను నాసికం (dorso-velar-na
మృదుతాలువు స్థానం. జిహ్వామూలం కరణం. అల్పప్రాణం, నాదం, స్ప
అనునాసిక్యం.

ఞః తాల వ్యానునాసికం (Palatal Nasal) కఠిన తాలువు స్థా
జిహ్వామధ్య కరణం. తెలుగులో స్పృష్టోష్మ ప్రయత్నంతో (frica
పాటు అదనంగా అనునాసికం.

ణః- మూర్ధన్యాను నాసికం (Retroflex nasal) మూర్ధం - స్థా
ప్రతివేష్టిత జిహ్వాగ్రం కరణం.

నః దంతమూలీయాను నాసికం (alveolar nasal) దంతమూ
నం, నాలుక కొన కరణం, నాదం, అల్పప్రాణం. అనునాసికం.

మ: ఉభయోష్ఠ్యాను నాసికం (bilingual nasal)స్థానం–పై పెదవి, కరణం–క్రింది పెదవి, అల్పప్రాణం, స్పర్శం, నాదం, అనునాసికం.

మ: దంత్యోష్ఠ్యాను నాసికం (labio-dental nasal) స్థానం–పై దంతముల క్రిందిభాగం. కరణం-క్రింది పెదవి; నాదం, అల్పప్రాణం, స్పర్శాను నాసికం. ఇది ఆఫ్రికన్ భాషల్లో ఉంది.

ఫ్రెంచి, పోర్చుగీస్, స్పానిష్ కొంతవరకు ఇటాలియన్ భాషల్లో స్వరాలు, అనునాసిక నిరను నాసిక భేదాలతో ఉన్నాయి.

21.2 పార్శ్వక ప్రయత్నం:

శ్వాసం జిహ్వాయొక్క ఉభయపార్శ్వముల నుండి నిర్గమించటం. ల, ళ, ఱ నుచ్చరించేటప్పు డీప్రయత్నం గోచరిస్తుంది. ఈ ధ్వనులనే పార్శ్వక ధ్వనులంటారు. (lateral sounds)

21.3 తాడిత ప్రయత్నం: (Flap)

తాడనం చేయటమంటే ప్రహరించటం. నాలుక కొన దంతమూలాన్ని తాడనం చేస్తుంది. ఇట్టి తాడిత ప్రయత్నంతో ఉచ్చరింపబడే ధ్వని రేఫం.

21.4 కంపిత ప్రయత్నం:

కంపనం కలది. నాలుకకొన దంతమూలాన్ని తాడనం చేయటంలో కంపనం కల్గుతుంది. కంపిత ధ్వని ( trill ) తెలుగులో శకటరేఫం. ఆధునికంగా శకటరేఫ ద్విత్వస్థితిలోనే ఉచ్చరింప బడుతుంది. ఉదా॥ కఱ్ఱ, బొఱ్ఱ.

21.5 ఊష్మప్రయత్నం:

స్థానకరణముల సమీపావస్థలో ఏర్పడ్డ ఇరుకైన సందుగుండ శ్వాస ప్రవాహం ఒత్తిడితో నిర్గమించటం.

ఈ ఊష్మధ్వనులకే spirants, అని, sibilants అని, Fricatives అని వ్యవహారం.

సంస్కృతంలో శ,ష,స, హ లు ఊష్మాలు, మహాప్రాణాలు. ఆంగ్లంలో "వ" ఊష్మం, నాదం, అల్పప్రాణం, ఫ-మహాప్రాణోష్మం, శ్వాసం.

ష: ద్రోణికోష్మం (groove fricative) నాలుక చిన్నదోనెలాగా అవుతుంది.

స: దంతమూలీయోష్మం ( alveolar slit fricative )

21.6 అంతస్థ ప్రయత్నం.

ఈషత్ స్పృష్టాలైన య,వ,లు మాత్రమే అంతస్థ ప్రయత్నం కలిగిన రేఫలకారాన్ని కూడ చేరుస్తుంటారు. స్పృష్టా స్పృష్టములకు మధ్య జరిగే ప్రయత్నం.

ప్రపంచ భాషలన్నింటిలో విశేషంగా ఈయు-వలు అనుసంధాన ధ్వనులు (glides - జార్చునవి అని అర్థం) గాను ఉపయుక్తం అవుతుంటాయి.

22.0 స్వరములు.

స్వయంగా ప్రకాశించేవి స్వరాలు. ఇవన్నీ నాద ధ్వనులు. (sonants) వీనిననుసరించి ధ్వనించేవి లేక వీనిచే వ్యంజింప బడేవి - వ్యంజనాలు. (consonants). స్వరవ్యంజన సంయోజనం "మణిహారం" వంటిదిగా అభి వర్ణితం. అచ్చులు, హల్లులు అనేవి పాణినీయ ప్రత్యాహార సంజ్ఞలు. అయినా వీటివ్యాప్తి అధికంగా ఉంది.

హల్లులు - (i) స్థానకరణ స్పర్శము (ii) రాపిడితో వాయు నిర్గమనం (iii) ఈషత్స్పృష్టం అనే మూడు లక్షణాల్లో ఏదోఒకటికలవి. ఇట్టిలక్షణాలు లేనివి అచ్చులు.

అక్షర నిర్మాణంలో (syllable) స్వరాలే ప్రధానాలు. వ్యంజనాలు అప్రధానం. స్వరంగాని, స్వరంతోగూడిన వ్యంజనంగాని "అక్షర" మౌతుంది. (syllable) స్వరసహాయం లేనిది వ్యంజనానికి అక్షరత్వంలేదు.

22.1 స్వరోచ్చారణం ముఖ్యంగా ద్వివిధ ప్రయత్నాల ద్వారా కల్గు తుంది. (i) సంవృత ప్రయత్నం. ఆస్యం సంవృతంగా ఉన్నప్పుడుచ్చరింప బడే స్వరాలు. ఈ స్థితిలో నాలుక అంగిలికి చాల దగ్గరగా వస్తుంది కాని మూయదు. మూస్తే స్పర్శోచ్చారణం ఏర్పడుతుంది, ఉదా: ఇ,ఈ,ఉ,ఊ.

(ii) వివృతప్రయత్నం: (open) ఆస్యం వివృతంగా ఉన్నప్పు డుచ్చరింపబడేవి. ఉదా: అ,ఆ.

సంస్కృత శాబ్దికులు కావించిన ఈ విభజనాన్ని జర్మను, ఆంగ్ల పండితు లంగీకరించారు. అయితే పై రెండు భేదాలతోపాటు ఇంకా రెండు చేర్చారు.

(iii) అర్థసంవృతం (half-closed) — ఎ,ఏ,ఒ,ఓ,లు. (iv) అర్థవివృతం (half-open) ఎ,ఏ

22.2 నాలుక ఉత్థాపితమయ్యే స్థితినిబట్టి, పెదవుల వర్తులావర్తుల స్థితినిబట్టి స్వరాల విభజనాన్ని పాశ్చాత్యులు కావించారు. తెలుగు స్వరాల్ని ఇలా విభజించవచ్చు.

| | అగ్రస్వరాలు (Front vowels) | మధ్యస్వరాలు (central vowels) | పృష్ఠస్వరాలు (Back vowels) |
|---|---|---|---|
| సంవృతం | ఇ,ఈ | ............ | ఉ,ఊ |
| అర్థసంవృతం | ఎ ఏ | ............ | ఒ,ఓ |
| అర్థవివృతం | ఎ ఏ | ............ | – – |
| వివృతం | – – | అ,ఆ, | – – |

ఓష్ఠ్య [round] నిరోష్ఠ్య [unround] భేదాల్ని బట్టి, జిహ్వాభాగాల్ని బట్టి ఆరువిధాలైన స్వరాలు ఏర్పడతాయి. పెదవులు సెలవుల వైపు విస్తరించేటట్లు ఉచ్చరింప బడేవి-విస్తారిత స్వరాలు. (spread vowels) ఉదా: ఇ,ఈ,ఎ,ఏలు.

ప్రపంచంలో కొన్ని భాషల్లో ఇ,ఈ లు ఓష్ఠ్యాలుగాను (round) ఉ,ఊ,ఒ,ఓలు విస్తారితాలు (spread) గాను ఉచ్చరింపబడటాన్ని బట్టి భాషాశాస్త్ర విద్యార్థి అన్నివిధాలైన ధ్వనుల్ని ఉచ్చరించటం అభ్యాసం చేయాలి.

22.3 అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఒ, ఓ అనేవి సమానస్వరాలు. (simple vowels) ఐ, ఔ,-సంధ్యక్షరాలు (compound vowels or diphthongs) తెలుగు, మున్నగు ద్రావిడ భాషల్లో ఏ, ఓ లు సంధ్యక్షరాలుకావు. ఎ, ఒ, ల దీర్ఘ రూపాలు.

సంస్కృతంలో ఏ,ఓ,లుసంధ్యక్షరాలే. ఐ ఔ లు తిలతండుల న్యాయంలో కలిసిన సంధ్యక్షరాలు కాగా ఏ, ఓ, లు క్షీర నీరన్యాయంలో కలిసినవి.

ఒక అచ్చు నుచ్చరించటానికి ప్రయత్నించే టప్పుడు రెండో అచ్చుకూడ ఉచ్చరింపబడితే అది సంయుక్త స్వరం లేక సంధ్యక్షరం (diphthong) అవుతుంది. ఉచ్చారణనుబట్టి యివి రెండువిధాలు.

(i) నత సంధ్యక్షరాలు. (falling diphthongs) అయి, అవు, అయింది అవుతుంది మొదలైనవి.

(ii) ఉన్నత సంధ్యక్షరాలు: (raising diphthongs) paid, paint, rai ఐంది, ఔతుంది మొదలైనవి.

ఆధునికులు ఏ, ఓ, లను సంధ్యక్షరాలుగా అంగీకరించరు; రెండో అచ్చు ఉచ్చరింపబడదు కాబట్టి.

22. 4 ఋ, ౠ, ఌ, ౡ: ఇవి కేవలం స్వరాలు కావు, కేవలం వ్యంజనాలుకావు. స్వరవ్యంజన ధర్మసమ్మిశ్రిత విశేషధ్వనులు. ఆద్యంతాలలో స్వరధర్మాలు, మధ్యలో వ్యంజనధర్మాలు ఉన్నాయని శాస్త్రజ్ఞుల ఊహ.

ఛందశ్శాస్త్రంలో యతిమైత్రి విషయంలో స్వరవ్యంజన ధర్మాల్ని (ఋ-ఇ, ఈ, ఎ, ఏ లకు రి, రీ, రె, రే, లకు) ప్రాసమైత్రిలోనివి వ్యంజన ధర్మాన్ని (ఆఋషి పుత్రుడు గట్టిన చీరలు) కల్గిఉన్నాయి.

తెలుగు సంధిలోనివి వ్యంజన ధర్మాన్ని, సంస్కృత సంధిలో స్వర వ్యంజన ధర్మాల్ని కల్గి ఉన్నాయి.

ఉదా: అతడు + ఋషి = అతడుఋషి
ఆ + ఋషి = ఆ ఋషి
పితృ + ఋణము = పితౄణము
సప్త + ఋషి = సప్తర్షి, సప్తఋషి

ఆధునికులు వీటిని "నిర్జీవస్వరాలు"గా (Neutral vowels) పేర్కొన్నారు.

## 23. 0 తెనుగు స్వర వర్ణనము:

23. 1 అ:— (a) సంపూర్ణ వివృత విస్తారిత హ్రస్వము (cental low unround open short vowel)

(b) మూర్ధము (స్థానము) (f) హ్రస్వము
(c) జిహ్వామధ్యం (కరణం) (g) అల్పప్రాణము
(d) సంపూర్ణ వివృత ప్రయత్నం.
(e) నిరోష్ఠ్యము

(h) నాదము (చివరి రెండులక్షణాలు అన్నిస్వరాలకు సమానం)

ఆ ఇవే - (a, f) దీర్ఘం (long)

23. 2 ఇ

(a) సంపూర్ణ సంవృత విస్తారితాగ్ర హ్రస్వము.
(closed high front unround short vowel)
(b) కఠిన తాలువు, (c) జిహ్వ మధ్యం.
(d) సంపూర్ణ ప్రయత్నం
(e) విస్తారితము, లేక నిరోష్ఠ్యం (f) హ్రస్వం.

ఈ ఇవే (a, f) - దీర్ఘం (long)

23. 3 ఉ

(a) సంపూర్ణ సంవృత పశ్చాదోష్ఠ్య హ్రస్వము.
(highback round short vowel)
(b) స్నిగ్ధ తాలువు (c) జిహ్వామూలము (velar)
(d) సంపూర్ణ సంవృతం
(e) ఓష్ఠ్యము (వర్తులీకృతం) (f) హ్ర్వసం.

ఊ ఇవే – (a, f) దీర్ఘం (long)

23. 4 ఎ (a) అర్థ సంవృత విస్తారితాగ్ర హ్రస్వము
(half-closed unround short vowel)
(b) కఠినతాలువు (c) జిహ్వాగ్రము (d) అర్ధసంవృతం
(e) విస్తారితము (f) హ్రస్వం.

ఏ:- ఇవే (a, f) దీర్ఘం (long)

23. 5 ఎ: (మెడ, మెట్ట ఇత్యాదిపదాది నుచ్చరింపబడు స్వరము)
(a) అర్ధవివృత విస్తారితాగ్ర హ్రస్వము
(half-open unround short vowel)
(b) కఠిన తాలువు (c) జిహ్వాగ్రం (d) అర్ధవివృతం
(e) విస్తారితం (f) హ్రస్వం

ఏ:- ఇవే - (a, f) దీర్ఘం, (long) (మేక, మేధ ఇత్యాదుల్లోని పదాది స్వరం.)

23. 6 ఒ (a) అర్ధసంవృత పశ్చాదోష్ఠ్య హ్రస్వం
(half-closed round short vowel)
(b) హనుమూలం (c) జిహ్వామూలం (d) అర్ధసంవృతం
(e) ఓష్ఠ్యం (వర్తులీకృతం) (f) హ్రస్వం

ఓ - ఇవే - (a, f) దీర్ఘం (long)

ఉ, ఊ, ఒ, ఓ, అను సంస్కృతంలో ఓష్ఠ్యములు (labials) లేక ఓష్ఠ్యజములుగా వ్యవహరిస్తారు. నిజానికి ఓష్ఠములతో వీనికి సంబంధము లేదు. హనుమూల, జిహ్వామూలాలే స్థాన కరణాలు. కాని వర్తులీకృతత్వం ఓష్ఠ్యముల మూలాన కల్గటం చేత అదిప్రధానంగా ఎంచటంచేత ఓష్ఠ్యాలనే వ్యవహారం ఏర్పడింది.

24. 0 ఐ. పి. ఏ. చరిత్ర (అంతర్జాతీయ ధ్వనిమాల)

తొలుత లేఖన పద్ధతుల్లోని దోషాల్ని నివారించటానికి (Spelling re-orms) జాన్ హార్ట్ (John Hart) అనువ్యక్తి ఛార్టు నొకదాన్ని తయారు చేసాడు. అన్య భాషల్ని బోధించటానికి, చదవటానికి ఆ ఛార్టు కొంత ఉప యుక్తంగా ఉంది.

రాబర్టురాబిన్‌సన్ స్థానప్రయత్న భేదాల్నిబట్టి ధ్వనుల్ని విభజించాడు. స్వరోచ్చారణాన్ని సూచించే చిత్రనిర్మాణ మీతని ప్రతిభకు నిదర్శనం. స్వరోచ్చారణంలో నాలుకస్థితిని (position) ఈ చిత్రాలు చూపిస్తాయి.

సంధ్యక్షరాలకు (diphthongs) ఊష్మాలకు ప్రత్యేక లిపిసంకేతాల్ని విలియం హోల్డర్ ఏర్పాటు కావించాడు.

19వ శతాబ్దికి చెందిన ధ్వని శాస్త్రజ్ఞులు పిట్‌మన్, ఇల్లిస్, స్వీట్ మున్నగువారు ధ్వని సంకేతాల్ని గూర్చి విశేషకృషి గావించారు.

1885లో పాల్‌పారి (Paul Parry) అంతర్జాతీయ ధ్వని మాలకు పునాది వేసాడు. 1886లో ఫ్రాంమ్సులో గల కొద్దిమంది అధ్యాపకులతో ఒక సంఘాన్ని ప్రారంభించి ధ్వన్యముకూల లేఖనాన్ని ప్రచురం కావించాడు. ఈ సంఘంపేరు Phonetic teachers Association, వీరో పత్రికను కూడ నెల కొల్పారు. ఆ సంవత్సరంలోనే అంతర్జాతీయ సంఘం కూడ ఏర్పాటైంది.

; కాలంలోనే ఆటో ఎస్పర్సన్ (Otto Jesperson) అన్ని భాషలకు అను ర్తించే రీతిగా ఒక 'ధ్వనిమాల'ను నిర్మించాలనే అభిప్రాయం వ్యక్తం సారు. ఈ రీతిగా ఏర్పాటైనదే 'అంతర్జాతీయ ధ్వనిమాల' (Internation- Phonetic Alphabet) గా వ్యవహృతం.

l. 1 ఐ. పి. ఏ. ప్రాథమిక సూత్రాలు:

i) ప్రతి ధ్వనికి ప్రత్యేకమైన చిహ్నం ఉండాలి.

(ii) ఇతరభాషల్లోగల విశిష్ట ధ్వనులకు గల సంకేతాల్ని స్వీకరించాలి.

(iii) కొద్ది మార్పులతో రోమన్ లేఖన విధానాన్ని అనుసరించాలి.

(iv) క్రొత్తగా ఏర్పాటైన ధ్వని సంకేతాలు పాతసంకేతాల నుండి పరిణమించినవైనా కావాలి,లేదా పాతవాటిని జ్ఞప్తి చేసేవైనా కావాలి.

(v) అడ్డగీతలు (diacratic marks) సాధ్యమైనంత వరకు వాడరాదు.

4. 11 కొన్ని ఆనుషంగిక నియమాలు:

(1) ఒక పదాన్ని ఇంకో పదం నుండి వేరు చేయటానికి కారణ హతమైన ధ్వనిని ప్రత్యేక ధ్వనిగా గుర్తించి, దానికో సంకేతాన్ని ఏర్పాటు చేయవచ్చు.

(ii) సన్నిహితోచ్చారణం గల ధ్వనుల్ని ఒకే సంకేతంతో నిరూపిస్తు, దాన్ని నెత్తిపై అడ్డగీత చేతగాని (–) ప్రక్కన రెండుచుక్కలు (:) ఉంచి గానినిరూపించ వచ్చు.

ఉదా: స్వరాలకుగల హ్రస్వదీర్ఘ భేదాలు

అ, అ: ; ఇ, ఇ: ,

అ,$\bar{అ}$ ; ఇ, $\bar{ఇ}$.

(iii) క్రొత్తగా ఏర్పరుపబడిన ధ్వని సంకేతాలు గ్రీకు సంకేతాలకు దగ్గరగా ఉండాలి.

## 5. 0 ప్రపంచభాషాగత ధ్వని వర్ణనము:

ప్రపంచ భాషలలోని వివిధ ధ్వనులకు

(a) పారిభాషిక నామము (b) భాషాశాస్త్ర వర్ణనము(c) స్థానము (d) కరణము (e) ప్రయత్నము (f) అల్పప్రాణమా? మహాప్రాణమా?

(g) శ్వాసమా? నాదమా? (h) విశేషాంశములను అనువివరము క్రింది రీతినిసమకూర్చబడ్డాయి. వీనికి ఐ. పి. ఏ. గుర్తు అనుబంధమందుచూడవచ్చు.

25.1 1 క్ (a) జిహ్వామూల హనుమూలీయస్పర్శం.
(b) dorso-velar unaspirated unvoiced stop (c) హనుమూలం
(d) జిహ్వామూలం (e) స్పర్శం (f) అల్పప్రాణం
(g) శ్వాసం (h) కవర్గధ్వనుల్ని సంస్కృతజ్ఞులు కంఠ్యాలనటం స్థూలవ్యవహారం.

(2) ఖ్ (b) dorso-velar aspirated unvoiced stop
(f) మహాప్రాణం. a, c, d, e, g, h, పై రీతి.

(3) గ్ (b) dorso-velar unaspirated voiced stop
(g) నాదం. తక్కినవానికి చూ. (1)

(4) ఘ్ (b) dorso-velar aspirated voiced stop
(f) మహాప్రాణం. (g) నాదం. తక్కినవి చూ. (1)

(5) ఙ్ (a) జిహ్వామూలీయ హనుమూలీయానునాసికం (b) dorso-velar nasal (e) అనునాసికం (f) అల్ప (g) నాదం
(c) (d) (h) చూ. (1)

25.2 సంస్కృత చవర్గ ధ్వనులు:

(6) చ్ (a) తాలవ్యస్పర్శం (b) apico-palatal unaspirated unvoiced stop (c) కఠినతాలువు (d) జిహ్వామధ్యం
(e) స్పర్శము (f) అల్ప (g) శ్వాసం

(7) ఛ్ (a) apico-palatal aspirated unvoiced stop (f) మహా. తక్కినవి పై రీతిని.

(8) జ్ (b) apico-palatal unaspirated voiced stop (d) నాదం. చూ. 6.

(9) ఝ్ (b) apico-palatal aspirated voiced stop. (f) మహా. (g) నాదం చూ 6.

(10) ఞ్ (a) తాలవ్యానునాసికము (b) apico-palatal unaspirated

voiced nasal (c)(d) - పైని (e) అనునాసిక ప్రయత్నము (f) అల్ప(g) నాదం.

25.21 తెనుగు మున్నగు ద్రావిడ భాషలలోని చవర్గ ధ్వనులు :—

(11) చ్ (a) తాలవ్య స్పృష్టోష్మం (b) apico - palatal unvoiced unaspirated affricate (c) కఠినతాలువు (d) జిహ్వ మధ్యం (e) స్పృష్టోష్మ ప్రయత్నం (f) అల్ప (g) శ్వాసం.

(12) చ్ (a) దంతమూలీయ స్పృష్టోష్మం (b) apico alveolar unvoiced unaspirated affricate (c) దంతమూలం (d) జిహ్వ బర్సం (blade of the torgue (e) స్పృష్టోష్మ ప్రయత్నం (f) అల్ప(g) శ్వాసం (h) తెనుగులోనే యిది విలక్షణ ధ్వని.

(13) జ్ (b) apico-palatal voiced unaspirated affricate (g) నాదం. తక్కినవి చూ. 11.

(14) జ్ (a) దంతమూలీయ స్పృష్టోష్మం (b) apico alveolar voiced unasvirated affricate (c) స్పృష్టోష్మ ప్రయత్నం. (d)నాదం (h) తెలుగునందు విలక్షణ ధ్వని. తక్కినవి చూ. 11

(15) ఞ్ (a) తాలవ్యాను నాసికం (b) apico - alveolar voiced unaspirated affricate (c) అనునాసిక ప్రయత్నం (d) అల్ప (g)నాదంతక్కినవి చూ. 11

25.3 మూర్ధన్య ధ్వనులు: మూర్ధం స్థానంగా ఉత్పన్నమైనవి. పూర్వులు వీటిని సెరిబ్రల్స్ [cerebrals] అనేవారు. ఇది స్థాన ప్రధానసంజ్ఞ. నవ్యులు వీటిని 'retroflex sounds' అంటారు. ఇది కరణప్రధాన సంజ్ఞ. 'రెట్రాఫ్లెక్స్' అంటే పరివేష్టిత జిహ్వాగ్రమని అర్థం.

(16) ట్ (a) మూర్ధన్య స్పర్శం. (b) unvoiced, unaspirated retroflex s top (c) మూర్ధం (d) పరివేష్టిత జిహ్వాగ్రం (e) స్పర్శప్రయత్నం (f) అల్పప్రాణం (g) శ్వాసం

(17) ఠ్ (b) unvoiced aspirated retroflex stop(f)మహా ప్రాణం, (a)(c)(d)(g) పై రీతిని

(18) డ్ (b) voiced unaspirated retroflex stop (f) అల్పప్రాణం (g) నాదం (c)(d)(e) చూ. 16.

(19) ఢ్ (b)voiced aspirated retroflex stop (f) మహాప్రాణం (g) నాదం. (a) (c) (d) (e) చూ. 16.

(20) ణ్ (a) మూర్ధన్యానునాసికం (b) nasal retroflex (e) అనునాసికం (f) అల్పప్రాణం (g) నాదం (c) (d) చూ. 16.

పార్శి భాషలోను ద్రావిడ భాషల్లోను, ముండా భాషల్లోను 'ట' 'డ'లు అతి ప్రచురం. సంస్కృతంలో ఉన్నవికాని అవి నిసర్గాలు కావు. ముండ ద్రావిడ భాషాప్రభావం చేత ఏర్పడ్డవంటారు.

(యుధి + స్థిర → యుధిష్ఠిర; ప్రతి + స్థ → ప్రతిష్ఠ)

25. 4 త వర్గం: 21 త్ - [a] దంత్య స్పర్శం [b] unvoiced, unaspirated apico-dental stop (c) పై దంతాల వెనుకభాగ [d] నాలుకకొన [e] స్పర్శప్రయత్నం (f) అల్ప (g) శ్వాస

(22) థ్ (b)unvoiced aspirated apico dental stop (f) మహా. (a), [c] (d) [e] (g) పైరీతిని.

(23) ద్ [b] voiced unaspirated apico dental stop [g] నాదం (a) (c) (d) (e) (f) చూ. 21.

(24) ధ్ (b)voiced aspirated apico dental stop. (f) మహా (g) నాదం (a) (c) (d) (e) చూ. 21

(25) న్ [a] దంత్యాను నాసికం. [b] dental nasal [c] అను నాసికం (f) అల్ప (g) నాదం (c) (d) చూ. 16.

(h) ఇది తెలుగులో ధ్వని, వర్ణం కూడ. తవర్గ ధ్వనుల ముందుదంత్యాను నాసికం. తక్కిన చోట్ల దంత మూలీయం

25. 41 దంతమూలీయములు:

ఐ. పి. ఏ. లో వీటికి, దంత్యాలకు ఒకేగుర్తు. ఇంగ్లీషు, జర్మానిక్ మున్నగు భాషలలో దంతమూలీయాలున్నాయి. దంత్యస్పర్శాలకు వీ ప్రత్యేక చిహ్నాలు క్రిగీతల ద్వారా చూపవచ్చు.

(26) ట్ (a) దంతమూలీయ స్పర్శం. [b]unvoiced unaspirated alveolar stop.] [c] దంతమూలం [d] జిహ్వాగ్రం. [e] స్పర్శ ప్రయత్నం [f] అల్ప (g) శ్వాసం. (h) ఇది ప్రాచీన ద్రావిడ భాషలో ఉన్నది. రెండచ్చులమధ్య ఇది శకటరేఫగా మారింది. అంటే స్పర్శ స్వభావాన్ని కోల్పోయి, కంపితలక్షణాన్ని పొందింది.

(27) న్ (a) దంతమూలీయాను నాసికం. (b) alveolar nasal. (c) దంతమూలం (d) జిహ్వాగ్రం (e) అనునాసికం (f) అల్ప (g) నాదం. (h) తెలుగులో పదాదిలోను ద్విత్వ స్థితిలోను, పదాంతంలోను ఉంది.

25. 5 ప వర్గధ్వనులు:

(28) ప్ (a) ఉభయోష్ఠ్య స్పర్శం (b) unvoiced, unaspirated bilabial stop (c) పై పెదవి (d) క్రిందిపెదవి. (e) స్పర్శం (f) అల్ప (g) శ్వాసం.

(29) ఫ్ (b) unvoiced aspirated bilabial stop (b)మహాప్రాణం (వాయుసంవర్గాతిశయం) a c d e g పై రీతిని.

(30) బ్ (b) voiced unaspirated bilabial stop (g) నాదం c d e f చూ. 28

(31) భ్ [b] voiced aspirated bilabial stop (f) మహా(g)నాదం a b e చూ. 28 g

(32) మ్ [a] ఉభయోష్ఠ్యాను నాసికం (b)bilabial nasal[c] అనునాసికం [f] అల్ప [g] నాదం [e] [d]చూ. 28.

25. 6 అంతస్థములు:

(33) య్ (a) తాలవ్యాంతస్థము [b] palatal, frictionless continuant [c] కఠిన తాలువు [d] జిహ్వామధ్యం [e] అంతస్థప్రయత్నం (ఈషత్ స్పృష్టం)

(f) అల్ప [g] నాదం (h) సంస్కృతంలో ఇది తాల
శిథిల ష్మప్రయత్నం కలది. అందుచేతనే ప్రాకృతంలో
ధ్వని 'జ' గామారింది. యముడు-జముడు. తెలుగు
తేలికగా ఉచ్చరింపబడుతుంది.

(34) ర్ [a] దంతమూలీయం తాడితం [b] alveolar flap (c) దం
మూలం (d) నాలుకకొన (e) తాడిత ప్రయత్నం (f) అ
[g] నాదం

(35) ఱ్ (a) మూర్ధన్య తాడితం (b) retrorflex flap (c) మూర్ధ
(d) పరివేష్టిత జిహ్వాగ్రం (e) తాడితప్రయత్నం (f) అ
[g] నాదం h] అమెరికన్ ఇంగ్లీషులో కూడ ఇది మాండలి
భేదంగా ఉన్నది.

(36) ఱ్ [a] దంతమూలీయ కంపితం [b] alveolar trill (c) దం
మూలం (d) జిహ్వాగ్రం (e) కంపితప్రయత్నం. (f) అల్ప
(g)నాదం (h) కొన్ని ద్రావిడభాషలలో ఇప్పటికి ఇది ప్రత్యే
వర్ణం తెలుగులో చారిత్రకంగా ప్రత్యేకవర్ణం. తెలుగుశాసనా
నాలుగాకులు గల్గినబండి చక్రంవలె చెక్కబడుటంచేత దీని
బండి ర అనేవ్యవహారం.

(37) ల్ [a] దంతమూలీయ పార్శ్వికం [b] alveolar lateral fri
tionless continuant[c] దంతమూలం [d] జిహ్వాగ్రం [
పార్శ్విక ప్రయత్నం [f] అల్ప [g] నాదం [h] సంస్కృ
తంలో దంత్య పార్శ్వికం

(38) వ్ [a] దంతోష్ఠ్యం [b] labio-dental fricative పై దంతము
క్రిందిభాగం [d] క్రింది పెదవి (e) అంతస్థప్రయత్నంతోగూడి
ఊష్మప్రయత్నం (f) అల్ప [g] నాదం [h] ఆంగ్లం
Very, Vau was ఇత్యాదులలో ప్రచురంగా శ్రుతం.

(39) వ్2 (a) దంతోష్ఠ్యాంతస్థం
(b) labio-dental frictionless continuant
(c) పై దంతముల క్రిందిభాగం .
(d) క్రింది పెదవి (e) అంతస్థ ప్రయత్నం (f) అల్పప్రాణం
(g) నాదం (h) తెలుగులో సర్కారు మాండలికంలో మాఁవఁ, సివ్ఁ హవ్ఁ మొదలైన పదాలలో శ్రుతం.సంస్కృతంలో ప్రచురం

(40) వ్3 (a) ఉభయోష్ఠ్యాంతస్థం. (b) bilabial, frictionless continuant or bilabial semi-vowel. (c) పై పెదవి (d) క్రింది పెదవి (e) అంతస్థప్రయత్నం (f) అల్ప (g) నాదం (h)ఇది ద్రావిడభాషల్లో ప్రచురం. స్థూలదృష్టికి వ కారం ఒకటిగా తోచినా ఒకటి ఊష్మం (ఆంగ్లం),రెండోది ఓష్ఠ్యం (సంస్కృతం), మూడోది ఉభయోష్ఠ్యం(ద్రావిడం)

25.7 ఊష్మములు:

(41) శ్ (a) తాలవ్యోష్మం (b) palatal fricative or spirant (c) కఠిన తాలువు (d) జిహ్వ మధ్యం (e) ఊష్మ ప్రయత్నం (f) అల్ప (g) శ్వాసం (h) సంస్కృతజ్ఞుల దృష్టిలో నిది మహాప్రాణం.

(42) ష్ (a) మూర్ధన్య ద్రోణికోష్మం (b) retroflex groove fricative (c) మూర్ధం (d) ప్రతివేష్టితజిహ్వాగ్రం (e) ఊష్మ ప్రయత్నం (f) అల్ప (g) శ్వాసం (h) సంస్కృతజ్ఞులు మహా ప్రాణమంటారు.

(43) స్ (a) దంతమూలీయ విస్తారితోష్మం (b) alveolar slit fricative (c) పై దంతముల వెనుకభాగం (d) జిహ్వాగ్రం (e) ఊష్మ ప్రయత్నం (f) మహా ప్రాణం (g) శ్వాసం (h) సంస్కృతజ్ఞులు పై రీతిగా పేర్కొన్నారు. తెనుగులో దంతమూలం, అల్ప ప్రాణం.

(44) హ్1 (a) కంఠమూలీయోష్మం (b) glottal fricative (c) హను మూలం (d) జిహ్వామూలం (e) ఊష్మ ప్రయత్నం (f) మహా (g) శ్వాసం(h) వాస్తవంగా దీనిని హనుమూలీయోష్మం అనటం

ఉచితం. I.P.A లో దీన్ని glottal fricative గా చూపించా దీనికి ప్రతిగా నాదధ్వని 'behave, manhood' వంటి పదాల వినిపిస్తుంది.

25.8

(45) హ్2 (a) పరహనుమూలీయోష్మం [b) uvelar fricative (c లంబిక (d) జిహ్వామూలం (e) ఊష్మ ప్రయత్నం (f) మః (g) శ్వాసం (h) అరబ్బీ భాషలోని విశిష్ట ధ్వని.

(46) గ్లోటల్ స్టాప్ : (a) కంఠమూలీయ స్పర్శం [b] glottal stop (c (d) నాదతంత్రులు (e) స్పర్శప్రయత్నం (f) అ (g)శ్వాసం (h) ఇది కొన్ని అనాగరిక ద్రావిడ భాషలలో ఉన్న తెలుగులో అ-ఆలు ఇ-ఈలు అని హ్రస్వదీర్ఘాల్ని పలికేటప్ప మధ్యలో వినిపిస్తుంది.

(47) ళ్ (a) మూర్ధన్య పార్శ్వకాంతస్థం. [b] retrofle lateral frictionless continuant (c) మూర్ధం (d) పరివేష్టి జిహ్వాగ్రం(e) పార్శ్విక ప్రయత్నం, ఈషత్ స్పృష్టం (f) అల్ప (g) నాదం (h) ద్రావిడ భాషలలో ఇది ప్రచురం. సంస్కృతంలో ఇది ప్రత్యేక వర్ణంకాదు. కల = కళ.

(48) ఴ (a) మూర్ధన్య పార్శ్వకాంతస్థోష్మం (b) retroflex lateral continuant fricative మూర్ధం (d) ద్రోణికాకృత పరివేష్టితజిహ్వాగ్రం. (e) ఊష్మ ప్రయత్నం (f) అల్ప (g) నాదం (h) ద్రావిడ భాషలలోని ధ్వని.

(49) (a) ఉభయోష్ఠ్యోష్మం (b) unvoiced aspirated bilabial fricative (c) పై పెదవి (d) క్రింది పెదవి (e) ఊష్మప్రయత్నం (f) మహా(g) శ్వాసం (h) ఇది జపనీస్ భాషలోని ధ్వని. స్పర్శ ప్రయత్నం ఉంటె "ఫ" అవుతుంది.

(50) [a] ఉభయోష్ఠ్యోష్మం [b] voiced unaspirated bilabia fricative [c] పై పెదవి [d] క్రింది పెదవి [e] ఊష్మ

ప్రయత్నం(f) అల్ప ప్రాణం [g] నాదం [h] జర్మన్, ఫ్రెంచ్, స్పానిష్, పోర్చుగీస్ భాషలలోని ధ్వని. పెదవులు కలవకుండ 'బ' కారాన్నుచ్చరించటం.

51) ఫ్ (a) దంతోష్ఠ్యోష్మం (b) unvoiced aspiraed labiodental fricative (c) పై దంతముల క్రింది భాగం (d) క్రిందిపెదవి (e)ఊష్మప్రయత్నం (f) మహా (g) శ్వాసం (h) సంస్కృతం లోని 'ఫ' స్పర్శం. ఇది ఆంగ్లంలో 'కాఫీ' 'ఆఫీసు' వంటి పదాల్లో ప్రచురం.

52) థ్ (a) అంతర్దంత్యోష్మం (b) unvoiced aspirated interdental fricative [apico inter-dental fricative] (c) రెండు పండ్ల వరసల మధ్యభాగం, పై దంతములవెనుక భాగం (d) నాలుకకొన (apex) (e) ఊష్మ, స్పర్శ ప్రయత్నాలు (f) మహా (g) శ్వాసం (h) ఇంగ్లీషు, జర్మానిక్ భాషలలో ప్రచురం. భారతీయ భాషల్లో 'త' వర్గీయధ్వనులకిది సమీపధ్వని. thank, thought మొదలైన పదాలోని ఆదిధ్వని.

53) ద్ (a) అంతర్దంత్యోష్మం (b) voiced unaspirated interdental fricative (c) రెండు పండ్ల వరుసల మధ్య (d) నాలుకకొన (e) ఊష్మప్రయత్నం (f) అల్ప (g) నాదం (h) than, this మొదలైన పదాలల్లోని ఆదిధ్వని.

54) మ్ (a) దంతోష్ఠ్యాను నాసికం (b)labio-dental nasal (c) పై దంతముల క్రింది భాగం (d) క్రింది పెదవి(e) ఊష్మ ప్రయత్నంతో కూడిన అనునాసిక ప్రయత్నం (f) అల్ప (g) నాదం (h) జర్మన్ భాషలోను, కొన్ని ఆఫ్రికన్ భాషలలోను ప్రచురం.

25. 9 అరబ్బీ భాషలోని ప్రచుర ధ్వనులు:

(55) క్ 2(a) పరహనుమూలీయస్పర్శం [b] unvoiced, unaspirated uvelar stop (c)లంబిక (d) జిహ్వామూలం (e) స్పర్శ (f) అల్ప (g) శ్వాసం

(56) గ్ 2 (a)పరహనుమూలీయస్పర్శం voiced unaspirated uvel
stop (c) లంబిక (d) జిహ్వామూలం (e) స్పర్శప్రయత్నం
(f) అల్ప (g) నాదం

(57) న్ (a) పరహనుమూలీయానునాసికం (b) uvular nasal
(c) లంబిక (d) జిహ్వామూలం (e) అనునాసిక ప్రయత్నం
(f) అల్ప (g నాదం

(58) క్3 (a) జిహ్వామూల హనుమూలీయోష్మం (b) unvoiced unasp
rated dorso-velar fricative (c) హనుమూలం (d) జిహ్వా
మూలం (e) ఊష్మప్రయత్నం(f) అల్ప (g) శ్వాసం

(59) గ్3 (a) జిహ్వామూల హనుమూలీయోష్మం (b) voiced unaspi
rated dorso-velar fricative (c) హనుమూలం (d) జిహ్వా
మూలం (e) ఊష్మప్రయత్నం (f) అల్ప(g) నాదం
[ఈ 59 ధ్వనులకు I. P. A. చిహ్నాలు అనుబంధంలో చూపింప
బడ్డాయి]

# 4. వర్ణ విజ్ఞానం (Phonemics)

26. 1 మనం మాట్లాడే భాష ధ్వనులమయం. ఈ ధ్వనులలో కొన్ని ముఖ్యమైనవి, కొన్ని ముఖ్యం గానివి. ముఖ్యమైన ధ్వనికే 'వర్ణమ'ని వ్యవహారం. కాబట్టి వర్ణాలన్నీ ధ్వనులేకాని, ధ్వనులన్నీ వర్ణాలుకావని నిర్ణయం. అముఖ్యమైన ధ్వనుల్ని, ముఖ్యమైన ధ్వనులలోనే పరిగణించ వచ్చు. అముఖ్యమైన ధ్వనుల్ని ప్రత్యేక లిపిచిహ్నాలద్వారా నిరూపించ వలసిన అవసరం లేదు. అవి ముఖ్యమైన ధ్వని చిహ్నంతోనే వ్యవహృతం. ఉచ్చారణలో భేదం ఉండవచ్చు.

26. 2 భావప్రకటనం వాక్యంద్వారానే సాగుతుంది. వాక్యం నుండి పదాల్ని అపోద్ధారం చేస్తాం. పదాలనుండి వర్ణాల్ని పృథక్కరిస్తాం. ఉదా:

బొమ్మ - (బ్ + ఒ + మ్ + మ్ + అ) అయిదు వర్ణాల సమ్మేళనంద్వారా ఏర్పడ్డది. తొలిరెండు వర్ణాలు ఒక అక్షరంగాను, మలిమూడు వర్ణాలు ఒక అక్షరంగాను ఏర్పడ్డాయి. తరువాత రెండక్షరాలు మేలగించగా పదం ఏర్పడింది. అక్షరమంటే [sylable] రెండుగాని అంతకెక్కుడు గాని వర్ణాల సమ్మేళనం. ఇందులో ఒక్కవర్ణమైనా స్వరం కావాలి. కేవలస్వరం కూడ అక్షరం కావచ్చు.

స్వతంత్రోచ్చారణం కల్గిన స్వరాన్ని మాత్రం వర్ణమనిగాని అక్షరమని గాని అనవచ్చు. కేవలహల్లులు వర్ణాలే. అక్షరాలుకావు. అంటే వర్ణాలన్నీ అక్షరాలు కావు.అక్షరాలన్నీ వర్ణాలే.

26. 21 : సమానహల్లుల కలయికను ద్విత్వమని, (double) (క్క ,గ్గ) భిన్నహల్లుల కలయికను 'సంయుక్తమ'ని (conjunt ) (త్స్వ)అంటారు. తెనుగు మొదలైన భాషలలో ద్విత్వ హల్లులే అధికం. సంస్కృతాది భాషలలో సంయుక్త హల్లులే ప్రచురం. భాషలలోగల వర్ణసమ్మేళన విధానాన్నివట్టికగా తయారు చేసుకోవచ్చు.

పదం అర్థవంతమైందేకాని, పదాల్ని ఏర్పరచిన వర్ణాలకు మాత్రం అర్థంలో భాగం లేదు. వర్ణం అర్థవంతం కాదు.

26. 3 సంస్కృతవ్యాకరణాలలో పృథగ్వర్ణ నిర్ణయాన్ని గూర్చి నిరూపణలు లేవు. ఎందులోదో కాని, ఈ క్రింది కారికనొకదాన్ని శ్రీవజ్ఝలవారు ఉట్టంకించారు: (వైయాకరణ పారిజాతము-పుట 142)

"అనుప్రదానాత్ సంసర్గాత్ స్థానాత్ కరణ విభ్రమం
జాయతే వర్ణవైశేష్యం పరిమాణాచ్చ పంచమాత్"

అనుప్రదానాత్ = గళ వివర సంకోచ వికాస రూప బాహ్యప్రయత్న భేదం వల్ల, సంసర్గాత్-ప్రాణవాయు సంసర్గంలోని మహత్వాల్పత్వాలవల్ల, స్థానాత్ - జిహ్వ ప్రదేశం స్పృశించే జిహ్వామూల తాలుమూర్థాదిస్థాన భేదాల వల్ల, కరణ విభ్రమాత్ - ఆయాస్థానాల్ని స్పృశించే జిహ్వాప్రదేశ స్పర్శనాది వ్యాపార విశేషాలవల్ల లేదా ఓష్ఠోపసంహారాదులైన వ్యాపార విశేషాలవల్ల పంచమాత్—అయిదవదగు, పరిమాణాత్—హ్రస్వదీర్ఘాది మాత్రాపరిమాణ విశేషంవల్ల, వర్ణవైశేష్యమ్—వర్ణవిశేషత, జాయతే—కలుగుతుంది.

నిశ్వాస వాయువు శ్వాసకోశం నుండి వాయుమార్గం ద్వారా ౬ ప్రాయ వేదక శబ్ద ప్రయోగేచ్ఛా సహకృతమై వచ్చేటప్పుడు కలిగే బాప భ్యంతర ప్రయత్నాదుల చేత ధ్వని వైవిధ్యం సంభవిస్తుంది. క, ఖ: రెం కంఠ్యాలే, శ్వాసాలే. కాని ఒకటి అల్పప్రాణం, ఇంకోటి మహాప్రాణం. భేదంవల్ల, ఈరెండు వేరువేరుధ్వనులు. ఇలాగే తక్కినవి. ఏదోఒకఉచ్చార భేదం వల్ల ప్రత్యేక ధ్వని ఏర్పడుతున్నది. ఇందులో వర్ణనిర్ణయం లేద ఏది ప్రధాన ధ్వనో, ఏది అప్రధానమో కూడ నిర్ణయించే సూచనలు లేక

26. 31 సంస్కృత వైయాకరణులెవరు వర్ణనిర్ణయం చేయటాని యత్నించలేదు. ప్రాకృతవైయాకరణులు-వరరుచిమొదలైనవారుసంస్కృ ప్రాకృత వర్ణనిర్ణయం చేస్తే, [1] చింతామణి కర్త వారిననుసరించి సంస్కృ ప్రాకృతాంధ్ర భాషలకు వర్ణనిర్ణయం చేసాడు[2]. తన్మూలంగా తెలుగుల ప్రవేశించిన సంస్కృత భాషావర్ణాల్ని గుర్తింప చేస్తాడు తత్కర్త. అంి కాని అసలు పృథగ్వర్ణాన్ని ఎలా నిర్ణయించాలో మనవ్యాకరణాలు సూచించవు

[2]ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః ప్రకృతేస్తు తేదశో నాస్యాః షట్త్రింి దతతేఽన్యేచాను ప్రవిశన్తి శబ్దయోగవశాత్ (1–5)

26. 4 ధ్వని - వర్ణం:(Phone-Phoneme)మామిడి–మావిఁడి: చీమ-చీఁవఁ; మామ-మాఁవఁ. ఈ ఉదాహరణాల్లో కేవలం ఉచ్చారణ భేదమేకాగి అర్థభేదంలేదు. కొన్నిప్రాంతాల్లో పదమధ్య మకారం పలుకుతుంటే, సర్కార ప్రాంతంలోని వారు [వ్ఁ] (చూ. 25. 5 లో 39) గా పలుకుతారు. ధ్వని భేదమే.

ఒకేప్రాంతంలో వారు కొన్ని కొన్ని సందర్భాల్లో ఈ క్రింది రీతిగ ఉచ్చరిస్తారు. కారం-ఖారం; కర్మ–ఖర్మ; దారం–ధారం; గంట-ఘంట; ఒక్క-ఒక్ఖ ఈ ఉదాహరణాలలోను ధ్వని భేదమేకాని వర్ణ భేదంలేదు. ఇట్టివి అప్రధాన ధ్వనులు.

పైవానికి భిన్నమైనవి ఈ క్రింది ఉదా హరణలు: కంప-గంప; చూలు–జూలు; టోకు-డోకు; తగ్గు–దగ్గు: పాట–బాట. ఇందులోని శ్వాసనాద

1 తెనుగు వ్యాకరణ వికాసము చూ. 1. 8, 1. 9

భేదం వల్ల అర్థభేదం కూడ కల్గుతున్నది. కాబట్టి యిది ప్రధానధ్వని దంగా పరిగణించాలి. అర్థభేదాన్ని కల్గించే ధ్వనులే ప్రధానమైనవి. అవి ప్రత్యేక వర్ణాలు. అర్థ భేదాన్ని కలిగించే ఈషదుచ్చారణ భేదం 'ఒకేచోట' గల పదాల జంటను కనిష్ఠభేదక పదయుగళము లేక కనిష్టపదయుగళం (minimal pair) అంటారు. ఇట్టి పదయుగళంలో భేదక లేక వ్యావర్తక లక్షణం (distinctive feature) గలధ్వనుల్ని ప్రత్యేక వర్ణాలుగా నిర్ణయించాలి, కాబట్టి క,గ, చ, జ, ట, డ, త, ద, ప, బ, ప్రత్యేక వర్ణాలు. వీటిని నిలువు గీతల మధ్య నిరూపిస్తారు.

కద్దరు-ఖద్దరు, కారం-ఖారం వంటివి కనిష్ఠపదయుగళాలు కావు. ఈ జంటలలో అర్థభేసం లేదు. ఇందులోని భేదకలక్షణం అవ్యావర్తకం. ఇది అప్రధానం. (Non-distinctive feature) అందుచే ఇందులోని క, ఖ, లు ప్రత్యేకవర్ణాలు కావు ఒకేవర్ణంలోనిధ్వనులు. అందుచే వీటిని [క][ఖ] అనే రీతిని గుర్తించాలి. అయితే ఈ సందర్భంలోనే ఇవిధ్వనులు, కరము-ఖరము అన్నపుడు అల్పప్రాణ, మహాప్రాణ భేదం వల్ల అర్థభేదం కలుగుతున్నది. అందుచేత /క/ /ఖ ప్రత్యేక వర్ణాలు. అందుచేత|_ ఉదాహరణాలలో కాక పోయినా ఇవి బలీయం కాబట్టి వర్ణాలుగానే పరిగణించాలి,

2౬.41 కనిష్ఠ పదయుగళాలు ఎన్ని ఏర్పరచగలిగితే అంత మంచిది. వర్ణనిర్ణయం నిర్దుష్టంగా జరుగుతుంది. ప్రధాన ధ్వని భేదాలు పదాదిలోను, పదమధ్యంలోను, పదాంతంలోను ఉండవచ్చు. అన్వేషించి పట్టాలి. కొన్ని కనిష్ఠ పదయుగళాలలాగ కనిపిస్తాయి. కాని కావు. ఉదా॥ మేకు - మేక. ఉ, అ ల భేదంవల్ల అర్థభేదం కలిగిందనుకుంటాం. లిపినిబట్టి నిర్ణయించ కూడదు. ఉచ్చారణప్రధానం. పదాంతాలలోనేకాక పదాదిలోకూడా ఉచ్చారణ భేదం కనిపెట్టవచ్చు. కొన్ని సందర్భాలలో ఎ,ఏలు అర్థవివృతోచ్చారణాన్ని పొందుతాయి. అందుచేత ఈ భేదం అప్రధానం. ఇట్టివాటిని అనుమానపద యుగళాలు లేక సందిగ్ధ పదయుగళాలు (Suspicious pairs) అంటారు. వీటిని గూడ ప్రత్యేక పట్టికగా తయారు చేసుకొంటె భాషాస్వభావం బాగా అవగతమౌతుంది. ఇట్టివి మరికొన్ని

అట - అట్ట ; పీట - పిట్ట;
ఊబి - ఉబ్బి ; గాదె - గద్దె; తాగు - తగ్గు;

మాను - మన్ను; కాలు - కల్లు; చేపు - చేప;
పేడు - పేడ ; తేట - తెట్ట; పీట - పిట్ట;
పెట్టు - పెట్ట ; మెట్టు- మెట్ట; కోత - కొత్త మొదలైనవి.

## 26.5 వర్ణం - సవర్ణం [Phoneme-allophone]

సవర్ణమనే సంజ్ఞ మనకు బాలవ్యాకరణం ద్వారా బాగా పరిచయం దీన్నే ఉపవర్ణమనీ అనవచ్చు. ఒక వర్ణంలో అనేక సవర్ణాలు లేక ఉపవర్ణా ఉండవచ్చు. పరిసరాలు కారణంగా ఒక వర్ణం అనేక సవర్ణాలుగా మా తుంది. సవర్ణోచ్చారణం వర్ణోచ్చారణం కన్న కొంత భిన్నంగా ఉన్నా, అ వర్ణాంతర్గతమైనదే కాని దానికి స్వతంత్రవర్ణప్రతిపత్తి లేదు. సవర్ణాలని అప్రధానమైన ధ్వని భేదాలే. ఇవి అర్థభేదక సామర్థ్యం కలవి కావు.

26.51 ఎ_ఎ : మెట్టు-మెట్ట, పెట్టు-పెట్ట ఇత్యాదుల్లో అర్థసంవృ మైన ఎ కారం అర్థవివృతంగా ఉచ్చరింప బడుతున్నది. అందుకు కారణ ప్రక్కనున్న అకారం. పూర్తిగా వివృతమైన ఈ అకారాన్ని ఉచ్చరించ లంటే ఈ మార్పు రావాలి. పూర్తిగా సంవృతమైన ఉకారంముందు అ సంవృతమైన ఎకారం మార్పుచెందదు. ఇది పాక్షిక స్వర సమీకరణం (Partial vowel harmony)

పదాంతంలోకూడ అర్థసంవృత ఎకారాన్ని అర్థవివృతంగా ఉచ్చ స్తారు. ఉదా॥ గిన్నె, మెట్టె, లే (వనిలె)

మొత్తంమీద అర్థసంవృతోచ్చారణం ఉన్నచోట అర్థవివృతోచ్చార ముండదు. ఇది ఉన్నచోట అది ఉండదు. అంటె వీటి ప్రవర్తనం పరస్పర భావంలోనే. ఇట్టివాటినే పరస్పర పరిపూరక వ్యాప్తిగల సవర్ణాలు లేక ఉ వర్ణాలుఅంటారు. (allophones in complementary distribution-C.D. /ఎ/ అనే వర్ణానికి [ఎ,ఎ ] అనేవి సవర్ణాలు. [ఎ] సంవృతస్వరాని పూర్వం; [ఎ ] వివృతస్వరానికి పూర్వం కొన్నిపదాంతాలలోను.



26.52 ఏ–ఏ̱ : మేకు–మేక; పేడు-పేడ; చేటు-చేట ఇవి కూడ పై రీతి గానే సి.డి.లో సవర్ణాలు.




26.53 ఆయా వర్గాక్షరాలకు ముందు [ఙ,ఞ,న,ణ,మ] అనే పంచమాక్షరాలు వస్తాయి. వీటిస్థానంలో మనం బిందువు నుపయోగిస్తాం. (అందుకే చిన్నయసూరి పరుష,సరళాలకు ముందే బిందువు తెలుగులో వుంటుందని సూత్రించాడు. చూ. బా.వ్యా. సంజ్ఞా 16.) కాబట్టి బిందువునే వర్ణంగా పరిగణించాలి. సవర్ణస్థాయిలోనే ఉచ్చారణ కల్గి, వర్ణస్థాయిలో స్వతంత్రోచ్చారణం లేని ఇట్టి చిహ్నాన్ని 'అధివర్ణం' (archi - phoneme)[1] అంటారు. ఈ సవర్ణాలలోని మకారాన్నికాని నకారాన్నిగాని వర్ణంగా పరిగణించి, తక్కిన వాటిని దీనికి సవర్ణాలుగా పేర్కొనవచ్చు. పాణిని 'మోనుస్వారః' (8-3-23) అన్నాడు కాబట్టి మకారాన్ని స్వీకరించటం మంచిది.




ఇవన్ని భిన్న పరిసరాలలోనే వస్తాయి కాబట్టి ఇవి "పరస్పరాభావ పరివర్తిత ధ్వనులే". (C.D.)

26.54 దంతమూలీయ తాలవ్యచజలు: తాలవ్యాచ్చులైన ఇ,ఈ,ఎ,ఎ̱ ఏ,ఏ̱ (ఐ) లతో గూడినపుడు చజలు తాలవ్యాలుగాను; తాలవ్యేతరాలైన అ,ఆ, ఉ,ఊ, ఒ,ఓ,ఔలతో గూడినపుడు దన్తమూలీయాలుగాను ఉచ్చరింపబడతాయి. ఇవికూడ పరస్పరాభావంలోనే (C.D.) ప్రవర్తిలుతాయి.

---

(1) The neutralised or environmentally determined variant is given a special name Archi-Phoneme. దీన్ని "వర్ణాయిత"మని అంటారు.

26.57




దంతమూలీయం, శిథిల స్పర్శం లేక ఈషత్కంపితం. నాదం, పదాదిలో మధ్యంలో, సంయుక్తదశలో-రాజు, సరాసరి, క్రమం, తర్కం

దంతమూలీయం అధిక కంపితం నాదం: ద్విరుక్తస్థితిలో కర్ర, బుర్ర, గొర్రె

26.58 ఉభయోష్ఠ్యాంతస్థ వకారం (25.6:40) దంత్యోష్ఠ్యాంతస్థ వకారం (25.6:39) పరస్పర పూరక సవర్ణాలు.




26.59 సకారం తవర్గానికి పూర్వం దంత్యంగాను - కస్తూరి, దస్తూరి, కాస్తే,పుస్తె; తక్కిన చోట్ల దన్తమూలీయంగాను ఉచ్చరింప బడతాయి. కాబట్టి యీ సకారాలు సవర్ణాలు.

26.510 హకారం రెండువిధాలుగా పరిసరాన్నిబట్టి ఉచ్చరింపబడుతుంది. ప,ఫ లకు, క,ఖ లకు ముందు శ్వాసంగాను: అంతహ్‌పురం, మనహ్ ఫలకం, మనహ్ కమలం, దుహ్ఖం.

పదాదిలోను, పదాంతంలోను, అచ్చులమధ్య నాదంగాను: హంస, హాయి, వహం, మొహం, సహాయం. కాబట్టి వీటిని పరస్పరాభావ ప్రవర్తన గల సవర్ణాలుగా ఎంచవచ్చు.

26.6 మరికొన్ని సవర్ణాలు:- పై రీతిగా భిన్న స్థానాల్లో ప్రవర్తిల్లే సవర్ణాలుకాక, ఒకేస్థానంలో ప్రవర్తిల్లే సవర్ణాలు భాషలోచాలఉంటాయి.

వీటినే స్వతంత్ర పరివర్తిత సవర్ణాలు (Free Variants) పర్యాయ ప్రవృ పవర్ణాలు అంటారు.

(1) కర్చు-ఖర్చు; కద్దరు-ఖద్దరు: కద్దరు-ఖద్దరు: ఇత్యాదుల్లో [క] [ఖ] లు సవర్ణాలు.

(2) కడవ-గడవ; కడచు-గడచు: [క] [గ] కణుపు-గణుపు

(3) గాలి-ఘాలి; గంట-ఘంట [క] [ఘ]

(4) తోగు-దోగు [త] [ద]

(5) దాగు-డాగు; దక్కు-డక్కు, దగ్గఱ-డగ్గఱ (చూ. బా. వ్యా. ప్రకీర్ణ. 1

[ద] [డ]

(6) శెలవు-సెలవు; శేపు-సేపు [శ] [స]

ఈ రీతిగా పదాదిలో హల్లుల్లో ఇటువంటి సవర్ణోచ్చారణం శ్రుతం ఇవి ఇతరత్ర, కనిష్ఠ పదయుగళాల్ని బట్టి వర్ణాలుగా పరిగణింప బడటంచే పవర్ణాలుగా వీటి పరిగణనం ప్రధానం కాదు. ఇవన్నీ అప్రధాన ధ్వనుల ముందే పేర్కొన్నాం. ఇంకా క్రిందివాటిని పరిశీలించేది పదమధ్యంలో:

(7)(a) -గ- / -వ- } : పగలు-పవలు; చిగురు-చివురు
-గ- / -వ- } తగులు-తవులు; ఉంగరం-ఉంవరం
ఈగి-ఈవి; తీగ-తీవ; అగు-అవు
(బా. వ్యా. అచ్చిక 27)

(b) -గ / -హ— పగం-పహం; మొగం-మొహం.

(8) -డ- / -ణ- : అడగు-అణగు; పోడి-పోణి
మిడుగు-మిణుగు; నాడెం-నాణెం
(బా. వ్యా. ప్రకీర్ణ - 13)

(9) -త- / -ద— బ్రతుకు-బ్రదుకు; అతుకు-అదుకు
గతుకు-గదుకు; చితుకు-చిదుకు

(10) -ద- / -జ- } జూదం-జూజం; జాది-జాజి
-ద / -జ } అవుదు-అవుజు; ఉద్ది-ఉజ్జి
(బా. వ్యా. ప్రకీర్ణ- 21)

(11) -ర- / -న- చిరుగు-చినుగు; అరటి-అనటి

(12) -గ- / -య: ఓగిరం-ఓయిరం; కోగిల-కోయిల

(13) -ట / -త: గుమ్మెట-గుమ్మెత; గుంట-గుంత; జుట్టు-జుత్తు

26.61 అచ్చులలో విశేషంగా ఇటువంటి పరివర్తనం కనిపించదు, కాని అసలు లేకపోలేదు.

(1) ఇ- / ఉ- : ఇసుళ్లు-ఉసుళ్లు; ఇసుక-ఉసుక
(2) అ- / ఎ- : అసలారు-ఎసలారు; అక్కటికం-ఎక్కటికం
(3) అ- / ఉ- : అదరిపాటు-ఉదరిపాటు
(4) అ- / ఒ- : అప్పగింత-ఒప్పగింత
(5) -అ- / -ఉ- : అవలింత-అవులింత; కసవు-కసువు
అవఘళించు-అవుఘళించు; ఎరవు-ఎరువు

(6) -అ- / -ఇ- : అలయు-అలియు; అదరిపడు-అదిరిపడు

26.62 పదాది హల్లుల లోపం:

చిగురు-ఇగురు; చీరిక-ఈరిక; చులకన-ఉలకన; చేసి-ఏసి; చెనయు-ఎనయు; నన-అన; నట్టు-అట్టు; నలగు-అలగు; నావి-ఆవి; నిగిడించు-ఇగిడించు; నీవు-ఈవు; నీలుగు-ఈలుగు; నీరెండ-ఈరెండ; నులి-ఉలి; నులుము-ఉలుము, నూలుకొను-ఊలుకొను; నెగయు-ఎగయు; నెమకు-ఎమకు; నెమ్మిక-ఎమ్మిక; నెమ్మి-ఎమ్మి; పనుచు-అనుచు; పసరు-అసరు; పులుము-ఉలుము; పొందు-ఒందు; పొచ్చెము-ఒచ్చెము; పొనరు-ఒనరు; పొదలు-ఒదలు; పొరయు-ఒరయు; పొలయు-ఒలయు; హడపము-అడపము; హరిదళము-అరిదళము; హలది-అలది.

ఇవన్నీ రూపాంతరాలు (variants): ఉచ్చారణంలో కించిద్భేదమే.

## 26.7. సంశ్లిష్ట వర్ణాలు లేక అధ్యాంశిక వర్ణాలు: (Supra - Segmental Phonemes)

కనిష్ఠ పదయుగళాలు ఆధారంగా వర్ణ నిర్ణయం చేస్తాం. ఇవి చాల వరకు సంప్రదాయ వ్యాకరణాలతో వర్ణసమామ్నాయంగా నిరూపితం.

వీటికి లేఖన చిహ్నాలు కూడ ఉంటాయి. ఇవన్ని విభక్తమైన వర్ణాలు. ఇవి అపంశ్లిష్టంగా ఉంటాయి కాబట్టి వీటిని విభజించటంలో క్లేశంలేదు. వీటిని 'అపంశ్లిష్ట వర్ణాలు' (Segmental phonemes) అంటారు.

వీటికంటె భిన్నస్వభావం గల వర్ణాలు కొన్ని ఉన్నాయి. ఒక పదంలో ఊనిక (Stress) ఆదిలో ఉంచి చదివితే ఒక అర్థం, ఇంకోచోట ఉంచి చదివితే వేరొకఅర్థం వస్తుంది. ఉదాత్త స్వరం ఒకర్థాన్నిస్తుంటె, అనుదాత్త స్వరం వేరొక అర్థాన్నిస్తుంది. వాక్యాంతంలో కాకువు వల్ల భిన్నార్థంలభిస్తుంది. మాటల్ని మాటల్ని కాని, ఒక మాటలోని కొన్ని అక్షరాల్ని వేరొక మాటతో కలిపిగాని చదివితే ఒక అర్థం, ఆపి చదివితే ఇంకోటి శ్రోతకు స్ఫురిస్తాయి. ప్రతి భాష ఇటువంటి ఛందో లక్షణాల్ని (Prosodical features) కలిగి వుంటుంది. వర్ణంలాగానే ఈ లక్షణంలోని కనిష్ఠాంశం అర్థభేదక సామర్థ్యం కలది. ఇది విభజించటానికి కష్టమైంది కాబట్టి దీన్ని 'సంశ్లిష్ట వర్ణం' లేక 'ఛందోవర్ణం' లేక 'అవిభక్త వర్ణం' లేక "ఊర్ధ్వాంకిత వర్ణం"(Supra Segmental phonemes [1] or prosodems[2]) అంటారు.

వీటిని అర్థంచేసు కొంటేనే కాని భాషాసమగ్రావగాహనం కలగదు. మాతృభాషలోని ఈ లక్షణాల్ని విస్మరించటం చాల కష్టం. ఆంగ్లేయుడు తెలుగు మాట్లాడుతుంటె తనకలవాటైన ఊనిక అధికంగా గోచరిస్తుంది.ఇట్లే ఇతరులు. భాషాశాస్త్రం వీటి ప్రాముఖ్యాన్ని గుర్తించి, భాషా సజీవ లక్షణాల వన్నింటిని నిరూపిస్తుంది. వీటికి గూడ సంకేతాలేర్పాటు చేస్తుంది. ఇటువంటి లిపినే "వర్ణాత్మక లేఖనం" (Phonemic script) అంటారు.

---

[1] The minimum unit of a prosodic feature serving a phonemic purpose is called a "Supra Segmental phone"

[2] Prosodic feature accompanying linear or segmental phonemes in the flow of speech - Language in the modern world Simeon Potter : p. 211

బ్లూమ్ ఫీల్డు వీటిని "అప్రధాన వర్ణాల"న్నాడు [1] (Secondary phonemes). వీటిని గుర్తించటంలోని క్లేశాన్నిబట్టి, ప్రాధాన్య వివక్షనుబట్టి ఇలా అన్నా, భాషాసమగ్రావగాహనానికి ఇవి చాల ముఖ్యమైనవి. వీటిని తెలుసుకోవాలంటే ఆ భాషా వ్యవహర్తల మధ్య కొన్నాళ్ళయినా జీవించాలి.

26.71 వ్యవధాన భేదం (Juncture)

(1) ఇంట్లో ఒక్క పలుకు లేదు: ఇంట్లో ఒక్కపలుకులేదు. 'ఒక్క-పలుకు' అంటే ఒక్క మాట లేదని, నిశ్శబ్దంగా ఉందని అర్థం. 'ఒక్కపలుకు' భోజనానంతరము సేవించేది.

(2) రెండెడ్ల - బండ్లు : రెం డెడ్లబండ్లు;

(3) వాడు తెలిసీ తెలియనట్లు మాట్లాడాడు. తెలిసీతెలియనట్లు మాట్లాడాడు. ఈ విధంగా వాక్యాలి ఉచ్చరించేటప్పుడు సన్నిహితవర్ణాల్లో ఒకదాని నుండి ఇంకొక దానికి ఉచ్చారణనుపక్రమించటంలో (Transition) వచ్చే తేడాల్ని బట్టి అర్థంలో మార్పు లేర్పడతాయి. ఇట్టివి 'వ్యవధాన భేదం'గా (Juncture) [2]పరిగణింప బడతాయి. ఈ భేదం కూడా ఒక విధమైన వర్ణమే.

---

[1] "It is somewhat harder to identify the secondary Phonemes. These are not part of any simple meaningful speech - form taken by it self, but appear only when two or more are combined into a larger form, or else when speech-forms are used in certain ways especially as sentences. "Language: 5.11.

"The secondary phonmes are harder to observe than the primary phonemes, because they occur only in combinations or in particular uses of simple forms (e.g. John? in contrast with John). Idib.

[2] "Juncture refers to the pauses or near-pauses which connect various parts of a sentence".

"An intersegmental prosodeme: (prosodic feature accompanying segmental phonems in the flow of speech)- manner in which segmental phonemes and syllables are joined together in the flow of speech-Language in the Modern world: Simeon Potter: P. 208

'రాఘవ పాండవీయ ద్వ్యర్థి కావ్య'రచనలో పింగళి సూరన ఇటువంటి వ్యవధాన భేదాలెన్నో కావించి రెండర్థాలు రమ్యంగా సాధించి 'ఓహో' అనిపించు కొన్నాడు. ఇవే సభంగ, అభంగ శ్లేషలు.

(1) ఏనుంగని కర మరయక - రామాయణం.
ఏనుం గనికర మరయక - భారతం.

(2) ధర్మరాజీవ రమాధుర్యము - రామాయణము.
ధర్మరాజు ఈవర మాధుర్యము - భారతం.
పావురాయి, పావు-రాయి అంటే అర్థభేదం విదితం.

సంస్కృతంలో "కృష్ణః సర్పః" అంటె నల్లనిపాము. "కృష్ణసర్పః" అంటె త్రాచుపాము. ఆంగ్లములో[1] "వైట్ హౌస్" అంటె తెల్లగా వెల్ల వేసిన ఇల్లు. "వైట్‌హౌస్" అంటె అమెరికా అధ్యక్షుడుండే ఇల్లు. "బ్లాక్ బర్డ్"- ఒకానొక పక్షి విశేషం. "బ్లాక్‌బర్డ్" - నల్లపక్షి. "నైట్ రేటు"- టెలిఫోన్‌కు రాత్రివూట తగ్గింపు ధర. "నైట్రేట్" క్షారక పదార్థం. "లైట్‌హౌస్ కీపర్" అంటె దీప గృహరక్షకుడు. "లైట్ హౌస్ కీపర్" అంటె చులకనపడ్డ గృహ రక్షకుడు. ఇటువంటి వైచిత్రులు ప్రతి భాషలోను ఉంటాయి.

శ్రీనాథ మహాకవి ఇట్టి వ్యవధాన భేదాన్నుపయోగించి [2] కర్ణాటాంధ్ర రాజుల సత్కారాలందుకొన్న కథ లోకవిదితం. అసలు ప్రథమ శ్లోకంలోనే వ్యవధాన భేదముంది. హాల చక్రవర్తిని కవివత్సలుడ్ని చేసిందీ వ్యవధాన భేదమే. 'మోదకైస్తాడయ'- 'లడ్డతో కొట్టు' అని గ్రహించిన రాజుకు సందర్భశుద్ధిలేదు. 'మా + ఉదకైః తాడయ' అన్నవిభజన చేసుకొనే పరి జ్ఞానంలేదు పాపం.

---

1 ఆంగ్లంలోని వ్యవధాన భేదాలను గూర్చిన సమగ్ర స్వరూపం కావాలంటే "English Juncture" అనే ఆరోఅధ్యాయం A course in Modern Linguistics అనే గ్రంథంలో దాన్ని అధ్యయనం చేయాలి,

2 "సర్వజ్ఞ బిరుదనామము శర్వునకే. రావుసింగ జనపాలునకే ఉర్వింజెల్లును." "రావుసింగ జనపాలున కేయు ర్వింజెల్లునుః"

3. 'మా, నిషాద !, మానిషాద !=లక్ష్మీదేవికి నివాసమైనవాడా ! అని అర్థం.

26.72 ఊనిక (Stress) : ఊది పలకటం, నొక్కి పలకటం, అధికంగా కంఠ స్వరాన్ని ఉపయోగించటం. నాదతంత్రుల్ని మిక్కిలి సమీపంగా తెచ్చి, కండరాల్ని బిగించి ఉచ్చరించటం[1]. ఊనికను అధికంగా ఉపయోగించే భాషల్లో ఆంగ్లం అగ్రస్థానం వహిస్తుంది. 'ఫోర్‌టెల్' అనే పదంలో 'టెల్' శబ్దంమీద ఊనిక కాని 'ఫోర్‌సైట్' అన్నప్పుడు 'ఫోర్' మీద ఊనిక.[2] ఆంగ్లంలో కొన్ని పదాలు పదాది ఊనికవల్ల నామరూపాలవుతాయి. అపదాదిలో ఊనికవల్ల క్రియా రూపాలవుతాయి: కన్‌టెస్ట్ (నా)- కన్‌టెస్ట్ (క్రి); ప్రెసెన్ట్ (నా) ప్రెసెన్ట్ (క్రి) పర్‌మిట్ (నా) పర్‌మిట్ (క్రి), ఈ విధంగా అర్థభేదక సమర్థం కావటంచేత ఆంగ్లంలో 'ఊనిక' కూడ వర్ణమే. ఇట్టి భేదాలు తెలుగులో లేవు.

26.73 స్వరాశ్రయ భేదాలు: (Pitches): కంఠస్వరం ఎప్పుడు ఒకేరీతిగా ఉండదు. సందర్భాన్ని బట్టి అత్యుచ్చగాను, ఉచ్చగాను, సమాహారంగాను, నీచగాను ఉంటుంది. ఈ స్వరాన్ని బట్టి వక్త చెప్పదలచిన అభిప్రాయం పూర్తి అయింది లేంది తెలుస్తుంది. అందుచేత ఇవి వాక్యాంతంలోగాని, ఉపవాక్యాంతంలోగాని శ్రుతం. చైనీయుల భాషలోను, మరికొన్ని ప్రపంచ భాషల్లోను ఈ స్వరభేదాలు ప్రధాన వర్ణాలుకూడా. ఈ భేదాల్ని సంఖ్యలో సూచిస్తారు. 1 = నీచ, 2 = సమ, 3 = ఉచ్చ, 4 = అత్యుచ్చస్థాయి అనేవి స్థాయిభేదాలు. ఆశ్చర్యాన్ని, దిగ్భ్రాంతిని, భయాన్ని ప్రకటించేటప్పుడీ నాలుగోస్థాయి శ్రుతం.

వాడు ఊళ్లోలేడు.
వాడు ఊళ్లోలేడు.

---

[1] Stress—that is, intensity or loudness—consists in greater amplitude of sound -waves, and is produced by means of more energetic movements, such as pumping more breath, bringing the vocal chords closer together for voicing and using the muscles more vigorously for oral articulations. Bloomfield; 7.3

[2] బ్లూమ్ ఫీల్డ్; 5-11

ఈ వాక్యద్వయంలో అచ్చులు, హల్లులు సమానమే అయినా మొదటివాక్యం నిర్ధారణార్థాన్ని, రెండోది ప్రశ్నార్థాన్ని తెల్పుతుంది. ఈ భేదం వాక్యాంతంలోని స్వరం ఉచ్చస్థాయిలో ఉండటంవల్ల ఏర్పడింది. మొదటివాక్యం సమస్వరంతో ప్రారంభమై సమస్వరంతోనే అంతమౌతుంది. రెండోది సమస్థాయిలో ప్రారంభమై ఉచ్చలో అంతం. ఇంకా ఆశ్చర్యాన్ని ప్రకటించటానికి అత్యుచ్చస్థాయి కూడ అందుకోవచ్చు.

స్థాయి భేదాల్నిబట్టి ప్రాధాన్య వివక్ష విదితం.

2 I am going 3home,
2 I am 3going home.
3 I am going home.

పై వాక్యాల్లో మొదటిదానితో ఇంటికి, రెండవదానిలో వెళ్ళటానికి, మూడో దానిలో తనకు ప్రాధాన్యం.

'పోతే పో' (3-1) అన్నవాక్యంలో చివరిస్వరం మూడవ స్థాయి నుండి అధోముఖమౌతుంది. 'పోతేపో'(3-4)అంటే కంఠస్వరంఇంకాఉచ్చకు పోవచ్చు సందర్భాన్నిబట్టి. 'అంతే పో! తమ్ము కపిధ్వజ ప్రభలు అంధీ భూతులన్‌చేయవే!' అన్న తిక్కనగారి ధర్మరాజు సంజయుడ్ని ఈసడించి నప్పుడు ధర్మరాజు కంఠస్వరం 3-1కి కాక 3-4కు పెరిగి వుండవచ్చు.

వైదిక సంస్కృతంలోస్వరం దీనికంటె భిన్నం.అందులోని ఉదాత్త (20. 39) అనుదాత్త (20.310), స్వరిత (20.311) భేదాలు అర్థ భేదాన్ని కల్గిస్తాయి కాబట్టి అవి వర్ణాలే.

26.74 కాకువు: శోక భయాదులచే కలిగే ధ్వని వికారం జిహ్వ. (సూ.ని.)కక ధాతువుకు లౌల్యార్థం. స్వరగతమైన సాకాంక్షప్రతిపత్తే లౌల్యం. ఇది స్వరవైచిత్రి సూచకం. ఈ స్వర వైచిత్రి ఈషద్రూపంలో వాచ్యమౌతుంది. అందుకే కాకువైంది. ఈషదర్థంలో కు శబ్దానికి కాదేశం రాగా కాకు వైంది. కాకు వంటి జిహ్వ యని అర్థం. జిహ్వావ్యాపార సంపాద్యమైనందున కాకు వ్యవహారం.

ఇది శిరోనిష్పన్న తారనాద మని, కంఠస్థాన నిష్పన్న మధ్యమ రమని, ఉరస్సముత్పన్న మంద్ర నాదమని త్రివిధాలు. దీన్ని నాట్య ం[1] విపులంగా నిరూపించింది.

దేవుని యెదట నిల్చి నిజం చెప్తాను.

దేవుని యెదట నిల్చి నిజంచెప్తాను↑ –

ంద్రస్థాయిలో కంఠస్వరాన్ని యత్కించిద్భగ్నం చేస్తేనే అర్థం మారు ంది. 'తక్రాం' అని సౌరాష్ట్రి గోపిక వేసే కేకలో శిరోనిష్పన్న తారనాదం నునాసిక రంజక మౌతుంది. ఇటువంటి కాకు భేదాల్ని గ్రహించటం క్లేశం. టకంలోని పాత్రలు దీన్నెట్లా ఉపయోగించాలో భరతముని ఎప్పుడో ్దేశించాడు. ఇది వాక్యాంతంలోనే ఉంటుందనుకోరాదు. 'ఓ ః విను వీథి న్న ఖచరోత్తములార ః' అన్నప్పుడు ఆదిలోనే కాకువుంది.

.75 విరామ భేదాలుః ఇది రెండువిధాలు. అర్ధవిరామం ామా/,/) పూర్తివిరామం (ఫుల్‌స్టాప్/./) ఇది కాలపరిమితిలోని భేదాన్ని ంచిస్తుంది. ఆంగ్లంలోని ఈ వాక్యద్వయంలోని భేదం సులభంగా ర్తించవచ్చు.

Your honour, the claint is the widow's heir.
Your honour the claint, is the widow's heir.

మొదటి వాక్యం సంబోధన. అక్కడ అర్ధవిరామం ఉండాలి. ిరామంగా చదివే రెండోవాక్యంలో జడ్జిగారే క్లైన్ట్ అవుతాడు.

"ఎవ్వనిచేజనించు జగ, మెవ్వని లోపల నుండు,లీనమై

ఎవ్వనియందు డిందు, పరమేశ్వరుడెవ్వడు ః" అని విరామాలిచ్చి దవకపోతే అర్థం తారుమారౌతుంది. ఆంగ్ల భాషా సంపర్కము వల్లనే ామ చిహ్నాలు తెలుగులో ఇప్పుడు మనం వాడుతున్నాం. పూర్వం లేవు.

---

[1] శ్రీ భరతముని నాట్య శాస్త్రము—నాట్యవేదము—ద్వి. భా. భినవ భారతీవివృతిః జమ్ములమడక మాధవరామశర్మః పుటలు 663–673

అందుకే ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తములు కావాలని కః హెచ్చరిక. ఇంకా అర్థ విరామానికి చూ. 28.71. అవిరామంగా విరామంగ చదివితేకల్గే అర్థభేదం నిరూపితం.

28.8 వర్ణమంటే ఏమిటి ? పై విచారణాన్ని పురస్కరించుకొని వర్ణమంటె ఈ క్రిందిరీతిని కావింపబడ్డ నిర్వచనాల్ని పరిశీలించవచ్చు:

1. వర్ణమంటె కొన్ని ధ్వనుల సమూహం. లేదా ఒకే వర్గానికి చెందిన కొన్ని పవర్ణాలతో కూడింది[1] . ఉదా : /మ్/[జ్, ఞ్,న్, ణ్, మ్-] అను నాసికవర్గం.

2. ప్రముఖమైన శబ్ద లక్షణంలోని కనిష్ఠాంశం. [2] ఉదా : కరువు, గరువు. శ్వాస నాద భేదం.

3. వ్యవహార భాషలోని భావప్రకటనా వ్యవస్థకు చెందిన కనిష శబ్దాంశం వర్ణం. దీనివల్ల ఉక్త విషయంనుండి అనుక్త విషయాన్ని వేరు చేయుగలం[3]. 'కంప' అనే ఉక్త విషయంనుండి 'గంప' ను వేరు చేస్తుంది.

4. ఒకానొక భాషాసంబంధమైన ధ్వని వ్యవస్థలో పరస్పరం విభిన్నంగా ఉండే మూలకాలు వర్ణాలు. [4] క, గ, చ, జ మొదలైనవి.

5. విభక్తావిభక్త ప్రధాన ధ్వని భేదం వర్ణం.

---

(1) A phoneme is a class of sounds (Gleason - p. 258)
A phoneme is a class of allophones. (Ibid. p. 263)

(2) (a) - "a minimum unit of distinctive sound feature, a phoneme" (Bloomfield, p 79)
(b) minimum distinctive sound-feature into which any given flow of speech can be divided.
Language in Modern World : P. 210

(3) "The phoneme is the minimum feature of the expression system of a spoken language, by which one thing that may be said is distinguished from any other thing, which might have been said". (Gleason. p. 16)

(4) "The phonemes of a language are the elements which stand in contrast with each other in the phonological system of a language" (Hocket, p.26)

26.81 సవర్ణమంటే ఏమిటి ? 'తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ'ని పాణిని నిర్వచనం (1-1-9). తౌల్యంలేకపోయినా 'ఋ,ౡవర్ణయో ర్మిథ స్సావర్ణ్యం వాచ్యమ్' అని వార్తికకారుడు విధించాడు.[1] ఈ రీతిగా పాణినీయ సంజ్ఞ విస్తృతార్థాన్ని పొందింది. తెలుగు వ్యాకరణాలు దన్త్య తాలవ్య సందర్భంలో ఈ సంజ్ఞను, తుల్యాస్య ప్రయత్నం లేకపోయినా ఉపయోగించాయి. భాషాశాస్త్రంలోను దీన్ని వాడుతున్నారు. దీనినే ఉపవర్ణం (allophone) అనవచ్చు.

ఏ ధ్వని అయినా ఇంకోధ్వనితో పరస్పరాభావంలో పూరకంగా ప్రవర్తిల్లుతు, ఒకవర్ణాన్ని ఏర్పరుస్తుంటే దాన్ని 'సవర్ణం'గా భావించవచ్చు.[2]

రెండుగాని,అంతకెక్కుడుగాని సాజాత్యంగలధ్వనులు ఒకదానియొక్క అభావంలో ఇంకోటి సరిగా అదే స్థానంలో ప్రవర్తిల్లుతుంటె అటువంటి వాటిని 'సవర్ణాలు'గా పరిగణించాలి. వీటినే "పరస్పరాభావ ప్రవర్తక సవర్ణాల"ని అంటారు[3].

ఈ రీతిగానే కాక పర్యాయోచ్చారణంకల ధ్వనులు కూడా సవర్ణాలే అవుతాయి గాని, వాటికి ఇతంత్ర అర్థభేదక సామర్థ్యం ఉంటే అవి ప్రత్యేక వర్ణాలవుతాయి. కాబట్టి ఆ రీతిగా నిర్ణయించే ముందు జాగ్రత్త వహించాలి. ఉదా : కడప - గడప [క-గ] కారం - ఖారం [క-ఖ] కాని ।కంప। ।గంప। ; ।కాలు। ।గాలు। ఇట్టి వాటిని బట్టి ।క। గ। లు ప్రత్యేక వర్ణాలు. ।కరం। ।ఖరం। లో ।క। ఖ। లు వర్ణాలు.

---

(1) చూ. తెనుగు వ్యాకరణ వికాసం 3.5

(2) Any sound which is in complementary distribution with another, so that the two together constitute a single phoneme is called an allophone of that phoneme.
(Gleason)

(3) If two or more phonetically similar sounds are distributed among the forms of a language that one of them ever occurs exactly the same position as any of the others, then they are to be classified as allophones of the phoneme which are in complementary distribution.
(Outlines of Linguistic Analysis - Block Trager)

26.9 వర్ణ స్థాపన : ఇంతకు పూర్వమే వర్ణ సమామ్నాయం సంప్రదాయ వ్యాకరణాల్లో చాలా భాషలకు నిర్ణయమై ఉన్నా, ఆ నిర్ణయం నిర్దుష్టమనలేం. తెలుగు వర్ణాలు 36గా నిర్ణయమైనాయి. దన్త్యతాలవ్య చ జ ల వవర్ణాలని నిర్ణయించిన వ్యాకరణాలే వర్ణమాలలో ౘ ౙ ల్ని చేర్చటం సమంజసంకాదు. తాలవ్య చ జ లు చెప్తే, దన్త్య చ జ లు చెప్పినట్లే కాదా! భాషాశాస్త్రజ్ఞ లిట్టి విషయాల్ని పునరాలోచనం చేస్తారు.

ఇంతకన్న ముఖ్యంగా - వ్యాకరణాలు,లిపిలేని భాషల్ని పరిశీలించి, వర్ణాలు నిర్ణయించ గలిగితే అతడ్ని భాషా శాస్త్రజ్ఞుడుగా పరిగణించ వచ్చు. మంచి భాషావ్యవహర్తను ఎన్నుకోవాలి (informant) ఈపనికి.

ఒకానొక భాషలోని పదాల్ని, వాక్యాల్ని లిఖించు కొనేటప్పుడు ప్రతి ధ్వనికి ఒకసంకేతాన్ని ఏర్పాటు చేసుకోవాలి. దీన్ని "ధ్వన్యాత్మక లేఖనం" (Phonetic transcription) అంటారు. ఈ లేఖనంలో సాధ్యమైనంత వరకు ఐ.పి.ఏ. గుర్తులే వాడటం మంచిది. ఈ లేఖనంలో అతివ్యాప్తి,[1] అవ్యాప్తి[2] దోషాలుండ కూడదు.

సేకరించిన పదజాతం నుండి అర్థభేదక సామర్థ్యంగల కనిష్ఠపదయుగళాల్ని (minimal pairs) కూర్చగలగాలి. వీటిని వర్ణక్రమంలో ఏర్పాటు చేస్తే వర్ణ పన జరుగుతుంది. ఇవన్నీ విభక్తవర్ణాలు. (segmental phonemes) విధమైన వాక్యాలు రికార్డుచేసి వాటి ఆధారంతో ఆ భాషలోగల prosodical features నిర్ణయించి, 'సంసక్తవర్ణాల్ని' ( Supra - segmental Phonemes ) ఏర్పరచాలి.

ప్రధాన భేదక ధ్వనులేవో (Distinctive features) అప్రధాన ధ్వనులేవో(Non-distinctive features) అందులోపరస్పరాభావప్రవర్తకధ్వనుల్ని (Non-distinctive phones) స్వేచ్ఛాప్రవర్తితధ్వనుల్ని (free variation)

---

1 అతివ్యాప్తిఅంటే over differentiation: లక్ష్యాలకుమించిన లక్షణం

2 అవ్యాప్తి అంటే under differentiation: లక్ష్యాలన్నింటిని పట్టని లక్షణం.

ర్ణయించటం చాల కష్టం. ఈ అప్రధాన ధ్వనులకు ప్రత్యేక లేఖన హ్నాల్ని పరిహరించవచ్చు. వర్ణాలకే ప్రత్యేక లేఖన చిహ్నాలేర్పాటు చేయాలి. వ్యపధాన భేదాలకు (Junctures), స్వరభేదాలకు (tones) గుర్తు ర్పాటు చేయాలి. వీటన్నిటితో కూడిందే వర్ణాత్మక లేఖనం (Phonemic ranscription).

భాషను తొలుత రికార్డు చేసుకొనేటప్పుడే ధ్వన్యాత్మక లేఖనం. తద ంతరం దాన్ని మథించగా ఏర్పడేదే వర్ణాత్మక లేఖనం. ధ్వనుల్ని [ ] కర్తులమధ్య, వర్ణాన్ని // మధ్య గుర్తించాలి. ధ్వనులకంటె వర్ణాలు పరి ుతం.

6.91 కనిష్ఠపదయుగళాలు (minimal pairs)

పదాదిలోగల ప్రధాన ధ్వని భేదాల్ని పురస్కరించుకొని ఈ క్రింది నిష్ఠ పదయుగళాలు సూచితం.

అ/ /ఆ/ అగు అమ్మ అను పడు మను వడి
ఆగు ఆమ్మ ఆను పాడు మాను వాడి
ఉచ్చారణ లక్షణాలకు చూ. 23.1

ఇ/ /ఈ/ ఇక ఇగ ఇల ఇవి పిలుచు
ఈక ఈగ ఈల ఈవి పీలుచు
చూ. 23.2

ఉ/ /ఊ/ ఉడుపు ఉరు కుడుచు కురుపు పుట
ఊడుపు ఊరు కూడుచు కూరుపు పూట చూ. 23.3

ఎ/ /ఏ/ ఎలిక ఎటు తెగ నెల చెర
ఏలిక ఏటు తేగ నేల చేర చూ. 23.4

ఎ̱/ /ఏ̱/ - పె̱డ - మె̱డ } ఇంతకు పూర్వం (చూ. 26.51, 26.52)
_డ మే̱డ } ఎ̱, ఏ̱లు ఎ,ఏ లకు సవర్ణాలుగా నిరూ
చూ. 23.5 పితం. ఎ̱, ఏ̱లకు మినిమల్ పెయిర్స్ లేవని పలువురు భావిస్తున్నారు. ఒకటి రెండున్నాయి. ఇది వివా దాస్పదం. వీటినిబట్టి ఎ̱, ఏ̱లు వర్ణాలే అనాలి.

/ఒ/ /ఓ/ ఒరుపు (తెరపి) కొన కొర దొర పొలుచు
ఓరుపు కోన కోర దోర పోలుచు చూ.23.6

/అ/ /ఏ/ పాక పాట మాడ
పేక పేట మేడ

/క్/ /గ్/ కట్టు కుండి కుడి కడి కడ్డి కంత కంప కా
గట్టు గుండి గుడి గడి గడ్డి గంత గంప గా
కుచ్చు కూడు కోల కోతి
గుచ్చు గూడు గోల గోతి చూ. 25.

అప్ప అక్క }
కప్ప కక్క } ఇత్యాదిగా ప్రత్యేక జంటలు /క/ కు ఉన్నాయి.

అచ్చు ఇచ్చు ఈత }
గచ్చు గిచ్చు గీత } ఇత్యాదులు ప్రత్యేక /గ/ కు చాలఉన్నాయి.

శి తరులు మహాప్రాణాన్ని అల్పప్రాణాలుగా పలుకుతా
శి లు మహాప్రాణాల్ని పలుకుతారు. సంస్కృతంలో అ
' ల్యేక వర్ణాలు కాబట్టి శిష్టవ్యవహారంలోను అవి ప్రత్యే
వర్ణాలుగానే పరిగణించాలి.

/క/ /ఖ/ కలము = నావ
ఖలము = నేల

/ఖ/ /ఘ/ ఖాతం
ఘాతం

/చ్/ అదురు అరుపు అల్లు ఇటిక ఉక్క ఎక్కు ఒప్పు
చదురు చరుపు చల్లు చిటిక చుక్క చెక్కు చొప్పు
చూ.25.2

/జ్/ అల్లి ఇగురు ఊరు జాలి ఓడు
జల్లి జిగురు జూరు జోలి జోడు

/ఛ్/ ఛందం ఛదనం ఛలి
ఆందం అదనం చలి

/ఝ/ ఝరం ఝష
ఉరం ఉష

/ట్/ టంకం టంగన టక్కరి టీక టెక్క
అంకం అంగన అక్కరి ఈక ఎక్క చూ. 25.3

/ఠ్/ ఠావు ఠీవి ఠేవ
ఆవు ఈవి ఏవ

/డ్/ అప్పు అగు ఆలు ఏకు
డప్పు డాగు డాలు డేకు

/ఢ్/ అక్క ఆక ఓలము
ఢక్క ఢాక ఢోలము

/ణ్/ /డ్/ ణ్ పదాదిలోరాదు.
కడుపు కణత కణక కణుపు మణుగు
కణుపు కలత కలక కలుపు మడుగు

/త్/ ఈగ అట్ట అప్పు ఉప్పు ఉక్కు ఊనిక
తీగ తట్ట తప్పు తప్పు తుక్కు తూనిక చూ. 25.4

/థ్/ తెలుగువారి ఉచ్చారణలో ఈ తవర్గ ద్వితీయవర్ణం తద్వర్గ చతుర్థవర్ణంలో లీనమైంది. సంస్కృతంలో /ధ్/ /థ్/ ప్రత్యేక వర్ణాలు.

వథకం–వదం వతకం–వథకం;

రెండు వర్ణాలు ఏకవర్ణంగా విలీనం కావటం 'వర్ణసమ్మేళనం'. (Phonemic merger) ।థ్।  ।ధ్। ఈ రీతిగా సమ్మేళనం తెలుగులో ప్రాచీనకాలంలోనే | జరిగినట్లు తెలుస్తుంది. ధ్

గ్రంథం, కథ, రథం అని పండితులు వ్రాస్తున్నా ఉచ్చరించరు. ఈ థ కారోచ్చారణం అసలు లేదేమో అని అనుకొనేవాడ్ని. కాని ఈమధ్య ఒకావిడ తన భర్తను 'నీ మొహాన

ఛు! ఛు! అని ఉమ్మేస్తారని' నిందిస్తుంటే స్పష్టంగా ః
పించింది. ఈ ధ్వన్యనుకరణ శబ్దాల్ని క్వణములు (clicks
అంటారు. ఇవి భాషాపరిధిలోవి కావని ఇంతకుపూర్వ
పేర్కొన్నాను. (చూ. i.16) వీటి ఉచ్చారణంలో గ
సమధికంగా నిర్గమిస్తుంది. కొన్ని ఆఫ్రికన్ భాషల్లో ఇటువ
"క్లిక్స్" కొన్ని అర్థవంతాలు. ఇవి శ్వాసంకాని, నాదంకా
అనునాసికం[2]కాని కావచ్చు. గ్లోటల్‌స్టాప్ ఇట్టిదే (చూ. 25.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ।న్। | అక్క | ఏడు | అలక | ఆను | అమ్ము | ఊరు |
| | నక్క | నేడు | నలక | నాను | నమ్ము | నూరు |
| ।ప్। | అక్క | ఉచ్చు అడు | ఏడు | అప్పు | ఒర | |
| | పక్క | పుచ్చు పాడు | పేడు | పప్పు | పొర | |

| | | |
|---|---|---|
| ।ఫ్। | ఫలం (పండు) | ఫలితం |
| | పలం (మూడుతులాలు) | పలితం |

।ఫ్। చూ 25.8 (51) ఇది ఆంగ్ల పదాల ద్వారా తెలుగులో చేరిం
ఆంగ్ల పదాలద్వారానే దీనికి వర్ణత్వం. ఫాట్ పాట్ కాఫీ ఇ
శిష్టు లీవర్ణాన్ని ఉ< రిస్తున్నా, సామాన్య ప్రజలు సంస్కృ
।ఫ్। కారాన్ని ఆంగ్ల । ।కారాన్ని ।ప్। గానే (దేశీయవర్ణంగా
పలుకుతారు. అప్పుడ పకారంతో పర్యాయోచ్చారణం కల
(F.V.) కొందరు శిష్టులు కూడ " ఫలితాలు, ఫలం" అం
విన్నాను. ఆంగ్ల వర్ణ ప్రభావానికి నిదర్శనం.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ।బ్। | అక్క | ఆగు | ఒట్టు | అడుగు | అరిసె | ఇరుసు |
| | బక్క | బాగు | బొట్టు | బడుగు | బరిసె | బిరుసు |

---

[1] "A speech sound in some languages made by enclosing between two stop articulations of the tongue, enlarging the e closure to rarefy the air and suddenly opening the enclosur
—Webster's Diction

[2] Hocket-pp. 71, 72   Lectures on Linguisties, p. 22
F.M. Berezin

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| । భ్ । | భావి | భాతువు | భాయి | భావ | భాలం | | |
| | బావి | బాతువు | బాయి | బావ | బాలం | | |
| । మ్ । | ఉక్కు | ఊగు | ఉగ్గు | ఉచ్చు | ఆట | ఊట | ఊత |
| | ముక్కు | మూగు | ముగ్గు | ముచ్చు | మాట | మూట | మూత |
| । య్ । | చూ.25.6. యతి | యాజి | యాస | యుక్తి | యుక్తం | | |
| | అతి | ఆజి | ఆస | ఉక్తి | ఉక్తం | | |
| । ర్ । | ఱూక | ఱేగు | ఱట్టు | ఱవ్వ | ఱుబ్బు | ఱేపు | ఱేకు |
| | రూక | రేగు | రట్టు | రవ్వ | రుబ్బు | రేపు | రేకు |

రేఫ · ఱ కారాలు చారిత్రకంగా ప్రత్యేకవర్ణాలే. కాని వీటికి ఉచ్చారణలో భేదం లేని కారణంగా ఈ రెండు రేఫగానే మేళగించాయి. /ర్/—/ఱ్/

ఆఱు వాఱు నీఱు } ఇట్టివి /ర్/ వర్ణసమ్మేళనం (Phonemic merger)
ఆరు వారు నీరు

చారిత్రక కనిష్ఠ పదయుగళాలు (Historical minimal Pairs)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| । ల్ । | లాగు | లేపు | లడ్డు | లక్క | లావు | | |
| | ఆగు | ఏపు | అడ్డు | అక్క | ఆవు | | |
| । వ్ । | అక్క | ఆగు | అచ్చు | ఆటు | ఆలు | ఏలు | ఈక |
| | వక్క | వాగు | వచ్చు | వాటు | వాలు | వేలు | వీక |
| । శ్ ।[1] | శక్తి | శంబరం | శకలం | శరం | శోకం | శకృత్ | |
| | సక్తి | అంబరం | సకలం | సరం | ఓకం | సకృత్ | |

---

[1] 'నాన్నా! వ్యాకరణం ఎందుకు చదవాల'ని కొడుకు ప్రశ్నిస్తే తండ్రి ఈ రీతిగా జవాబిచ్చాడట:

'అధికం యది నాధీషే తథాపి పఠపుత్ర! వ్యాకరణమ్; సకలశ్శకలో మాభూత్, సలిలం శలిలం, సకృత్ శకృత్' సాను శాగాగాని, శాను సాగాగాని ఉచ్చరించ కుండా ఉండాలంటె వ్యాకరణం చదవాలని అర్థం. పై పదాలకుగల అర్థభేదాల్ని సూ.ని. చూచి గ్రహించండి. ఇవి కనిష్ఠపద యుగళాలు.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| /ష్/ | షటి | షండం | | | | | | |
| | పటి | అండం | | | | | | |
| /స్/ | ఆగు | అన్న | అలుపు | ఆకు | ఆన | ఆలు | ఈల | ఈ |
| | సాగు | సన్న | సలుపు | సాకు | సాన | సాలు | సీల | సీ |
| /హ్/ | హద్దు | హరి | హంసం | హల | హవి | హస్తి | హా |
| | అద్దు | అరి | అంసం | అల | అవి | అస్తి | అ |
| /ళ్/ | కల | వేల | తాలు | మంగలం | | | | |
| | కళ | వేళ | తాళు | మంగళం | | | | |

సంస్కృతంలో ల-ళ లకు పర్యాయోచ్చారణం (F.V.)

పదాదిలోనే పై ఉదాహృతుల్లో అర్థభేదక లక్షణం నిరూపితం. పై మార్గదర్శకాలే. ఇంకా ఎన్నైనా ఆలాగా నిర్ణయించవచ్చు. ఈ విధంగా పదాంతంలోను, పదమధ్యంలోను భేదక లక్షణం గల జంటల్ని నిర్ణయి వర్ణస్థాపనం స్థిరంగా నిలుస్తుంది.

26.10 వర్ణం: భిన్న దృక్పథాలు : (1) అమెరికన్ దృక్పథ (American School) అమెరికనులు వర్ణానికి విశేష ప్రాముఖ్య మిస్తార ధ్వనులన్నీ పరిగణనీయం కావు. ప్రధాన ధ్వనులే పరిగణనీయం. అ వర్ణాలు. అప్రధాన ధ్వనులన్నీ ఏవో కొన్ని ప్రధాన ధ్వనుల కంతర్భాగం ఉంటాయనేది అమెరికన్ సిద్ధాంతం. వర్ణాలు ఏ భాషలోనైనా పరిమితం ఉంటాయి. వాటికే లిపి చిహ్నాలు ఏర్పరచాలని, అలా ఏర్పాటు చేయుట కొదువని భాషావేత్తల నిశ్చయం.

వర్ణ నిర్ణయానికి కనిష్ఠ పదయుగళాలు (minimal pairs) కావాలి అందుకెంతో పదసామాగ్రిని సేకరించాలి. ప్రత్యక్ష కృషి (Field work అపారంగా చేయాలి. మంచి వ్యక్తిని భాషావ్యవహర్తగా (informan ఎన్నుకోవాలి.

ఈ దృక్పథంలో అర్థానికి ప్రాముఖ్యం లేదు. పదాని కర్థనిర్ణయ కష్టసాధ్యం. పదాల కర్థాలు సంప్రదాయికంగా అనుస్యూతంగా వస్తున్నవే

(conventional) వాటిని శాస్త్రీయంగా భేదించటం దుస్సాధమని వీరి తలంపు. ఆ ప్రమేయంలోకి దిగకుండ అర్థభేదకం గల ధ్వని లక్షణాన్ని బట్టి వర్ణనిర్ణయం చేస్తే సరిపోతుందంటారు వీరు.

ఈ దృక్పథంతో మరికొన్ని దృక్పథాలు భేదిస్తున్నాయి. వర్ణమన్నా ధ్వనన్నా ఒకటే. ప్రత్యేక వర్ణకల్పనం అనవసరమని కొందరంటారు. మరి కొందరు వర్ణంకంటే అక్షరం (syllable) ప్రధాన మంటారు. పదాల ఉచ్చారణ భేదాన్నిబట్టి వర్ణనిర్ణయం చేయరాదని,పదాన్ని మొత్తంగా స్వీకరించాలని కొందరంటారు [కంప] అనే మొత్తం ఉచ్చారణ [గంప] అనేదాని నుండి భేదిస్తుందని వాక్యగతంగా వీటిని పరిశీలించాలే కాని వ్యష్టిగాకాదనే విమర్శలున్నాయి, అర్థప్రధాన వాదాలు చెలరేగాయి. ఇందులో చారిత్రకత లేదు.

2) ప్రేగ్ దృక్పథం : (Prague School) 1926లో భాషాశాస్త్ర కేంద్ర మేర్పడింది. స్లావిక్ భాషలో విశేష పరిశీలనం జరిగింది. జాకోబ్‌సన్ మున్నగు ప్రముఖు లీకేంద్రానికి చెందిన వాళ్లు. చారిత్రక ధ్వని శాస్త్రంపై వీరికభిమానం. భాషా ప్రయోజనాలపై వీరిదృష్టి కేంద్రీకృతం. అందుచే వీరిని ప్రయోజన వాదులంటారు. (Functionalists) భాషా సాంఘిక సారస్వత ప్రయోజనాల్ని అమెరికన్లులాగ వీరు విస్మరించరు.

భాషాగతధ్వని విజ్ఞానంలోనే (Phonology) వీరికభినివేశం. ధ్వని సమ్మేళనాలు (Sound Patterns) వాని అనువర్తనాలు, శైలి, గ్రామీణిక మాండలిక భాషా ప్రాధాన్యంపై వీరికృషి అధికంగా సాగింది.

వీరు ధ్వనులకంటె వ్యాకరణానికి అధిక ప్రామాణ్యమిస్తారు. (mor-Phology) వ్యాకరణంలోని మార్పుమూలానే ధ్వనిలో మార్పులు వస్తాయంటారు. ఉదా : ఎలక్ట్రికల్ (విశేషణం) ఎలక్ట్రిసిటి (విశేష్యం.)

స్విస్ భాషా శాస్త్రజ్ఞుడు ఫెర్డినాండ్ దే సస్సూరే ప్రభావం ఈ మతానుయాయుల మీద ఉన్నది. అమెరికన్ భాషా శాస్త్రజ్ఞులు కొందరు ప్రేగ్ దృక్పథాన్ని అధ్యయనం చేశారు.

3) లండన్ లేక బ్రిటిషు దృక్పథం : (London or Brit School): ఈ దృక్పథంలో ధ్వనికే ప్రాధాన్యం. ధ్వని విజ్ఞానమే సమ సిద్ధాం తాచరణాత్మక భాషాశాస్త్రాధ్యయనానికి ప్రాతిపదిక[1]. ఈ గాములకు ప్రాచ్య భాషావ్యాకర్తలపైన వారి కృషిపైన అధిక విశ్వాసం

వీరు ధ్వనికి, వ్యాకరణానికి, సైఘంటిక రచనకు అధిక ప్రాము మిస్తారు. ఇవి అర్థాశ్రయాలని ఈ దృక్పథానికి చెందినవారిలో అగ్రగా మైన 'ఫర్త్' ( Firth ) అభిప్రాయం. అమెరికన్ భాషా శాస్త్రజ్ఞులకు మ గామి 'బ్లూమ్‌ఫీల్డ్' అభిప్రాయంలో భాషా శాస్త్రంలో అర్థానికి స్థాన లేదు[2]. ఈ అభిప్రాయంతో వీరేకీభవించరు. ధ్వనుల్లో అనేకార్థ భేదాలుం యని (Phonetic levels ) అవిఅర్థ భేదాన్నిబట్టి ఏర్పడతాయని వీరినిరు ణం. భాష బహు వ్యవస్థాత్మకం.(Systemic)

4) కోపెన్ హేగన్ దృక్పథం (Copenhagen schoo

ఇందులోను శబ్దానికే ప్రాధాన్యం. అర్థంతోగాని, మనస్తత్వశాస్త్రం గాని, సాంఘిక పరిస్థితులతోగాని నిమిత్తంలేదు. శాబ్దిక నిర్మాణమే భా గతమైన సర్వస్వం. అదే పరిగణనీయం[3]. అన్య ప్రమేయం అనవసరమ దృక్పథానికి చెందిన Luis Hjelmslev అభిప్రాయం. ప్రత్యేకంగా వర్ణా పరిగణనంలేదు. వీరినే "నిర్మాణవాదులం"టారు. (Structuralists)

ఈ విధంగా భిన్నదృక్పథాలున్నా, వీని అన్నింటిలో అమెరిక ఈదృక్పథమే ఇప్పుడుప్రబలంగా ఉంది.ఇతర దృక్పథాలపై తనప్రభావాని ప్రసరింప చేసింది. ఐరోపియనుల భాషాలోచనాన్ని అమెరికన్ దృక

---

[1] 'A thorough practical and theoritical knowledge of phonetic is the essential basis of all linguistics.'

[2] 'The great American linguist Leonard Bloomfield took th view that the study of meaning is not a lengitimate part c linguistics' Linguistics- P 251

[3] A self - sufficient totality is the structure.

ఘం బాగా మార్చగల్గింది. వర్ణ నిర్ణయం ప్రాధాన్యాన్ని సంపాదించుకొన్నది. ధ్వనుల్లో విశిష్టమైన వాటికి ప్రత్యేకంగా "వర్ణం" అని వ్యవహరించటమే సముచితంగా కనిపిస్తుంది.

## 26.11 ధ్వన్యాత్మక లేఖనం : (Phonetic Script) వర్ణాత్మక లేఖనం (Phonemic Script)

11.1 భాష ధ్వనిమయ మైంది ధ్వనిభేదాలనంతంగా ఉంటాయి. ప్రతి ధ్వనిభేదానికి ఒక లిపి సంకేతాన్ని ఏర్పాటు చేస్తే అటువంటిదాన్ని "ధ్వన్యాత్మక లేఖనం" (Phonemic Script) అంటారు. కాని ఇది పూర్తిగా సాధ్యమయ్యే పనికాదు. ఎందుకంటె సూక్ష్మాతిసూక్ష్మమైన ఉచ్చారణభేదాల్ని గుర్తించటం చాల కష్టం. తెలుగులో స్పర్శధ్వనులు పదాదిలోను ద్విరుక్తంగాను ఉన్నపుడు బరువుగా ఉచ్చరిస్తాం. దీన్నే 'దృఢోచ్చారణం' ( tense articulation ) అంటారు. వీటినే రెండచ్చులమధ్య, అద్విరుక్తంగాను తేలికగా ఉచ్చరిస్తాం. దీన్నే "శిథిలోచ్చారణ" మంటారు. (lax articulation)ఇటువంటి భేదాల్ని మనప్రాచీన వ్యాకర్తలు మితంగాగుర్తించినట్లు 'వ్యోర్లఘు ప్రయత్నతర శాకటాయనస్య' (పా.8-3-18)అనేసూత్రాన్ని బట్టి "లోశః" అనే ప్రాకృత వ్యాకరణసూత్రాన్ని బట్టి తెలుస్తుంది. చిన్తామణి కర్త[1], అతడ్ననుసరించి చిన్నయసూరి[2] య-ర-ల-వ లకు లఘ్వలఘు భేదోచ్చారణాల్ని పేర్కొన్నారు. ఇటువంటివి ఎన్నోఉన్నాయి. వాటినన్నింటిని లిపిలో నిరూపించటం దుస్సాధం. పొదుపుకూడా కాదు. ఎందుకంటె ప్రతి భాషావ్యవహర్త, ఆయా పరిసరాల్నిబట్టి ఉచ్చారణలోని భేదాల్ని ఎటువంటి సూచనలేకుండానే గ్రహించి తగురీతిని పలుకుతాడు, అటువంటప్పుడు ఇటువంటివాటికి ప్రత్యేకలేఖన చిహ్నాలు వ్యర్థమేకదా!

11.2 య, వ లకు ప్రత్యేక లిపి గుర్తులు లేవు. కాని 'ర-ఱ' లు భిన్నంగా నిరూపించారు. ఇందుకు కారణం - ఇవి చారిత్రకంగా భిన్న

---

[1] లఘుర్వో ఽ లఘువశ్చేతి ద్వేధా న్త స్థాస్వద న్తి శ్యాస్తారః అన్యే ఽ న్య వ్యాకరణ స్పష్టార స్త్వత్ర గృహ్యతే ద్వివిధః. సంజ్ఞా. ౭

[2] బా. వ్యా. సంజ్ఞా 18.

వర్ణాలు. అర్థభేదం కొన్ని పదాల్లో గోచరిస్తుంది. (చూ. పుట 115) నిజ నేటి లిపిలో ఈ విభేదం అనవసరం. అర్థభేదం సందర్భాన్నిబట్టి అనేక పదా లాగానే వీనికి తెలుసుకోవచ్చు. ఛందో విధేయంగా వ్యాకర్తలు వీటిని తీయ వర్ణాలు కావనటం తెలివితక్కువతనం.

ఎ, ఎ̱, ఏ, ఏ̱ లలో అర్ధ వివృతాలకు ప్రత్యేక చిహ్నాలు ఏర్పర పోవటంలో పొదుపు పాటించారు. ఏర్పరిస్తే అది ధ్వన్యాత్మక లేఖన ప అవుతుంది. అయి, అవులు సంధ్యక్షరాలు. వీటికి ప్రత్యేక లిపు లనవసర కాని ఛంద స్ప్రభావానికి లొంగి వీటిని గురువులుగా పరిగణింప చే టానికి వీటిని ఏర్పరచారేమో!

దన్తమూలీయ చ, జ లకు '‿' గుర్తు ఉంచితే అది ధ్వన్యా లక్షణం. ఉంచకుండా వ్రాస్తే అది వర్ణాత్మకం. ఇప్పుడెవ్వరూ ఉంచ లేదు. అదే పొదుపు. సవర్ణాలకు మన ప్రాచీనులు చాల వరకు ప్రత్యేక చి లేర్పరచక పోవటం మంచిదే. ఆంగ్లంనుండి వచ్చిన 'ఫ̱' కు గ ప్రత్యేక లిపి అవసరం లేదు.

11.21 వర్ణ సవర్ణ పరిజ్ఞానం ఇప్పటిలాగ లేకపోయినా సంప్రదా లిపులు చాలవరకు వర్ణాత్మకంగానే ఉన్నాయి. ఆంగ్లలిపి అధ్వాన్నపై వారు సంప్రదాయాన్నే అంటిపెట్టుకొన్నారు. ఆ లిపి మూలాన ఆ భా వ్యాప్తికి ఎటువంటి అవరోధం కలుగలేదుకదా! ఏమైనా సంప్రదాయ లను సంస్కరించి, వాటిని వర్ణాత్మకంగా సవదరించటంఅవసరం. ఈ విధ స్పానిష్, బొహిమియన్, పోలిష్, ఫిన్నిష్ వంటి భాషలకు జరిగాయ బ్లూమ్‌ఫీల్డ్ పేర్కొన్నారు[1]. ఇటువంటి వాటిలో తమిళ భాషను చేర్చా ఆ భాషలో వర్గ తృతీయాలు (గ జ డ ద బ లు) ప్రత్యేక వర్ణాలు కా అవి ఉచ్చారణలోనే వుంటాయి. రెండచ్చుల మధ్య, య ర ల వ లకు నాసికాలకుతరువాతనే అవిశ్రుతం. పదాదిలోను ద్విత్వస్థితిలోను క చ ట త

---

[1] Traditional alphabetic writing is accurate only in the ca of a few languages, such as spanish, Bohemian, Polish and Finni where it has been shaped or revised by persons who had work out the phonemic system of their language. — Lang. 5.7

వుంటాయి. అందుచేత కేవల వర్గ ప్రథమాక్షరాల్నే వారు లేఖనంలో చూపి స్తారు. 'కాంతి' అనే పదాన్ని /కాన్తి/ అనే వ్రాసినా పలకటం /కాన్ది/ అనే. గాంధిగారిని కూడ /కాన్ది/ గానే పలుకుతారు. /పఙ్కజమ్/ [పఙ్గజమ్] భాగ్యాన్ని /పాక్కియమ్/ మలయాళంలో కూడ ఇదేపద్ధతి. క చ ట త ప లు గ జ డ ద బ లు సవర్ణాలు, సి. డి. లో ఉంటాయి. వర్ణాలకే లిపులు. అందు చేత వర్ణమాలలో వారెంతో పొదుపును పొందారు. ఇందువల్ల సంక్షిప్త లేఖ నం (Short hand) టైపు రైటింగ్ వంటి ఆధునిక సౌకర్యాలు వారికి సుకరమైనాయి.

11.3 ధ్వన్యాత్మక లేఖనం లిపు లేర్పడక కేవలం వ్యవహార మాత్రంగా ఉన్న భాషలకు అప్రధాన, ప్రధాన ధ్వని భేదాల్ని నిర్ణయించి, వర్ణ నిర్ణ యం చేయటానికి తోడ్పడుతుంది. దీనిలో ఐ. పి. ఏ. గుర్తులే సాధ్యమై నంతవరకు వాడటం మంచిది.

మనం ఏరీతిగా పలుకు తున్నామో ఎలా వ్రాస్తున్నామో గుర్తించి, ఈ తారతమ్యానికి కారణాలూహించటం అవసరం. కాబట్టి భాషాశాస్త్ర విద్యా ర్థులు ధ్వన్యాత్మక లేఖనాన్ని అభ్యసించాలి. /మాను/ [మాంవం] /సత్య నారాయణ/ [సచ్చనారాయణ] /పద్యాలు/ [పజ్యాలు] ఇట్టివి ఎన్నో అనుబంధంలో ప్రదర్శించాం.

11.4 ఈ సందర్భంలో లిపినిగూర్చి కొంచెం ముచ్చటించు కోవాలి. మానవ మనోగత భావాలు కంఠధ్వనుల మూలాన ప్రకటితమౌతాయి. ఆ భావాలకు ఈ ధ్వనులకు ఎటువంటి సంబంధంలేదు. ఈ కంఠధ్వనులకు కొంత కాలానికి కొన్ని భాషలకు లిపి చిహ్నాలు ఏర్పడతాయి. వీటిలోను కాలానుగుణ్యంగా మార్పులు వస్తుంటాయి. శాసనాల్లోని లిపికి తాటాకులలోని లిపికి, ముద్రణ లిపికి ఎంతో కొంత భేదముంటుంది. శాసనాలలోని లిపి పరిణామాల్ని నిరూపించే దానికి 'పురాలేఖనశాస్త్రం' (Paleography) అంటారు. వీటికి కంఠధ్వనులకు ఎటువంటి సారూప్యం లేదు. ఇట్టి లిపిని "భావలిపిలేఖనం" (Ideographic script)

కతిపయ భాషలలో మనోగత భావాల్ని చిన్నచిన్న బొమ్మలద్వారా నిరూపిస్తారు. దీన్నే "చిత్రలిపి" ( Pictography ) అంటారు. ఇకోనిక్ లిపి

(Iconic script) అనీ అంటారు. చైనీయుల లిపి ఇటువంటిది. దీనికి కంఠ ధ్వనులతో సంబంధంలేదు. సరాసరి భావంతోనే.

11.41 కంఠధ్వనులకు సంకేతాలైన లేఖనాలు రెండు విధాలు: (i) అక్షరలిపి: (Syllabic script) తెలుగు, సంస్కృతం మొదలైన భాషాలిపు లిట్టివి. ఇందులో వ్యంజన స్వర సమ్మేళనాకృతులే ఉంటాయి. (ii) వర్ణలిపి వ్యంజనాలు, స్వరాలు విడివిడిగా నిరూపితాలు. ఉదా: ఆంగ్లలిపి. అయితే హ్రస్వదీర్ఘ భేదాలిందులో సూచితం కావు. తకార టకారాలకు, దకార డకారాలకు ఒకే విధమైన చిహ్నాలుండటం, ఉకారాన్ని కొన్నింటిలో అకారంగా పలకటం (put, but) ఇత్యాదిగా లోపాలున్నాయి. ఇటువంటి లోపాలు సవరించి, ప్రపంచంలో అందరికి ఉపయోగ పడేటట్లుగా రోమన్ లిపి (Roman scitpt) ఏర్పాటు చేశారు. ఈ పద్యంచదవండి.

aTajanika:nce bhu: misuru Dambara cumbi Sirassa rajhari:
PaTala muhurmuhulu tata bhanga taranga mridanga n'svana
spuTa nuTana: nuru: pa pari Phulla kala: pa kala: pija: lamun
kaTaka caratkare: Nu karakampita sa: lamu Sita Sailamuni.

ఇవన్నీ ఆంగ్ల వర్ణాలే. దీర్ఘానికి నెత్తిపై గీతగాని, ప్రక్కన రెండు చుక్కలు (:) గాని, రెండచ్చులుగాని ఉంచవచ్చు. ట కు T, డ = D, ణ = N, శ =S అని ప్రత్యేకంగా క్యాపిటల్సు ఉంచాం. ఇంగ్లీషుటైపు చేయవచ్చు పైదాన్ని. ప్రత్యేక చిహ్నాలు వివరిస్తే ప్రపంచంలో చాలమంది పైపద్యాన్ని చదవగల్గుతారు. ఆంగ్ల వ్యాసాలలో శ్లోకాలీవిధంగానే ముద్రిస్తారు.

11.5 ధ్వనులలో పొదుపు సాధించినా, ఛందో లక్షణాలన్నింటికి (prosodical features) తగు సంకేతాలేర్పాటు చేస్తేగాని అది "పూర్ణ వర్ణాత్మక లేఖనం' అనిపించుకోదు. (complete Phonemic script) అది చాల వ్యయ ప్రయాసలతో కూడింది. కేవలం వర్ణాలకు పరిమితం చేసుకొన్నా, టైపు రైటర్లు తయారుచేయాలంటే ఎక్కువ పెట్టుబడి పెట్టాలి. అక్షర లిపిలో వేగం సాధించటం చాల కష్టం. ఇటువంటి పరిస్థితులలో పైరీతి లిపిని అలవాటు చేసుకొంటె ఇంగ్లీషు టైపుమిషన్లనే వాడుకోవచ్చు. కాని మన లిపి చాల అందమైందని, దాన్ని విడనాడలేమనే ఆత్మాభిమానం అడ్డు వస్తుంటుంది. దీనికి కొంత తెగింపు పాలకుల్లో ఉండాలి.

# 5. పదాంశ విజ్ఞానం [MORPHEMICS*]

27.1 పదం–పదాంశం : ఇంతవరకు గావించిన పరామర్శ ధ్వనిని గూర్చే. ధ్వని ఎప్పుడు వర్ణమౌతుందో నిరూపించాం. వర్ణానికి అర్థంతో ప్రత్యక్ష సంబంధం లేదు. పరోక్ష సంబంధమే. ఈ వర్ణ సమ్మేళనము వలన పదాలేర్పడుతాయి. ఈ పదాలు [1]అర్థవంతాలు. నిఘంటువు లీయర్థాల్ని నిరూపిస్తాయి. ఇవి వాక్యాలుగా కూడ ఉపయుక్తం. 'అవి ఏమిటి?' 'పూవులు' అనవచ్చు. అపుడది వాక్యమే.

పూవులు అనేది పదం. కాస్త చదువుకొన్న ఏ తెలుగు వాడైనా దీన్ని విభజించమంటే 'పూవు' 'లు' అని రెండంశాల క్రింద అలవోకగానే వింగడిస్తాడు. –'లు' అనేది అనేకార్థంలో వచ్చిందని చెప్పగలుగుతాడు. పూవు నింకా అర్థవంతమైన ముక్కలు చేయమంటె చేయలేడు. ప్ + ఊ + వ్ + ఉ అని వర్ణాలుగా తుంచవచ్చుగాని ఇవి అర్థవంతం కావు గదా ! అందుచేత ఈ పదంలో రెండు పదాంశాలే ఉన్నాయి.

---

* "a branch of linguistic analysis that consists of the study of morphemes; the structure of a language in terms of morphemes" - Webster Dic

[1]A word is a minimum free-form : Lang. p. 178
......the smallest speech-unit capable of functioning as a complete utterance -Palmer : Dictionary of Lingustics.
A word is the smallest thought unit vocally expressible and is composed of one or more syllables.
Foundation of Language – Gray p.146

A word is thus any segment of a sentence bounded by successive points at which pausing is possible. Vendryes—Lang. p. 89

A free form which cannot be divided entirely into smaller free forms is a minimum free form or word. Outlines of Linguistic Analysis : Block & Trager

పూవు పూసింది, పూవు విసిరాడు, పూవు వాడింది—ఈ రీతిగా ' అనే పదాంశానికి స్వతంత్రంగా ప్రయోగముంది. కాని -'లు' అనే శానికి ఇటువంటి స్వతంత్ర ప్రయోగం లేదు. 'పూవు' పదము, పదాం కూడ. కాని 'లు' కేవలం పదాంశం మాత్రమే. పదాలన్నీ పదాంశా పదాంశాలన్ని పదాలుకావు. స్వతంత్ర ప్రయోగంగల పదాంశాల్ని 'అ పదాంశాల'ని (free morphemes or forms) [1] అస్వతంత్రమైన శాల్ని "నిబద్ధ పదాంశాల"ని (bound morphemes [2] or forms) అంటా

ఏ భాషలోనైన "నిబద్ధ పదాంశాల" కన్న "అనిబద్ధ పదాం మిన్నగా ఉంటాయి.

27.11 నిబద్ధ పదాంశాల వినియోగాన్ని బట్టి ప్రపంచభాషల్ని ద్విధా గడించవచ్చు: (i) విశ్లేషాత్మక భాషలు: (analytic languages) పదాంశాలను వాడని భాషలు ఉదా: నవీనచైనా భాష. (ii) సంశ్లేషా భాషలు (analytic languages) నిబద్ధ పదాంశాల్ని ఎక్కువగా ఉప గించేభాషలు. ఉదా: ఎస్కిమోభాష. ఈ భాషలో నిబద్ధ పదాంశమ కలసి పదాలుగా ఏర్పడుతాయి[3].

27.12 నిబద్ధ పదాంశ సంయోగరీతి ననుసరించే ప్రపంచ భా స్థూలంగా నాలుగు విధాలుగా విభజించటం జరిగింది.

(i) విశ్లేషాత్మక భాషలు: (Isolating languages) నిబద్ధ పదాం లేనివి.చైనాభాష 2) సంయోగాత్మక భాషలు (agglutinative langua నిబద్ధ పదాంశాలు, విడగొట్టటానికి వీలుగా చేరేవి. ఉదా: తురి

---

[1]Any fraction that can be spoken alone with meanin normal speech is a free form—e. g. play. Block & Tr

[2]A linguistic form which is never spoken alone is a bo form. All others are free forms. Bloomfield Lang P.

[3] [a: whisa-ut-iss? ar-si-niarpu-na] అంటె I am looking something suitable for a fish-line' అని అర్థం— Language 1

(3) బహుధా సంశ్లేషాత్మకభాషలు: (Polysynthetic languages) ఉదా: ఎస్కిమోభాష. నిబద్ధపదాంశాలు బాగా విలీనమై విశేషార్థస్ఫూర్తి కలిగించేవి. (4) ప్రత్యయాత్మక భాషలు (inflectional languages) నిబద్ధ పదాంశాల కలిసిపోయినవి. ఉదా: లాటిన్, సంస్కృతం[1].

27.13 పదాంశమును (నిబద్ధానిబద్ధ) "శబ్దము"నవచ్చు[2]. నిబద్ధ పదాంశమును చిన్తామణి "వర్ణకమ"ని పేర్కొన్నది[3]. నిబద్ధ పదాంశ నిరూపణంలో ప్రాచీన గ్రీకులకన్నా హైందవ వ్యాకర్తలే భాషాశాస్త్రజ్ఞులకు ఆదర్శ ప్రాయమైన కృషి గావించారని బ్లూమ్‌ఫీల్డ్ ప్రశంస[4].

27.14 మరోపదాంశంతో కలయికలేని స్వతంత్ర పదాంశం "సామాన్య పదం" (Simple word) : గోడ, మేడ, ఇల్లు, వాకిలి.

ఒకటిగాని అంతకెక్కుడుగాని పదాంశాలతో కలిసిన స్వతంత్ర పదాంశం 'సంక్లిష్టపదం': (complex word) : గోడకు, గోడమీద, మేడలోపల ఇంట్లో–ఇందులో కొన్ని నిబద్ధ పదాంశాలు కూడ ఉండవచ్చు.

రెండుగాని అంతకెక్కుడుగాని స్వతంత్ర పదాంశాలు కలది "సంయుక్తపదం" (compound word) ఉదా: (homework) మేడ క్రింద, గోడమీద, వాకిలిప్రక్క.

27.2 పదాంశం – సపదాంశం : (morpheme-allomorph)

ఒక పదంలోని అర్థవంతమైన కనిష్ఠ శబ్దాన్ని పదాంశ[5] మనవచ్చు.

---

[1]Bloomfield 13.4

"[2]కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల" అని చిన్నయసూరి వాడటంలో విశేషం గమనార్హం. చూ. బాలవ్యాకరణ వికాసవ్యాఖ్య— సంధి 12 సూ.

"[3]ప్రత్యయఇవ వర్ణకః" ఆం. చిం. సంజ్ఞా 11

[4]The ancient Greeks made some progress in this direction but in the main our technique was developed by the Hindu Grammarians. Language 13.2

[5]Morphemes are the smallest individually meaningful elements in the utterances of a language—
A course in Modern Linguistics 14.1

అర్థ వ్యవస్థతో సరాసరి అన్వయించగల భావప్రకటన కనిష్ఠాంశాన్ని పదాంశ మనవచ్చు[1].

ఒకే పదాంశం ప్రవర్తిల్లే అర్థంలోనే దానికి ప్రతినిధిగా భిన్న పరిసరాల్లో ప్రవర్తిల్లుతు, పరిసర భేదాల ననుసరించి గాని, తదితర కారణాల వల్ల గాని, భిన్న రూపోచ్చారణాలు గలశబ్దాల్ని 'సపదాంశాలు'[2] (allomorphs) అంటారు. ఉదా : తెలుగు బహువచనంలో ఇప్పుడు విశేషంగా ప్రవర్తిల్లే పదాంశం 'లు' దీనికి సపదాంశాలు రు, ండ్రు, ళ్లు, డ్లు మొదలయినవి. వీటిని { } అనే గుర్తులమధ్య ఉంచుతారు. ఇవి ప్రవర్తిల్లే పదాలు, రాములు, పలకలు, బాలురు, నెయ్యురు, పగతురు, కోడండ్రు, చెలియండ్రు, త్రాళ్లు, కొడవళ్లు, ఎడ్లు మున్నగునవి. బియ్యము, ఉప్పు ఇత్యాదులలో శూన్య సపదాంశం (Zero allomorph). కోడండ్రురు, [2]కొడవళ్లులు అర్థశూన్య సపదాంశాలు ( empty allomorphs )

ఆంగ్లంలో బహువచన పదాంశం / s / సకారం. దీనికనేక సపదాంశాలు. (i)శ్వాసాలకు చేరినపుడు సకారం:

---

[1]A morpheme is the smallest unit in the expression system which can be correlated directly with any part of the content system—An Introduction to Descriptive Linguistics

H. A. Gleason (jr.) 5.9

A morpheme is a group of one or more allomorphs which conform to certain, usually rather clearly definable criteria of distribution and meaning. Ibid 5.22

[2] a)... all the morphs which represent some given morpheme are called allomorphs of that morpheme: Hocket 32.2

b) An allomorph is a variant of a morpheme which occurs in certain definable environments —Gleason 5.22

బుక్ – బుక్స్; కాప్ – కాప్స్
మాట్ – మాట్స్; మాచ్ –మాచస్

(ii) నాదాలకు చేరినపుడు "జ్"
కబ్ – కబ్జు, రోజ్ – రోజెజ్; బాగ్ – బాగ్జు

(iii) ఆగమ సపదాంశాలు (ఎన్,- రెన్,- డ్,-)
ఆక్స్ – ఆక్సెన్, చైల్డ్ – ఛిల్డ్రెన్, మేక్ – మేడ్

(iv) ఆదేశ సపదాంశాలు — ఎ: మాన్ – మెన్

(v) ఆగమాదేశాదులు:
రేడియస్ – రేడి; సిలబస్ – సిలబి

(vi) రూపశూన్య సపదాంశాలు: షీప్, డీర్, ఫిష్
{యస్, జ్, -ఎన్, -రెన్, -డ్, - ఎ, } సపదాంశములు

27.21 కొన్ని సపదాంశాలు శూన్యరూపంలో వుంటాయి. వీటినే "రూప శూన్య సపదాంశంలు" (Zero allomorphs) అంటారు. రూపశూన్యం ఎప్పుడు సపదాంశంగానే ఉంటుంది. కాని పదాంశంగా ఉండదు. ఒక అర్థంలో ఒక పదాంశం ప్రవర్తిల్లుతుంటే, కొన్ని చోట్ల ఎటువంటి శబ్దం ప్రవర్తిల్లకుండానే ఆ అర్థం ఏర్పడుతుంది. అంటే పదాంశం యొక్క అభావస్థితి అది. అభావం కూడ ఒక భావమేకదా !

ఆంగ్లంలో బహువచన పదాంశం { S } దీనికనేక సపదాంశాలున్నాయి { -Z, -iz, -ren,-e etc } కాని sheep - sheep; deer - deer, fish – fish, ఇత్యాదుల్లో బహువచనంలో ఏరూపం చేరినట్లు కనిపించటం లేదు. అయినా లేదనలేం. అదే "రూపశూన్య సపదాంశం"

ఇట్టి రూపాన్ని గుర్తించటంలో హైందవ వ్యాకర్తలే భాషా శాస్త్రజ్ఞులకు మార్గ దర్శకులు[1]. పదం ఏర్పడాలంటే ప్రకృతికి ఏదో ప్రత్యయం చేరితీరాలి. ప్రత్యయం లేనిచోట్ల లేదనకూడదు. చేరి లోపించిందనాలి. వ్యాకరణ సంప్రదాయమిది. ఇది విడ్డూరంగా కనపించవచ్చు బాహ్యానికి. కాని దీనిలో ఎంతో సత్తావుంది.

ఇగ్లోరా యుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు[2], ఋకారాంతంబున కత్వంబును, స్త్రీవద్భావంబునగు[3], స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు[4] ఇత్యాది సూత్రాల్లో రూపశూన్య సపదాంశాల్ని గుర్తించవచ్చు.

## 27.22 అర్థ శూన్య పదాంశం: (empty morpheme)

రూపశూన్య సపదాంశానికి వ్యతిరేకమైంది అర్థశూన్యపదాంశం. రూపముంటుంది కాని దానికి అర్థముండదు. పేదరాలు, బీదరాలు వంటి పదాలలోని రేఫ; పల్లెటూరు, దుక్కిటెద్దు, తేనెటీగ వంటి వాటిలోని 'ట్'; రాజునాజ్ఞ, విధాతృనానతి – ఇత్యాదులలోని 'న్' మొదలైన ఆగమాలకు అర్థంలేదు. పూర్వోత్తర పదాంశాల్ని అనుసంధానం చేయటమే వాటిపని. ఇట్టివాటిని 'అర్థశూన్య పదాంశాలు' అనవచ్చు.

పై రీతిగా ఆగమాలే కాకుండ, కొన్ని పదాలలోని కొన్ని పదాంశాలకు అర్థం కనిపించదు. ఉదా: వాడన్నం తినేశాడు. తిన్నాడంటేనేచాలు. వాడా పని పూర్తిచేసేసాడు. చేసాడంటేనేచాలు. వాడు వెళ్ళిపోయాడు.— వెళ్ళాడంటేనేచాలు. మరి ఒక మాండలికంలో వెళ్ళాడంటానికి 'వెళిపొచ్చాదం'టారు.

---

[1]The sheep grazes. The sheep graze. Here the Hindus hit upon the apparently artificially but in practice eminently serviceable device of speaking of a zero element, in sheep : sheep the plural - suffix is replaced by a zero, that is, by nothing at all.

Bloomfie'd p. 2C9.

[2]బా. వ్యా. తత్సమ 44 [3]ఇందే 52 [4]ఇందే 57

ఇటువంటి వాటిని తెనుగు వ్యాకర్త ఒకరు "ఘటక క్రియల"ని నిరూపించారు[1]. విశేషార్థ స్ఫూర్తిలేని ఈ పదాంశాల్ని అర్థశూన్య పదాంశాలనవచ్చు.

పై రీతినిగాక "పూర్ణపదాంశాలు" (Full morphemes) కానివి "రిక్త పదాంశాల"ని (Empty morphemes) ఒక భాషాశాస్త్రవేత్త[2] నిరూపణం. ఇందులో అర్థసంపద అంతగా ఉండదు.

The man chopped some wood, with an axe. అనే ఆంగ్ల వాక్యంలో[3] man, chop, wood, axe అనేవి పూర్ణ పదాంశాలు; the, some, with, an అనేవి "శుష్కపదాంశాలని", స్వతంత్రార్థం కల పదాలు "పూర్ణ పదాంశాల"ని స్వతంత్రంగా అర్థాన్ని ఇవ్వలేనివి శుష్కపదాంశాలని అతని భావం.

27.23 మరికొన్ని పదాంశ భేదాలు :

(i) ఒక పదాంశాని కేమాత్రం మార్పు కలుగనీకుండ ప్రక్కనే అదనంగా చేరే పదాంశాలుంటాయి. వాటిని "ఆగమ పదాంశాల"న వచ్చు. (Additive morphemes)

బొమ్మలు, విలుకాడు, కుత్తుకబంటి

—boys, richer, richest, runner, oxen మొదలైనవి.

---

[1]"భూగమి క్రియయో రంతే ఘటకాఖ్యాన ముచ్యతే" అధర్వణుని వికృతి వివేకము-క్రియా. 23. చూ.తె.వ్యా.వి. పుట 797,98

[2] Full morphemes are nouns, verbs, adjectives and adverbs. They have more or less independent meaning, so that one or a series of full forms in isolation can fairly meaningful.

Language and Its Structure p 72-73 Ronald W. Langacker

ఇంతకన్న It is said, it rains వంటి వాక్యాలలోని 'it'; అనుసంధాయక అస్త్యర్థకాలు – to be forms, is, was, been, are వంటివి రిక్త పదాంశాలంటే బాగుంటుందేమో!

(ii) ఒక పదాంశంలోని కొంత భాగాన్ని తొలగించి, ఆ స్థానంలో వచ్చే పదాంశాలు. ఇవి ఆదేశ పదాంశాలు. (Replacing morphemes)

ఉదా :

man — men
woman — wom n
sing — sang
ma :e — made

(iii) పై రెండు రీతులుగాను ప్రవర్తిల్లే పదాంశాలు "ఆగమాదేశ పదాంశాలు"

sleep — sl e p t
weep — w e p t

27.24 కొన్ని పదాంశాలు ఒకేఒక సన్నివేశంలోనే మరో పదాంశముతో కలిసి ప్రయోగింప బడుతాయి. అట్టివాటిని ఏకైక పదాంశాలు (unique morphemes) అంటారు. ఇందుకు బ్లూమ్‌ఫీల్డ్ (పుట 160) ఇచ్చిన ఉదాహరణం : cranberry. cran- దీనికర్థం ఇదమిత్థంగాలేదు. ఒకానొక రకమైన బెర్రి అనిఅర్థం. ఇటువంటిదే Strawberry లోని Straw— తెలుగులో "సీతాకోక చిలుక" లోని సీతాకోక—; "బ్రహ్మ జెముడు" లోని బ్రహ్మ— ఇటువంటివి. చిలకడదుంపలోని చిలకడ — ఇట్టిదే ననిపిస్తుంది. కాని నిజానికిది 'చిరుగడ'. వ్యవహారంలో ఆవిధంగా మారింది. నాగమల్లి, ఇంద్ర గన్నేరు, గరుడవర్ధన, నందివర్ధన మొదలయిన పుష్పనామాల్లోని తొలి పదాంశాలు ఇట్టివి.

27.25 ఒక పదాంశాన్ని ఆమ్రేడిస్తే అత్యంతార్థం ఏర్పడుతుంది.[1] అటువంటి దాన్ని "ఆమ్రేడిత పదాంశం (reduplicative morpheme అంటారు. ఆఫ్రికన్ భాషలో "mua" అంటే నీరు. దీన్ని ఆమ్రేడిస్తే సముద్రం అని అర్థం.

---

[1] Introductory Linguistics—Robert A.Hall (Jr) p. 135
H. gleason (Jr) 7-19

తెలుగులో ద్విరుక్తమౌతున్న పదాంశంలో మార్పు వస్తుంది:

అదుకు + అదుకు = అందదుకు

తునియలు + తునియలు = తుత్తునియలు

"టగలాగ్" అనే భాషలో ఆద్యక్షరం [1] పునరుక్తంకాగా 'మాత్రమే' అనే అర్థమేర్పడుతుంది.

దలవా—దదలవా
రెండు—రెండుమాత్రమే
ఇశ —ఇఇశ
రెండు—రెండుమాత్రమే

ఒక పదాంశంలో నుండి కొంతభాగాన్ని తీసివేస్తే మరో పదాంశం ఏర్పడుతుంది. ఫ్రెంచిభాషలో 'grand' అంటే గొప్పస్త్రీ. ఇట్టి దాన్ని 'వ్యవకలన పదాంశం' అంటారు. (substantive morpheme)[1]

27.26 ఒక అర్థంలో సామాన్యంగా ప్రవర్తిల్లే రూపాలకు భిన్నంగా ఎట్టి సంబంధంలేని వేరొకరూపం ప్రవర్తిల్లితే అట్టి శబ్దాన్ని సర్వాదేశ లేక సర్వాధిష్ఠ సపదాంశం (suppletive allomorph)[1] అంటారు. దీనికి ఆంగ్లంలో సముచితోదాహరణం go—went; తెలుగులో ఉదాహరణాలు 'వచ్చు' అనేపదాంశానికి వ్యతిరేకార్థంలో ఆదేశమయ్యే 'రా' అనే సపదాంశం; 'అగు' అనే ధాతువుకు వ్యతిరేకార్థంలో వచ్చే 'కా'. "కాదు" అనేదానికి ఒ మాండలికంలో "అవదు" అనే రూపంకూడ ఉంది. ఇవి ఆదేశాలే.

27.27 ఇంకోదృక్కోణంనుండి పదాంశాల్ని రెండు విధాలుగా విభజించవచ్చు. అవి (i) నిష్పాదకములు: (inflexions) (ii) ఉత్పాదకములు (derivatives.)

నామ క్రియా ప్రాతిపదికలకు వివిధ పదాంశాల్ని చేర్చి భిన్న భిన్న రూపాల్ని నిష్పాదింప జేస్తే అట్టివాటికి నిష్పాదక రూపాలంటారు.[2] "నామ

---

[1]Hocket — 33.4

[2]Inflexion : Morphological process in which an element is added to a basic form to denote number, person, case, tense, etc., e.g. home: homes, wait: waited

రూపాలకు వివిధార్థాలలో విభక్తుల్ని చేర్చి రూపాలు సాధించే ప్రక్రియకు "నామ నిష్పాదకత్వం" (declension) [1] అని; క్రియాధాతువులకు విభిన్నార్థ కాల్లో (tenses) (వర్తమాన భూత భవిష్యత్తద్ధర్మాద్యర్థకాలలో) వివిధ క్రియా విభక్తుల్ని చేర్చి రూప సాధనం కావించటాన్ని క్రియా నిష్పాద కత్వం" (Conjugation) [2]అంటారు. క్రియా స్వరూప సమగ్ర ప్రదర్శనమది.

పై రీతిగా నిష్పాదన విధానం కాకుండ, క్రియా ధాతువుల నుండి నామరూపాలనుండి వివిధార్థాలలో (భావ కర్తృ కర్మాద్యనేకార్థాలలో) తిరిగి నామ రూపాల్ని పుట్టించటాన్ని "ఉత్పాదకత్వ" మంటారు. (derivation)

ఈ ఉత్పాదకం రెండువిధాలు:

(i) ప్రాథమికోత్పాదకం: (Primary derivation) దీనినే సంస్కృతాంధ్ర వ్యాకరణాలలో 'కృదంతీకరణం' అంటారు.

ఉదా: అంగు + క 7 అంక: బంధనం: భావార్థం.
మొలచు + క 7 మొలక: మొలచునది. కర్త్రర్థం.

ఇవి ధాతువులకు వివిధార్థాలలో ప్రత్యయాలు చేరగా ఏర్పడ్డవి. ఇవి నామరూపాలు. తిరిగి వాక్యంలో కర్తగా, కర్మగా ఉంటాయి. వీటిపై నామ విభక్తులు చేరుతాయి. (ఈ వివరాలకు బాలవ్యాకరణ వికాస వ్యాఖ్య పుటలు 445—451. చూచేది)

(ii) అనంతరోత్పాదకాలు: (Secondary derivatives) వీటినే సంస్కృతాంధ్ర వ్యాకరణాలలో 'తద్ధితాంతాలు" అంటారు. ఒక పర్యాయం నిష్పన్నమైన రూపాలకు భావాద్యనేకార్థాలలో వేరువేరు ప్రత్యయాలు చేరగా నామరూపాలు పుడుతాయి. తిరిగి వీటిపై నామ విభక్తులు చేర్చవచ్చు.

---

[1]Declension: system or paradigm of inflexions of nouns, pronouns, and adjectives expressing case, gender and number.

[2]Conjugation: system or paradigm of verb inflexions to express tense, mood, voice, person, and number.
Glossary of Linguistic Terms: Language of the Modern world.

మంచి, మంచితనం. మంచితనంతో జయిస్తున్నాడు. (వివరాలకు చూ.బా. వ్యా. వికాసవ్యాఖ్య-పుటలు: 438-442)

### 2.28 ధాతువు : ప్రాతిపదిక (root and stem)

పదంలోని అర్థవంతమైన కనిష్ఠశబ్దం ధాతువు[1]. పదంలోని ప్రధానార్థం ఈ ధాతువులోనే ఉంటుందంటారు. సోదరభాషలలో (cognate languages) ఈ ధాతురూపం చాలవరకు ఒకటిగానే ఉంటుంది. ఈ ధాతువుకు పూర్వంలోగాని, పరంలోగాని, అంతరంలోగాని నిబద్ధపదాంశాలు చేరగా పదత్వం సిద్ధిస్తుంది. ప్రత్యయాత్మక భాషలకు పూర్వానుబంధాలు (Prefixes) అధికం. సంయోగాత్మక భాషలకు పరానుబంధాలు (Suffixes) విశేషంగా ఉంటాయి. సెమిటిక్ కుటుంబానికి చెందిన భాషలలో అంతరనుబంధాలు అధికం.

ఉదా: హీబ్రూ : గ్నొబ్ — దొంగిలించు ; గొనబ్ – దొంగ ; గొనెబ్ – దొంగతనం. ఆంగ్లంలో sing - sang - sung. సంస్కృతంలో రుద్ — రుణద్ధి.

ధాతువు ప్రధానార్థ వాహకమైనా సంస్కృతాది భాషలలో వివిధ ఉపసర్గలు చేరటంచేత, అర్థంలో మార్పువచ్చి, అసలు ధాతువుకున్న అర్థమేమిటో అవగతంకాదు.

"ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యత్ర నీయతే
విహారాహార సంహార ప్రహార పరిహారవత్"

ఇందులో (హృ) ధాతువు అయినా దానిఅర్థం ఇదమిత్థంగా నిర్ణయించలేము. ఈ ఉపసర్గలు కొన్నిచోట్ల ధాత్వర్థాన్ని బాధించి అన్యార్థాన్నిస్తాయి. కొన్నిచోట్ల ధాత్వర్థాన్నే యిస్తాయి. కొన్నిచోట్ల ధాత్వర్థంయొక్క

---

[1] root: basic element of a word, common to all cognate forms, to which prefixes and suffixes are added, e. g. * hen 'grsap' is the root of in - com - pre - hen - s - ib - il - it -y

Glossary—Language in Modern world.

విశేషాన్ని బోధింప జేస్తాయి[1]. ఉదా: తిష్ఠతి – నిలబడుచున్నాడు, ప్ర
ష్ఠతే — బయలుదేరి పోవుచున్నాడు; యాతి, ప్రయాతి; – పోవుచున్నా
హసతి – నవ్వుచున్నాడు, ప్రహసతి; బిగ్గరగానవ్వుచున్నాడు.

ఆంగ్లంలో కూడ con - ceive, per ceive re - ceive, de-ce
వంటి పదాలలో ధాతువైన — ceive కర్థం నిర్ణయించటం కష్టం. అం
చేత ధాతునిరూపణంలో ఊనిక కొంత తోడ్పడుతుంది. " incomprehen
bility" లో ఊనిక — hen — మీద ఉంటుంది. ద్రావిడ భాషలలో ఉ
సర్గలుండవు కాబట్టి సామాన్యంగా ధాతువు పదాదిలోనే ఉంటుంది. చైనీస్
భాషలో ప్రత్యయాలే ఉండవు. ధాతువులే పదాలు. స్వర భేదాన్నిబట్టి, పద
క్రమాన్నిబట్టి అర్థం మారుతుంటుంది.

ప్రత్యయం చేరటానికి అనుకూలమైన పదభాగం ప్రాతిపదిక (Stem)[2]
'అన్నిటికి' అనే పదంలో అన్నిటి— ప్రాతిపదిక. —కి ప్రత్యయం. అన్ని
ప్రాతిపదిక (—టి ఉపవిభక్తి) (inflexion) అన్ని – ధాతువు (root)

తెలుగులో ఔప విభక్తికాంత రూపాలన్నీ ప్రాతిపదికలే. ఇల్లు-ఇంటి
ఇంటి(కి) ఊరు - ఊరిని, త్రాడు-త్రాటిని, గోయి – గోతిలో; నూతి
ఇత్యాదులు.

27.29 పై రీతిగా నిష్పన్నంకాని ఉత్పాదకంకాని పదాంశాలు కొని
ఉన్నాయి. ఇవి చేరే రూపాలు పదాలుకాని, పదబంధాలుకాని, వాక్యా
కాని కావచ్చు. —ఆ: ప్రశ్నార్థకం–రాడా? (వాక్యాంత స్వరాన్నిదీర్ఘంచే
ఉచ్చగా ఉచ్చరిస్తే అది ప్రశ్నఅవుతుంది. వాడు రాడూ ↑)— ఏ
ఏవార్థకం : నీవేతప్పు ఇతఃపరంబెరుగ–ఓ : సందేహార్థకం: వస్తాడో! రాడో

---

[1]ధాత్వర్థం బాధతే కశ్చిత్, కశ్చిత్ తమను వర్తతే. తమేవ
నష్ట్యన్యః, ఉపసర్గగతిస్త్రిధా।

[2]The part of an inflected word that remains unchanged
cept by phonetic changes or variations through out an inflecti
(W

ఘనుడా భూసురుడేగెనో! .... చిక్కెనో!.... – కదా: కిలార్థకం. రాడుగదా వచ్చాడుగదా! ఇట్టివాటిని పదకల్పకావ్యయాలు[1] (clitics) అంటారు.

27.210 నపదాంశాలు శబ్దాన్నాశ్రయించుకొని వ్యాప్తిచెందుతాయి. కొన్ని రూపాన్నాశ్రయించుకొని ఉంటాయి.

| | | |
|---|---|---|
| organic | ⇌ | inorganic |
| accurate | ⇌ | inaccurate |
| sufficient | ⇌ | insufficient |
| consistent | ⇌ | in consistent |
| different | ⇌ | indifferent |
| direct | ⇌ | indirect |
| tolerence | ⇌ | intolerence |
| possible | ⇌ | impossible |
| proper | ⇌ | improper |
| moral | ⇌ | immoral |
| balance | ⇌ | imbalance |
| regular | ⇌ | irregular |
| responsible | ⇌ | irresponsible |
| logical | ⇌ | illogical |

ఈ మొదలైన ఉదాహరణాల్లో in—im—ir—il— ఆయా శబ్దాల్ని బట్టి వచ్చిన వ్యతిరేకార్థక నపదాంశాలు.

im — అనే నపదాంశం ఉభయోష్ఠ్యాలయిన వ, బ, మలకుపూర్వం

in — అనే నపదాంశం అచ్చులకు, దంతమూలీయాలకు, ఊష్మాలకు, క, ట, డ వర్ణాలకు ముందు:

ir — రేఫమునకు పూర్వం

il — లకారానికి పూర్వం, ప్రవర్తిల్లటం గమనించవచ్చు. ఇవి శబ్దాశ్రయాలు.

| | | |
|---|---|---|
| thesis | ⇌ | anti thesis |
| kind | ⇌ | unkind |

ఇందులో anti, un — ప్రత్యేక రూపాలు. ఇవి రూపాశ్రయాలు.

---

[1] ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారిలా తమ భారతి వ్యాసంలో అన్నారు.

27.211 కొన్ని పదాంశాలు రెండుగాని అంతకెక్కువగాని పదాంశాల్ని కలపటానికి పనికివస్తాయి. అంతకన్న వానికి ప్రత్యేకార్థముండదు. సంస్కృతంలో వీటిని "సముచియా"అంటారు. ఇట్టి వాటిని 'అనుసంధానపదాంశా' లనవచ్చు. (Structural markers)

ఉదా: Rama and Krishna

Sons or daughters

### 27.3 పదాంశములు — పరిసరభేదాలు:

పదాంశానికి ఒకటిగాని అంతకెక్కువగాని రూపభేదాలుండవచ్చు .ఇవి భిన్నపరిసరాల్లోనే ప్రవర్తిల్లుతాయి పరిసరభేదాల వల్లనే ఎక్కువగా రూపభేదాలేర్పడతాయి. వాటిని సూత్రీకరించవచ్చు. ఇటువంటి సపదాంశాల్లో కొలదిగా రూపభేదాలున్నా అర్థంలో మార్పుండదు. కాబట్టి వీటిని ఏకపదాంశభాగాలుగా పరిగణించవచ్చు.

'వచ్చ్' ధాతువుకు భూతార్థంలో "–ఇ" పరమౌతుంటే ధాతువులో మార్పులేదు. 'వచ్చి' అనే రూపమేర్పడుతుంది. దీనికి వర్తమానార్థంలో –'తు' పరమైతే ధాతువు "వస్" గా మారుతుంది. వ్యతిరేకార్థంలో –'క' పరమైతే రూపం పూర్తిగామారి, "రా" అవుతుంది. పరిసర ప్రభావంచేత మారిన రూపాన్ని ~ అనే గుర్తుచేత, దానికి భిన్నంగా వచ్చే మార్పును "∞" గుర్తుచేత సంకేతిస్తారు.

వచ్ ~ వస్ ∞ రా; విన్ ~ విణ్ + టు → విణ్టు → వింటు; (విన్ + అక → వినక: మార్పులేదు) చూచ్ + ఇ → చూచి, చూచ్ + తు → చూస్తు; చూచ్ + అక → చూడక అవుతున్నదికాబట్టి చూచ్ ~ చూస్ ∞ చూడ్ అని సూత్రీకరించవచ్చు.

### 27.4 పదాంశస్థాపన : నైడా సూచనలు :

పదాంశాల్ని స్థాపించటానికి నైడా ఈ క్రింది సూచనలుచేసాడు.

(i) అర్థసామ్యం, రూపసామ్యంగలిగి పునరావృత్తమయ్యే శబ్దాలు: ఆవుపాలు, ఆవుతోక, ఆవుపేడ, ఆవుదూడ, పుస్తకాలు, పూలు, గోడలు మాతులు, మేకులు

(ii) అర్థసామ్యముండి, పరిసర భేదంవల్ల రూపభేదమందిన శబ్దాలు:
వచ్చాడు, వస్తాడు, రాడు, చూచాడు, చూస్తాడు, చూడడు
ఉన్నాను, ఉంటాను, ఉండను

(iii) చూస్తాడు, తింటాడు, - త్ - ట్ భవిష్యదర్థాలు, పూర్వశబ్దాల్లో రూప భేదానికి కారణమైనవి.

(iv) రూపసాదృశ్యమున్నా అర్థభేదముంటే అవిప్రత్యేకపదాంశాలే
పాలు = milk, పాలు = Share
కల్లు = toddy, కల్లు = stone
వేరు = root, వేరు = separate

(v) పృథక్స్థితిలో ఉన్న శబ్దాలు. వీటికలయికచే స్వతంత్రార్థకా లేర్పడతాయి.

మేన + రికం (రెండు నిబద్ధ పదాంశాలే. ప్రత్యేక ప్రయోగంలేని శబ్దాలు.కోడంట్రికం)

(vi) వేరొక శబ్దంతో కలిసేవి:
తల్లి + తండ్రి → తల్లిదండ్రులు
అక్క + చెల్లెలు → అక్కాచెల్లెండ్రు

## 5 — ఎ) వాక్య విజ్ఞానం (Syntax)*

28.1 పదాంశం చేకూర్చే అర్థం "అర్థాంశం" (Sememe)[1] ఈ పదాంశాని కీఅర్థం అంటూ ఎలాఏర్పడిందో నిర్ణయించటం సాధ్యంకాదు.

---

* Syntax - sentence constructions study of the arragment and function of words as members of a sentence.
Language in the Modern world - Glossary.

[1]The meaning of a morpheme is a sememe
Bloomfield – P : 162

"గోడ" అనే పదాంశానికి, దానిఆకృతికి ఏవిధమైన సంబంధంలేదు. తెలు
జాతి ఎంతోకాలంగా ఎత్తుగా ఉండే ఒకానొక కట్టడాన్ని "గోడ" అ
వ్యవహరిస్తున్నదంతే. ఇటువంటి పదాంశాల్ని మనం కోశంలో చూస్తాం.
వర్ణాలు, నిర్ణీతమైన క్రమంలో ఉచ్చరింప బడ్డప్పుడే ఇటువంటి పదాం
లేర్పడుతాయి.

కేవల పదాంశాలు, వాటి అర్థాంశాలు తెలుసుకొన్నంత మాత్ర
చేతనే - అంటే నిఘంటువులను మథించినా మనకు భాషా స్వభావం అవగ
మైనట్లుకాదు. ఈ పదాంశాలు ఒకానొక క్రమంలో సమ్మేళనాన్ని పొం
సమన్వయార్థాల్ని సమకూర్చుతాయి. క్రమంలో మార్పువస్తే అర్థంలో
మార్పురావచ్చు. ఎత్తుగోడ, గోడఎత్తు ఇందలి అర్థంలోని మార్పు ఊహిం
వచ్చు. ఇదో నిర్మాణం, అదో నిర్మాణం. ఇంకా వీటిని పెంచవచ్చు. ఎత్తు
గోడలే కట్టారు. గోడ ఎత్తుగా కట్టారు. గోడ ఎత్తు పెరిగింది. ఇందులో
రెండేసినిర్మాణా (Contructions)[2] లున్నాయి. ఈ రెండు నిర్మాణాలు కలిసి
ఒకపెద్ద నిర్మాణాన్ని ఏర్పరచాయి. వీటినే వాక్యాలంటారు. ఒకటిగాని, అంత
కెక్కువగానినిర్మాణాలతో కూడింది వాక్యం, లేక "ఉద్ఘాటనం"(utterance)
కొన్ని నిర్మాణాలలో క్రమంమారినా అర్థంలో పెద్దగా మార్పుండదు.
"కట్టారు ఎత్తుగోడ" 'కట్టారు గోడఎత్తుగా' 'ఎత్తుగోడ కట్టారు' పెరిగింద గోడ
ఎత్తుగా[3] ఇత్యాదులు.

పదక్రమంలో మార్పు తాత్పర్యంలో భేదాన్ని చేకూరుస్తుంది జాన్‌రాన్
యెవే అనేదానికన్న ఎవేరాన్‌జాన్ అనే ఆంగ్లోద్ఘాటనంలో జీవంమిన్న

---

[1] The total stock of morphemes in a language is its lexicon. idid.

[2] whenever two (or, rarely, more) forms are spoken together as constituent of a complex form, the Grammatical features by which they are combined, make up a 'construction'.
(Bloomfield — P 169)

[3] చూ. బా. వ్యా. వికాసవాఖ్య. పుట. 245; కారక - 37 సూ ఆరు నిర్మాణాలు : గాలి చల్లగా వీచెను....

అంటారు[1]. ఐ లైక్ ఫిష్ అనేదాని కన్న ఫిష్ ఐ లైక్ అనటంలో చేపలపై ఎక్కువ మక్కువ స్ఫురిస్తుంది. వక్తకీ విషయాలు సువ్యక్తం.

28. 2. 'పెరిగింది' 'కట్టారు'వంటి పదాల్ని విడగొట్టటం కష్టం.ఇవి సంక్లిష్ట రూపాలు. (complex forms) రెండు పదాంశాలిందులో మిశితమై నాయి. 'ఎత్తుగా' అనేదాంట్లోను రెండు పదాంశాలు కలిసాయి. ఎత్తు + కా (అగు) 'ఎత్తుగా' అని రూపానికి 'కట్టారు.' అనేరూపంతోనే అన్వయం. సన్నిహిత సంబంధం. 'గోడ ఎత్తుగా కట్టా' రంటె "గోడ" అనేఒక్క పదాంశం ఒక అవయవం ( constituent)[1] "ఎత్తుగా" "కట్టారు" అనే సంక్లిష్ట రూపాలు సన్నిహిత అవయావాలు.(limmediate constituents )"ఎత్తుగా" అనేది గోడతోకాకుండా "కట్టారు" అనేరూపంతోనే సన్నిహితత్వం కలిగింది. మొత్తంమీద ఈమూడు రూపాలు సన్నిహితాలు. ఈ ఆసన్న అవయవాలు సన్నిహిత సంబంధినిర్మాణాల్ని (constitue ts structnr)[2] సమకూరుస్తున్నాయి. దీన్నిబట్టి సన్నిహితావయవాలు (immediate constituents-I I.cs) అంటే రెండుగాని అంతకెక్కడు గాని అవయవాలు ఆసన్నమై ఒక నిర్మాణాన్ని చేకూర్చేవని అర్థం[2]. నల్లావు, కృష్ణసర్పం • వంటి నిర్మాణాలు సన్నిహితావయవాల వల్ల ఏర్పడ్డవే.

పై నిర్మాణాల్ని ఈ రీతిగా నిరూపించవచ్చు : ఇది సన్నికర్షవిభజనం (I. C. Analysis)

గోడ + కట్ + ఆరు

గోడ + కట్టారు

గోడకట్టారు.

---

[1]A constiuent is any word or construction (or morpheme) which enters into larger construction. —Gleason P 132.

[2]An immediate constituent is one of the two or a few contitueuts of which any given construction is directly formed—Gleason— P 133

గోడ + ఎత్తు + గా + కట్ + ఆరు
గోడ + ఎత్తుగా + కట్టారు
గోడ + ఎత్తుగా కట్టారు
గోడ ఎత్తుగా కట్టారు
ఎత్తు + గోడ + కట్ట్ + ఆరు
ఎత్తు + గోడ + కట్టారు
ఎత్తుగోడ + కట్టారు
ఎత్తుగోడ కట్టారు

28. 3. ప్రతి ఉద్ఘాటనంలో రెండు ప్రధాన విభాగా లుంటాయి. (1) ఉద్దేశ్యం (Head) ఇది వక్తకు శ్రోతకు విదితం.

(2) విధేయం (attribute) వక్తకు మాత్రమే విదితం. ఇవి ఉద్ఘాటనం లోని నిర్మాణాలలోను, నిర్మాణంలోని సంక్లిష్ట రూపాలలోను, పదాలలోను ఉంటాయి. ఆ విధమైన విభజం ఈ క్రింది రీతిని ప్రదర్శితం.

ఉదా: పెద్దన్నయ్య అన్నంతిని రెండోఆట సినిమాకువెళ్ళాడు. ఇదో పెద్ద ఉద్ఘాటన. ఇందులో పెద్దన్నయ్య, అన్నంతిని, రెండోఆట సినిమాకు వెళ్ళాడు. అనే మూడు నిర్మాణాలున్నాయి. ఈ ఉద్ఘాటనలో పెద్దన్నయ్య అనే నిర్మాణం ఉద్దేశ్యం. తక్కిన నిర్మాణాలన్నీ దీనికి విధేయమైనవి.

ఈ ఉద్ఘాటనంలోని పదాంశాలనన్నీ ఈరీతిగా విభజించవచ్చు : పెద్ద + అన్న + అయ్య + అన్నం + తిన్ + ఇ + రెండ్ + ఓ + ఆట + సినిమా + కు + వెళ్ళ + ఆడు. వీటిని ఉద్దేశ్య విధేయాల క్రింద విభజింపవచ్చు. చిన్న చిన్న నిర్మాణాల్లో ఉద్దేశ్యాలు, పెద్దనిర్మాణంలో కలిసేటప్పుడు విధేయాలు కావచ్చు.

పె + అన్న + అయ్య + అన్నం + తిన్ + ఇ + రెండు + ఓ
పె + అన్నయ్య + అన్నం + తిని + రెండో
పె న్నయ్య + అన్నం తిని + రెండో
పె న్నయ్య అన్నం తిని రెండో
ఆట + సినిమా + కు + వెళ్ళ + ఆడు
ఆట + సినిమాకు + వెళ్ళాడు
ఆటసినిమాకు + వెళ్ళాడు
ఆటసినిమాకు వెళ్ళాడు

28.4 మూడో విభజనం వ్యాకరణ సంబంధి. ప్రతి నిర్మాణం నామబంధం, క్రియాబంధం అనేవి ప్రధానంగా ఉండవచ్చు వీటికి వి లుండవచ్చు.




28.5 ఈ ఉద్ఘాటనంలో అర్థం సమగ్రంగా ఉంది. అపరిసమాప్త ఆక లేదు. సమగ్రార్థ బోధకమైన ఇటువంటి నిర్మాణాల్ని 'అకాంక్ష పరిసమ నిర్మాణా'లంటారు. ఇందులోని పదాలవల్లనే అర్థంపూర్ణంగా చేకూరుతున కాబట్టి వీటిని 'అంతః కేంద్రిక నిర్మాణాల'నీ అంటారు.
(endo – centric phrases or constructions)[1]

సంస్కృతంలోని పూర్వోత్తరోభయ పదార్థ ప్రధాన సమాస ణాలన్ని ఇటువంటివే. సమాసాలకే అందులో పరిమితమైన విషయం శాస్త్రంలో నిర్మాణాలన్నింటికీ విస్తృతంగా అన్వయింపబడటం గమనా ప్రపంచంలోని అన్ని భాషల్లో ఇటువంటి నిర్మాణాలే అధికం.

---

1 Any construction which shows the property just descr and illustrated is endo-centric. Hocket: p. 1

If a phase has the same function as one or more of its im diate constituents it is an endo-centric phrase or constructor Block&T

28 51 ఈ 'అంతఃకేంద్రీకృతార్ధనిర్మాణాల్ని' రెండుగావిభజించవచ్చు (i) విశేషణ-విశేష్యనిర్మాణాలు. (Subordinative or Attributive constructions) (చూ.28.3) ద్వంద్వ నిర్మాణాలు. (Coordinative constructions). వీటిలో రెండుగాని అంతకెక్కువగానిఉద్దేశ్యాలుంటాయి.(Heads) ఉదా : బ్రెడ్-అండ్ బట్టర్, కాఫి, టీ ఆర్ మిల్క్. అండ్, ఆర్ మొదలైనవి. 'అను సంధాయకాలు' (co-ordinators) తెలుగులో ఇట్టివి కృతకం. ఈ మధ్య అంగ్ల ప్రభావంచేత వాడుచున్నారు. 'కాఫీ మరియు భోజనహోటల్' యత్కించిత్ విరామమే ఇటువంటి సందర్భాల్లో చాలు. రాముడు, కృష్ణుడు అన్నంతినివెళ్లారు. రామకృష్ణు లంటే ఏకపదత్వం ఏర్పడుతుంది.

28. 6 పై నిర్మాణాలకు వ్యతిరేకమైనవి- 'బహిఃకేంద్రీకృతార్థ నిర్మాణాలు' (Exo-centric constructions) నిర్మాణంలోని 'అవ్యవహితావయవాలలో' కాక, అన్యత్ర అర్థంగల నిర్మాణాలివి[1]. సంస్కృతజ్ఞులు సమాసపరంగా పేర్కొన్న 'అన్యపదార్ధప్రధానాలు' (బహువ్రీహి)

"అకటా! ఏమని చూరుదాన నిను! నాథా" అనుకూలవతి నాదుమనసులో వర్తించు కులకాంత మది నెంత కుందు నొక్కో! - ఈ నిర్మాణాన్ని "కులకాంత మదినెంతో కుందును। అనిమారిస్తే 'అంతః కేంద్రీకృతం' అవుతుంది.

28.7 ఇంకో దృక్పథం నుండి పరిశీలిస్తే నిర్మాణాలు ద్వివిధాలు (i) సావకాశనిర్మాణాలు : (open constructions) వీటినే వికృత నిర్మాణాలనీ అనవచ్చు. నిర్మాణాన్ని పెంచటానికి గాని పర్యాయపదప్రయోగానికిగాని

---

[1]If a phrase has not the same function as any of its immediate constituents, it is an Exo - centric phrase and has an Exo-centric construction. Ex. For John, in fresh milk. An exo-centric construction has neither a head, nor an attribute.

Block & Trager-

A construction which is not endo-centric is exo-centric

Hocket—p. 185

విలు గల విట్టివి[1]. ఒక చిన్న స్వతంత్ర పదాంశానికి కూడ ఈ లక్షణం ముంటుంది. ఉదా: మంచి, మంచితనం, మిక్కిలి మంచితనం, ఎంతో మిక్కిలిమంచితనంతో రాణిస్తున్నాడు.

'అన్నయ్య' 'పెద్దన్నయ్య' 'డెబ్భై ఏండ్ల పెద్దన్నయ్య' 'వణకు బారిన డెబ్భైఏండ్ల పెద్దన్నయ్య' అనే రీతిగా నిర్మాణాన్ని పెంచటానికి అవకాశముంది.

28. 71 ఈ పెంపుదల రెండు విధాలుగా ఉంటుంది. ఒక నిర్మాణానికి పూర్వంగానైనా ఉండవచ్చు. పరంగానైనా ఉండవచ్చు. పూర్వంగాజరిగితే అట్టిది పూర్వాభివృద్ధి నిర్మాణం[2] (anticipatory expansion) పరంలో జరిగితే పరాభివృద్ధి నిర్మాణమని[3](sequential expansion) అంటారు. ఈ అభివృద్ధి సావకాశనిర్మాణాలకే ఎక్కువ. అప్పుడు పూర్వాభివృద్ధి సావకాశ నిర్మాణాలని (anticiaptory open constructions) పరాభివృద్ధి సావకాశ నిర్మాణాలని (sequential open constructions) అని రెండువిధాల వింగడించవచ్చు.

సామాన్యంగా నామక్రియా విశేషణాలన్నీ తెలుగులో పూర్వంలోనే వస్తాయి. ఉదా :- పెద్దన్నయ్య, అరవై యేళ్ల పెద్దన్నయ్య, నెమ్మదిగా వచ్చాడు. ఆంగ్లంలో నామ విశేషణాలు పుర్వానువర్తులే కాని క్రియావిశేషణాలు పరానువర్తులు. Good boy goes to school in time. Bad boy goes to school late.

---

[1]If a contruction is susceptible of development by the substitution or adition of further elements, is called 'open' if not it is 'close'. This distinction applies even to minimum free forms.',
Introductory Linguistics – Robert A. Hall (Jr.) P. 196

[2&3]If an element is added before what it modifies. we may speak of an 'anticipatory expansion in process it comes after what it modifies, will be termed sequential expansion Ibid—P. 197

28.72 మొత్తంమీద సావకాశ నిర్మాణాలు చాలావరకు అంతఃకేంద్రీకృతార్థకాలే (endo-centric) : కులకాంత కుందుతుంది. నామనస్సులో వర్తించు కులకాంత మదిలో కుందుతుంది. అనుకూలవతి, సాదు మనసులో వర్తించు కులకాంత మదిలో ఎంతగానో కుందుతుంది. ఈ విధంగా నిర్మాణాల్ని పూర్వంలో పెంపుచేస్తున్నాం. కాబట్టియివి "పూర్వావకాశఅంతఃకేంద్రీకృతార్థ నిర్మాణాలే" (anticipatory endo-centric open construrctions) ఈ నిర్మాణాలకే : "కుందుతుందో!" "కుందునో కొ!!" అని ఆశ్చర్యార్థకాన్ని సందేహార్థకాన్ని (clitic) చేరిస్తే, ఆకాంక్ష పరిసమాప్తంకాదు. అప్పుడా "కుందు" ఎంతటిదో తెలియదు. అందుచే అది "పూర్వావకాశ బాహ్యకేంద్రీకృతార్థ నిర్మాణం" (anticipatory exo-centric open construction) అవుతుంది.

28.8 సావకాశ నిర్మాణానికి వ్యతిరేకం "నిరవకాశ నిర్మాణం" (closed construction). సామాన్యంగా "బాహ్యకేంద్రీకృతార్థ నిర్మాణాలు" పెంచటాని కవకాశమిచ్చేటట్లుండవు. ఉదా : "అకటా! ఏమని దూరుదాన నిను నాథా!" ఈ ఉద్ఘాటనాన్ని పెంచటం సాధ్యంకాదు. కాకపోతే "అకటకటా!" అనవచ్చు. పెద్దవిశేషంలేదు. ఇటువంటి ఉద్ఘాటనాలేభాషలోనైనా పరిమితంగానేవుంటాయి. ఇట్టివి "బాహ్యకేంద్రీకృతార్థ నిరవకాశ నిర్మాణాలు" (exo-centric closed constructions).

28.81 నిర్మాణాల్ని పెంపుచేస్తున్నా ఒక్కొక్క విశేషణం ఆ పెంపుదల నరికడుతుంది. అప్పుడా నిర్మాణం "నిరవకాశం" (closed) అవుతుంది. పెద్దన్నయ్య, డెభ్భైయేండ్ల పెద్దన్నయ్య. "మా" చేరిస్తే పెంపుదల ఆగిపోతుంది. సావకాశం నిరవకాశం అవుతుంది. ఆంగ్లంలో యీరీతిగానే :

| | |
|---|---|
| (milk) | anticipatory |
| fresh (milk) | open |
| nice(fresh (milk) | constructions |
| very(nice(fresh (milk) | |
| (this(very(nice(fresh (milk) } | (closed construction) |
| (some(very(nice(fresh(milk) } | ( ,, ) |

28.9 ఒకటి రెండు ఆంగ్ల నిర్మాణాల విభజనం.







ఉద్ఘాటనాల్ని పైనసూచించినట్లు అనేకవిధాల విభజించటం అభ్యాసం చేసికోటం "భాషాకేళి."

29.1 తెలుగువాక్యం : ఆధునికాంధ్ర వ్యాకరణాలు తెలుగు వాక్య స్వరూపాన్ని కొంతవరకు నిరూపించటానికి యత్నించాయి. పాశ్చాత్యులాంధ్ర భాషను గూర్చి రచించిన వ్యాకరణాల్లో వాక్యనిరూపణానికి శ్ర వహించారు. వారిలో సి. పి. బ్రౌన్, విలియం బ్రౌన్, హెన్రీ మోరిస్, హాలి ఆర్డెన్ మున్నగువారు ప్రసిద్ధులు.

ఆధునికంగా వాక్యాన్నిగూర్చి పరిశోధించిన వారు డా॥ చేకూరి రామారావు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ "తెలుగువాక్యం" అనే వారి గ్రంథాన్ని ప్రచురించింది. వ్యవహారంలోని 242 వాక్యాలిందులో వారు (ఎన్నో అవాంతర భేదాలతో) పరిశీలించారు. సామాన్య వాక్యాలు, సంశ్లిష వాక్యాలు, అనుకృతి వాక్యాలు, సంయుక్తవాక్యాలు అనే శీర్షికల క్రింద పై వాక్యాలు వివిధోపశీర్షికల క్రింద పరిశీలింపబడ్డాయి. ఈ గ్రంథ ప్రచురణానికి ముందు "భారతి" లో వారి వ్యాసాలనేకం వాక్యంపై ప్రచురితాలు.

ఉద్దేశ్య విధేయాలు వాక్యంలోని ప్రధాన భాగాలు. విధేయాలు క్రియా విరహితంగా వుండటంతో తెలుగువాక్య వైలక్షణ్యం గోచరిస్తుంది. సుదీర్ఘవాక్యరచన సంస్కృతానికి లాగా తెలుగుకు విహితంకాదు. "కడు పసిబిడ్డ వీడు, ఒకటి కాదవునా యెరుగండు. ముందరయ్యేడి ఒక పాటెరుంగడు. ఎదయెంతయు కోమలము. ఎప్పుడైన నే కుడువగ బిల్తుగాని తనకుం గల ఆకటి ప్రొద్దెరుంగడు. ఈకొడుకిటు వోకకుం మనసు కుందెడు. నిన్గని యూరడిల్లెడున్" వంటివి తెలుగు వాక్యాలు. భాషాశాస్త్రం సారస్వతం లోని వాక్యాల్ని పరిశీలించేదానికన్న నిత్య వ్యవహారంలోనివే పరిశీలించటం ఉత్తమ మంటుంది.

యత్తదర్థకాల వాడుకకన్న, ధాతుజ విశేషణాల వాడుకే తెలుగులో అధికం. ఇవి కర్తకు కర్మాదులకు తుల్య ప్రాధాన్యాన్ని చేకూరుస్తాయి[1].

29. 2 ఎంతచెప్పినా ఇంకాయెంతో చెప్పటానికి వీలయింది వాక్యం. ఇది విరామం మీద విశేషంగా ఆధారపడి వుంటుంది "పోతన, మహాకవి" "పోతన" ఉద్దేశ్యం, "మహాకవి" విధేయం అని పోతన తరువాత అర్ధ విరామంతో పలికితే అది వాక్యం. అవిరామంగా పలికితే యిదంతా ఉద్దేశ్య మౌతుంది, విధేయముండదు. "పోతనమహాకవి,భాగవత మాంధ్రీకరించాడు" ఇప్పుడు వాక్యమౌతుంది. ఈవిధంగా వాక్యస్వరూపం విశేషంగా ఉద్దేశ్య విధేయాల మీద ఆధారపడి వుంటుంది. విధేయం క్రియారహితంగాను, సహితంగాను వుండవచ్చు. "పోతన మహాకవి ఆంధ్ర భాగవత కర్త"

---

[1] బా. వ్యా. వికాస వ్యాఖ్య-పుట. 273

# 6. విపరిణామ విజ్ఞానం (Change)

30.0 విపరిణామమంటే మార్పు. భాషనిరంతర పరిణామస్వభావంకలది. ఈ మార్పు నియతంగా పద్ధతి ప్రకారం కలుగుతుంది. కాబట్టే భాష ఒకవ్యవస్థగా, శాస్త్రంగా అధ్యయన యోగ్యమైంది. వివిధ జంతు వితతి చేసే కంఠధ్వనుల్లో ఏమాత్రం మార్పులేదు. అందుకే అవి భాషలు కావు. దేశ కాలాల్ని బట్టి మానవులుచేసే ధ్వనుల్లో మార్పు కన్పిస్తుంది. అందుచేతనే అవి భాషలు

విపరిణామం మూడు విధాలు :

(1) శబ్దవిపరిణామం : శబ్ద స్వరూపంలో వచ్చినమార్పు. ఉదా యోగి - జోగి ; యాత్ర - జాతర

(2) అర్థవిపరిణామం : శబ్దాకృతిలో మార్పులేకపోయినా అర్థంలో మార్పురావచ్చు. వ్యాకరణం నిరూపించే ఆర్థికమైన మార్పులుగాక నైఘంటికార్థంలో వచ్చే మార్పుల్ని అర్థవిపరిణామం అంటారు.[2] ఒకప్పుడు "ఆలు" అంటే స్త్రీ. అనంతరం "భార్య"అనే అర్థమేర్పడింది. (3) శబ్దార్థ విపరిణామం : జోగి-జాతర అనే పదాల్లో శబ్దాకృతిలోనే గాక అర్థాకృతిలో కూడా మార్పువచ్చింది. బిచ్చగాడు, అల్లరి అనేఅర్థాలేర్పడ్డాయి. శబ్దవిపరిణామమేర్పడ్డంత వేగంగా అర్థవిపరిణామం కల్గదు. శబ్దార్థవిపరిణామాలు పై రెండింటికన్న తక్కువగానే వుంటాయి ఏభాషలోనైనా

---

[1] "Dogs have been barking, cats miaowing, lions roaring and donkeys braying in the same way since time immemorial, While all languages evolve to some extent. Human language, as opposed to animal cries, displays infinite variability, both in time and in space. Flexibility and change may be described as the essence of all living languages"

"Lectures on Linguitsics" —
F. M. Berizen. pp 12-13

[2] Innovations which change the lexical meaning rather than the grammatical function of a form are classed as change meaning or semantic change.

Bloomfield — 24. 1

ఈ పరిచ్ఛేదంలో ముఖ్యమైన శాబ్దిక ఆర్థికవిపరిణామ హేతురీతులు పరామర్శింప బడుతాయి.

30. 2 శబ్ద విపరిణామ హేతువులు, రీతులు : శబ్దాకృతిలో మార్పు అనేక కారణాల్ని పురస్కరించుకొని కల్గుతుంది. అవిచాలవరకు మనస్తత్వ శాస్త్రానికి సంబంధించినవి. కొన్ని మార్పులెందుకు కలిగాయో ఊహించలేం, అగమ్యాలు.[1] మార్పులు చాలవరకు హటాత్సంభవాలంటారు. ప్రధానకారణం: వక్తకు గల సౌలభ్యాపేక్ష. ఉచ్చారణలో లాఘవాన్ని సాధించడానికే ప్రతి వక్త, వ్యక్తావ్యక్తంగా ప్రయత్నిస్తుంటాడు. ఊనికను సరిగా పాటించడు. మార్పు, శ్రోత అవగాహనానికి ఆఘాతం కల్గనంతమేరకు వక్త కావిస్తూనే వుంటాడు.

30. 21. పదాది సంయుక్త ఉచ్చారణ క్లేశమైంది. దానినితొలగించుకోటానికి ఆయా భాషావ్యవహర్త లెల్లాప్రయత్నించింది భాషాచరిత్రలు నిరూపిస్తాయి. ప్రాచీనాంగ్లంలోని పదాది వ్యంజనసంయుక్తాలు క్రమంగా అసంయుక్తాలయినాయి. ఉదా : హ్రింగ్ → రింగ్: హ్లీవన్ → లీవ్; హ్నెక్క → నెక్క: క్నీవ్ → నీ; తెలుగులో కూడయిటువంటి వున్నాయి. క్రోతి → కోతి; ప్రాత → పాత: క్రొత్త → కొత్త; వ్రాత → రాత.

ఈ రీతిగా పదాంతవ్యంజన సంయుక్తతకూడా తొలగిపోతుంది. [2]ఇండో-యూరోపియన్ మూల భాషలలోని 'పేట్స్' అనేరూపం లాటిన్‌లో "పేస్" అని, సంస్కృతంలో "పాద" అని మారింది. ప్రాచీనాంధ్ర శాసనాల్లోని వాణ్డు → వాడు అని, మూణ్డు → మూడు అని కావట మిట్టిదే. పద మధ్యంలోని సంయుక్తత అసంయుక్తమౌతుంది. ప్రాచీన

---

[1]a. "The reasons for these phonetic changes are still obscure" — "Lectures on Linguistics" P—98 F. M. Berizen.

b. The causes of sound - change are unknown Bloomfield : P : 385

[2]Bloomfield pp: 371 - 72 (21:2,3)

" All droppings of consonants also make for phonetic ease.. "Efficiency in linguistic change"—Jesperson—pp' 170

లాటిన్ : ఫుల్‌గ్మెన్ - లాటిన్ : ఫుల్‌మెన్ (ఫ్లాష్ అని అర్థం). ఈ రీతిగా సంయుక్తత అసంయుక్తం కావటాన్ని "Simplification of consonantal clusters" )[1] అంటారు.

30. 3 సమీకరణాలు (Assimilations) సాధారణంగా వర్ణ సంయుక్తత వర్ణసమీకరణానికి దారితీస్తుంది. ఇందులోను సౌలభ్యమేకారణం. ఒక వర్ణాన్ని ఉచ్చరించేటప్పుడుండే అవయవస్థానాన్నిమార్చి ప్రక్క నుండేవర్ణాన్నుచ్చరించే స్థానంలో ఉచ్చరిస్తే అదివర్ణసమీకరణ మౌతుంది.[2] ప్రక్కనున్న వర్ణంతో పూర్తిగా సమీకరిస్తే అది "పూర్ణసమీకరణ" మౌతుంది. (Complete assimilation) . ఉదా : అక్టో→అట్టో (ఎనిమిది) ; అగ్ని→ అగ్గి. ప్రక్కనున్న వర్ణోచ్చరణ లక్షణాల్ని కొన్నింటిని మాత్రమే పొందితే అది "పాక్షిక సమీకరణ" మౌతుంది[3] (Partial assimilation). (సం) స్వప్న→(లా) సోమ్నస్. పకారం మకారంగా మారింది. అనునాసికత సమానలక్షణం.వాక్ + మయము→వాఙ్మయము; బదుకు → బతుకు; → ఉదుకుఉతుకు ఇట్టివి.

---

[1]Quite commonly clusters change by way of assimilations. The position of the vocal organs for the production of one phoneme is altered to a position more like that of the other phoneme.

Bloomfield. P. 372

[2]Assimilation is the process where by one phoneme is harmonised with another, either by being made identical with it, or being given common characteristics, Foundation of language

L. H. Gray P. 68.

[3]The assimilation may affect the action of the velum, tongue or lips. If some difference between the consonants is kept, the assimilation is partial. Bloomfield - P. 373

పరవర్ణం పూర్వవర్ణంతో సమీకరిస్తే అది "పరవర్ణ సమీకరణ" మౌతుంది. (progressive assimilation)[1] ఉదా : అగ్ని→అగ్గి; పలన→పల్న→పల్ల; కావ్యం → కబ్బం; కొలను → కొల్ను→కొల్లు:సత్య → పత్తు; లక్షణ → లక్కన; లాక్ష → లక్క ; సత్య → సత్తె ఇత్యాదులు. పరవర్ణంతో పూర్వవర్ణం సమీకరిస్తే అది "పూర్వవర్ణ సమీకరణ" మౌతుంది. (Regressive assimilation). ఉదా: భక్తి →బత్తి; శక్తి → సత్తి; అర్పణ → అప్పన ; కర్పూర→ కప్పుర ; దుగ్ధ → దుగ్గ ; అర్క → అక్క ; ఆశ్చర్య → అచ్చెరువు ఇత్యాదులు. పూర్వవర్ణసమీకరణం పరవర్ణసమీకరణం కంటె అధికమని బ్లూమ్ ఫీల్డు అభిప్రాయం[2]. తద్భవాలను బట్టి లెక్క తేల్చి యీ యభిప్రాయ సమీచీనతను నిర్ణయించ వచ్చు. ఇండో యూరోపియన్ భాషలలో పరవర్ణ సమీకరణ మధికమంటారు[3]

పూర్వవర్ణం, పరవర్ణాన్ని ; పరవర్ణం, పూర్వవర్ణాన్ని ప్రభావితంచేస్తే అది "పరస్పర వర్ణసమీకరణం" (Reciprocal assimilation) అవుతుంది. ఉదా : వేడి + నీళ్ళు→వేడి + ణీళ్ళు (మూర్ధన్య "డ" కారం నకారాన్ని ణ గా మార్చింది)→వేణ్ణీళ్ళు ( 'ణ' ప్రక్కనున్న 'డ' ను 'ణ' కావించింది) ఈ సమీకరణం పూర్తిగా ప్రక్క ప్రక్కవర్ణాలకు జరిగింది. కాబట్టి దీన్ని "పార్శ్వ వర్ణపరస్పరపూర్ణ సమీకరణం" అనవచ్చు (complete juxtaposinal, reciprocal assimilation)[4] తత్ + చరితం→తచ్చరితం; తత్ + టీక→తట్టీక

---

[1]In progressive assimilation the latter consonant is altered Thus pre-Latin (Kolnis) Latin (collis). Bloomfield : p. 37:

[2]the common case is regressive assimilation, change of the prior phoneme. Bloomfield . p : 372

[3]In Indo-Europian languages, assimilation is most frequently of the regressive type. ఇందులో "Thought is ahead of the speech" అన్నమనస్తత్త్వ నియమ మున్నదంటారు.

Foundation of the Language. C. H. Gray, p 68

[4]Juxtapositional Assimilation నే Continguous Assimilation అనీ అంటారు. - ఇందే - పుట 68, Gleason · p. 84

వంటివి పార్శ్వవర్ణపూర్ణ సమీకరణాల కుదాహరణలు (complete juxtapo-sitinol assimilation). ఇంకో ఉదాహరణం: పూచెన్ + కలువలు→ పూచెన్ + గలువలు (పార్శ్వవర్ణ పాక్షిక సమీకరణం). → పూచెజ్గలువలు (పరస్పర పార్శ్వవర్ణ పాక్షిక సమీకరణం). నాదతరమగు అనునాసిక నకారం శ్వాస కకారాన్ని నాద గకారంగా మార్చింది. తిరిగి గకారం తన ప్రక్కనున్న నకారాన్ని తన వర్గంలోని జ్ గా మార్చింది.[1]

30. 32 స్వర సమీకరణం (Vocalic assimilation) పై రీతిగా స్వర సమీకరణం కూడా జరుగుతుంది. ఇది ఉచ్చారణలో సౌలభ్యాన్ని సాధించే దానికే. చాల భాషలలో లేని యీలక్షణం తెలుగు భాషలో విశేషంగా కన్పి స్తుంది. అందుచేతనే యీభాష మృదు మధురమైందిగా పాశ్చాత్య భాషా వేత్తల ప్రస్తుతికి పాత్రమైంది.[2]

దీన్ని కాల్డ్వెల్ పండితుడు 'స్వరైక్య సిద్ధాంతమ'ని యిరీతిగా పేర్కొన్నాడు. (The law of harmonic sequence) ఒకానొక పదంలోగాని, ధాతువులోగాని వున్న అక్షరంలోని స్వరం తన్ననుసరించే అక్షరంలోని స్వరంతోగాని లేదా అనుసరించి వచ్చే స్వరం తనకు పూర్వమందున్న

---

[1] బా. వ్యా. వికాసవాఖ్య. పుటలు : 66–68

[2] ........euphonically exceptionally beautiful even when using foreign words – G. Home field , M. C. Hoed, Hindu 1 6 - 7 – 58

Among these five languages, the Telinga appears to be the most polished...............

Dr. Carey : Telinga Grammar (1812)

'........... it may boast, in a particular manner, of great elegance of expression and melody of sound,,

Dr. Campbell : Introduction to Teloogoo Grammar (1816)

...... whilst in point of euphonic sweetness it just claims to occupy the first place"

Dr. Caldwell, Comparative Grammar p: 25 (1956 Edition).

స్వరంతోగాని సమైక్యం చెందుతున్నది. [1]ఈ సమైక్యం విశేషంగా ఇ- ఉ లమధ్యే జరుగుతుంది.

(i) ఇ 7 ఉ : హరి + లు → హరులు; గిరి + లు → గిరులు; కత్తి + లు కత్తులు. (అన్యదేశ్యాల్లో యీ మార్పు కనిపించదు. బెంచి + లు → బెంచీలు; కుర్చీ + లు → కుర్చీలు)

అంతిమ ఇకారమేగాక మూడక్షరాలుగల పదాల్లో దాని ప్రక్కనున్న ఇకారంకూడ ఉత్వమౌతున్నది. కలికి + లు → కలుకులు; ములికి + లు → ములుకులు. ఇట్లే చెలుములు, కలుములు, బలుములు మొదలైనవి. మూడక్షరాలనటంచేత జిగి + లు → జిగులు; పిడికిలి + లు → పిడికిళులు; పందిరి + లు → పందిరులు ; రాపిడి + లు → రాపిడులు వంటి పదాల్లో పై మార్పు రావటంలేదు. ఇత్వప్రభావమిది. ఇంతకన్న ఉత్వ ప్రభావమే అధికమేమో! వీటిలో పూర్వస్వరం ప్రక్కనున్న పరస్వరంతో సమీకరించింది. కాబట్టి 'పూర్వ పార్శ్వక స్వరసమీకరణం' అనవచ్చుదీన్ని. (Progressive juxta positional vocalic Assimilation).

(ii). ఉ 7 ఇ : ఇకారం మీది విభక్తుల్లోని 'ఉ' 'ఇ' గా మారుతున్నది. ఉదా: హరి + ను → హరిని; హరి + కు + ను → హరికిని: శ్రీ + ను → శ్రీని; శ్రీ + కు + ను → శ్రీకిని; వారి + ను → వారిని; సుకృతి + వు → సుకృతివి;సుకృతి + ను → సుకృతిని;వండు + ఇ + రు → వండిరి; వండితి + వు → వండితివి; ఇట్లే వంటితిని; వండితిమి.

ఇత్వ ప్రభావం అనాద్యమైన ఉత్వం మీద కూడ ప్రసరిస్తుంది. నిగుడు + ఇ / ఎ = నిగిడి / నిగిడె; మునుగు + ఇ/ఎ = మునుగి / మునిగె ఇత్యాదులు.

---

[1]A given vowel, occuring in one syllable of a word, or in root, requires an analogous, i. e., a vowel, belonging to the same set, in the following syllables of the same word, or in the particles appended to it, which therefore, alter their vowels accordingly. ......it is in Telugu, that it comes out most distinctly and regularly Caldwell, P. 181 (1956. Edi)

ఐకారం ఈతో తుల్యం కాబట్టి రైని, రైకి, పైకి, కైకి వంటి రూపాలేర్పడుతున్నాయి. పుచ్చు - పుప్పు - పుప్పి - పిప్పి (పిప్పిపన్ను).

టి, తి వర్ణాలు పరమౌతున్నప్పుడు కూడ ఉత్వ మిత్వ మౌతున్నది. రెండు + టి + కు → రెండిటికి ; ఇట్లే మూటికి, పెక్కిటికి. ద్విత్వం తోకూడిన "ఉ" "ఖ" కావటంలేదు : నెత్తుటికి. ఇట్టివి పరపార్శ్వకస్వర సమీకరణాలనవచ్చు (regressive juxatapositional vocalic assimilations).

చెప్పమన్నాడు, తినమన్నాడు, చేయమన్నాడు వంటి అధ్యర్థక్రియలలో ధాతుగత ఉకారం అకారం కావటానికి కారణం ప్రక్కనున్న అత్త ప్రభావం. వ్యంజన ప్రభావంవల్లకూడ స్వరంపై ప్రసరించి మార్పు తేవచ్చు. ఉదా : మగడు - మొగుడు ; మనుమరాలు - మనమరాలు కావటం స్వర సమీకరణం.

30. 33 పదాంశసమీకరణం (Morphological assimilation) సంస్కృతంలో విశేష్యం ఏలింగంలో, ఏవచనంలో, ఏ విభక్తిలో ఉంటే, విశేషణం కూడ అదేలింగంలో, వచనంలో, విభక్తిలోఉండటం: 'సుందరీ సీతా ; సుందరంవనం;సుందరః రామః,' ఇటువంటిదికావచ్చు. తెలుగువ్యాకరణాల్లో ఇటువంటివాటికి నియమం కావించటం సంస్కృత ప్రభావంవల్లనే[1]. "పద్మలత మనోహారిణి" అనే కాక, పద్మలత మనోహారి" అనికూడ అనటం లతా శబ్దం - స్త్రీ లింగం కావటమే - ఇట్టివాటిని ఈ శ్రేణిలో చేర్చవచ్చు[2].

వాడు వస్తున్నాడు ; అది వస్తున్నది ; నీవు వస్తున్నావు ; మీరు వస్తున్నారు; నేను వస్తున్నాను, మేమువస్తున్నాము వంటిరూపాలలో ఇటువంటి సమీకరణాన్ని గుర్తించవచ్చు[3].

---

[1]బా. వ్యా. కారక: 19

[2]మహతీతరంబులగు స్త్రీ లింగముల విశేషణంబులకు గ్లీబత్వంబు విభాషనగు, "హృద్యయగు విద్య" తెలుగు పద్ధతి ప్రకారం "హృదమగు విద్య" అనాలి, లింగప్రభావం.

(బా. వ్యా. తత్సమ. 86) వికాస వాఖ్య పుట 16 - 168

[3]ఇవి దూరపదాంశ సమీకరణానికి కూడ ఉదాహృతులౌతాయి.

30. 34 వర్ణసమీకరణం వాక్యంలో దూరంగా కూడ జరగవచ్చు. ఇట్టి దాన్ని "దూరసమీకరణం" (distant assimilation) అనవచ్చు. ఉదా : "ఆనమ త్సురాసుర మకుటాగ్ర రత్న రుచి శోభిత పాదునకు అద్రి నందనేశ్వరునకు, భూషణంబైన వాసుకి" ఇందులో విశేషణం, విశేష్యాన్ని బోలి షష్ఠిలో ఉండటంచేత ఇది "దూరపదాంశ పార్శ్వసమీకరణ" మౌతుంది (distant morphological juxtapositional assimilation).

30. 4 వర్ణవిభేదం (Dissimilation) ఇది సమీకరణానికి వ్యతిరేకమైంది. విభిన్న వర్ణోచ్చారణం క్లేశమైనట్లుగాని, ఒకపదంలో సమాన వర్ణోచ్చారణంకూడ ఒకప్పుడు మానవునకు కష్టమనిపించి వుండవచ్చు. అప్పుడొక వర్ణాన్ని భిన్నవర్ణంగా ఉచ్చరిస్తాడు. లాటిన్ "పిరిగ్రినస్" (విదేశీయుడు, క్రొత్తవాడు) రొమాన్సు భాషల్లో "పెలేగ్రినస్" గాను, ఇటాలియన్‌లో "పెల్లెగ్రినో" గాను ఆంగ్లంలో "పిల్గ్రిమ్" గాను మార్పుచెందింది. "సెరెబ్రమ్", "సెలెబ్రమ్" గా మారటమట్టిదే .సంస్కృతంలో "క + కృ—చకృ ; హు + హు— జుహు ; ధ + ధ—దధా ; "ఛోధామి" వంటి చారిత్రక రూపం "బోధామి" కావటం ఇందుకుదాహరణాలు. "భీభత్సుడు" "బీభత్సుడు" కావట మిట్టిదే! రెండు మహాప్రాణాల్ని వెంట వెంటనే ఉచ్చరించటంలోని క్లేశాన్ని తొలగించుకోటానికి తొలిదాన్ని అల్పప్రాణంగా మార్చుకోవటం.

తెలుగులో : కొడవలి + లు — కొడవలులు — కొడవళులు ; వచించు + ఇంచు—వచించించు—వచింపించు ; చూచు + ఇంచు — చూచించు— చూపించు మున్నగునవి. బొమ్మలు + ఇల్లు—బొమ్మలిల్లు—బొమ్మరిల్లు.

ఈ విభేదం వ్యంజనాలలోనేకాక స్వరాలలోకూడ కలగవచ్చు. అప్పుడట్టి వాటిని స్వరవిభేదం (Vocalic dissimilation) అనాలి. వారు + లు— వారులు—వారలు; అమ్మ + అమ్మ—అమ్మమ్మ—అమ్ముమ్మ;

30.5 వర్ణవ్యత్యయం (metathesis)[1]

---

[1]A change of place, or condition, transposition of two phonemes in a word. (Webster)

తడబాటువల్ల ముందువర్ణం వెనుక, వెనుకవర్ణం ముందు ఉచ్చరించటం జరిగితే అది వర్ణవ్యత్యయ మౌతుంది. ఈ తడబాటు అనవధానత వల్ల కూడ కలుగవచ్చు. "స్ఫూనర్" అనేవ్యక్తి Sons of the soil అనటానికి tons of the soil అన్నాడట. మహాభారతంలో ఆదివర్వతం అన్నట్లుగా. దీనికి స్ఫూనరిజమ్ అనేపేరు. అనంతపల్లి రాళ్లకృష్ణశర్మ, విశ్వసత్య నాథాయణ వంటి ఓట్టివే, చమత్కారజనకాలు.

తెలుగులో ఏడు + పది — డే + బది — డెబ్బది అయిందని ఒకవ్యాకర్త చేర్కొన్నాడు [1]. ఒక-కొ + అంత - కొంత అనే రూప మేర్పడ్డదంటా డీతడు.[2] నవ్వలు + ఆట — నవ్వులాట — నవుటాల.[3] ఎల — లే ; -అనగ — నాగ, అనవుడు — నావుడు ఇట్టివే.

ప్రాచీన ద్రావిడ భాషలోని రూపాలుకొన్ని ఇటువంటి మార్పును బొందే తెలుగులో ప్రవేశించాయి. అవన్ఱు — వాన్ఱు — వాణ్డు — వాండు — వాఁడు; అవర్ — వారు; ఉరల్ — రోలు

జనవ్యవహారంలో బాగాపాతుకొన్న "గజదొంగ"అనేపదం, 'జగదొంగ' అనేపదానికి వర్ణవ్యత్యయం. "పావురం" అనేది "పారువం" అనేదానికి, "తవుడుకొను" అనేది "తడువుకొను" అనేదానికి వ్యత్యయరూపాలు. ప్రాచీన ఆంగ్లంలో వాస్ప్, నవీనంలో వాప్స్ అయింది.

30. 6 అజ్లోవం (Synecopation) :దీన్ని "స్వరనాశం" అంటారు. పదంలో ఊనికలేని స్వరంలోపిస్తుంది. ఇదికూడ ఉచ్చారణ త్వరకారణంగా

---

[1] ప్రౌ. వ్యా. సమాస. 24

[2] ప్రౌ. వ్యా. శబ్ద. 51

[3] సూర్యరాయాంధ్ర నిఘంటు విందుకు ఆరు ప్రయోగాలు భారతాదులనుండి ఇచ్చింది. ఇందులో ఒక్కటే నిర్ధారకం. టకారంతో యతిగలది "నవ్వు/ టాలకుఁబన్నిదమిడి సొగటా లాడగనో/ట ........"

(ప్రబోధరాజ వేంకటేశ్వర విజయ విలాసం 636)

కలిగే మార్పే. శ్రోత అవగాహన దెబ్బతిననంతవరకు ఉచ్చారణలో వేగాన్ని సాధిస్తాడు వక్త. ఇది నాగరకతకు, తెలివితేటలకు సూచనంగాను భావింప బడుతున్నది[1]

లాటిన్ : calidus→caldus; dominus→domnus

ఆంగ్లం : interesting→intresting

ఆంధ్రం : అబ్బురము→అబ్రము[2,3]

అదురుచు → అద్రుచు ; చిలుక → చిల్క, కినుక → కిన్క ; వేడుక → వేడ్క; కూరుకు → కూర్కు; పెరుగు → పెర్గు[4]; కలికి → కల్కి ;ములికి →ముల్కి ; బుడిపి → బుడ్పి ; పొలతి → పొల్తి[5] ; మ్రానువడు → మ్రాన్పడు ; మినువడె → మిన్వడె[6]; వలదు— వల్దు → వద్దు ; చలిది → చల్ది → చద్ది ;కొలది → కొల్ది → కొద్ది ;

పదాంతంలో రేఫలకారాలకు విశేషంగా అజ్లోపం కనిపిస్తుంది. ఉదా: వనముల్, రాముల్, వత్తుర్, పోదుర్, బాలుర్, పాలుర్ వంటివి సారస్వత

---

[1]Wundt attributed sound change to increase in the rapidity of speech and this in turn,to the community's advance in culture and general intelligence. It is safe to say that we speak as rapidly and with as little effort as possible, approaching always the limit where our interlocutors ask us to repeat our utterance, and that a great deal of sound change is in some way connected with this factor. Bloomfield P : 386

[2] బా. వ్యా. ప్రకీర్ణ. 19 కప్పురము-క్రపము; అప్పుడు-అప్డు, చప్పుడు-చప్డు. నెత్తురు-నెత్రు.

[3] బా. వ్యా. ప్రకీర్ణ-20

[4] ,, ఇందే-18

[5] ,, . -17

[6] ,, ,, -16

భాషలో ఛందస్సు ననుసరించి యేర్పడ్డవి. గుణ్ణవ్, సింహవ్ వ్యవహా రూపాలు. ఇట్టి అంతిమ స్వరలోపాన్ని[1] "apocope" అంటారు.

30.7 ఆద్యక్షరలోపం : (apheresis) పదాదిలోని స్వరంగాని, వ్యం నంగాని, అక్షరంగాని లోపించటం. ఇది ఉచ్చారణ త్వరవల్ల కలిగేమార కావచ్చు. ఉచ్చారణంలోని చలనంవల్ల కూడ ఆద్యక్షరలోపం ఏర్పడవచ్చు ఆంగ్లంలో around కు మారుగా round, racoon అనటానికి coon అనట ఇట్టివే.

తెలుగులో వాడు-ఆడు; చిగురు-ఇగురు ; పొందు-ఒందు; పొదవ ఒదవు; హడపం-అడపం; హరిదళం-అరిదళం వంటివి పదాదివ్యంజన లోపాి ఉదాహరణాలు. పదాది రేఫలోపించటానికి ఉదాహృతులు : సంయుక్త లోపానికి ప్రదర్శితాలు: క్రోతి-కోతి; గ్రద్ద - గద్ద; ప్రొద్దు-పొద్దు; క్రొ కొత్త; మ్రింగు-మింగు. వకారలోపానికి : - వ్రాత-రాత; వ్రేవల్లె - రేవల్లె ప్రాచీన ద్రావిడంలోని పదాది 'చ'కారం తెలుగు మున్నగు దక్షిణ ద్రావి భాషల్లో లోపిస్తుంది. *చుప్ → ఉప్పు; *చీ → ఈ (గ)

30.8 వర్ణనాశం (Haplology) : సమానవర్ణంగాని వర్ణసముదాయ గాని తిరిగివస్తుంటే అందులో ఒకటి లోపిస్తుంది[2]. లాటిన్ : న్యూట్రీ-ట్రీక్స్ → న్యూట్రీక్స్; పి + పెన్డియమ్ → స్టిపెన్డియమ్.

ఆంగ్లం : humble+ly → humbly ; honest+ty → hones Engla+land → England.

తెలుగు : నిప్పు + పుల్ల → నిప్పుల్ల; బొంత + దళం → బొందళ వంగ + కాయ → వంకాయ; ఎనుప + పెంటి → ఎనుపెంటి; ఎంత + దా

---

[1]The loss of final vowels as in Old English singe (I) si is known as apocope. Bloomfield - P : 38

[2]When a phoneme or group of phonemes recurs within word, one occurance together with the intervening sounds, may be dropped : this change is known as Haplology.

Bloomfield , p: 3

ఎందాక; ఇంత + దాక → ఇందాక; అంత + దాక → అందాక; కంచు + చెంబు → కంచెంబు మొదలైనవి.

సంస్కృతము : త్రి + ఋచ → తృచ; శష్ప + పింజరః → శష్పింజరః; శేవ + వృధః → శేవృధః. దీనికి కారణాలు ఊనికలోపం, ద్రుతోచ్చారణాదులు కావచ్చు.

30.9 స్వరభక్తి : (anaptyxis) సంయుక్త వర్ణోచ్చారణంలోగల క్లేశాన్ని తొలగించటానికి అసంయుక్తం కావించటం ముందు పేర్కొన్నాం. (30. 21) సంయుక్త వర్ణాల మధ్యలో స్వరాన్ని చేర్చి సంయుక్తతను విడగొట్టటమే 'స్వరభక్తి'. "విప్రకర్ష" అని ప్రాచీన వ్యవహారం. వేదకాలంలో కూడ ఇటువంటిది ఉన్నది. ఇంద్ర-ఇందర; దర్శత-దరశత; స్వర్గ-సువర్గ; స్వర్ణ-సువర్ణ; పృథ్వీ-పృథివీ; ప్రేత-పరేత మున్నగునవి.

సంస్కృతపదాలు తెలుగులో చేరేటప్పుడు విశేషంగా ఇటువంటిమార్పు కనుపిస్తుంది. చంద్రుడు-చందురుడు; ద్వారము-దువారము; హర్షము-అరుసము; దర్శనము-దరిసెనము; శబ్దము-సబుదము.

అన్యదేశ్యాలు తెలుగులో ప్రవేశించేటప్పుడుకూడ ఇట్టి స్వరభక్తి కల్గుతుంది. అస్వార్-అసివారు; హుర్మజ్-హురుమంజ్ ఇత్యాదులు.

30. 10 స్వరాధిక్యం (Prothesis) : పదాది రేఫలకారాది హల్లుల్ని సంయుక్తాక్షరాల్ని ఉచ్చరించటంలోగల అసౌకర్యాన్ని తొలగించుకోటానికి ముందు స్వరాన్ని చేర్చటం. లోకం-(తమిళం) ఉలగం; రత్నం-అరతనం; రాజు-(కన్నడం) అరసు; తెలుగు : రథం-అరదం; (ఆంగ్లం) స్కూల్-ఇస్కూల్; స్టేషన్-ఇస్టేషన్; స్టాంప్; ఇస్టాంప్; స్పెషల్-ఇస్పెషల్ ఇత్యాదులు.

30. 11. వర్ణాధిక్యం (epenthesis) : ఒక ధ్వనినిగాని అక్షరాన్నిగాని పదమధ్యంలో చేర్చి అభివృద్ధిగావించటం.[1] ఆంగ్లం : athelete—(athlete) ; తెలుగు : కోలాటం – కోలాటకం ; దొంగాటం – దొంగాటకం

---

[1]The insertion or development of a sound or letter in the body of a word (Webster)

విటతాటం – విటతాటనం ; చిచ్చు + కన్ను → చిచ్చరకన్ను ; బొట-వ్రేలు → బొటనవ్రేలు ; వేగు + జుక్క → వేగురుజుక్క ; నడపడి నడవడిక ; నడిరేయి – నడికిరేయి ; ఉచ్చారణలో ఏదో కొరత కల్గినట్లు భావించటంచేత ఇట్టి ఆధిక్యమేర్పడుతుంది.

30. 12 లోపదీర్ఘం (Compensatory Lengthening) భాషలో సమాజ ధర్మంగో చరిస్తుంది. ఒక అక్షరం బలహీనమై లోపిస్తే ఆలోపాన్ని పూర్తి చేయటానికి దాని పూర్వ స్వరం దీర్ఘమౌతుంది. ఉదా : పుస్తకములు పుస్తకాలు ; ముత్యాలు, మీసాలు, నాణాలు, వజ్రాలు మున్నగునవిట్టివే ఇ మువర్ణాంతలోపమే కాక ఇతరవర్ణాలు లోపించినప్పుడు కూడ ఇ దీ ం కలుగుతుంది. చివుకు – చీకు ; దనుక – దాక ; దుముకు – దూకు ... – నీరు ; సగము – సాము ; మొగము – మోము మున్నగునవి లోపదీర్ఘ రూపాలే వ్యవహార ప్రచురాలు.

అన్నంత క్రియలపై ప్రార్థనాదుల్లో వరమయ్యే 'ఇమ్ము' "ఈ" కావటం కూడ యిట్టిదే[1]. 'ఉండనిమ్ము' – 'ఉండనీ'; కననిమ్ము – కననీ ఇట్లే వినసీ, చేయనీ వ్యవహార ప్రసిద్ధాలు.

30. 13 ద్విత్వలోపం (non - gemination)

ఉదాసీనత కారణంగా ద్విత్వలోపం కొన్ని పదాల్లో గోచరిస్తుంది అందువల్ల అర్థానికేమీ అఘాతం కలుగదు. ఉదా : అక్కట – అకట అచ్చట – అచట ; ఉయ్యాల – ఉయాల ; అయ్య – అయ ; ప్రెగ్గడ – ప్రెగడ ; సంప్రదాయ వ్యాకరణాలీ మార్పును బాగా నిరూపించాయి[2]. రంజిల్లు — రంజిలు మొదలైన విట్టివే.

30. 131 ద్విత్వ కల్పనం (gemination) : లేని ద్విత్వాన్ని కల్పించటం కొన్నిచోట్ల కన్పిస్తుంది. అందుకు కారణం అర్థాధిక్య కల్పన కావచ్చు. ఉదా : తలక్రిందులు – తల్లక్రిందులు ; తలడిలు – తల్లడిల్లు

---

(1) ప్రౌ. వ్యా – క్రియా 10 సూ.

(2) బా. వ్యా. ప్రకీర్ణ-8

పడిన – పడ్డ ; కొనిన – కొన్న ; చనిన – చన్న ; కొనుము – కొమ్ము ; ఉండిన – ఉన్న ; అగు → కా + ము – కమ్ము ఇత్యాదులు.

30. 14 నాదము ⇌ శ్వాసము (Voicing ⇌ unvoicing)

నాదాక్షరాలు శ్వాసం కావటానికి కారణం పదంలో ప్రక్కనున్న శ్వాస ప్రభావం కావచ్చు, ఉదా : బ్రదుకు → బ్రతుకు ; ఉదుకు → ఉతుకు ; చిదుకు → చితుకు ; అదుకు – అతుకు ; ఇట్టివి పాక్షిక వర్ణసమీకరణా లౌతాయి. (partial assimilation): కానుగ → గానుగ ; కడప → గడప ; కనుక → గనుక ; చీరాడు → జీరాడు ఇత్యాదుల్లో పదాది నాదత ఉచ్చారణ సౌలభ్యం వల్లగాని, "అనుచిత విభాగం" (చూ) వల్లగాని ఏర్పడి ఉండవచ్చు.

పూచెను + కలువలు – పూచెను గలువలు ; తల్లి + తండ్రి – తల్లి దండ్రులు. ఈ రీతిగా సంధిలో కచటతపలు గజడదబలు గసడదవలు కావటం పాక్షిక పార్శ్వవర్ణ సమీకరణంగా నిరూపితం. ఈ సందర్భంలో నాదతను గూర్చి తెలుసుకోవాలి. ఇది నాలుగు స్థాయిలలో ఉంటుంది. (i) నాదములు : గజడదబలు (ii) నాదతరములు : ఙ ఞ ణ న మ లు (iii) నాదతమములు : య ర ల వ లు (iv) మహానాదములు : స్వరములు.

నాదతమమైన అనునాసిక నవర్ణప్రభావంచేత శ్వాసం నాదమైంది. రెండు స్వరాల మధ్యలో కొన్నింటిలో ఇటువంటి మార్పు వస్తుంది.

30. 15 అనునాసిక్యం : (Nasalisation) స్పర్శవర్ణాలుకొన్నితద్వర్గానునాసికాలు కావటం ఉచ్చారణలో అనునాసిక్యానికిగల ప్రాముఖ్యాన్ని సూచిస్తుంది. ఉదా : అడగు – అణగు ; కడితి – కణితి ; బోడి – బోణి ; తిరుగబోత – తిరుగమోత ; పొగరుబోతు – పొగరుమోతు .

కొన్ని సందర్భాలలో ఉన్న అనునాసిక్యం లోపిస్తుంది.

కూష్మాండ – కుమ్మాండ – గుమ్మడి
వల్యఙ్కికా – వల్లంకిఅ – వల్లికి
ఆమన్త్రణమ్ – ఆమంతణ – ఆమెత
ఏకాన్తః – ఎక్కంత – ఏకత
మంజిల్ – మజిలి ; భేంట్ – భేటి : అనునాసికతాలోపం.

కొన్ని సందర్భాలలో లేని అనునాసిక్యం ఏర్పడుతుంది.

ఔష్ట్రికా - ఒట్టిఆ - ఒంటె

మూలకమ్ - మూలగ - ముల్లంగి

30. 16 సామ్యము (Analogy)

మార్పులన్నింటిలో ఇది చాల ప్రధానమైంది ఇది మానవ మనస్తత్వ సంబంధి. వాడుకలోనున్న ఒకానొక శబ్ద స్వరూపాన్ననుసరించి క్రొత్తశబ్దాల్ని కల్పించటమే సామ్యం[1]. తెలియని శబ్దాన్ని తెలిసిన శబ్దంగా గుర్తించటం.[2] ప్రతివ్యక్తి భాషాభేద వ్యాకరణ పరిజ్ఞానాల్ని కల్గి ఉండడు. భాషావ్యవహారం త్వరగా సాగిపోవాలి. ఎక్కువ ఆలోచిస్తూ కూర్చోడు. అందుచేత తనకు బాగా పరిచయమున్న శబ్ద సామ్యంతో క్రొత్త శబ్దాలు సృష్టిస్తాడు. ఇది ఏ ఒక్క వ్యక్తో కావించేదికాదు. అనేకులు కావిస్తుంటారు. ఆవిధంగా వాటికి వ్యవహార ప్రాబల మేర్పడుతుంది. ఉదా: దాసత్వం, సేవకత్వం అనే పరిచిత పదాల సామ్యంతో 'బానిసత్వం' అనే పదం ఏర్పడింది. నిజానికి 'బానిస' అనే తెలుగుపదం. దీనిపై భావార్థంలో 'తన' అనే తద్ధిత ప్రత్యయంచేరితే "బానిసతనం" అవుతుంది. ఇంతటి పరిజ్ఞానం ప్రతి వక్తకు ఉండదు కదా! 'బుద్ధిమంతురాలు' అనే రూపసామ్యంతో 'పనిమంతురాలు' అనే పదం ఏర్పడింది.

ఇట్టిదే 'గౌరవనీయులు' అనేది. గణనీయులు, పూజనీయులు మున్నగు పదాల సామ్యం వల్ల ఏర్పడి ప్రజాస్వామ్యంలో ప్రచురమైంది. నిజానికి 'గౌరవార్హులు' అనాలి. వ్యాకరణ విరుద్ధాలై బహుళ ప్రచారంలో ఉన్న ఐక్యత, ప్రాముఖ్యత, రామణీయకత్వం, చేతురు, కోతురు, చెయ్యక, యియ్యక, ఇవ్వక మొదలైనవి సామ్యంచేత ఏర్పడ్డవే. మీననేత్రి, పద్మనేత్రి ఇత్యాదు లట్టివే.

[1]Analogy is in its essence the replacement of an accepted form by a new form. Intruduction to Modern Linguistics.
—R. Palmer.

[2]Identification of the unknown with the known.

క్రొత్త పదాలు కూడ చిత్రంగా ఈ పద్ధతిలో సృష్టింపబడతాయి. ఉదా : కండ్లు - కన్ను ; వండ్లు - ? వన్నుని అసలురూపం; పల్లు. 'వస్తున్నాడు' అనేదాని సామ్యంలో మధ్యమ పురుషలో 'వస్తున్నీవు' అనేది 'వస్తున్నావు' అని అయి ఉండవచ్చు. వైయాకరుణుడొకడు 'అతయేవ వశవః తార్కికాః' అన్నాడట. తార్కికుడు వెంటనే 'అతయేవ వైయాకరణాః తృణవః' అన్నాడట. 'తృణాని' అనాలిగదా ! 'తృణవ' ఇతి కథమ్ ? అని వైయాకరణుడు ప్రశ్నిస్తే 'వశవ ఇతి యథమ్' అన్నాడట తార్కికుడు. 'యథా' అనాలి. ఇలా తప్పులు మాట్లాడుతున్నా వేమిటంటే తార్కికుడు 'అస్మాకూణామ్ తార్కికేషాం అర్థరి యేవ శక్తిః, నతు శబ్దరి' అన్నాడట. ఇదీ తప్పే. 'అస్మాకం తార్కికాణామ్ అర్థేయేవశక్తిః, నతు శబ్దే' అనాలి. ఆంగ్లంలో boyish, girish, foolish అనే రూపాల సామ్యంలో childish అనే పదమేర్పడ్డది. Womanish ఇట్టిది.

30. 17 అనుచితవిభాగం (wrong spilitting) సామ్యలక్షణాలు దీనికి కొంత అన్వయిస్తాయి. ప్రసిద్ధమైన సమకాలీన శబ్దస్వరూప మాధారంగా పదంలోని కొంత భాగాన్ని విడగొట్టి తక్కిన భాగాన్ని పదంగా వ్యవహరించటం. ఉదా : 'లు' నేటి బహువచన పదాంశం. చారిత్రక బహువచన పదాంశం — కలు-గలు - కులు - గులు మొదలైనవి. చిలుకలు-ఈగలు - తడికలు-గొడుగాలు - ఏనుగులు -కొలకులు ఇట్టిచారిత్రక బహువచనాంతాలలో "లు" అనేది బహువచన పదాంశమనే భ్రమతో విడగొట్టి ఏ. వ. రూపాలుగా చిలుక ఈగ తడిక గొడుగు ఏనుగు కొలకు అని వ్యవహరిస్తాం.

శబ్దగతమైన "లు" అనేవర్ణాన్ని పదాంశంగా భ్రమించి ఏకవచన రూపాన్ని నిర్మించుకొన్నారు - శ్రీకాకుళం — విజయనగరం మాండలిక వ్యవహర్తలు. అదే "కాన్‌స్టీపుల్". ఇది బహువచనరూపం అనే భ్రాంతితో "కాన్‌స్టీపు" అనే అంటారు ఏకవచనంలో. కన్యాశుల్కంలో కూడ ఇది వాడబడింది. "సమన్సు" - "సిజర్సు" లోని అంతిమ "స" కారం బహువచన పదాంశమనే భ్రాంతితో "సమను", "సిజరు" అనే ఏకవచన రూపాలిట్టివే

'తెమ్మరల్' అనేది 'తెమ్మరలు' అయిందితెలుగులో. దాని .ఏ.వ. తెమ్మరగా వ్యవహరిస్తాం

ఒక భాషలోని పదాన్ని అన్యభాషీయులెలా తప్పుగా విరుస్తారో మాగురువర్యుల పేరు "గంటి జోగిసోమయాజి"నిస్మరిస్తే తెలుస్తుంది. హిందీ

వారు చివరి "జీ" గౌరవ వాచకమనుకొని "గంటిజోగి సోమయ జీ" అ
వ్రాయటం గమనించి ఆశ్చర్యపడ్డాను. ఇంకా చూడండి-ఉచార్య దొణప్పగా
తెలుగులో క్రొత్తవెలుగులలో అనుచిత విభాగము: కొన్ని వ్యక్తి నామాలు

30.18 తాలవ్యీకరణం (Palatisation) (చూ. 31.3(1)తాలవ్యాచ్చులతో
గూడిన (ఇ, ఈ,ఎ,ఏలు) కకారం చకారంగా మారటం.స్లావిక్ భాషాచరిత్రలో
ఇది ప్రముఖపాత్రవహించింది. మూలద్రావిడభాషలోని "క"కారం కన్నడంలో
తప్ప,తక్కినతమిళం,తెలుగువంటిభాషలలో "చ"కారంగామారింది. కెడు-చెడు
కివి→ చెవి→; కిళి → చిలుక;కెయ్-చెయ్; కెందావ→చెందావఇత్యాదులు.

30. 19 సామ్యమూలకనిర్మాణం (back formation) సామ్యమూల
కంగా ఒకానొక పదం ఏర్పడ్డదని భావించి అది ఆధారంగా దానికో పూర్వ
రూపాన్ని కల్పించటం. రైట్ — రైటర్; రన్ — రన్నర్ వంటి నామ
రూపాలు క్రియలపై ఏర్పడ్డాయి. "ఎడిటర్" అనేపదంకూడ రైటర్, రన్నర్
వంటిదిగా భావించి "ఎడిట్" అనే క్రియారూపాన్ని కల్పించటం; "బట్లర్"
నుండి "బటిల్" అని; 'పెడ్లర్'నుండి "పెడిల్" అనే రూపాల కల్పన ఇట్టివే.

"వైట్ వాషర్" అనే నామరూపంనుండి "టువైట్ వాష్" "హౌస్ కీపర్"
అనే రూపంనుండి "టు హౌస్‌కీప్"అనే క్రియారూపాల నిర్మాణం ఇటువంటిదే
(బ్లూమ్‌ఫీల్డు - పుట. 416)

30.20 లోకనిరుక్తి (folk or popular etymology) ఇది అర్థ వివర
ణామానికి కూడ చెందింది. వక్త తనకు బాగా పరిచయమైన పదాంశాన్ని
తన కపరిచితమైన పదాంశ స్థానంలో చేర్చి వ్యవహరిస్తాడు.
క్రమంగా అదే,వ్యవహార ప్రాచుర్యాన్ని పొందుతుంది. నూతన పదం,కల్పిత
మౌతుంది.

ప్రాచీనాంగ్లంలో "బ్రైడ్‌గుమా" అంటే, "బ్రైడ్‌మాన్" అని అర్థం.
గుమాఅనే పదాంశ స్థానంలో "గ్రూమ్" అని చేర్చి వ్యవహరించగా అదే స్థిర
పడింది. గుమా అంటే అర్థం తెలియక అర్థంతెలిసిన పదాంశంతో వ్యవహ
రించటంచేత ఇటువంటి పదం ఏర్పడింది. గ్రూమ్ అంటే ఇల్లుచక్కదిద్దే
సేవకుడని అర్థం.

సింహాచలానికి ఉత్తరాన నార్త్ సింహాచలమనే రైల్వే స్టేషన్ కట్టారు.
ప్రజలకు నార్త్ అనేపదం తెలియక, అది నారద అయి వుంటుందని, పూర్వం

నారదుడక్కడే దిగి పాదచారియై సింహాచలాన్ని దర్శించటానికి వచ్చేవాడని ఊహించుకొని నారద సింహాచలమని వ్యవహరింప సాగారు.

మద్రాసులో "హామిల్‌టన్" అనేదొర ఒక వంతెన కట్టాడు. ఆవంతెన దగ్గరను, క్రిందను అంబష్ఠులు క్షురకర్మ చేస్తుంటారు. ఈ సంఘటనతో ముడి బెట్టుకొని "హామిల్‌టన్"అనే పదస్థానంలో దానికిడగ్గరగా ధ్వనించే"అంబట్టన్" అనేపదాన్ని చేర్చి "అంబట్టన్ బ్రిడ్జి" అని వ్యవహరింపసాగారు. ఇలాలోక నిరుక్తి మనస్తత్వానికి సంబంధించినది.అవగాహనంలోని లోపాన్ని,తమకున్న అవగాహనతో భర్తీ చేయుటానికి ప్రయత్నించటం ఇందులో గమనాహర్హం. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో స్వీపర్లు "ఆర్ట్సుకాలేజిని" "హాస్టల్‌కాలేజి" అనే వాళ్లు. ఇదేమని ప్రశ్నిస్తే "హాస్టల్‌కు దగ్గరగా వుందికదా ! అందుకే దానికా పేరు" అనే వాళ్లు. నవ్వుకునేవాళ్ళం. సిటీ బస్సును కొందరు చీటీ బస్సులని అంటుంటారు.

ఇటువంటి వ్యవహారం ప్రజలు, తమస్థాయిలో తాము చేస్తున్నా పండితులు తమపరిధిలో తాము చేస్తుంటారు. పదాలకు వ్యుత్పత్తుల్ని కల్పించే టప్పుడు "నక్కేది నక్క"అనేవ్యుత్పత్తి కల్పనమిట్టిదే. నరికల్ —నర్కల్— నక్కల్-నక్క—ఎముకలెక్కువగలదనిఅసలువ్యుత్పత్తి.మీదిది"లోకనిరుక్తి[1]

[1] "Popular etymologies are largely adoptive and contaminative. An irregular or semantically obscure form is replaced by a new form or more normal structure and some semantic content-though the latter is often far-fetched"

"The transformation of words so as to give them an apparent relationship to other better known or better understood words"

"modification often pseudo - learned of a linguistic form' according, either to a falsely assumed etymology as welsh rarebit from as welsh rabbit or to a historically irrelevant anology as bridegroom from bridegome"

The process whereby the popular mind creates a false though plausible association.

ఈవివిధాంగ్ల నిఘంటు నిర్వచనాలు పరిశీలింపదగినవి.

తెలుగుకోశాలలోను[1], సంస్కృతంలోని నిరుక్తులలోను కొన్నిలోక నిరుక్తులు లేక పోవు.

ఇంకా సంప్రసారణం, సాంకర్యం వంటి మార్పులు కొన్నిగమనించ వచ్చు.వర్ణసమ్మేళనం (Phonemic merger ,వర్ణవిదళనం (phonemic split) ఇంతకుముందే పేర్కొన బడ్డాయి. భాషా వికాసంలో (చూ. ధ్వనుల మార్పు ద్వి. ము. పుట 293-305) ఇవిబాగా నిరూపితం. భారతి-డిసెంబరు 1979లో డాక్టర్ స్థలింగంనేని బసవశంకరరావుగారు 25 మార్పులు సూచించారు. పరిశీలించేది.

## 31. 1 ధ్వని సూత్రాలు (Phonetic Laws)

మూలభాషలోని కొన్నివర్ణాలు, దాని పుత్రికల్లో భిన్నరూపాలతో ఉండవచ్చు. స్థూల దృష్టికివి భిన్నంగా గోచరించినా సూక్ష్మంగా పరిశీలిస్తే యివి యొకేవర్ణం యొక్క సమానాంతర వర్ణాలుగా (Parallel phonemes) స్ఫురిస్తాయి. ఈ భిన్నత్వం నియతపద్ధతిలోనే వుంటుందిగాని యధేచ్ఛగా ఉండదు.

ఈ విధమైన మార్పేల కలుగుతుంది ? మూలభాషనుండి దూరం కావటంచేత, పరిసరాల భేదంవల్ల, భౌగోళికాది పరిస్థితులు కారణంగాను

---

[1]శబ్దరత్నాకరం "ఐదువ" శబ్దాన్ని ఐదుధరించేది అని మంగళ సూత్రాదులు పేర్కొనటం లోకనిరుక్తి అనవచ్చు. చూ-15.16 తెలుగుభాషా చరిత్ర: 1974 జి. యన్. రెడ్డి. "అవిధవా" శబ్దం "అయిదువ" అనివీరుపేర్కొన్నారు - కాని ఇది 'ఎద్దు' అనే ద్రావిడ ధాతువు (DED 693) నుండి ఏర్పండిందనటం సముచితం. దీని అర్థం : పొందు, చేరు, అనుకూలమగు, కలిసిపోవు. కన్నడం 'అయ్దు' తెలుగు "ఏదు" దీనికి సూ. ని. నన్నిచోడుని ప్రయోగం ఇచ్చింది. (కన్నడం) అయిదువె .... భర్తను చేరినస్త్రీ; అయిదువ అనేది ఈ రీతిగా గ్రహించటం సముచితం. నిజానికి రెడ్డిగారికన్న ముందే దొణప్పగారు 'అవిధవా' శబ్దభవం - అయిదువ అన్నారు. చూ తెలుగులో కొత్తవెలుగులు : తెలుగులో కొన్ని జన నిరుక్తులు. (1972)

కలుగవచ్చు. ఇట్టి మార్పులు సోదర భాషలలోనే (cognate languages)[1] కాక, ఒక భాషకుగల వివిధ మాండలిక భేదాలలోను చూడవచ్చును. ఈ మార్పులొకే కాలంలో లేక అనంతర కాలంలో ఏర్పడి ఉండవచ్చును. లేదా ఒకానొక కాలంలో ఉండి తర్వాత లోపించను వచ్చు. ఏమైనా ఈ మార్పులు నియతమైన పద్ధతుల ననుసరించే ఉంటాయి. అందుచేత భాషాశాస్త్రజ్ఞులు వీటిని సూత్రాలలో నిరూపించారు. వీటికే ధ్వని సూత్రాలని వ్యవహారం.

31.11 ధ్వని సూత్రమంటే ? : ఒక భాషా కుటుంబానికి చెందిన సోదర భాషలలోగాని ; లేక ఒకేభాషలోగాని ; లేదా దాని వివిధ మాండలికాలలో గాని, ఒకానొక వర్ణం నియతంగా కొన్నిపరిసరాలలో, లేదా కొన్ని పరిస్థితులలో, ఒక కాలంలోగాని, అనేక కాలాలలోగాని, నిర్ణీత పరిస్థితులలో మార్పులకు లోనవుతుంటే, వాటి నభివర్ణించి నిరూపించేది ధ్వనిసూత్రం (phonetic Law)[2]

ఆధునికులు ధ్వనిసూత్రాలనే వ్యవహారానికి మారుగా 'సమానాంతర వర్ణనిరూపణాలు' (Phonemic correspondences) అని వ్యవహరిస్తు న్నారు. 'ధ్వనుల పరిణామాలు' అంటే, ఇట్టి ధ్వనులెందుకు మారాయోచెప్ప

---

[1]The word (cogneate) means 'born' together and it refers specifically to words which have survived in various languages from a common original language -

Lectures on Linguistics, Berezin P: 48

[2]The phonetic law is best defined as a factual statement of a regular correspondance, or set of correspondences found by empherical observation and comparision to exist under like circumstances or conditions, between a given phoneme, within a given area, at a given period, in the history of a given language-group, language, or dialect, and a parallel phoneme (or parallel absence of phoneme) at another period or at different periods within such a group, language or dialect or in different members of the language-group, whether at the same period or at different periods,. Foundation of Language, by Louis H. Gray p.75

వలసివుంటుంది. అందుకనేక జ్ఞాతాజ్ఞాత కారణాలుంటాయి. అది వివరించట కష్టం. సమానాంతర వర్ణాలంటే ఈ కష్టం ఉండదు[1]

19వ శతాబ్దపు భాషాశాస్త్రజ్ఞులు ధ్వని సూత్రాలన్నారు. వర్ణాన్ని గూర్చిన పరిజ్ఞానం బాగావృద్ధిలోనికి రాని రోజులవి.

31. 2 గ్రిమ్స్ ధ్వనిసూత్రం(Grimm's Law).

జాకబ్ లుడ్విగ్ గ్రిమ్ (1785-1863) జర్మన్ భాషాతత్వవేత్త కొన్నాళ్లు గ్రంథాలయాధికారిగా ఉండి తర్వాత రాజాహ్వానం మీద బెర్లిన్‌లో స్థిరపడ్డాడు. ఇతడు స్వతంత్రంగా వ్రాసిన గ్రంథాల్లో ముఖ్యమైంది 'జర్మన్ వ్యాకరణం' (1819). ఇది జర్మన్ తులనాత్మక భాషాశాస్త్రానికి పునాదిరాయి ఈ శాఖకితడు జనకుడంటారు.

31. 21 గ్రిమ్ ప్రతిపాదిత సూత్రాలు:

(i) ఇతర ఇండోయూరోపియన్ భాషలలోని శ్వాస స్పర్శాలు జర్మానిక్ భాషలలో శ్వాసోష్మాలవుతాయి.

| | | | |
|---|---|---|---|
| | ఇతర ఇండో యూరోపియన్ భాషలలోని శ్వాస స్పర్శాలు (unvoiced stops) | → | జర్మానిక్ భాషలలో శాసోష్మ అవుతాయి. (unvoiced spirants |
| (a) | ప (bilabial) | → | ఫ (labio-denta spirant) |
| | పేస్ (లాటిన్), పాద్ (సంస్కృతం) | — | ఫుట్ (ఆంగ్లం |
| | పతెర్ ( ,, ), పితా ( ,, ) | — | ఫాదర్ ( ,, ) |
| | పిసిస్ (,,) | — | ఫిష్ ( ,, ) |
| (b) | త | — | థ (voiceless inter-dental slit fricative) |

---

[1]The best term to replace 'phonetic law, is phonemic corre-spondance, which denotes the facts observed without expressing any openion as to their origin.Foundation of lang - p. 75

త్రేస్ (లాటిన్), త్రి (సంస్కృతం) — త్రి (ఆంగ్లం)
తెన్ ఇస్ ( ,, ) — థిన్ (,,)

(c) క - హ (ఆం)
కెన్తుమ్ (,,) - హండ్రెడ్ (,,)
కొర్నూ (,,) - హార్న్ (stone) (,,)
కాపుత్ (,,) - హెడ్ (,,)

(2) నాదస్పర్శాలు - శ్వాసస్పర్శాలు
[voiced stops] - (unvoiced stops)
:ఛెట్టుబెరడు. - వ (హెమ్ప్ : (ఆం)

(a) బ (కనబిస్.) (గ్రీ)

b) ద - ట (unvoiced unaspirated alveolor stop)

దు బ (లా). వంద్వ (సం) - టు (ఆం)
దెన్స్ (,,) దన్త్ (,,) - టూత్ (,,)
ఎదియర్(,,) - ఈట్ (,,)

(c) గ - క
గ్రానుకు (లా) - కాన్ (ఆం)
గెనుస్ (,,) - కిన్ (,,)
ఆగర్ (,,) - ఆకర్ (,,)

(3.) మహాప్రాణనాదస్పర్శాలు మూల ఇండో యూరోపియన్ భాషలలోనివి (P. I. E) - () పూర్వగ్రీకులో మహాప్రాణశ్వాస స్పర్శాలు (ii) పూర్వ లాటిన్‌లో శ్వాసోష్మాలు (iii) పూర్వజర్మన్ భాషలో నాదస్పర్శాలు లేదా నాదోష్మాలు.

(22)

(a) భరామి (సం) - ఫెరో (గ్రీ) - ఫెరో (లా) - బేర్ (ఆం)
భ్రాతా (సం) - ఫ్రాతేర్ (గ్రీ) - ఫ్రాతెర్ (లా) - బ్రదర్ (ఆం)
(b) అధాత్ (సం) - థేసో (గ్రీ) - ఫెసీ (లా) - దు (ఆం)
మధు (సం) - మెదు (గ్రీ) - మీద్ (ఆం)
మధ్యః (సం) - మిద్ (ఆం)
(c) హంసః (సం) - (లా) - గూస్ (ఆం)
హోస్టైస్ (లా) గృహస్థః (సం) - - హోస్టెస్‌లాగెస్టె (ఆం)

31. 22 పై గ్రిమ్ సూత్రాలకు కొన్ని అపవాదాల వంటివి కనిపించాయి: తక్కిన ఇండోయూరోపియన్ భాషలలోని ప,త,క లు జర్మానిక్ భాషలలోని ఫ, థ, హ లుగా తప్పని సందర్భాలనేక మున్నాయి. ఉదా: (సం) అస్తి — (గ్రీ) ఎస్తి — (లా) ఎస్త్ — (గోథిక్) ఇస్త్; (లా) కప్తస్ — (గోథిక్) హఫ్త్స ; (సం) అష్ట — (గ్రీ) ఒక్తో — (గోథిక్) అహ్తౌ ;

ఇవి అపవాదాలని ఆక్షేపించారు. కాని నిజానికి కావు. కావని సమర్థించాలంటే గ్రిమ్‌సూత్రాన్ని సమగ్రం చేయాలి. ఇతర ఇండోయూరోపియన్ భాషలలోని అసంయుక్తప, త, క, లు మాత్రమే ఫ, థ, హ లు గా మారుతాయనాలి. పై వి సంయుక్తాలు కాబట్టి మారలేదు.

గ్రిమ్ తృతీయ సూత్రం ప్రకారం జర్మానిక్ భాషలలోని బ, ద, గ లు సంస్కృతంలో భ, ధ, ఘ లు గాను; గ్రీకులో ఫ, థ, ఖలుగాను క్రమంగా మారాలి. కొన్నికొన్ని సందర్భాలలో అలాకావటం లేదు. ఉదా: (సం) బోధామి – (గ్రీ) పెన్‌థొమయ్ - (ప్రా. ఆం) బెడిదన్ - (న. ఆం) బిడ్,

దీనికి హెర్‌మను గ్రాస్‌మన్ ఈరీతిగా సమాధానమిచ్చాడు.

"సంస్కృతంలోగాని, గ్రీకులోగాని మహాప్రాణ స్పర్శాలు స్వర సహితంగా ఒకదాని తరువాత ఒకటివస్తే అందులోని తొలి వ్యంజనం తన మహాప్రాణతను కోల్పోతుంది" అంటే వర్ణవిభేదం కల్గుతుంది. (Dissimilation)
(PIE) భెవ్‌ఘోమయ్ (ప్రా. సం) భోధామి (న. సం) బోధామి
(ప్రా. గ్రీ) ఫెవ్‌థోమయ్ (న. గ్రీ) ఫెవ్‌థోమయ్.

గ్రిమ్ సూత్రాలకు సరిపడని రూపాలకు గ్రాస్మన్ ప్రత్యేక సూత్రాలు రచించి సమర్థించాడు. ప్రతి సూత్రానికి అపవాదం ఉంటుందని (Every rule has an exception) అనే పాత వ్యాకర్తల నినాదానికి ప్రతిగా, ప్రతి అపవాదానికి ఒక సూత్రముంటుంది (Every execption has its own rule) అనే నినాదాన్ని క్రొత్త వ్యాకర్తలు చేసారు.

31. 23 ధ్వని సూత్రాలకు అపవాదాలున్నాయనేవారు ఈ క్రింది విషయాలు గమనించాలి.

(i) ధ్వని సూత్రాల పరిధిలోనికి రాని రూపాలకు ఏవేని ప్రత్యేక ధ్వని సూత్రాలుంటాయేమో పరిశీలించాలి. భోధామి → బోధామి కావటానికి కారణం చెప్పినట్లు.

(ii) యాదృచ్ఛిక శబ్దసాదృశ్యాన్ని బట్టి ధ్వని సూత్రాల కపవాదాలుంటాయని భ్రమింపరాదు. (లా) డైస్ – (ఆం) దే.

(iii) మూలభాషలోని పాక్షిక పద సాదృశ్యాన్ని బట్టి ఏర్పడ్డ పదాల్ని చూచి అపవాదాలని భ్రమింపరాదు (PIE) ఘచే – కబే (లా) హబేరె (ఆం) హేల్.

(iv) ప్రాతిదేశపదాల్ని (Loan words) సరిగా గుర్తింపకుండ అవి అపవాదాలని భ్రమింపరాదు. ఈ నియమాలు ద్రావిడ ధ్వని సూత్రల పట్ల కూడ సమన్వయిస్తాయి.

31. 3 **ద్రావిడ ధ్వని సూత్రాలు :** ముఖ్యమైన ద్రావిడ ధ్వని సూత్రాలీక్రిందివి పరిశీలితం.

31. 31 తాలవ్యీకరణం (The law of palatisation) : జిహ్వామూల హనుమూలీయ శ్వాసాల్పప్రాణ స్పర్శం (unvoice d unaspirated dorso-velor stop) తాలవ్యస్పృష్టోష్మాల్పప్రాణ శ్వాసంగా (unvoicad unaspi ated palatal affricate) మారటానికి కారణం తాలవ్య స్వర ప్రభావమే. అందుకే ఈ సూత్రానికి ఈ పేరు వచ్చింది.

మూలద్రావిడంలోని ★ కకారం, తాలవ్య స్వరపరకమైె తెలుగు, తమిళ మలయాళాదుల్లో చకారంగా మారుతుంది, కన్నడంలో మారదు.

★ కెయ్ – చేయు – చెయ్ – చెళక – కెయ్/గెయ్ ★ కెత్ – చెదరు చితర్ – చితరుక – కెదఱు★ కేత్ – చెరుగు – చేఱుక – కేఱు ★ కె చెవ్వ – చెవ్వ – చెవ్వక –

తమిళంలో కెటు (డు), కిళి మొదలైన పదాలు తాలవ్యీకరణం పొందటంలేదు. చెటు, చిళి కావటంలేదు. కాబట్టి యివి పై సూత్రానికి అప వాదాలని భావిస్తారు. కాని వీటికి క్రింది రీతిని సూత్ర కల్పనం చేయవచ్చు

"మూలద్రావిడ * క కారానికి పరమైన తాలవ్యస్వరానికి మూర్ధన్య వర్ణం పరమందుంటే తమిళ మలయాళాలలో కకారం చకారంకాదు"

* కెట్ – చెడు – కెటు (డు) – కెటుక – కిడు / కెడు
* కిళి – చిలు(క) – కిళి — కిళి — గిళి
* కెణ్ / కిణ్ – చెండు – కెణ్డు – కిండు.

తమిళ మలయాళాలలో చెటి (డి) చెట్టువంటి రూపాలున్నాయి. కాని యివిఅర్వాచీనంగా ఏర్పడ్డవి.ఇవి తెలుగునుండి చేరినఎరవు పదాలుకావచ్చు

తెనుగులో కినియు, కెడయు, కెడవు, కెడయిక, కెడపు, కెడ, కిట్టు, కెరలు, కైవారం, కైదండ, కెళాకుళి, కెలను, కెలసం, కెల్లగించు మున్నగునవి విశ్రుతాలు. ఇవన్నీ అపవాదాలుగా భావిస్తే సూత్రానికి విలువ ఏముంటుంది?

ప్రతిపదాన్ని పరిశీలించాలి. ఇందులో కెరలు, కెలసం వంటివి కన్నడం నుండి ఎరవుగొన్నవి కొన్ని తాలవ్యీకరణం జరగక మునుపే సమాసబద్ధమైనవి – కైవారం, కైదండ. కొన్ని పర్వతారణ్య సంవృత ప్రాంతాలలో (relic areas చూ. 33. 10) ప్రాచీన వ్యవహారమే కల్గివున్నవి కావచ్చు.

క్రిందు, క్రేవ మొదలైన పదాది రేఫయుక్తాలున్నాయి. ఇవికూడ తాలవ్యీకరణం ప్రవర్తిల్లటానికి పూర్వమే ఏర్పడ్డాయి అనాలి.

తమిళ శిలాశాసనాలలో "చేరమాన్" అనిఉంది. (క్రీ. పూ 300). ఇది కేరళపుత్ర అనే పద సంబంధి. కేరళ పదమే తమిళంలో 'చేర' గా మారింది.క్రీ.పూ 300 పూర్వమే ఈవర్ణపరిణామం జరిగిందని భావించవచ్చు.

21.33 పకారం హకారం కావటం : మూల ద్రావిడ భాషలో హకారం లేదు. తెనుగులో హవర్ణఘటిత పదమొక్కటిలేదు. ఉంటే అది కన్నడం నుండో ఉర్దూ మొదలైన ఇతర భాషలనుండో ఎరవు గొన్నది.

మూలద్రావిడ పకారం, కన్నడంలో ఫ గా మారి ఆపిమ్మట హకారంగా మారింది. ఈ మార్పు క్రీ. శ 7వ శతాబ్దికేర్పడింది. అఋపన → అఋఫన→ అరుహన (7 శతాబ్ది).

11 వ శతాబ్దికే కన్నడంలోని పకారాది పదాలన్నీ హకారాదిగా మారాయి. నాగవర్మ తన "కర్ణాట భాషాభూషణం"లో 'పేహోవా' అని సూత్రించారు. ఇది వికల్పంగా చెప్పబడినా నిత్యంగానే ప్రవర్తిల్లింది. పంప, పొన్నవంటి కవి నామాలుకూడ హంప, హొన్న అయినాయి. పకారాది తద్భవాలు కూడ హకారాదులైనాయి. తెనుగులోని హత్తు, హెచ్చు వంటి క్రియా ధాతువులు[1], హాయి, హొయలు వంటి ధ్వన్యనుకరణ శబ్దాలు కన్నడంనుండి వచ్చినవని పరిశోధకులు[2] భావించారు.

మూలద్రావిడ * పకారం హకారంగా మారటం కన్నడ, తుళుభాషలకే పరిమితం.

| | | | |
|---|---|---|---|
| ★ వతు | - హత్తు | - హత్తుని | - పట్టు |
| ★ పేర్/పెర్ | - హెచ్చు | - హెచ్చుని | - పెచ్చు |
| ★ పూ | - హాలా/హూవు | - పూ/హూ | - పూ/పూవు |
| ★ పాల్ | - హాలు | - హాలు | - పాలు. |
| ★ పామ్పు | - హావు | - హావు | - పాము. |

31. 33 మూలద్రావిడ భాషలో రెండచ్చులమధ్య "ఱ" కారం తమిళ మలయాళాలలో మార్పు లేకుండా వుంటె, కన్నడంలో "ళ" గాను తెలుగులో "డ" గాను మారింది.

| | | | |
|---|---|---|---|
| ★ కోఱ | (త. మ) కోట | (క) కోళి | (తె) కోడి |
| ★ తాఱ | ( ,, ) తాఱ | (క) తాళి | (తె) తాడి |

31. 33 మూలద్రావిడ భాషలోని ద్విరుక్త దంతమూలీయ తకారం తమిళ, మలయాళ భాషలో ట్ట (ట్ర) గాను, కన్నడంలో "త్త"గాను, తెనుగు "ట్" గాను మారింది.

| | | | | |
|---|---|---|---|---|
| ★ చత్తు | - చుట్టు | - చుట్టు | - సుత్తు | - చుట్టు |
| ★ పత్తు | - పట్టు | - పట్టు | - పత్తు/హత్తు | - పట్టు |
| ★ ముత్తు | - | - ముట్టు/ముట్టు | - ముత్తు | - ముట్టు. |

[1] Telugu Verbal Bases — Prof Bh. Krishna Murthy, P: 6౬

[2] "ఆంధ్రభాష - హకారాది పదాలు" డా॥ తుమాటి దొణప్ప: "ఆంధ్రప్రదేశ్" ఏప్రిల్ 1964.

## 32. 0 అర్థ విపరిణామం (Semantic divergence)

అర్థ విపరిణామ హేతువుల్ని, రీతుల్ని మద్దురు వర్యులు విద్వాన్ గంటి జోగి సోమయాజులు తమ "భాషావికాసం" లో విపులంగా పేర్కొన్నారు. (చూ. పుటలు 587 - 592. ద్వి. ము.) ఆచార్య జి. యన్. రెడ్డిగారు తెలుగు భాషాచరిత్ర అనేభాషావిషయిక వ్యాససంకలనంలో (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ) అన్యదేశ్యాలలో, సంస్కృత పదాలలో అర్థవివరిణామాన్ని విపులీకరించారు. "అర్థ శాస్త్రం" మీద పరిశోధించిన ఖ్యాతి ఆచార్య జి. యన్. రెడ్డిగారికే దక్కింది. తరువాత ఎవరు ఈకృషికొన సాగించటం లేదు.[1] విశేషంగా శబ్దాకృతికి, అర్థాకృతికి ఎటువంటి సంబంధంలేదు. "బల్ల" అనే శబ్దానికి నాలుగు కాళ్ళు కలిగి పైన సమతలంగా ఉండే బల్ల ఆకారాన్ని ఊహింపజేసేశక్తి ఏ మాత్రం లేదు.అయితే ఆవిధమైన అర్థం ఎలా ఏర్పడింది? ఆశబ్దానికాఅర్థం అనుస్యూతంగా, సాంప్రదాయకంగా (coventinal) వచ్చింది. తరతరాల నుండి వాడుకలో వస్తున్నది. కాబట్టి పదాలనేవి ఆయావస్తువుల శాబ్దిక సంకేతాలు మాత్రమే. బాహ్యమైన శబ్దాకృతిమారితే అంతరమైన అర్థాకృతి మారాలనిలేదు దేనిదారి దానిదే.

---

[1] (ఎ) 1933లో శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ వ్యాససంగ్రహ పంపుటిలో మాగురువులు కీ. శే. దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు "అర్థవివరిణామ పద్ధతి" అనే వ్యాసంలో 35 సంస్కృత పదాలు తెలుగులో అర్థవివరిణామం పొందిన రీతిని సోదాహరించారు. పుటలు : 217 – 230.

(బి) "అర్థవివరిణామము" - శ్రీ దివాకర్ల వెంకటావధాని, తెలుగు భాషా సమితి ; విజ్ఞాన సర్వసము - విశ్వసాహితిVI - 54 - 60.

(సి) "సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో అర్థ వివరిణామము." డాక్టర్ కాశీభట్ట సేతురామేశ్వర దత్త - భారతి, మార్చి 1980.

## 32. 1 స్వయం ద్యోతకత (Motivation)

పై మాటలు చాలవరకు నిజమే అయినా కొన్ని కొలది పదాలు వాటి అర్థాల్ని కొంతవరకు ద్యోతమానం కావిస్తాయి. ఉదా: పీపీ, పటపట, చెడుగుడు మొదలైనవి. ఇవి ధ్వన్యనుకరణ శబ్దాలు. కూకూ అనికూసే పక్షిని తెలుగులో కోకిల అంటాం. ఇంగ్లీషులో కుక్కూ, ఫ్రెంచిలో కౌ కౌ, జర్మన్–కుకుక్ హంగేరియన్ – కకుక్, రష్యన్–కకుష్క, ప్రాచీనగ్రీక్–కొక్కక్స్. ఈ రీతిగా ధ్వన్యాకృతిలో సామ్యం ఈ ధ్వన్యనుకరణ శబ్దాలకు ప్రపంచ భాషల్లో గోచరిస్తుంది.

పై నిరూపణాన్ని బట్టి ఏభాషలోనైనా పదజాతాన్ని రెండు విధాలుగా వింగడించవచ్చు. (1) సాంప్రదాయికాలు (Conventional words), 2) స్వయంద్యోతకాలు (motivated words).

ఈ స్వయం ద్యోతకత, స్వభావ భేదాన్ననుసరించి త్రివిధాలు :

(i) ధ్వని స్వయం ద్యోతకత (Phonetic motivation )
(ii) వ్యాకరణ స్వయం ద్యోతకత (grammatical motivation)
(iii) ఆర్థిక స్వయం ద్యోతకత (Semantic motivation)

32. 11 ధ్వని స్వయం ద్యోతకత (phonetic motivation) : ధ్వన్యనుకరణ శబ్దాలు , ఆశ్చర్యార్థకాలు – ఆహా , ఓహో మొదలైనవి. శబ్దానుకృతులైన కాక , కోకిల , దుందుభీత్యాదులు. యస్కాదులు కూడా ఇట్టి వాటిని పేర్కొన్నారు.

దీన్ని మూడు విధాలుగా పేర్కొనవచ్చు (a) ప్రత్యక్షానుకరణాలు : చెడుగుడు , చిటపట , పీపీ , గురక, మేక, కాకి , ఆవులింత. కొన్ని జంతువుల అరుపులిట్టివి.

(b) చేష్టానుకరణాలు : అమ్మా (ఆవు) , మ్యావు (పిల్లి) , బుస (పాము) ఓండ్రుపెట్టుట (గాడిద) , ఝుమ్మనుట (తుమ్మెద) ; ఘీంకారము (ఏనుగు) .

(c) ధ్వని సంకేతత్వం : కొన్నిపదాలు ప్రత్యక్షానుకరణాలు గాక కొంతమాత్రం ఉంటుంది. అటువంటిచోట్ల మహాప్రాణోచ్చారణముంటుంది. తెలుగులో ఉదా : ఘట్టిగా , ఖచ్చితంగా , చప్ఫగావుంది , ఖారం.

కొన్నిపదాల్లో పదాదిలో ' హ ' చేరుతుంది. ఉదా : అడలు – హడలు అడావుడి – హడావుడి ; ఆరతి – హారతి.

32. 12 వ్యాకరణ ద్యోతకత : (grammatical motivation). ఇందులో ఏదో వ్యాకరణాంశం చేరినందు వల్ల అర్థ స్వరూపం కొంత వ్యక్తమౌతుంది.

(క) ప్రాథమిక నిష్పన్న రూపాలు : క, గ , త , ప , వ , ఇమిత్యాది కృత్ప్రత్యయాలు ధాతువులకు చేరటంచేత ఏర్పడ్డవి. ఎండు + అ → ఎండ 'ఎండు ' ధాతువు ఎట్లా ఏర్పడింది తెలియదు కాని 'ఎండ ' ఏలాఏర్పడింది తెలుస్తుంది. ఎండునట్లు చేసేది ఎండ, ఇట్టివే అమ్మకం , దీవన ,పూవు (పూ = వికసించు ) ' తిండి , తోట (తోడు = to dig) ; తోడేలు , కుందేలు మొదలైనవి . వీటినే కృదంతాలంటారు.

అనంతర నిష్పన్నరూపాలు : అందగాడు , బోయత , కన్నెతికం , జాలరి, వయ్యారి , వగలాడి వంటివి : తల్లడిల్లు , మేలుకొను వంటి శబ్ద పల్లవాలు; చేతిగుడ్డ దొంగభయం, మంచినూనె , బంతిపూవు , ముక్కంటి , నలువవంటి సమాస రూపాలు : ఇల్లిల్లు , కట్టకడ, అందదుకులు, తుత్తుమురు వంటి ఆమ్రేడితాలు : మాటమంతి , అప్పసొప్పు , వంటి జంటపదాలు; శిలాక్షరాలు , మేలుబంతి , తాటాకులు కట్టారు వంటి నుడికారాలు ; ఆకాశం బద్దలయింది , ప్రాణంపోయింది వంటి అతిశయోక్తులు: ఆలంకారిక భావ ప్రకటనాదులీ వర్గానికి చెందుతాయి.

32.13 అర్థద్యోతకత (Sematic motivation): రెండు సాంప్రదాయిక పదాలు కలసి వేరొక అర్థాన్ని చేకూరుస్తాయి. ఉదా : గోడకాలు (పునాది). మంచంకాలు, మేజాకాలు ; వంటిచిగురు, చింతచిగురు మొదలైనవి.

ఆయా జంతు లక్షణాల్ని బట్టి కొంతమంది వ్యక్తుల్ని ఆజంతువుల పేళ్ళతో వ్యవహరించటం—కుక్క, నక్క, పులి, గాడిద మొదలైనవి.

నిద్ర ఎక్కువగా పోయేవాడ్ని కుంభకర్ణుడని, దానంచేసేవాడ్ని దానకర్ణుడని, తిండిపోతును బకాసురుడని, కోపదారిని దుర్వాసుడని. ఇంకా నక్షత్రకుడు, రంభ, తాటకి, మంధరేత్యాది పురాణ ప్రసిద్ధ నామ వ్యవహారం ఇట్టిదే.

## 32. 2 నానార్థకత (poly semy) :

(poly - many, sema - sign, multiplicity of meaning.)

ఒక పదం తనకుగల ప్రాథమికార్థంతోపాటు మరికొన్ని అర్థాల్నికూడ సంతరించుకొంటుంది. ఈ యితరార్థాలు కాల క్రమంలో ఏర్పడుతాయి. అయినా మౌలికార్థం నశించదు. నిఘంటువులీయర్థాల్ని ఇస్తాయి.

'ఆకు' అంటే చెట్టుఆకు, తమలపాకు, విస్తరాకు, తాటాకు, తాళ పత్రం, చీట్లపేక కార్డు, చక్రంలోని ఆకు. ఈవిధంగా వివిధార్థాలేర్పడటానికి కారణం: సందర్భాన్ననుసరించి పదగతమైన అర్థంగమిస్తుంది. ఈఅర్థగమనం (shift)[1] నానార్థకతలో ప్రముఖ పాత్రవహిస్తుంది. అర్థగమనంతోపాటు అర్థ విస్తృతి, అర్థంలో మార్పు కూడ ఇందుకు కారణాలు. సామాన్యంగా ఒక పదానికి నియతమైన ప్రధానార్థమొకటి ఉన్నా, ఒకే సందర్భంలోనే ఖచ్చితంగా ఏ పదం ప్రయోగింపబడదు. సందర్భంలో కొంచెంగా మార్పు ఉండనే ఉంటుంది. అప్పుడర్థం సందర్భోచితార్థాలు మారుతుంది. అనంతంగా ఉంటాయి. వాటినన్నింటిని పట్టి నిరూపించటం కష్టం. కొన్నింటిని నైఘంటికులు తమ శక్తికొలది నిరూపించటానికి యత్నిస్తారు.[2] దుక్కి- దున్నటం, మేడి, దున్నటానికి చాలినంతవర్షం; నాటకం - డ్రామా, నటన, చరిత్ర, మోసపుచర్య ; నెల – చంద్రుడు, ముప్పైరోజులు, ముట్టు. ఈ రీతిగా అనేకార్థాలున్న

---

[1] shift plays an important role in the geneisns of polysemy
: Bloomfield

[2] the varieties of connotation are countless and indefinable.. and as a whole cannot be distinguished from denotative meaning.
Bloomfield

వ్పుడు, శ్రోత సరియైన అర్థాన్ని గ్రహించటం క్లేశంకాదా అనే సందేహం కలుగుతుంది. అన్నింటికి సందర్భమే మార్గ దర్శకం. అది సరిగ్గా గ్రహించే శక్తి లేకపోతేనే చిక్కు. పూర్వం హాలచక్రవర్తి అది తెలియక్క "మోదక" శబ్దానికి "లడ్డు" అని మాత్రం తెలిసినవాడు కాబట్టి జలక్రీడల్లో లడ్డు విసిరి భార్యచేత మూఢు డనిపించుకొన్నాడు. అన్నంతింటు సైంధవం తెమ్మంటే ఉప్పుతేవాలి. తిన్నతరువాత సైంధవం తెమ్మంటే గుఱ్ఱం తేవాలి. కాని పరమానందయ్య శిష్యుడిలాగా చేయకూడదు. సందర్భమే,[1] అర్థని ర్ణయానికి జీవగఱ్ఱ. దీన్నే ప్రకరణం, ప్రసంగం, ప్రస్తావమంటారు. భగవా భర్తృహరి ప్రకరణంతోపాటు వాక్యఅర్థం, ఔచిత్యం, దేశం, కాలం, మొ...ం ఆటు అర్థనిర్ణయానికి తోడ్పడతాయని, కేవలం శబ్దాకృతి వల్లకాదనీ, వాక్యపదీయంలో పేర్కొన్నాడు.[2] అనేకార్థక శబ్దాలు పరస్పరం భిన్నమనే పక్షంలోకూడ అర్థాన్ని నిర్ణయించటానికి ప్రకరణాదులే సాయపడతాయని భర్తృహరి ఉద్ఘాటన[3]

---

[1] The polysemy of words does not matter in the least, because, the herae always has the situation to guide him in choosing which is appropriate to the context. The Theory of speach of Language: Gardiner Alan ; Telugu semantics - G. N. Reddy.

[2] వాక్యాత్ప్రకరణా దర్థా దౌచిత్యా ద్దేశ కాలతః
శబ్దార్థాః ప్రవిభజ్యన్తే నరూపదేవ కేవలాత్
చూ. వాక్యపదీయం - 1 - 314 (తెలుగు అకాడమీ) వివరణం.

[3] అనేకార్థస్థలాల్లో అర్థభేదాన్నిబట్టి శబ్దభేదాన్ని అంగీకరించాలి అనే పక్షంలోకూడ ప్రకరణాద్యుపాయాలు ఆవశ్యకాలే
భేదపక్షే ఽపి సారూప్యాద్భిన్నార్థాః ప్రతిపత్తిషు
నియతా యాంత్యభివ్యక్తిం శబ్దాః ప్రకరణాదిభిః
—వాక్యపదీయం 1 - 317

## 32. 3 సమాన రూపోచ్చారణలు (Homonyms)

కొన్ని పదాలు రూపంలోను ఉచ్చారణలోను సమానంగా ఉన్నా వాని అర్థాలు భిన్నంగా ఉంటాయి. ఈ భిన్నార్థకత ఆయాపదాల పుట్టుక వల్ల తొలుత ఏర్పడింది. భిన్నరూపాలుగా పుట్టి ఇవి పరిణామం వల్ల ఏకాకృతి వహిస్తాయి.

పన్ను – నోటిలోపన్ను, ఇంటిపన్ను. అసలు శబ్దం 'పల్లు' అయినా సామ్యం వల్ల 'పన్ను' అనే రూపం కల్పించబడినట్లు పరిశీలితం (చూ. 30. 16) పాలు - భాగం. ఇది 'పగులు' అనే క్రియారూపంనుండి ఏర్పడ్డది. పాలు – క్షీరం. 'పాయి' అనే ఏకవచనానికి బహువచనమని భావించబడుతున్నది[1]. కల్లు - రాయి. కల్ – కల్లు, కఱు అనే ద్రావిడ రూపంనుండి ఏర్పడ్డది, తాటికల్లు. రెండు దేశ్యాలే.

పాఁడి - పాడి : క్షీరము - ధర్మము. ఈ భేదాన్ని సూచించటానికే ఖండ బిందువు (ఉచ్చారణలేకపోయినా) వ్రాతలో ఉంచుతారు. దీని పూర్వరూపం పాణ్డి.

నాఁడు – నాడు : దినము, ప్రదేశము (నడువబడింది).

కాఁచు – కాచు : వేడిచేయు, రక్షించు.

మీరు – మీఱు : నీవు బ. వ; అతిక్రమించు.

నీరు – నీఱు : జలం, నశించు.

మురుగు – ముఱుగు : అలంకారం, మకిలి.

ఈ అర్థభేద సూచనకే ఉచ్చారణలోలేని శకటరేఫం వ్రాతలో చూపించట. కొన్నింటిలో ధాతువులుభిన్నంగా ఉంటాయి. ఉదా : పిప్పి— పిల్చుధాతు జన్యం ఒకటి,[1] పుచ్చు → పుప్పి → పిప్పి (Juxatapositional vowel asismilation.)

భాషాభేదం ఉన్నా ఏకశబ్దాకృతిగల పదాలనేకం గోచరిస్తాయి. సంస్కృతాంధ్ర భాషాభేదాలు : రాజు (సం), రాజు (తె) – రగులజేయు ;

---

[1] రమణీయము – దువ్వూరి వేంకట రమణ శాస్త్రి – ప్ర. ము. పుట 311

కల (సం) - ఆర్ట్; కల (తె) - స్వప్నం; అరి (సం) - శత్రువు; అరి (తె) - కప్పం.

ఆంగ్లాంధ్ర భాషాభేదాలు : లేడి (ఆంగ్లం) - స్త్రీ; లేడి (తెలుగు) = జంతువు : కారు car -కారు (ఋతువు); పంపు (ఆంగ్లంలోని పైప్‌శబ్దభవం)- ఆజ్ఞ(తె)

అన్యదేశ్యాలు : కలం పడవ- తెనుగు పెన్ అనే అర్థంలో అన్యదేశ్యం. ఇటువంటి పదాల్లోని అర్థభేదాన్ని గుర్తించటానికి కూడ సందర్భమే శరణ్యం.

2. 4 సమానార్థకాలు (Synonyms) ; (Syn - with, onyma-name)[1]

శబ్దాకృతి భిన్నంగా ఉన్నా, అర్థం సమానంగా ఉన్న పదాలు. వీటినే పర్యాయ పదాలంటారు. అమరంలోను, ఆంధ్రనామ సంగ్రహాది నిఘంటువులలోను అర్థాన్ని బట్టి ఇటువంటి పర్యాయ పదాలు నిరూపితాలు. ఆంగ్లంలో చాలవరకు అకారాది క్రమంలోని నిఘంటువులే. అర్థప్రధానంగా కూర్చబడ్డదాన్ని "థిసారస్" (Thesauras) అంటారు. ఇది నిఘంటువుకు వ్యతిరేకమైంది. పదం సిద్ధంగా ఉన్నప్పుడు అర్థంకోసం నిఘంటువు చూస్తాం. అర్థం సిద్ధంగా ఉండి పదం ఏమిటో తెలియనపుడు థిసారస్ను ఉపయోగిస్తాం. [2]రాగెట్ ఆంగ్లభాషకు రచించిన ఇంటర్‌నేషనల్ థిసారస్ 1194 పుటలు గలది. ఆంగ్ల రచయితలకు, విద్యార్థులకు, సందర్భోచిత పర్యాయపద ప్రయోగానికిది యెంతో ఉపకరిస్తుంది.

సమానార్థకాలంటే సంపూర్ణంగా సమానార్థకాలని భావించరాదు. ప్రతి పదానికి అర్థంలో ఈషద్భేదం ఉంటుంది. పూర్తిగా సమానార్థకాలైన పదాలు సామాన్యంగా ఉండవు. అలా ఉండటం గౌరవం[3]

---

1 One of two or more words or expressions of the same language that have the same or nearly the same name.

2 A Thesaurus is the opposite of a dictionary. you turn it to when you have the meaning already, but don't yet have the word. -From the introduction by I. A. Richards to Roget's pocket Thesaurus

3 Complete synonymy is a rare occurance and a luxury which lauguge can ill - afford" cf Telugu semantics by G. N Rabdy.

32. 41 స్వచ్ఛ పర్యాయపదాలు : (Pure synonyms). వీటిని ఒకదాని స్థానంలో వేరొకదాన్ని ఉపయోగించవచ్చు. ఇట్టివి ఉండవని పైన చెప్పినా ఒకానొక భాషలోని మాండలిక భేదాల్ని ఇట్టివిగా గుర్తించవచ్చు. ఉదా : చెక్కలు - వక్కలు : నాగలి - మడక : కపిల - మోట : పిల్ల - గుంట : పప్పు - బేడలు : వంద - నూరు : గేదె - ఎనుం, బఱ్ఱె : సాగు - సేద్యం, వ్యవసాయం, కమతం మొదలైనవి.

32. 42 బాలభాషను ప్రత్యేక మాండలికంగా గ్రహించాలి. కాని వీటిని పెద్దలకు వాడే పదాలకు మారుగా వాడితే నవ్వుపుడుతుంది. పెద్దవాళ్ళను 'బువ్వతిన్నారా'? అనిగాని, 'లాల బోసుకొన్నారా?' అనిగాని ప్రశ్నించం గదా. బాయి - పాలు : ఉగ్గు - ఆముదం : బుజ్జి - మజ్జిగ : ఆయి - నెయ్యి: ఆచ్చి - షికారు : తాయం - తీపి పదార్థం : ఉజ్జ - కుక్క అప్పచ్చి - తిను తినుబండారం బాలభాషకు చెందినవి.

32. 43 పర్యాయ పదతుల్యాలు (Quasi - Synonyms) : పుల్లి అనే అర్థంలో బండి, గిలక, రాట్నం పదాలుపయుక్తమైనా ఇవి వేరే అర్థాల్లోకూడ వాడబడుతున్నాయి. "చూచు - దర్శనం" అనేవి పర్యాయ పదాలే అయినా "దర్శనం" అనేది దేవుడికో గొప్పవారికో ప్రత్యేకంగా ఉపయోగిస్తాం. ఇలాగే భోజనం, తిండి, కూడు : గోచి, కౌపీనం మొదలైనవి.

తత్సమాలకు తద్భవాలకు నిజానికి అర్థభేదముండకూడదు. కాని తద్భవప్రయోగంలో న్యూనత గోచరిస్తుంది. దైవం - దయ్యం : యోగి-జోగి : యంత్రం - జంత్రం : యాత్ర - జాతర మొదలైనవి.

అవాచ్యత అని భావించి పర్యాయ పదాలు వాడుతాం. రాత్రిళ్ళు ఉప్పు అనరాదని రుచి అనో, లవణమనో, బుట్టలోదనో అంటాం. ఇవన్నీ పర్యాయపదతుల్యాలవుతాయి.

32. 44 సందర్భం (context) : కొన్నిపదాలకు ఇదమిత్థమైన అర్థం ఉండదు. అర్థం అనిశ్చితంగా, అస్పష్టంగా ఉంటుంది. పై పదంలోకిగాని అనేకపదాల్లోకిగాని ప్రసరించి అది విశేషార్థాన్ని ద్యోతమానం చేస్తుంది.

ఉదా 'మంచి' 1. మంచివాడు (Good fellow) 2. మంచినీళ్లు (drinking water) 3. మంచిమనసు (Kind heart) 4. మంచి సరకు (Quality goods) 5. మంచివేళ (Opportune time) 6. మంచి నూనె (ginger oil) 7. మంచిది. (Yes) 8. మంచి పూలు (Fresh flowers)

మంచికిగల ఈ విధమైన వ్యాప్తిని, అర్థక్షేత్రం, (semantic field)[1] అంటారు.

ఈ విధంగానే "మాట" అనే పదానికెంతో విస్తృతమైన అర్థ క్షేత్రం ఉంది. బ్రౌన్ నిఘంటువు నిరూపించిన దాన్ని ఆచార్య జి. యన్. రెడ్డిగారు "అర్థవిపరిణామం" అనేవ్యాసంలో ఉద్ధరించారు.[2] తమసిద్ధాంత వ్యాసంలో పేర్కొన్నదాన్ని ఇట ప్రదర్శిస్తాను.

మా
ట

(1) ఇచ్చాను : He made a Prosmise.

(2) పడదు : He would not tolerate abuse.

(3) సాగుతుంది : He is influencial.

(4) ఏమైంది : What has become of his affair.

(5) లోవచ్చాడు : He came in a second.

(6) మాట : Come here, listen.

(7) విను : please hear to my advice.

(8) లోచెప్పు : Put it briefly.

[9] మా అబ్బాయికి మాటలువస్తున్నాయి : My boy is learning to speak.

[10] మాకు మాటలులేవు : We are not in speaking terms.

---

[1] This type of range in meaning is called semanitic field. Telugu Semantics : G.N. Reddy

[2] పుట 421 - 22 తెలుగు భాషాచరిత్ర : ఆం. ప్ర. సాహిత్య అకాడమీ

32. 45 ఉద్రిక్తత లేక కాకువు (Emotive element) : ప్రతివ్యక్తి యొక్క భాషణం కేవలం అభిప్రాయ నివేదనమేకాక, ఎంతో కొంత ఉద్రిక్తతో కూడి ఉంటుంది. ఆ ఉద్రిక్తత భాషయొక్క సజీవలక్షణం.

[1] ఆ- పిలుపుకు సమాధానం, [2] ఆ - అంగీకారం, [3] ఆ - విసుగుదల [4] ఆ - సంభ్రమాశ్చర్యాదుల ప్రకటన [5] ఆ - హెచ్చరిక [6] ఆ - ఎట్లను ప్రశ్నార్థకము [7] ఆ - అనంగీకారము,
ఈ అర్థాలు వచ్చేటట్టు వక్త ఈ ఆకారాన్ని ఉచ్చరించగలడు.

వాడు వచ్చాడు. వాడు వచ్చాడు ↑ నిజంచెప్తాను. నిజంచెప్తాను ↑ ఈవిధంగా కాకువుతో పలికితే అది ప్రశ్న.

ఈరీతిగా ఒక శబ్దాకృతికొక అర్థాకృతి, రెండు మూడు అర్థాకృతులు. ఒకేఅర్థాకృతికి రెండుమూడు శబ్దాకృతులు; ఒకే శబ్దాకృతి,వేరువేరు శబ్దాకృతుల సమ్మేళనం వల్ల వేరువేరు అర్థాకృతుల్ని చేకూర్చటం ; ఒకే శబ్దాకృతిని భిన్న భిన్న కంఠస్వరాలతో పలకటంచేత భిన్న భిన్న అర్థాకృతులేర్పడటం అనే వైచిత్రిని పరిశీలిచ్చాం[1]

32.5 ఒక పదంలో గల అర్థాంశాన్ని Sememe అంటారు. ఈవిధమైన అర్థాంశాలేరీతిగా ఉంటాయెూ పై పుటలో సూచితం : నిఘంటువులు కొంత వరకే ఈ అర్థాంశాల్ని ప్రదర్శిస్తాయి. ఏ నైఘంటిక పదానికి (lexical word or lexema) ఏకాలంలో అర్థాంశంలో ఏవిధమైన మార్పు వచ్చిందో సూచించే నిఘంటువునకు "చారిత్రక నిఘంటువు" (Historical Lexicon) అంటారు. తెలుగుభాష కింతవరకిట్టి నిఘంటువు లేకపోవటం శోచనీయం.

ఒక నైఘంటికాంశాని కనేక అర్థికాంశాలు (Sememes) ఉండవచ్చు. అనేక నైఘంటికాంశాలకు ఒకే అర్థికాంశం ఉండవచ్చు.

ఈ అర్థవివరిణామాన్ని నిరంతరం పరిశీలించటానికో పరిశీలక బృందాన్ని విద్యాశాఖవారు నెలకొల్పి ఎప్పటికప్పుడు పదాలు ప్రయోగాలలో ఏరీతిగా మారుతున్నాయో పరిశీలింపజేసి, నిఘంటువుల్ని పునర్ముద్రితం కావిస్తుండాలి. అప్పుడే భాషాచైతన్యం ప్రస్ఫుటమౌతుంది.

---

[1] ఈ రచన కాధారం విశేషంగా ఆచార్య జి. యన్. రెడ్డిగారి "Telugu Se manties" అనే వారి సిద్ధాంత వ్యాసం. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ప్రచురణ.

# 7. తులానాత్మక విజ్ఞానం
## (Comparative Study)

33. 0 నిరాధారచరిత్ర : ఏభాషకైనా ఏదేని ఒకానొక నిర్ణీత కాలంనుండే తద్భాషాగతమైన ఆధారాలు లభిస్తాయి. ఆంగ్లభాషకు క్రీ. శ. 7 వ శతాబ్ది నుండి లిఖితమైన ఆధారాలు దొరుకుతాయి. తెలుగు భాషకు క్రీ. శ. 6 వ శతాబ్దినుండి శాసనాధారాలున్నాయి. అంతకుపూర్వం కతిపయగ్రామ మనుష్య నామాలు మాత్రమే సంస్కృత ప్రాకృత శాసనాలలో కనిపిస్తున్నాయి. కన్నడానికి క్రీ. శ. 4 లేక 5 శతాబ్దాల నుండి ; తమిళానికింకా పూర్వం నుండి శాసనాధారాలున్నాయి. ఈ విధంగా లభ్యమౌతున్న ఆధారాలతో ఆయాభాషల చరిత్రను నిర్మింపటానికి అవకాశం ఉన్నది. దీన్నే "సుజ్ఞాత చరిత్ర" అనవచ్చు.

33. 1 ప్రాక్ చరిత్ర (Pre - History) : పై రీతిగా ఆధారాలు లభించటానికి పూర్వం ఆ భాషలు లేవనటానికి వీలులేదుగదా? ఎంతో కాలం నుండి ఉంటున్న వాటి స్వరూపం ఎటువంటిదో నిరూపించటం సులభసాధ్యం కాదు. అదీకాక ఎటువంటి ఆధారాలు లేని భాషలెన్నో ఉన్నాయి ప్రపంచంలో. వీటికి లేఖన చిహ్నాలులేవు, ఉదా: ఆఫ్రికాలోని బంటుం బాషలు, అమెరికాలోని రెడ్ఇండియన్ భాషలు. వీటిలో కొన్నింటి కిప్పుడిప్పుడే లిపులు ఏర్పడుతున్నాయి. ఇట్టి భాషల ప్రాక్చరిత్రను తెలిసి కోవటంఎట్లా వీనికి రెండు ప్రధానమైన విధానాలున్నాయి. (1) అంతరపునర్నిర్మాణం (Internal or synchronic reconstruction) (2) బాహ్యపునర్నిర్మాణం (External or diachronic reconstruction), ఇట్టి పునర్నిర్మాణాల మూలంగా భాషాగత ప్రాక్ చరిత్రను (Pre - history) చిత్రించవచ్చు. అందుకు తగిన బాషాశాస్త్ర పరిజ్ఞానం ఉండాలి. ఎప్పుడైతే చరిత్ర ఉంటుందో అప్పుడు "ప్రాక్ చరిత్ర" కూడా ఉండితీరాలి. ప్రాక్చరిత్ర అంటే వ్రాత పూర్వకమైన సాక్ష్యాలు లభింపని కాలానికి చెందిన భాషాచరిత్ర

అని అర్థం. ఒకే భాషలోని ఆధారాలతో కావించే పునర్నిర్మాణం ఆంతర మైతే, సోదర భాషల ఆధారాలతో కావించేది "బాహ్య పునర్నిర్మాణం".

31. 11 ఒక్కొక్కప్పుడు లిఖితాధారాలు లభిస్తున్నా పునర్నిర్మాణం కావించటం అవసరమే. ఇందువల్ల లభించిన సాక్ష్యాన్ని లిఖితసాక్ష్యంతో సరి చూచుకోవచ్చు. అందువల్ల శాస్త్రప్రామాణ్యం విదితమౌతుంది. శాస్త్రంవట్ల ప్రత్యయమేర్పడుతుంది. ఉదా: ఆధునిక రొమాన్సుభాషల్ని తులనాత్మకంగా పరిశీలించి వాటిమాతృకను పునర్నిర్మాణం కావింపవచ్చు. ఈవిధంగా పరోక్షంగా నిర్మించిన భాషను లభ్యమయ్యే లాటిన్ లిఖిత సాక్ష్యాలతో సరి చూడవచ్చు.

ప్రత్యక్ష సాక్ష్యాలు లభిస్తున్నా అందులో అన్నివిషయాలూ సాకల్యంగా ఉండవు. లోపాలెన్నో ఉంటాయి. పరోక్ష సాక్ష్యాధారంతో ఆ లిఖితభాషను సాకల్యం చేయవచ్చు. ఎందువల్లనంటే, ఎప్పుడో రెండువేల సంవత్సరాలనాడు రోమనులు తాము మాట్లాడిన భాషనంతా లిఖితం చెయ్య లేరుగదా! అలిఖితమైన భాష ఎంతో ఉండి ఉండాలి. అట్టిభాష నీ పరోక్ష పద్ధతి మూలాన గ్రహించవచ్చు.

నేటి ఔత్తరహిక భాషలకు మాతృకలు వివిధ ప్రాకృతభాషలు. వీటిలోని రూపాలాధారంగా మూలభాషను పునర్నిర్మాణంచేస్తే లిఖితరూపాలతో సరిపోల్చుకోవచ్చు.

ఈ రీతిగా మూలభాషలు కొన్నిభాషలకు మాత్రమే లభిస్తున్నాయి. ఇలాలభించనివెన్నో ఉన్నాయి. పునర్నిర్మాణం ద్వారావాటి స్వరూపం తెలుసు కోవటంతప్ప అన్యమార్గంలేదు. మూలద్రావిడభాష ఇట్టిదే. దీని ధాతువుల్ని, క్రియారూపాదుల్ని పునర్నిర్మాణం చెయ్యటానికి ఎంతోకృషిసాగుతున్నది.

33. 2 మూలభాషలు భిన్నభాషలు కావటం: మూలభాషా వ్యవహర్తలు ఎక్కువగా ఉంటే వారు జీవనం జరుగక ఎక్కడికైనా దూరప్రదేశాలకు వలస పోవలసి వస్తుంది. అప్పుడు వారి భాషావ్యవహారం మూలభాషాతో సంబంధాన్ని కోల్పోయి స్వతంత్రంగా పరిణమిస్తాయి. పైకి విభిన్నభాషలుగా కనిపించినా సూక్ష్మంగా పరిశీలిస్తే వీటిలో ధ్వనులలోను,వ్యాకరణాంశాలలోను

వాక్యయోజనంలోను ఎంతో సామ్యముంటుంది. ఇట్టివాటిని "సోదర భాషలు" (Cognate Languages) అంటారు.

మూలభాష భిన్నభాషలుగా పరిణమించటం ఒకపద్ధతి కనుకూలంగానే ఉంటుంధిగాని ఇష్టమొచ్చినట్లుండదు. ఒక్కొక్క భాషలో ఒక్కొక్క పరిణామక్రమం ఉండవచ్చు. ఇట్టి పరిణామ ప్రవృత్తినే సపీర్ "Drift" అని పేర్కొన్నాడు.

"భాషాపరిణామ ప్రవృత్తి" కో మార్గం గోచరిస్తుంది. సముద్రంలోని అలలు కొన్ని కలసి పెద్దగా వుప్పొంగినట్లుగా అనేక పరిణామాల సమూహం ఒక నిర్ణీత మార్గంలో సంచరిస్తాయి. భాషాచరిత్ర ననుసరించి ఈ మార్గాన్ని అనుమానించవచ్చు. ఈ పరిణామక్రమం ఆభాషా వ్యవహర్తలకు తెలియకుండానే అప్రయత్నంగానే ఏర్పడుతుంది. ఇందులో మరికొన్ని క్రొత్తమార్పులుకూడ కాలక్రమంలో చేరుతుంటాయి. మొదట్లో కొద్దిమంది వ్యక్తులకు సంబంధించి అప్రధానంగా పరిగణనంలేకుండా ఉన్నా క్రమంగా ఇవికూడ ఆపరిణామ ప్రవృత్తిలో చోటుచేసుకునేవే."

మూలభాషలోని ఒకవర్ణం, అర్వాచీనంగా ఏర్పడ్డదాని జన్య భాషల్లో ఒక్కొక్కదానిలో ఒకవర్ణంగానే మార్పు చెందుతుంది. కాని రెండు మూడు వర్ణాలుగా మారదు. ఇట్టి నియతి ఉండబట్టి అర్వాచీనంగా ఏర్పడ్డ సోదర భాషల్ని తులనాత్మకంగా పరిశీలించి మూలభాషను పునర్నిర్మాణం చేయగలుగుతున్నారు[1].

33.3 మూలభాషా బాహ్య పునర్నిర్మాణం (Diachronic reconstruction of a proto - language) సోదరభాషలలో దేశీయములైన పదాల్నే గ్రహించాలి కాని ఎరవుపదాల్ని (Loan words) ఏమాత్రం తీసుకోకూడదు. ఇట్టివి

---

[1] "The Linguistic drift ha direction...The drift of a Language is constituted by the unconsc ous selection on the part of its speakers of those individual vari tions that are cumulative in special direction. This direction may be inferred, in the main, from the past history of the language......"

Language : Drift P. 155 ; Edward sapir

చాల పరిమితంగానే వుంటాయి. సోదర భాషలన్నింటిలోను శబ్దార్థాలలో తుల్యంగావుండే రూపాల్ని సేకరించాలి. ఈ సేకరణ ఎంత సమగ్రమైతే తులనాత్మక పద్ధతికూడ అంత నిర్దుష్టంగ ఉంటుంది.

32. 33 సోదర పదాలలో(Cognates)తుల్యంగా ఉండే వర్ణాలు మూల భాషలో కూడ ఉంటాయి.

| తమిళం | మలయాళం | కన్నడం | తెలుగు | మూలభాష |
|---|---|---|---|---|
| కణ్ | కణ్ | కణ్ | కన్ను | ★కణ్ |
| కాల్ | కాల్ | కాల్ | కాలు | ★కాల్ |
| తేళ్ | తేళ్ | తేళ్ | తేలు | ★తేళ్ |

తెలుగులో మూర్ధన్య ణకార ళకారాలు దంతమూలీయాలుగా మార్పు చెందాయి. ఉదంతత, కొన్నిపదాల్లో ద్విత్వస్థితి, తెలుగులో గోచరించే పరిణామ క్రమం. ఎక్కువ సోదరభాషలలో మార్పు చెందని భాగం మూలభాష నుండి సంక్రమించిందిగా భావించాలి. ప్రధాన ద్రావిడ భాషలే పైన చూపించాం. తుళులో కణ్ణు అని మూర్ధన్యంమారకుండా ఉత్వద్విత్వాలు వచ్చాయి. కొడగులో కణ్ణిగోణ్డి పర్జి కోలారు నాయికీలలోకన్; గదబలో కను, ఒల్లారి కోట కొణ్డ, కణ్, కువిలో తెలుగులోలాగ కన్ను. ఇవన్నీ ఇలా ఉండగా కురుఖ్ బ్రాహుఈలలో ఖన్న్, ఖన్ అనిఉండటం గమనార్హం. ఇందులోపదాది మహాప్రాణోచ్చారణం పరిసర భాషా ప్రభావంవల్ల కలిగిందని విదితం. మాల్తోలో జిహ్వామూలీయ కకారోచ్చారణం కూడ ఇట్టిదే. ఈ విధంగా మార్పులు భిన్న సోదర భాషల్లో కనిపిస్తున్నాయి. వీటికి కారణాలు కొన్ని ఊహింపవచ్చు. కొన్నింటిని ఊహించ లేకపోవచ్చు. కాని మార్పును మాత్రం గ్రహించటం సులభం.

3?. 32 సోదర పదాలు కొన్ని భిన్నంగా గోచరిస్తుంటే మూలభాషాగత మైనదేదో ఊహించటంలో జాగ్రత్త వహించాలి. ఈ ఉదాహరణాల్ని పరిశీలిద్దాం.

| కన్నడం | తెలుగు | |
|---|---|---|
| (1) కనలు | కనలు | ★క్ |
| (2) కెడు | చెడు | ★క్ |
| (3) కీరు | చీరు | ★క్ |
| (4) చిమ్ము | చిమ్ము | ★చ్ |

ఇందులో 1, 4 లలో మొదటి అక్షరాలలో మార్పులేదు. 2, 3 లలో మార్పు కన్పిస్తున్నది. దీన్ని బట్టి ఏది మూలభాషారూపమని నిర్ణయించటం? ఏదో ఒకటి నిర్ణయించవచ్చు. తెనుగునే తీసికొందాం. చె – కె, చీ– కీ అని కన్నడంలో మార్పుచెందాయి. అయితే 4 లో "చి" ఎందుకు మార్పుచెందలేదు? అనే ప్రశ్నకు సమాధానం లేకుండా పోతుంది. ఇందులో ఉన్నది కూడా తాలవ్యాచ్చేగదా! తాలవ్యాచ్చులతో కూడిన "క" కారం తాలవ్యీకరణం పొందుట మనం గమనించామే గాని చ కారం క కారం కావటం గమనించ లేదు. కాబట్టి తెనుగురూపాలు మార్పుచెందినవని 3,4 ఉదాహరణల్లోని కన్నడ రూపాలే ప్రాచీనాలని కన్నడంలో తాలవ్యీకరణం జరగలేదని, ప్రాచీన రూపాలే ఆభాషలో నిలిచాయని, తెలుగు మొదలైన ఇతర దక్షిణ ద్రావిడ భాషలలో తాలవ్యీకరణం కలిగిందని నిరూపించటం సులభం కాబట్టి ★క అనేవర్ణాన్ని మూలద్రావిడ వర్ణంగా నిర్ణయించాలి. (చూ. 31. 31)

33. 33 సోదరభాషలలో ఒకదానిలో ఒకవర్ణం ఉండి, అట్టివర్ణం ఇంకో భాషలో లోపిస్తే, మూలభాషలోవర్ణం ఉన్నట్లుగానే పరిగణించాలి.

| ఉదా: | పర్జి | తెలుగు | |
|---|---|---|---|
| | చీ | ఈ | |
| | చుప్ | ఉప్పు | |
| | చీన్డు | ఐదు | |
| | చాకోల్ | ఆకలి | ★చు |

ఒక వర్ణం పరిణామంలో లోపించటం సహజం. అంతేగాని క్రొత్తగా చేరిందని అంటే ఎందుకు చేరిందో వివరించాలి. కొన్ని మూల ద్రావిడ పదాలలోని చకారం తమిళ మలయాళాంధ్రాది దక్షిణ ద్రావిడ భాషలలో

లోపింపగా మధ్యోత్తర ద్రావిడ భాషలలో నిలిచి ఉంటుంది.

33. 4 అంతరంగిక పునర్నిర్మాణం (internal reconstruction or synchronic reconstruction) : పైననిరూపితమైనది. భిన్నసోదరభాషా రూపాలతో మూలభాషను పునర్నిర్మాణం చెయ్యటం. ఈవిధంగానేకాక ఒకే భాషలోని సమకాలీన పదాలాధారంగాను మూలభాషారూపల్ని కొంతవరకూ హించటానికి అవకాశం ఉన్నది. దీనికే "అంతరంగిక పునర్నిర్మాణమనిపేరు.

ఒక భాషపైనే ఆధారపడటం చేత ఈ పద్ధతివల్ల ఆభాషలోని ప్రాక్తన రూపాన్నే నిరూపించ గలుగుతాం. ఆదిమూలభాషా రూపంతో తుల్యంగా ఉండవచ్చు. ఉదా : మాఱు→ మార్చు (2) తారు→తార్చు . ఇందులో తొలిదానిలో ప్రేరణలో శకటరేఫ, రేఫగా మారింది. దీనినిబట్టి ఒకప్పుడీ ప్రేరణరూపంకూడ "మాఱ్చు" అని శకటరేఫతోనే యుండి యుండవచ్చునని, అనంతరకాలంలో శకటరేఫ సంయుక్తస్థితిలో రేఫమైఉండవచ్చు నని ఊహింపవచ్చు. శాసనరూపాలీ విషయాన్ని నిరూపిస్తున్నాయి కూడ. శకటరేఫ రేఫఅవుతుంది గాని రేఫమెప్పుడు శకటరేఫ గాదు. ఇది పరిణామ క్రమానికి విరుద్ధం.

33. 41 "చేద" అనేది నీళ్ళుతోడే సాధనం. ఇది "చేందు" అనే ధాతువుపై "అ" అనే కృదంతప్రత్యయం చేరటం చేత ఏర్పడ్డది. "చేన్దు" అనేది ప్రాక్తన ధాతురూపం. ఇది సంధిలో నిరూపిత మౌతున్నది. చేద + తాడు → చేత్తాడు అనికావాలి. ఊదు + తాడు ఊత్తాడు, రొద + తగ్గింది → రొత్తగ్గింది అయినట్లు. కాని అట్లా కాకుండా చేంతాడు" అవుతుంది. "చేన్దు" అనే ప్రాక్తన రూపాన్నీరీతిగాను గ్రహించవచ్చు.

33. 42 పదాదిలో రేఫ నేటిభాషలో లోపిస్తుంది. క్రోతి–కోతి; క్రొత్త – కొత్త: కాని సంధిలో "క్రొంగ్రొత్త" "క్రొంబసిడి" వంటిరూపాలను బట్టి ఇందులో పదాదిలో రేఫవున్నట్లు గ్రహించవచ్చు.

33. 43 నేటి తెలుగులో "రాయు" "రాత" "రాలు" వంటి వకారలోప యు రూపాలున్నాయి. వీటిపూర్వరూపాలు "వ్రాయు" "వ్రాత" "వ్రాలు" అని మాసరూపాల్ని బట్టి గ్రహించవచ్చు. చేవ్రాలు అంటాంగాని 'చేరాలు' అనం దా.

ఆంగ్లంలో (K) nowledge పదాది కకారం పలకదు. కాని పూర్వ కకారంకూడ ఉచ్చారణలో ఉన్నదని మనం 'Acknowledge' అనే పదాన్ని బట్టి గ్రహించవచ్చు. ఈవిధంగాభంగ్యంతరమైన నిదర్శనాలనుబట్టి ప్రాక్తన భాషారూపాల్ని ఊహించటానికి అవకాశముంది.

33. 5 మూలభాషాపునర్నిర్మాణద్వైవిధ్య పద్ధతి : (Inverted Reconstruction) ఒకపెద్ద భాషాకుటుంబంలో అనేక ఉప కుటుంబాలుంటాయి. ఈఉపకుటుంబాలకు మూలభాషలుంటాయి. ఒకేసారి ఉపకుటుంబమూల భాషలకు కూడ మూలమైన భాషారూపాల్ని పునర్నిర్మాణం చెయ్యటంలో పొరపాట్లురావచ్చు. అందుచేత ఉపకుటుంబాల మూలరూపాల్ని పునర్నిర్మాణంచేసికొని ఆ మీద వాటిఆధారంతో వాటికి మూలకందమైన భాషా రూపాల్ని పునర్నిర్మించుకోవటం చాల నిర్దుష్టమైన పద్ధతి. రెండుసార్లు మూల రూపాల్ని నిర్మిస్తుండటంచేత దీనికి "ద్వైవిధ్య పద్ధతి" అనే వ్యహారం ఏర్పడింది. ఇది సోపాన పద్ధతి కాబట్టి నిర్దుష్టం.

33. 51 జర్మానిక్ భాషా శాఖలో — ఇంగ్లీషు, సాక్సన్, జర్మన్ ఐస్లాండిక్, గాథిక్ అనేభాషాలున్నాయి. (చూ 6. 5) ఇందులోని సజాతీయ రూపాలాధారంగా మూలజర్మానిక్ (proto - germanic శబ్దాల్ని నిర్మించ వచ్చు. ఈమూలజర్మానిక్ భాషకు సోదరాలైనవి లాటిన్, గ్రీక్, సంస్కృత భాషలు. ఈపునర్నిర్మించిన రూపాన్ని వీటిలోని సజాతీయరూపాలతో పోల్చి మూల ఇండోయూరోపియన్ (Proto - Indo- Europeon) భాషా రూపాల్ని పునర్నిర్మాణం చేయుటమే ద్వైవిధ్యపద్ధతి.

33. 52 మూలద్రావిడభాషకు మూడు ఉపకుటుంబాలున్నాయి. ఈ ఉపకుటుంబాలకు మూలభాషలుంటాయి కదా ! ఆయా ఉపకుటుంబ మూలరూపాల్ని తొలుత నిర్మించుకొని ఇతర ఉపకుటుంబ రూపాలతో పోల్చుకొని మూలద్రావిడ భాషారూపాన్ని నిర్మించటం సముచితం.

కాల్డ్వెల్ కాలానికి 13 ద్రావిడ భాషలే విదితం. దక్షిణ భారతంలోని ద్రావిడభాషలే విశేషంగా పరిచయం. "ఉప్పు" అనే ప్రసిద్ధ పదం దక్షిణ ద్రావిడ భాషలన్నింటిలోను సమానమే అందుచే మూల ద్రావిడ భాషలన్నింటిలోనూ ఉప్పనే రూపమే ఉన్నట్లు నిర్మి , ఇతర సాక్ష్యాలను

బట్టి అదిదోషమని నిరూపితం. ఎందుచేతనంటే మధ్యద్రావిడభాషలలో ఇది 'చుప్' అని 'సుప్' అని ఉంది. అప్పుడు మూలద్రావిడ భాషారూపం చుప్ అవుతుంది. దక్షిణ ద్రావిడ భాషలలో పదాది చకారం లోపించిందని అది మధ్యద్రావిడంలో నిలిచిందని గ్రహించవచ్చు. ఈ పద్ధతివల్ల ఈరీతిగా నిర్దుష్టతను సాధించవచ్చు.

33. 6 ఉపభాషాకుటుంబనిర్ణయం : (Linguistic Sub-grouping)

ఒక భాషాకుటుంబంలోగల భాషలలో కొన్ని అత్యంత సన్నిహితంగా ఉన్నాయని భావించటానికికారణం అవిభౌగోళికంగాదగ్గరగాఉండటమేకాదు, మూలభాషలో లేని కొన్ని విశేషలక్షణాల్ని ఈభాషలు కలిగివుండటమే.వీటినే "పరిక్ష్ప్త నవప్రవర్తనాలు" (shared innovations) అంటారు.మూలద్రావిడ భాషలోని పదాది 'చ' కారం తెలుగు, తమిళం, మలయాళం,కన్నడ భాషల్లో కొన్ని పదాల్లో లోపించటం మనం గమనించాం. ఇట్టిదే "పరిక్ష్ప్త నవ ప్రవర్తనం" అంటే. ఇటువంటి లక్షణాల్ని బట్టే ఈ భాషల్ని ఒక ఉప కుటుంబం కావించాం. మూలద్రావిడభాషాలక్షణాల్ని సంక్రమింప జేసి కొన్నంతమాత్రాన వాటిని ఉపకుటుంబాలుగా నిర్ణయించకూడదు. "సంక్రమిత ధారణలు" (shared relations) ఎన్ని ఉన్నా పరిగణనంలోకి రావు. కకారం చకారం కావటంకూడ (Palatisation) పరిక్ష్ప్త నవప్రవర్తనమే

31. 61 ఒక భాషాకుటుంబంలో రెండు భాషలుంటే రెండు ఉప కుటుంబాలుండవచ్చు.




"క, చ, ట" అనే మూడు భాషలుంటే, మూడింటిలో భిన్నమైన లక్షణాలుంటే, మూడు ఉపకుటుంబాలుగా పరిగణింపవచ్చు. లేదా క, చ ఒక ఉపకుటుంబం కావచ్చు. 'ట' ఒక ఉపకుటుంబ మవుతుంది. లేదా 'క' ఒక

ఉపకుటుంబం; చ, ట లు ఒక ఉపకుటుంబం అవుతుంది. వాటినీరీతిగా నిరూపించవచ్చు.










ఈ రీతిగానే క, చ, ట, త, అనే భాషలుంటే :













ఇలాకాకుండా క, ట, త లు గాని చ,తలుగాని ఒక ఉపకుటుంబంగా ఉండటానికి వీలులేదు.

33. 62 ఉపకుటుంబాల నిర్ణయంవల్ల మూలభాషా పునర్నిర్మాణ ద్వైవిధ్య పద్ధతిని అమలు జరిపి నిర్దుష్టమైన మూలభాషను పునర్నిర్మాణం చేయవచ్చు. (చూ. 33. 5) తులనాత్మక భాషాధ్యయనాన్ని ఇంకా ఎక్కువ విపులంగా చేయవచ్చు. మొత్తం భాషాకుటుంబలో పరిక్షిప్తనవప్రవర్త నాల్ని సంక్రమితధారణల్ని, బాగా నిర్ణయించవచ్చు. మూలభాషనుండి భాష లేవిధంగా మార్పుకు లోనవుతున్నాయో గ్రహించటాని కెక్కువ అవ కాశమేర్పడుతుంది.

## 33. 7 మూలభాషా పునర్నిర్మాణ ప్రయోజనాలు :

చరిత్రకుకూడ అందని ఈమూలభాషను పునర్నించుకోన్నందు వల్ల ప్రయోజనమేమిటనే సందేహం పొడగట్టవచ్చు. చరిత్ర చెప్పని సాంస్కృతిక జీవనం ఎలావుంటుందో మూలభాషనుబట్టి గ్రహించవచ్చు. ఇండోయూరోపియన్ భాషలన్నింటిలో 'మంచు' అని అర్థమిచ్చే పదం ఉన్నది. కాబట్టి అటువంటిపదం మూల ఇండోయూరోపియన్ భాషలోకూడ ఉందని నిర్ణయించవచ్చు. అటువంటి నిర్ణయం వల్ల ఇండోయూరోపియనులు మంచుచేత ఆవరించిఉన్న ధ్రువప్రాంతానికి చెందినవారుగా అనుమానించటానికి అవకాశమున్నది.

ఇదే రీతిగా అన్ని ద్రావిడభాషలలోను 'విల్లు' 'అమ్ము'అనే పదాలున్నాయి అంటే మూలద్రావిడంలోకూడ ఉన్నట్లే దీన్నిబట్టి మూలద్రావిడ భాషావ్యవహర్తలు, విల్లమ్ములుదాల్చి వేటాడుతు అడవుల్లో జీవించేవారని తెలుస్తుంది. ఈరీతిగా చరిత్ర నిరూపించలేని అనేక విషయాల్ని ఈ మూలభాష లాధారంగా గ్రహించి సాంస్కృతిక వికాసాన్ని పొందటాని కవకాశముంది.[1]

---

1. ఈ విభాగరచన కెక్కువగా తోడ్పడ్డ వ్యాసం, మిత్రులు డాక్టర్ పి. యస్. సుబ్రహ్మణ్యంగారు భారతిలో (జనవరి 1961) ప్రచురించిన "ఆధునిక భాషాశాస్త్రము – తులనాత్మక పద్ధతి" అనేది.

# 8. మాండలిక విజ్ఞానం

[ Dialectology ]

## 34. 0 మాండలిక మంటే ఏమిటి ?

మండలానికి సంబంధించింది 'మాండలికం'. మండలమనే సంస్కృత నపుంసక లింగ శబ్దానికి దేశమని; పుంలింగ శబ్దానికి సమూహమని సూ. ని. పేర్కొన్నది. ఒక ప్రదేశానికి లేక ప్రాంతానికి సంబంధించిన ప్రజలు వ్యవహరించే భాషావిశేషాన్నిగాని, లేక భాషకు చెందిన ప్రజానీకంలో వృత్తినిబట్టిగాని కులాన్నిబట్టిగాని ఏర్పడ్డ ఒక వర్గం ప్రజలు వ్యవహరించే భాషాభేదాన్ని గాని 'మాండలిక' మని వ్యవహరించవచ్చు. ఈపదం శ. ర. లోకిగాని, సూ. ని. లోకి గాని చేరలేదు. కాని మోనియర్ విలియమ్సు [1] పేర్కొన్నది.

మండలమంటే - Society, association, a great circle a district of province, a surrounding district or territory; అనే అర్థాల్ని ఆప్టేకోశం పేర్కొన్నది. మండలిక మనే పదానికించు మించుగా ఈ అర్థాలే ఆకోశం చూపించింది.

34. 1 'డైలెక్ట్' [2] అనే ఆంగ్ల పదానికి అర్థాలు - సంభాషణ మని, మాట్లాడు తీరు, వైఖరి, రీతి, చర్చ, మాండలికం మొదలైనవి. బ్రౌణ్యం దీన్ని 'మాండలిక' మని అనువదించక పై రీతిగానే మాట్లాడే తీరు, వైఖరి అని పేర్కొంటున్నది.

---

1. మాండలిక (స్త్రీ. పుం. న) లేక మాండలీక : Relating to; a province. M. W. 'మాండలీకభాష' అని వేదం వేంకటరాయశాస్త్రిగారు వాడారు.

2. <dialectus < Gr. dialektos : discouse, language, < dialegesthai : converse, discuss, argue; manner

తెలుగు అకాడమీ ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు 'మాండలిక భాష' అని వచించింది. మొత్తంమీద ఆంగ్లనిఘంటువు ననుసరించి "పదజాతంలోగాని, ఉచ్చారణంలోగాని కొంత వైలక్షణ్యంగల ఒక మండలానికి చెందిన భాషనుగాని, ఒక భాషాశాఖనుగాని, లేక ఒక మూలభాషకుచెందిన భాషనుగాని, ఒక వృత్తికో, వ్యాపారానికో చెందిన పరిమిత భాషను మాండలికభాష" అనవచ్చు.

34. 11 భాషణలోని కొన్ని స్థానిక లక్షణాల మొత్తాన్ని గాని ఒక వ్యక్తి భాషణలోని విశేష లక్షణాల మొత్తాన్నిగాని; ప్రామాణిక భాష అని భావింపబడేదానినుండి వేరుపడిన లక్షణాలుగల భాషనుగాని; జార్గన్నుగాని (వృత్తి మాండలికం) కాంటునుగాని (వర్గ మాండలికం) మాండలికం అనవచ్చునని మరో ఆంగ్ల నిఘంటువు[1]. మొత్తంమీద పరస్పరావగాహన గలిగి ఒకానొక ప్రధాన

---

of speaking, phraseology, idiom; a form of a language prevailing in a particular district and marked by peculiarities of vocabulary, or pronunciations; a special variety or branch of a language, or one of a number of languages regarded as a family; a form of language characteristic of a particular profession or trade.

(The International webster New Encyclopedic Dictionary)

1. i) The sum total of local characteristics of speech
   ii) the sum total of an Individual's characteristics of speech
   iii) any form of speech considered as deviating from a real or imaginary standard speech
   iv) loosely, any jargon, can't or patois (అపభాష)
   వీటిని dialects గా పరిగణించవచ్చు.

భాషాంతర్గతంగా, ప్రత్యేక సారస్వతాదులు లేకుండా ఉండే భాషా భేదాల్ని 'మాండలికా'లని; దీనికి భిన్నంగా పరస్పరావగాహన లేకుండా, ప్రత్యేక సారస్వతాదులుగల వాటిని భాషలని పేర్కొన వచ్చు. 1

34. 12. పై నిరూపణాన్నిబట్టి మాండలిక భాషయొక్క ప్రధాన లక్షణాల్ని ఈ క్రింది రీతిని క్రోడీకరింపవచ్చు.

(i)పరిమితమైన మండలంలో ఏకదేశ వ్యవహారం కలిగి ఉండటం. (ii) ప్రామాణిక భాషలో అంతర్భూతంగా ఉండటం (iii) న్యూన ప్రామాణికంగా (substandard) ఉండటం (iv) స్వతంత్రమైన సాహిత్యంలేకపోవటం (v) ప్రాంతీయవైలక్షణ్యం విశేషంగా కలిగి ఉండటం. (vi) పృథగ్లక్షణాలెన్నో ఉన్నా, మొత్తంమీద భాషా వ్యవహర్తలమధ్య పరస్పరావగాహనాన్ని (intelligibility) కోల్పో కుండా ఉండటం మొదలైనవి.

34 2 మాండలికా లేర్పడటానికి ఈ క్రింది హేతువుల్ని కొన్నింటిని పేర్కొనవచ్చు :

(i) ఒక ప్రాంతంలోని భాషావ్యవహర్త లేవో కారణాలవల్ల అన్యప్రాంతాలకు వలసపోవటం; ఆపరిసరాలలోని భాషా ప్రభావం వీరి భాషపై ప్రసరించటం. (ii) ఒకే వ్యవహారప్రాంతంలోను అందు లోని అన్నిభాగాలకు భాషావ్యాపకసాధనాలైన రాకపోకలు, ఇతర

1. " In linguistics, the form or variety of a spoken language peculiar to a region, community, social group, or occupational group; in this sense, dialects are regarded as being to some degree, mutually intelligible while languages are mutually unintelligible.

(webster's New Twentieth Century Dictionay un - abridged Second Edition)

సంబంధబాంధవ్యాలుసన్నగిలి,భాషావ్యవహారంలో భేదాలుకలగటం. (iii) విస్తృతమైన వ్యవహారప్రాంతం ఉండడంచేత, సరిహద్దులలోని భాష, పరిసరాలలోని భాషాప్రభావానికి గురికావడం. (iv) చేనేత జాలరి, కుమ్మరి, కమ్మరి, వ్యవసాయం మొదలైన వృత్తులవారు వాడు, కొనే పనిముట్లకు పేళ్లు, వారుపయోగించే పదజాలం ఆయా ప్రాంతాలకే పరిమితంకావటం,(v)దుర్గమపర్వతారణ్య నదీనద ప్రాంతాలలోని ప్రజలు, అన్యప్రాంతాలతో రాకపోకలులేనికారణంగా, ప్రాచీనమైన భాషావ్యవహారాన్నే తాము కలిగిఉండటం. (vi) ఒకేప్రాంతంలోని ప్రజలు భిన్నభిన్నమైన సాంఘిక, ఆర్థిక పరిస్థితులకు చెందినవారు కావటం.(vii) భిన్నవృత్తుల్ని అవలంబిస్తుండటం (viii)రాజకీయ కారణాలు:నగరాలు, రాజధానులుగా ఏర్పడటం, ఆనగరభాష ప్రమాణికం కావటం. తెలంగాణా ప్రాంతం నైజాం పాలనలో ఉండటం, దత్త మండలంగా రాయలసీమ రాజకీయంగా వేరుకావటం మొదలగునవి. (ix) కొన్ని ప్రాంతాలలో శీతోష్ణాది పరిస్థితులు కారణంగా వారి ఉచ్చారణల్లో భేదాలేర్పడటం. (x) విద్యాసంస్కారాదులలో గల భేదం మున్నగునవి.

అసలు ప్రతి వ్యక్తి మాట్లాడేది మాండలికమే కాని 'భాష' కాదు. మాండలికాల సమాహారరూపమే భాష. మాండలికమే భాష యొక్క సహజస్థితి,[1] అందుచేత మాండలిక లెలాఏర్పడుతాయనే విచారణ అర్థవంతం కాదేమో !

ఒకే వ్యక్తి ఆయా సందర్భాన్నిబట్టి అనేక మాండలికాలు వ్యవహరిస్తాడు. పెద్దలతో ఒకతీరు, పిన్నలతో ఒకరీతి, బాలలతో ఇంకో తెరగు, అధికారులతో ఒక పద్ధతి, అనధికారులతో మరో విధానం, నౌకర్లతో ఇంకో తెరవు. ప్రతివ్యక్తిలో అతనికిగల సాంఘిక

---

1. "Dialect is the natural state of language."
— Max Muller.

గౌరవప్రతిపత్తుల్నిబట్టి, బహుముఖీన వ్యవహార విస్తృతిని అనుసరించి బహు మాండలికత గోచరిస్తుంది.

ఆధునిక యుగంలో ప్రయాణ సౌకర్యాలు, సినిమాలు, రేడియో, టెలివిజన్, వార్తాపత్రికలు, అధికమైన కారణంగా మాండలిక భాషాభేదాలు నశించిపోతున్నాయి. వృత్తిపదకోశాలు,[1] జిల్లాలవారిగా మండలిక పద పరిశోధనలు[2] వెలువడుతున్నాయి. మాండలికాల పరిజ్ఞానం అధికమైతే భాషసమగ్రత్వాన్ని పొందటానికెంతో అవకాశమేర్పడుతుంది.

34.3 లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా నాల్గవసంపుటిలో తెలుగు భాషకు గల మాండలిక భేదాలు కొన్ని పేర్కొనబడ్డాయి. అందులోని ఉదాహరణలు ఆంధ్రభాషా చరిత్రలోను, ఆంధ్రభాషా వికాసంలోను ఉద్ధరింపబడ్డాయి.

(1) మహారాష్ట్రంలోని చాందాజిల్లా పరిసరాలకు వలసిపోయి అక్కడ చేనేత పనులు, కూలిపనులు చేసుకొని బ్రతికే తెలుగు వారున్నారు. వీరు మూడు తెగలు - కొంటావు, గోలరీ, సాకేవారి అని. వీరు మాట్లాడే తెలుగుమీద పరిసర ప్రభావ మధికం.

(2) బొంబాయి ప్రాంతంలో ఇటుకపని చేసుకొని బ్రతికే కామాఠీ లనబడేవారు తెలుగువారే.

---

1. సాహిత్య అకాడమీవారు ఒక మాండలికపదకోశాన్ని, వ్యవసాయ వృత్తి పదకోశం, వాస్తు కుమ్మరి కమ్మరి వంటి వృత్తులకు కోశాలు ప్రచురించారు.

2. తెలుగు అకాడమీ, కరీంనగర్, ఆదిలాబాద్, కడప, అనంతపురం జిల్లాలలోని మాండలికాలను ప్రచురించింది.

(3) బెల్గాం జిల్లాలో దాసరులు మాట్లాడే తెలుగును 'దాసరీ' అంటారు. ఈజిల్లాలోనే దేశద్రిమ్మరులైన ప్రజలు మాట్లాడే 'బేరడీ' అనే భాష తెలుగు మాండలికం.

(4) బొంబాయి ప్రాంతంలో క్వారీపని చేసుకొని బ్రతికే వారు మాట్లాడే తెలుగును 'వడరీ' అంటారు.

పైని పేర్కొన్నవి కాక తెలుగునకింకా వలస కారణంగా ఏర్పడ్డ మాండలికా లెన్నో ఉన్నాయి తిరువనంతపురం ప్రాంతంలో నివసించే రెండువందల తెలుగు కుటుంబాలవారు; రాజ పాలియం, సేలం, కోయంబత్తూర్, కోలార్, మైసూర్ మున్నగు ప్రాంతాలలో ఉన్న తెలుగువారు ఇండ్లలో మాట్లాడే భాష తెలుగు. ఇవన్నీ తెలుగుమాండలికాలే. ఈ మాండలికాలలో దీర్ఘం మీద పూర్ణాను స్వారం కల్గిన రూపాలు - వాణ్డు, ఆణ్డబిడ్డమొదలైనవి, ప్రాచీన క్రియారూపాలు = తెస్తివి, చేస్తివి, వస్తివి మున్నగునవి ఈ మాండలికాలలో శ్రుతం. ఇంకా కలకత్తా, జంషడ్ పూర్, ఖరగ్ పూర్ వంటి ప్రాంతాలలోను తెలుగువారెందరో ఉన్నారు వారు ప్రధానమైనభాషనుండి వేరుపడిన కారణంగాను, పరిసరాల భాషా ప్రభావ మధికంగా ఉండటంచేతను వీరి తెలుగులో కొన్ని విశేష లక్షణాలు గోచరిస్తాయి. ఈ విధంగా తమిళ [1] కర్ణాట [2] మలయాళాది భాషలకుకూడ ఎన్నో మాండలికభేదాలున్నాయి.

---

1. అరవ, బుర్గండి, కైకడి, కొరవ అనేవి తమిళ మాండలికాలు గాను

2. గోలకన్నడ, హాలియ, బడగ - అనే కన్నడమాండలికాలు లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా నాల్గవ సంపుటిలో పేర్కొన బడ్డాయి.

34.4 ఆంధ్రదేశం తూర్పున సముద్రం తప్ప, తక్కిన అన్ని వైపుల అన్యభాషలున్నాయి. వాటి ప్రభావం ఆయా తెలుగు మాండలికాలపై ఎలా ప్రసరించిందో స్థూలంగా చూద్దాం.

(i) తూర్పున విశాఖ మండలంలోని తెలుగు మాండలికంలో ఒరియా భాషాపదాలనేకం తత్సమ, తద్భవాలుగా కనిపిస్తాయి. ఉదా: కంబారీ-జీతగాడు; ఉభాలు-ఊడ్పులు 'ఉభా' అంటే నేలనుండి పైకి తలెత్తుట అని అర్థం. బుగత - పెద్దరైతు, ఒరియా - భోగతా; బంద - చిన్న చెరువు, భోగట్టా-సంగతులు, విషయం; పన్నెలేకపైన-దువ్వెన; వేపి - కుక్క, మొరియలు - మరమరాలు.

(ii) తెలంగాణా పశ్చిమోత్తర జిల్లాలైన ఆదిలాబాద్, నిజామాబాద్ మొదలైన మండలాల సరిహద్దుల్లో మరాటీ పదాలు వినిపిస్తాయి. కొన్ని ఉదా: కులకర్ణి, గెడంచు, చకడాబండి బీగడబోరెం, రాతాళం, ఆరె (బండిచక్రపుటాకు) కచరం, కచ్చడం-గూడుబండి, గిరక-బావిగిలక

(iii) అనంతపురం కర్నూలు, మహబూబ్‌నగర్ మొదలైన మండలాలలో పడమటిదిక్కున వ్యవహృతమౌతున్న తెలుగుపై కన్నడభాషా ప్రభావం గోచరిస్తుంది. మచ్చుకు కొన్ని మాటలు: అరువు-తెలివి; ఉద్దులు-మినుములు, ఓళిగలు-బొబ్బట్లు, కొళివి - క్రోవి, గొట్టము; గెనుసుగడ్డ, గోడంబి - వేయించినజీడిపప్పు, పుంటికూర-గోంగూర, బాడుగ - అద్దె, బాళిక - మన్నిక, బాలేపండు - అరటి పండు, మడక - నాగలి, కల్లి-సన్నజెముడు, కోడి - అలుగు, బారి-మోటఎద్దులు నడిచేదారి, సొండు, సొండెం - మోటబొక్కెన, తొండం.

(iv) చిత్తూరు, నెల్లూరు మండలాల దక్షిణపు సరిహద్దులలో తమిళభాషా ప్రభావంవల్ల చేరిన కొన్ని శబ్దాలు.

ఆళ్వారు, ఉళవాయి, కనకపిళ్ళై, కూటు, తిర్లిక, పులికాపు, మణగానసనం - (గోడలగచ్చు) సాపాటు; కదురు - ఎన్ను; కపిల-మోట.

(V) తెలంగాణంలో అయిదారు శతాబ్దాలుగా ఉన్న హిందూస్తానీ పదాలు (హింది, పర్షియన్, అరబిక్) తెలుగుమాటల్ని త్రోసిపుచ్చి, వాటి స్థానంలో తత్సమ, తద్భవాలుగా విరివిగా వాడుకకు ఎక్కాయి. భూశాసన పరిభాషలో (రివెన్యూ) ఇవి విరివిగా చేరాయి.

కౌలు, మక్తా, శిస్తు, తహసీల్-ఇట్టివి దేశమంతటా వ్యాప్తిలో ఉన్నవే. ఇట్టివి కాక ఆలుగడ్డ - ఉర్లగడ్డ (హిం.) ఆలూ; కబ్జా-పట్టా భూమి; కాస్త - సేద్యం; తరి - మాగాణి; నై - కాలువ; సదర్ రాయి - సర్వే అధికారి వేసినరాయి; తుకం-నారు. (హిం. తుఖమ్-గింజ, జీవాణువు).

అంగూరు, ఆబోరు, ఇజరా, ఉజాడు, కసాలా, కసుబా, గరీబు, గల్లీ, జరూరు, తకరారు, గలాలీ, దౌలత్తు, నల్ల (కొళాయి) నాష్ట, పల్లా (బస్తా) బదనాము, ములాజా, లుక్సాను, శాయి, సదరీ, హామేషా, హాజీలు, హైరాన మొదలైనవి. ఇందులో కొన్ని ఇతర ప్రాంతంవారుకూడ వాడుతారు.

## 34. 5. మాండలికాలలోని అర్థ, శబ్ద, భేద పరిశీలనం :

శబ్దాకృతి ఒకటే అయినా, వివిధ మాండలికాలలో దాని అర్థం భిన్నంగా ఉండటం :

(i) బొట్టు : సాగర ప్రాంతంలో తిలకం, చుక్క; రాయలసీమలో అణాలో, నాల్గోవంతు,

(ii) వాకిలి : గుమ్మం, తలుపు అని రాయలసీమలో అర్థం. ముంగిలి అని సాగర ప్రాంతం. పెరటిగుమ్మానికి ఎదురుగాఉండే ప్రదేశం అని కళింగ ప్రాంతంలో.

(iii) బేడలు : రెండణాలని పూర్వం సర్కారులో వాడుక. కంది, పెసర, మినప, శనగ వాటి పప్పు అని రాయలసీమ.

(iv) అప్ప : అక్క అనే అర్థంలో కొందరు సాగరప్రాంతంలో వాడుతారు. రాయులసీమలో తండ్రి; గౌరవ వాచకం - ద్రోణప్ప.

(v) సొమ్ములు : విశాఖ, శ్రీకాకుళాలలో గొవులు; తక్కిన చోట్ల నగలు.

(vi) అయ్యగారు : పూజారి (మహబూబ్) పురోహితుడు (తెలంగాణ) గౌరవవాచకం (నెల్లూరు, రాయలసీమ)

(vii) అయ్యవారు : ఉపాధ్యాయుడు. బ్రాహ్మణుడు, సాతాని, శ్రీవైష్ణవుడు.

(viii) నూడ : బండిపై జల్లముందరి భాగం; పల్లె, తుంటి, భుజపుకీలు, నీరుపారించే సాధనం, నిలువుగా కుప్పవేయటం జంతువులపైనుంచే వెదురు అల్లకం.

ఇటువంటి వింకా మాండలిక పదకోశాన్ని చూచి గ్రహించవచ్చు. ఇవి నానార్థాలవంటివి. ఈఅర్థభేదాలు ఏర్పడటానికి కారణం పూర్వం పేర్కొన్నట్లు వివిధప్రాంతాలలో వీటి ఉపయోగానికి గల సందర్భము భావించవచ్చు.

34. 6. అర్థం ఒకటే అయినా భిన్నమాండలికాలలో వేరువేరు పదాలు వ్యవహారంలో ఉంటాయి :

తిరుగలి : తిరగలి, విసర్రాయి, రాగరాయి, రాగినకల్లు

దేవాలయం : కోవెల, గుడి, దేవళం, మందిరం

మహిషి : ఎనుం, ఎనుంగొడ్డు, గేదె, బర్రె

బకెట : చేద, బక్కీటు, బాల్చీ, బొక్కెన

పాదరక్షలు : చెప్పులు, జోళ్ళు, పాంకోళ్ళు, మెట్లు

ఇవన్నీ సమానార్థక శబ్దాలు (Synonyms).

34. 71. వేరువేరు పదాలలో కాక కించిత్ వర్ణ లేక ధ్వని భేదాలతో వివిధ మండలాలలో వ్యవహృతమౌతుంటాయి. (Variants).

గుండి : బొత్తం, బొత్తాసు, బొత్త్రాం, బొత్త్రాయి

దువ్వెన : పన్ని, పన్నె, పన్య, పైన

పోవుపెట్టడం : తిరగబాత, తిరగబోత, తిరగమాత, తిరగమూత
తిరుగమోత, తిరుగవాత

బకెట్ : బాల్చా, బాల్చీ, బాల్టీ, బాల్దీ

లాంగలం : నాగలి, నాగిలి, నాగల, నాగేలి, నాంగలి

34. 72. క్రియారూపాలలోకూడ ఈరీతిగానే భేదాలు వివిధ మాండలికాల్లో శ్రుతం :

ఇచ్చినాడు, ఇచ్చిండు, ఇచ్చేడు, ఇచ్చీశాడు, ఇచ్చేశాడు

తెచ్చినాడు, తెచ్చిండు, తెచ్చేడు, తెచ్చీశాడు, తెచ్చేశాడు

ఈరీతిగానే : పోతుంది-పోతాది-పోతది-పోద్ది
వస్తుంది-వస్తాది-వస్తది-వచ్చుద్ది

ఇట్టివాటిలో కొన్ని రూపాలు, ఆర్థికంగాను, సాంఘికంగాను వెనుక బ వారు వ్యవహరిస్తారు. లెగుద్ది, వచ్చుద్ది అనే రూపాలు మరీ వెనుక బ వారి వ్యవహారంలోవి.

34. 73. భావార్థక క్రియలు కొన్ని 'అటాంతా'లయితే, కొన్ని అడాంతాలవుతాయి. ఒకే మండలంలోనివారు ఈ రెండు విధాలయిన భావార్థకాల్ని వాడుక చేస్తారు.

చెప్పటం - చెప్పడం; పోవటం - పోవడం

తినటం - తినడం; వినటం - వినడం [1]

తింటం అని, వింట మనికూడా అంటారు.

34. 74. వ్యతిరేకార్థకంలో విధిరూపాలు వ్యవహారంలో పద కొండు విధాలుగా ఉంటున్నాయి. ఇవి పదకొండు మండలాలలో వ్యవహృతంగా భావించనక్కరలేదు. ఒకేవ్యక్తి రెండు మూడు వ్యవహారాలు చేయనచ్చు :

---

1. ప్రతి క్రియ మడాంతత్వం, ప్రతీతం నతుగీయతే
క్వచి దింప్వంతతాం కేచి దూచిరే నహి మే రుచిః॥

(వికృతి వివేక - అజ న్త. 98)

ప్రతి క్రియయందైన యడాంతత్వము లోక ప్రసిద్ధము. అట్లై నను ప్రయోగంబు లేదు. ఇంప్వంతత్వమును గొందరు చెప్పిరి కాని నాకిష్టములేదని అథర్వణుడు.

ఉదా : అందడము, పొందడము, విడువడము - ఇత్యాదుల డాంతములు. రాణింపు, తేలింపు ఇత్యాదులు ఇంప్వాం తంబులు - కవిజనమండనటీక.

చెప్పు : చెప్పుకు, చెప్పుటాక, చెప్పుబోక, చెప్పుబాకు, చెప్పుబోకు, చెప్పుమాక, చెప్పుమాకు, చెప్పువాక, చెప్పువాకు, చెప్పాక, చెప్పాకు.[1]

34. 8. **తెలుగు భాషామండలాలు** (Dialect regions) : వివిధ వృత్తిపదకోశాలాధారంగా తెలుగు భాషామండలాలు నాలుగుగా నిర్ణయం చేశారు, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి.[2] (1) పూర్వమండలం : కళింగదేశం – శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు. (2) దక్షిణమండలం : రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు. (3) ఉత్తరమండలం : తెలంగాణా, మహబూబ్‌నగర్, ఖమ్మంజిల్లాల్లో కోస్తా రాయలసీమలను ఆనుకొన్న తాలూకాలు ఆయా భాషామండలాల్లో కలుస్తాయి. (4) మధ్యమండలం : ఉభయ గోదావరులు, గుంటూరు, కృష్ణాజిల్లాలు, కోస్తాజిల్లాలు.

| | | | |
|---|---|---|---|
| మోట | : 1, 3, 4 | కపిల–2 | (రాయలసీమకే పరిమితం) |
| నాగలి | : 1, 3, 4 | నాగేలి/మడక–2 | ( ఇట్లే ) |
| పెడ | : 1, 2, 4 | పెండ–3 | (తెలంగాణాకే పరిమితం) |
| పటి/కర్ర<br>పడికర్ర | : 1, 3<br>4 | నొగ/నగ–2 | (రాయలసీమకే పరిమితం) |
| కర్రు | : 2, 3, 4 | నక్కు–1 | (కళింగదేశానికే పరిమితం) |
| తూము | : 2, 3, 4 | మదుం–1 | ( ఇట్లే ) |

1. ఈ రచనకు ఆచార్య తూమాటి దోణప్పగారి "మాండలిక భాషా భేదాలు" అనే వ్యాసం సహాయపడ్డది. "తెలుగులో కొత్త వెలుగులు" మొదటి సంపుటిలో దీ వ్యాసం.
2. తెలుగు మాండలికాలు – ప్రమాణ భాష : ప్రకరణం 14; పుట 389; ఆం. ప్ర. సాహిత్య అకాడమివారి "తెలుగు భాషా చరిత్ర".

కాడిమాను / కాడిమాకు - 2

కాండి/కాణి/కాని 3, కాడి-4 : పూజ/పూదు-1 ( ఇస్లే )

పై రీతిగా రాయలసీమకు, తెలంగాణాకు, కళింగానికి మాత్రమే పరిమితమైన మాండలికా లున్నాయి కాని, మధ్యమండలానికి మాత్రమే పరిమితం అనిపించుకొనే ఉదాహరణా లెక్కువగా లేవు. అంటే ఈ వ్యవహార మండలంలో ఉన్నపదం, ఇంకో మండలంలో నైనా వ్యవహృత కావటాన్నిబట్టి ఈ మాండలికమే అధిక వ్యాప్తి కలదిగా నిర్ణయించవచ్చు. రాజకీయమైన అస్థిమితత్వమే ఈ మండలానికి పృథగ్భూతంగా ఉదాహరణం లేకపోవటానికి కారణం. ఇతర ప్రాంతాలకు ఇలాకాదు. అందుచేత దీన్ని "మిశ్రవ్యవహారమండలం" (Mixed dialect region) అనవచ్చు. అందుచేత ఈ మాండలికమే ప్రమాణత్వాన్ని పొందటానికికూడ కారణం అయిఉంటుంది.

## 34. 9. మాండలిక భౌమిక శాస్త్రం (Linguistic or Dialect Geography) [1]

స్థానిక మాండలికాలు, ప్రామాణిక మాండలికం (Standard dialect) కన్న ప్రధానమైనవని భాషాశాస్త్రజ్ఞులు గుర్తించారు. ఎందుకంటె ప్రాచీన భాషాలక్షణం ఏదో ఒకటి స్థానిక మాండలికాలలోనే నిల్చిఉంటుంది. [2] క్రీ. శ. 18 వ శతాబ్దాంతానికి మాండలిక పదకోశాలు (Dialect dictionaries) యూరోపియన్ భాషలకు చాల వరకు ఏర్పడ్డాయి. వీటివల్ల ప్రామాణికేతర మాండలిక భాషా వైవిధ్యం నిరూపితమైంది. ప్రాంతీయోచ్చారణ రీతులిందులో నిరూపితం.

---

1. local or regional variations of a language or dialect studied as a field of knowledge — also calledialect Geography. (web.)

2. One noticed in time, the local dialects preserved one or another ancient feature, which no longer existed in the standard dialect. (Bloomfield — p. 321)

జోసఫ్ రైట్ (Joseph wright) ఆంగ్ల భాషకో నిఘంటువును రచించాడు. ఇల్లిస్ తన వ్యాకరణం - ఐదవ సంపుటిలో మాండలికో చ్ఛారణ భేదాలు నిరూపించాడు.

మాండలిక వ్యాకరణాలు (Dialect Grammars) కూడ విరచితమైనాయి. మాండలికాలలోని ధ్వనులకు, భాషలోగల వివిధ ప్రాచీన దశలకు చెందిన ధ్వనులకు గల సంబంధం ఇందులో నిరూపితం. 1821 లో జుహాన్ ఆండ్రిడస్ స్కిమ్లర్ (Johann Andreas Schemelier) రచించిన బవేరియన్ వ్యాకరణం ప్రామాణికం.

నిఘంటువులు, వ్యాకరణాలు ఎంతగాయత్నించినా, మాండలిక పదవ్యాప్తిని అవి నిర్దుష్టంగా, నిర్దిష్టంగా నిరూపించలేవు. విన్నదాని కన్న, కన్నది మిన్న.[1] మనస్సుకు బాగా హత్తుకొంటుంది.

క్రీ. శ. 1876 లో జార్జ్ వెన్కర్ అనే జర్మన్ పండితుడు ఇటువంటి లక్ష్యంతోనే మాండలిక భాషాపరిశోధన మారంభించాడు. ఇతడు 1881లో ఉత్తర, మధ్య జర్మనీలకు ఆరు పటాలతో ఒక చిన్న మాండలిక పట సంపుటి, (dialect atlas) తయారు చేసాడు. ఆ తరువాత ప్రభుత్వ సాయంతో నలభై వాక్యాల్ని వివిధ మాండలికాలలోనికి మార్పించి నలభై వేల జర్మన్ మాండలిక భేదాల్ని పటాల ద్వారా నిరూపించాడు. ఇవన్నీ శాస్త్రజ్ఞులు కాని ఉపాధ్యాయులు తయారు చేసినవి. అందుచేత ఇవి లోపరహిత మనజాలం. కాని కృషి ప్రశంసనీయం. ఇవి ధ్వని విధేయంగా గీయబడలేదు. ఇందులో అన్ని మాండలికాలు చేరలేదు.

ఎడమన్డ్ ఎడ్మాంట్ అనే ఫ్రెంచ్ భాషాశాస్త్రజ్ఞుడు ఫ్రెంచి మాండలిక పట సంపుటాన్ని విరచించాడు. ఇతడు పరిమిత

1. Things seen are mightier than things heard.

ప్రాంతాన్నే పర్యటించాడు. రెండువేల పదాల్ని మాత్రమే సేకరిం చాడు. ఎంత శాస్త్రీయ పరిజ్ఞాన మున్నా ఇతడు, ఒక మాండలికా నికి, మరో మాండలికానికి గల సూక్ష్మ భేదాల్ని గుర్తింపజాలక పోయినాడనే విమర్శకు గురి అయినాడు. ఇతడు పదాలే సేకరించాడు. వాక్యాలు సేకరించలేదు.

కె. జాబర్గ్, జె. జుడ్ అనే ఇటాలియన్ భాషాశాస్త్రజ్ఞులు, ఇటాలియన్ మాండలికాలకు 1928 వరకు అట్లాసు రచనలు చేస్తునే వచ్చారు. ఈ రచనలు పూర్వరచనలకన్న నిర్దుష్టమైనవిగా ఖ్యాతి పొందాయి. వీని ఒరవడిలో చిన్నచిన్న అట్లాసులు యూరోపియన్ భాషలలో ఏర్పడ్డాయి. ప్రతి అట్లాసుకు వ్యాఖ్యానం కూడ అవసరం.

విస్తృత ప్రాంతాన్ని తీసుకోటం కన్న పరిమిత ప్రాంతాన్ని గ్రహించినప్పుడే ఎక్కువ వివరాలు నిరూపించగల్గుతారు. ఒక పట్ట ణాన్నే తీసుకోవచ్చు. జన సాంద్రతవల్ల మాండలికా లేర్పడతాయి.

ప్రతి భాషావ్యవహర్త ఎప్పటికప్పుడు తన భాషణాన్ని (Idiolect) [1] తీర్చి దిద్దుకోటానికి, నాగరికోపేతం కావించటానికో వ్యక్తావ్యక్తంగా ప్రయత్నిస్తునే ఉంటాడు. తనకంటె నాగరకులైన వారి, శిష్టులైనవారి ప్రవర్తననేగాక, భాషణాన్ని అనుకరిస్తూనే ఉంటాడు. [2] తన పాత వాగ్ధోరణిని పూర్తిగా వదలలేడు క్రొత్త ధోరణిని పూర్తిగా చేపట్టనులేడు. వ్యక్తి భాషణంలోని మార్పులు క్రమంగా ఆయా ప్రాంతాలలోని ఇతర వ్యక్తులకు వ్యాపిస్తాయి.

1. Idiolect : a variety of speech used by one given individual, in its relation to the accepted language system.
2. Language in the Modern world - glossary. To take the extreme case, when a speaker comes in contact with persons who enjoy much greater prestige, he eagerly imitates not only their general conduct, but also their speech. — Bloomfield : 27-1

ఈ విధంగా ఒకానొక విలక్షణోచ్చారణమో, లేక పదమో వ్యాపించిన ప్రాంతాన్ని, వ్యాపించని ప్రాంతంనుండి పటాలలో వేరు చేసే రేఖనే వ్యవహార భేదక రేఖ (Isogloss) 1 అంటారు. వ్యవహార భేదక రేఖలు సామాన్యంగా ఒకదానితో ఒకటి కలిసి కోవు. ఒకానొక ధ్వని విశేషంగాని, వ్యాకరణ, నైఘంటిక లక్షణం గాని, ఏ ప్రాంతాన్ని ఆక్రమించిన ప్రజలచే వ్యవహృతమో ఈ రేఖలు సూచిస్తాయే కాని ఎప్పుడెక్కడ మార్పు ఏర్పడ్డది నిరూపించవు. 2 అంటే 'కపిల' అనే వ్యవహారం గల ప్రాంతంలో ఎప్పటి నుండి 'మోట' అనే వ్యవహార మేర్పడ్డది ఈ రేఖ చెప్పదు.

---

Iso=equal, gloss = language.

1. In linguistic maps, lines are drawn to separate diffrent dialect areas and define their boundaries. These lines are known as isoglosses.

V. Sriramamurthy's Linguistics &Language Teaching :p. 116

Within a dialect area, we can draw lines between places which differ as to any feature of language. Such lines are called isoglosses. If a village has some unique peculiarity of speech, the isogloss based on this peculiarity will be simply a line round this village. On the other hand, if some peculiarity extends over a large part of the dialect area, this isogloss of this fearure will appear as a long line, dividing the dialect area into two sections:

Bloomfield p. 51.

Isogloss — 1. a boundary line betwen places or regions that differ in a particular linguistic feature.

2. a linguistic feature shared by some but not all of the speakers of a dialect, language or group of related language. (web.)

2. An isogloss tells us only that there has occurred somewhere and at sometime a sound - change, an analogic semantic change; or a cultural loan, but the isogloss does not tell us where or when this change occurred. Bloomfield—p. 480,

'మోట' 'కపిల' అనేవి విడివిడిగా వ్యవహృతమౌతున్న ప్రాంతాల్ని భేదింప జేస్తుంది.

ఒక గ్రామంలో ఒక విలక్షణమైన భాషా లక్షణం గోచరిస్తే దాన్ని సూచించటానికి ఆ గ్రామం చుట్టూ గీతగీస్తాం. అలా కాకుండ, ఈ వైలక్షణ్యం ఆ మాండలిక ప్రాంతంలో ఎక్కువ భాగంలో కనిపిస్తే, అప్పుడే దాన్ని సూచించే వ్యవహార రేఖ ప్రాంతాన్ని రెండుగా చీల్చి, ఆలక్షణమున్న భాగాన్ని వేరు చేస్తుంది.

ఒకే ఒక వ్యవహార భేదక రేఖ కంతగా ప్రాముఖ్యం లేదు. అనేక రేఖలున్నపుడే వ్యవహారమండలాల్ని నిర్ణయించటానికి అవకాశ ముంటుంది. సమాన వ్యవహార రేఖల బొత్తి ఒక్కొక్క వ్యవహారమండల నిర్ణయానికి తోడ్పడుతుంది.

ఇవి సమానోష్ణోగ్రతల్ని కలిపే ఐసోబార్స్ (Isobars) వంటివి కావు. ఇవి సమానార్థక పదాలకు సరిహద్దు గీతలు. ఇవి రాజకీయ విభాగాల్ని సూచించే వాటిలాగా ఖచ్చితంగా ఉండవు. ఈ సరిహద్దులు స్థూలమైనవే. కొంతమంది భాషావ్యవహర్త లాధారంగా నిర్ణయమైనవి. ఒకవేళ భాషావ్యవహర్త లందరిని కలిపినా ఖచ్చితంగా, దోషరహితంగా ఈ రేఖల్ని గీయటం సాధ్యంకాకపోయినా, స్థూల నిర్ణయాని కివి తోడ్పడతాయి.

రెండు వ్యవహార మండలాల మధ్య వ్యవహార భేదక రేఖలు క్రిందుగా మీదుగా పోతున్నట్లు కనిపిస్తాయి. రెండు ప్రాంతాలలో విలక్షణంగా ఉండే వ్యవహారాలు ఈ ప్రాంత ప్రజల వ్యవహారంలో వినవస్తాయి. అట్టి ప్రాంతాన్ని "మాండలిక సంధి ప్రాంతం" (Transition zone) అంటారు. 'కపిల - మోట' అని రెండు పదాలు వాడుకలోఉంటె ఆ ప్రాంతం ఇటువంటిది.

మోట

మోట ) సంధి ప్రాంతం ( కపిల

కపిల

తెలుగులో ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు వ్యవసాయ పదాలకు తాము తయారుచేసిన మాండలికవృత్తి పదకోశంలో ముప్పైమూడు పటాలు ముద్రింపించారు. సమానార్థకాలైన కతిపయ వ్యవసాయ పదాలకు వేరువేరు సంకేతాలిస్తు పటాలలో వాటిని గుర్తింపచేసారు. అట్లా కాకుండ వ్యవహారరేఖల్ని గీయిస్తే ఎక్కువ ఉపయుక్తంగా ఉండేవి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, వ్యవసాయ పదాలకే కాక, వాస్తు, కుమ్మరి పదాలకుకూడ కోశాలు ప్రచురించింది. ఇంకా అనేక వృత్తులకు ప్రచురించే కార్యక్రమం దానిముందున్నది. ఎప్పటికో తయారు కాకపోవు ఈ కోశాలన్ని తెలుగు పద సంపద ఎంత గొప్పదో మనకు సూచిస్తాయి.

34. 10. మాండలిక పదకోశాలవల్ల కల్గే ప్రయోజనాలు :

మాండలికాలు భాషాశాస్త్రజ్ఞులకు పని కలిపిస్తాయి. కాబట్టి అతని దృష్టిలో వాటి కెంతో ప్రాముఖ్యం ఉంది. అంతే కాదు. ప్రామాణిక, ఉపప్రామాణిక మాండలికాల చరిత్రను, పుట్టుపూర్వోత్తరాల్ని తెలుసుకోవాలంటే ఈ మాండలిక పరిజ్ఞానం ఎంతో తోడ్పడుతుంది. అందుకే మాండలి భౌమిక శాస్త్రం ఈ మధ్యకాలంలో బాగా అభివృద్ధిగాంచి, అనేక సమస్యల్ని పరిష్కరిస్తున్నది. 1

1. The local dialects are of paramount importance to the linguist not merely because their great variety gives him work to do, but because the origin and history of the standard and sub-standard type of speech can be understood only in the light of the local, dialects. Especially during the last decades, linguists have come to see that dialect geography furnishes the key to many prob- ems : Bloomfield - pp. 50-51.

(i) వ్యవసాయ వృత్తిపదకోశంలో ఈ క్రింది మార్పులు ధ్వనులలో వివిధంగా కలిగేది నిరూపితం. వాటిని స్థూలంగా ఇట చూపుతున్నాను.

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిస్వరాలలో | అ / ఉ | గనువు | ... | గొనువు |
| | అ / ఒ | నగ | ... | నొగ |
| | | పనక | ... | పొణక |
| | | మలక | ... | మొలక |
| | ఇ / ఎ | మిట్ట | ... | మెట్ట |
| | | మిరుగు | ... | మెరుగు |
| | | తిగుట | ... | తెగిట |
| | | రిల్ల | ... | రెళ్ళ |
| | ఇ / ఉ | ఇసక | ... | ఉసికె |
| | | ఇసిరికె | ... | ఉసిరికె |
| | | దిరిసెన | ... | దురిసెన |
| | ఇ / ఒ | బిదర | ... | బొదర |
| | | గిట్ట | ... | గొట్టె |
| | ఉ / ఒ | గురుజ | ... | గొరిసె |
| | | గుజ్జంగి | ... | గొజ్జెంగ |
| | | గులుగు | ... | గొలుగు |
| | ఎ/ఒ | గెల | ... | గొల |
| | దీర్ఘం/హ్రస్వం | ఏతం | ... | ఎత్తం |
| | | చీల | ... | చిడ |
| | | పేడ | ... | పెండ |
| | | దూడ | ... | దొడ్డ |

పై ఉదాహృతుల్ని స్థూలంగా పరిశీలిస్తే తెలుగువారి ఉచ్చారణంలో ఉ, ఒ, లకు తదితర స్వరోచ్చారణం కన్న ఎక్కువ ప్రాముఖ్యమున్నట్లు తెలుస్తుంది.

వ్యంజనాలలో : పదాది : క/చ : (తాలవ్యీకరణం)

కింక ... చింక

కీలిసె, కీడిసె ... చీలిసె

తాలవ్యీకరణాన్ని పొందని కింక, కీలిసె, కీటక, కీగర వంటి రూపాలు దర్శి, వినుకొండ, పలనాడు, కంభం, మార్కాపురం ప్రాంతాలలో నిలిచిఉండటం గమనార్హం. ఇటువంటి ప్రాచీన లక్షణాలింకా ఎన్నో ఈ మాండలికంలో నిల్చిఉంటాయి. అందుకు కారణం : ఈ ప్రాంతానికి రాకపోకలు తక్కువ కావటం. ఇట్లా కావటానికి కారణం : ఇది దుర్గమారణ్య పర్వతావృతం కావటం. ఇటువంటి ప్రాంతాన్నే 'అవశిష్ట ప్రదేశం' లేక 'పురాతన వ్యవహారం ప్రాంతం (relic area) అంటారు. ఇట్టి ప్రాంతానికి అవల ఉన్నది, అంటే, పర్వతారణ్యావృతం కాకుండ, రాకపోకలు బాగా సాగే ప్రాంతం. పాతమాటలుపోయి వాటి స్థానంలో ఇక్కడ క్రొత్తమాట లేర్పడుతాయి. కాబట్టి దీన్ని కేంద్రప్రాంతం అంటారు (Focal area) వీటినే దుర్గము, సుగమ ప్రాంతాలనవచ్చు. వీటిని నీరీతిగా నిరూపించవచ్చు :



వ్యవహారభేదక రేఖలు దట్టంగా గీయబడేవి అంటే విశిష్టమైన భాషాలక్షణా లధికంగా గల్గిన ప్రాంతం, 'కేంద్రక్షేత్రం'. ఇందులో పెదపెద్ద నగరాలుంటాయి. నాగరిక భాషగా ఈ ప్రాంతం ప్రతిష్ఠపొందింది. దీనికి భిన్నమైంది 'అవశిష్టప్రదేశం'. [1]

డ/ద : డల్లు ... దల్లు
డోలువు ... దోలువు
డొల్లి ... దొల్లి
డోనె ... దోనె

అనాది వ్యంజనాలు : గ/వ : అగిసె ... అవిసె
నూగులు ... నూవులు
పొదుగు ... పొదువు

వ/బ : తువ్వ ... దుబ్బ
దవ్వ ... దబ్బ
ఉవ్వ ... ఉబ్బ (ఊబ)

డ/ణ/న : పడిక్ర ... పణిక్ర
దాడిమ్మ ... దాణిమ్మ ... దానిమ్మ
బొడగ ... బొణుగ ... బొనుగ

డ్డ/ణ/న : కాణ్డి ... కాణి ... కాన
మణ్డిగం ... మణిగం ... మనిగం

ళ/ల : ఉళవాయి ... ఉలవ
కళివె ... కలివి
బుళ ... బల

1. A region bounded by such a group of concentric isoglcsses, and enclosing a center of probable prestige is called a focal area. The Coverage of a focal area is relic area. Hocket : p. 431

కన్నడ, తమిళ భాషల సంపర్కమున్న చోటనే 'ళ' ధ్వని. తక్కిన చోట్ల 'ల'.

| | | | |
|---|---|---|---|
| డ/ర : | ఈడిక | ... | ఈరిక |
| | చిడత | ... | చిరత |
| ల/న : | గాలు | ... | గాను |
| | జీలుగ | ... | జీనుగ |
| | ములగ | ... | మునగ |

పదాది ల/న ల మార్పు (లేత- నేత మొదలైనవి) శిష్టేతరోచ్చారణం లోనిది.

వివిధ మాండలిక పరిశీలనాలుకూడ ఈ విధమైన ధ్వనుల మార్పుల్ని నిరూపిస్తాయి. ధ్వని సూత్ర నిర్మాణానికి పరిజ్ఞానం ఎంత గానో తోడ్పడుతుంది

(ii) సారస్వత ప్రయోగాల్ని కొన్నింటిని సరిగా అవగాహనం కావించుకోటానికి మాండలిక పరిజ్ఞానం ఎంతగానో తోడ్పడుతుంది :

ఉదా : "సింధువారంబులు సీలలు గేతకుల్ మెట్టులు మొల్లలు మెట్టుగుదెలు".

(నన్నెచోడ కుమార సంభవం : IV-439)

మెట్టుగుదె : ఒక విధమగు శకటావయవము అని సూ. ని. కాని నెల్లూరి మాండలికంలో మెట్టుగది, మెట్టుగుది అని దీనికిరూపాంతరంకూడ ఉంది. 'బండిపరాన్ని డోలుపుకు బిగించే తాడు' అని అర్థం. ఇది శకటావయువంకాదు. మాండలిక పరిజ్ఞానముంటే నై ఘంటికార్థం నిరుపమంగా ఉండేది.

శ్రీనాథుడు 'తెక్క ప్రాసంగు దొండముక్కు వడియె' (కాశీ. III-23) అని; 'బలుసుల్ పండెను, దొండముక్కు వడియెన్

శాసంగుజేల్' (శివ IV-19)అని కావించిన ప్రయోగాల్లో 'దొండ ముక్కువడు' అనే ఆక్షేపానికి 'దొండపండువలె గింజల కొన లెత్తఁబడు' అని సూ. ని. అర్థమిచ్చింది. ఈ పదం ఇప్పటికి మహబూబ్ నగర్ మండలంలో వ్యవహారంలో ఉంది. అది 'తొండముక్కువారు' అని, 'కంకికొనగింజలు ముదిరి ఎఱ్ఱబడట'మని అర్థం. ముదిరిన తొండ ముక్కు ఎర్రగా ఉంటుందికదా! పండితులకు శబ్దస్వరూపమే తెలియ లేదు. కారణం వారు కోశాలు చూచినవారేకాని దేశాలు చూచిన వారు కారు కోశం చూడాలి. దేశము చూడాలి. అప్పటికి కాని శబ్దరూపం కొంత తెలియను.

హరివంశం, భాగవతం, హంసవింశతి, సింహాసన ద్వాత్రింశిక మొదలైన కావ్యాలలో వ్యవసాయ వృత్తి పదాలెన్నో వస్తాయి. హరివంశం పూర్వభాగం (VI-4) లో పశువులకువచ్చే వ్యాధుల పేర్లునస్తాయి. ఇంకా అనేక సందర్భాలలో ఇతరవృత్తులకు సంబంధిం చిన పదాలు ఉట్టంకిలం. వాటినిగూర్చిన పరిజ్ఞానం, ప్రత్యక్షంగా పరిశీలింపబడితేనే సమకూరుతుంది. అందుకు వృత్తిపదకోశాలన్నీ రావాలి.

ఇంతేకాకుండ కన్యాశుల్కం, ప్రతాపరుద్రీయం వంటి నాట కాలు, బల్లకట్టు పాపయ్య అనే గోపీచంద్ కథలు, శ్రీపాద సుబ్ర హ్మణ్యశాస్త్రిగారి కథలు, దాశరథి రంగాచార్య ముళ్ళగువారి నవలలు, మొదలైనవి బాగా అవగాహన కావాలంటే విస్తృత మాండలిక పదకోశం తయారుకావలసిన అవసరం ఉంది. పదాలు వాక్యాలలో ప్రయోగించే తీరుకూడ ఇవి సూచించాలి.

పాత్రోచిత భాషను నాటకాలలో, నాటికలలో పరిపోషించా లంటే రచయితలకు మాండలిక పరిజ్ఞానం అవసరం. కావ్యేతర భాష నంతా సంప్రదాయ వ్యాకరణాలు గ్రామ్యంగా పరిగణించాయి.

ఒక వ్యాకరణం గ్రామ్యాన్ని ప్రయోగానర్హంగా [1] నిరసిస్తే దానికి పూరకమైన ఇంకొకటి [2] కొన్ని కొన్ని సందర్భాలలో గ్రామ్య ప్రయోగ మవసరమని, కవులు గ్రామ్యాన్ని సందర్భోచితంగా [3] వాడుతారని వివరించింది.

స్వతంత్ర పద్ధతిలో వ్యాకరణం రచించిన కేతన 'అమువలె' 'ఇమువలె' అనే వైదికబ్రాహ్మణ మాండలికాన్ని [4] గ్రామ్యంగా సూచించాడు. శ్రీదాసు శ్రీరాములు 1917 లో 'తెలుగునాడు' అనే చిన్నరచనలో బ్రాహ్మణులలో వివిధవర్గాలవారు మాట్లాడే

---

1. "అనియమాత్ గ్రామ్యం హి యత్త్వపభ్రంశః" - ఆం. చిం. I-3 - అపభ్రంశము ప్రయోగయోగ్యము కాదు కనుక తద్వివేకము కొఱకని బాలసరస్వతి. దీన్ని స్పష్టంచేస్తు చిన్నయసూరి: "లక్షణవిరుద్ధమగు భాషగ్రామ్యంబు - ఈ భాష ప్రయోగంబున కనర్హంబు". ఇట్లా ఆదేశించినా "పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపదగునని తాత్పర్యమ"ని పేర్కొన్నాడు.

2. "గ్రామ్యం తత్త్రద్విధా సాధు, కఱకంఠముఖాహితాః"
(వికృతి వివేకం - I-28)

"గ్రామ్యంబు తత్తజ్జాతి వర్ణనంబునం ప్రయోగార్హంబు"
ప్రౌ. వ్యా. I-14.

'మొక్కెముసామి', అనే రామాభ్యుదయ ప్రయోగం (II-7) 'మ్రొక్కెదముసామి' అని అకాడమి ప్రచురణంలో ఉండటం విచార్యం.

4. ఆంధ్రభాషా భూషణం : 26 పద్యం

తీరుల్ని పద్యాలలో నిరూపించారు.[1] ఇతర కులాలవారి మాటల రీతుల్ని గూడ వారు చిత్రించి ఉంటే బాగుండేది.

(iii) కవి కాని, రచయిత కాని, తానెంతగా ప్రామాణిక సా స్వత భావనే వాడుతున్నా, తన కత్యంత సహజమైన మాండలి కాన్ని ఎక్కడైన ఒకచోట వాడవచ్చు. దాన్నిబట్టి అతనేమండ నివాసి అయింది నిర్ణయించవచ్చు. లేదా అతని పూర్వు లేమండ లానికి చెందింది చెప్పవచ్చునని ఆచార్య భద్రిరాజువారు ఉదాహరణ మిచ్చారు. 'గునపం' అనేపదం పూర్వాంధ్రానికి, తూర్పుగోదావరికి పరిమితం. 'గడ్డపార' అనేది ఇతరమండలాలలో వాడుకలో ఉన్నది. పింగళిసూరన కళాపూర్ణోదయంలో 'గునపమని' (vi-8) 'గడ్డపార' (vi-23) అని వాడాడుకాబట్టి ఇతని పూర్వులు గోదావరి మండల వాసులని తెలుస్తుంది. ఈవిషయం ప్రభావతీ ప్రద్యుమ్నం అవతారిక లోని 'రంగుగ గౌతమీ పరిసరంబుల' అనే పద్యం ధ్రువపరుస్తున్నది.[2]

---

1. ఆస్నే చూస్నివషే చెవుడషే అష్లాగషే యేఁమిషే
విస్నావజ్ఝలవారి బుర్రినవ యావిస్నాయకిస్నారుషే
విస్నండెంతటివాడె యేళ్ళుపదిషే వెయ్యేళ్ళకీడేషుమా;
ఒస్నే బుర్రికి యీడషే వోయిషుకే ముంఘుంది లే మంచివ
ర్చొస్నే యుందురు శ్రోత్రియోత్తమపద స్త్రీలాంధ్ర దేశంబునన్
(పుట—9)

మధ్వస్త్రీల సంభాషణంలో కన్నడపదా లెక్కువగా ఉంటాయని నిరూపించినారు. (పుట 17) (6 వ ముద్రణం)

2. తెలుగుభాషా చరిత్ర. పుట 395. (అకాడమీ ప్రచురణ)

(iv) ఈ మాండలికాలనుబట్టి, ఆయాప్రాంతాల సాంఘిక, రాజకీయ పరిస్థితుల్ని ఊహించవచ్చు.

(v) మాండలిక పదప్రయోగం శిష్టులకు హాస్యజనకంగా ఉంటుంది. ఆ కారణంగా కానోపు గ్రామీణ భావనాదరించటం అవసరం. గురజాడ, వేదం వారు ఆపని[1] చేసి కీర్తిగాంచారు.

(VI) పరిసర భాషాప్రభావాన్ని గ్రహించటాని కిట్టికోశాలు తోడ్పడుతాయి. (చూ. 34.4)

34. 11. భాషావ్యవహర్తల దృక్పథాలనేకరీతులలో ఉంటాయి. ఆంగ్లేయులకు మాండలికాలపై అసలు గౌరవమే లేదు. ఉన్నత స్థాయికి చెందిన ఏవ్యక్తి మాండలికాల్ని పట్టించుకోడు. ఏదో ఒక మాండలికం మాత్రమే మాట్లాడేవాడు కాస్త సాంఘికంగా ఉన్నతిని సాధించటం మొదలుపెట్టగానే, తన మాండలికాన్ని వదలిపెట్టి, ఏ ఉపప్రామాణిక మాండలికాన్నో మాట్లాడటానికి ప్రయత్నిస్తాడు.

---

1. కన్యాశుల్కం ప్రథమముద్రణం (1897) పీఠికలో గురజాడవారిలా పేర్కొన్నారు :

> "I clothed the play in the spoken dialect, not only that it is better intelligible to the stage - going public than the literary dialect, but also from a conviction that it is the proper comic diction for Telugu"

రెండవ ముద్రణంలో అప్పారావుగారిలా వేదంవారిని ప్రశంసించారు.

> "The credit of deliberately introducing the vernacular into Telugu drama in keeping with the Sanskrit tradition belongs to my friend V. Venktraya Sastry Garu, whose Pratapa rudriyam owes not a little of its charm to a dialogue in the dialects".

ఉపప్రామాణికం మాట్లాడేవాడు ప్రామాణిక మాండలికాన్ని మాట్లాడాలని ఆరాట పడతాడు.

జర్మనులు వీరికంటె భిన్నస్వభావాన్ని అలవరచుకొన్నారు. గత శతాబ్దంగా వీరు స్థానికమాండలికాలపై ఎక్కువ మక్కువను చూపుతున్నారు. బహుశః ఇంతకు పూర్వం వాళ్లు ఉత్తమస్థాయి భాషను, వాఙ్మయాన్ని ఆరాధించటమే దీనికి కారణమేమో! తన సాంఘికస్థితి తనకే తెలియని మధ్యతరగతి జర్మన్, మాండలికాన్ని నిరసిస్తుంటే, కొంతమంది ఉన్నత శ్రేణికి చెందిన జర్మనులు కావాలని పనిగట్టుకొని తమ మాండలికాన్ని మాట్లాడుతున్నారు. ఉన్నత వర్గానికి చెందిన స్విస్, ప్రామాణిక జర్మన్ మాట్లాడగల్గినా, దాన్ని మాట్లాడక, నిత్యకృత్యంలో తన కుటుంబం లోను, ఇరుగుపొరుగువారితోను మాండలికంలోనే వ్యవహరిస్తాడని బ్లూమ్‌ఫీల్డ్ పేర్కొన్నాడు. (3. 6)

తెలుగువారు ఈ మధ్యకాలం వరకు సారస్వతభాష, అందు లోను సంస్కృత భూయిష్ఠంగా ఆడంబరోపేతంగా ఉన్న భాషనే అభిలషించారు. దీర్ఘసమాసా లెంతమాత్రం జొరబడనక్కరలేని నన్నయకు పూర్వపు దానశాసనాలలోను, అదో ఉదాత్తశైలి అనే భావనతోనే కాబోలు చోటుచేసుకొన్నాయి.

ఆధునికులు విశేషంగా జానపద సాహిత్య సేకరణంలో మక్కువచూపుతున్నారు. మాండలిక భాషానిరసనంవల్లనే తెలుగులో నాటకాలు - స్వతంత్రమైనవి కాని, అనువాదాలు కాని రాలేదు. మాండలిక వ్యవహారాని కఖండ గౌరవమిచ్చి, నాటకాన్ని రచించి ప్రజాభిమానాన్ని చూరగొన్న గొప్ప వ్యక్తి గురజాడ. వేదంవారు, తరువాత వస్తారు. వేదం వారు గురజాడకన్న గొప్ప

పండితుడైనా పాత్రోచిత భాషపట్ల అంతగా శ్రద్ధవహించటం ప్రశంసనీయం.

34. 12. ఒకానొక సంక్లిష్ట భాషావలయంలో ఈక్రిందిరీతిని భాషాభేదాలుంటాయని బ్లూమ్‌ఫీల్డ్ నిరూపణం (3.7) అది చాల వరకు అన్నిభాషలకు అన్వయిస్తుందనుకోవచ్చు.

(i) సారస్వత ప్రామాణిక భాష : (Literary standard language) తెలుగువారు పద్యరచనలో ఇప్పటికి ఈ భాషనే వాడుతారు : నేను వచ్చుచున్నాను.

(ii) వ్యవహార ప్రామాణిక మాండలికం : (Colloquial Standard language) వచనరచనలలో వాడబడేది. శిష్టులు మాట్లాడేది. పత్రికలలో, రేడియోలలో ఉపయుక్తం : నేనువస్తున్నాను.

(iii) ప్రాంతీయ ప్రామాణిక (Provincial standard language) భాష : మధ్యతరగతి ప్రజలు మాట్లాడేది. ఇది రెండో దానికి సమీపీనంగా ఉంటుంది. కాని ఒకప్రాంతంనుండి ఇంకో ప్రాంతానికి ఈభేదం ఉండవచ్చు : నేను వస్తున్నా, నేను వెళి పోస్తాను.

(iv) ఉపప్రామాణిక మాండలికం (sub standard language) ఇది (i) (ii) (iii) కన్నభిన్నమైంది. తక్కువ మధ్యతరగతి ప్రజలు వ్యవహరించేది : నేనొస్తా.

(v) స్థానిక మాండలికం : (local dialect) సాంఘికంగా బాగా వెనుకబడ్డ ప్రజలు మాట్లాడేది. ఇది గ్రామానికి, గ్రామానికి వేరుగా ఉండవచ్చు : నానొత్త. నానెళ్ళొత్త, మళ్ళెప్పుడొత్తా ?

సందాళోత్త, లెగుద్ది, వచ్చుద్ది మొదలైనవి ఇందులో వర్ణసమీకరణం అధికం. వర్ణలోపంకూడా ఎక్కువే.

34.13 ఆంగ్లంలో ఇంకా అనేక మాండలికాలు ప్రసిద్ధంగా నిరూపితాలు. అటువంటివి అన్ని భాషలలోను ఏ కొంతైనా ఉండక పోవు - పరిశీలించి నిరూపించ దగినవి. వాటిని గూర్చిన పరిచయ మవసరం.

(1) అపభాష లేక అశిష్టభాష (slang): దీన్నే యాసభాష అని భావిస్తారు. నిత్యవ్యవహారంలో ఎప్పటికప్పుడు మారుతూ, సాంప్రదాయిక ప్రయోగాల్ని తేలికపరచి, అర్థవిపరిణామాల్ని కల్గిన భాష. వ్యవహారిక భాషకున్నంత గౌరవంకాని, పతితుల భాష కున్న నైచ్యంగాని లేని భాష. ఇందులో చిత్రమైన కాల్పనిక పదాలు అధికం. ఎప్పటికప్పుడు మారుతుంటుంది. హాస్యజనకమైన పోలిక లెక్కువ[1].

(2) కూటభాష : (Argot) : ప్రత్యేకమైన నుడికారం, పదజాలం గల అజ్ఞాతవాసుల భాష. ఇది కేవలం ఈవర్గం వారికే అవగత మౌతుంది. దొంగల భాష ఇటువంటిదే[2] దుకాణాలలో వ్యాపారస్తులు వాడే భాషకూడ ఇట్టిదే.

(3) వృత్తిభాష లేక పతితభాష (Jargon): తికమకలతో కూడి, మామూలు భాషావ్యవహర్తలకు బోధపడని భాష. వివిధ

---

1. an informal, nonstandard vocabulary, composed typically of coinages, arbitrarily changed words, and extravagant, forced or facetious figures of speech (web). ఈ పదంపుట్టుక తెలియదంటుంది నిఘంటువు.

2. Argot is applied to a peculiar language of a clique or other closely knit group—thieves' argot.

విచిత్రమైన అనాగరకభాష. వివిధ భాషల సాంకర్యంగల భాష. సంక్షిప్తతపొందిన మాండలిక పదజాత వ్యాకరణాలు కలిగి, అన్య భాషీయులతో వ్యవహారాని కుపయుక్తమయ్యే భాష. ప్రత్యేక మైన నుడికారం, సాంకేతిక లక్షణాలు గల్గినభాష. ఒక ప్రత్యేక వృత్తి వారిచే వ్యవహృతం. దీర్ఘపదాలతో, అనవగాహన గల్గిన భాష. చిన్నభావాన్ని చెప్పటానికి డొంకతిరుగుడుగా అధిక పద జాల మిందులో ఉపయుక్తం.

ఐరోపీయనులు గత కొన్నిశతాబ్దాలుగా తమవలసలలోని బాని సలతోను, పతితులతోను ఇటువంటిభాషను మాట్లాడుతుంటారు. ఆఫ్రికాలోను, ఇండియాలోను, దూరప్రాచ్యదేశాలలోను, పోర్చు గీసు జార్గన్ భాషను మాట్లాడేవారు. మారిషస్ దీవులలో ఫ్రెంచి వారు ఫ్రెంచిజార్గన్ మాట్లాడుతారు. ఫిలిప్పైన్స్‌లో స్పానిష్ జార్గన్ వ్యవహృతం. ఆంగ్లజార్గన్ దక్షిణసముద్రంలోని పశ్చిమ దీవులలో ప్రచురం. ఇందుకు కొన్ని ఉదాహరణలు : —

(i) Kai kai he finish ? — Is dinner ready ?

(ii) Him cost plenty money and that fellow kai-kai him
They cost a lot of money and it has destroyed them.

(iii) you not like soup ? He plenty good kai-kai : don't you like soup? It's very good.

ఈ జార్గన్‌భాష వివిధ జాతులవారికి వ్యాపారభాషగా ఉపయుక్తమైతే అది 'సంపర్క-భాష' (lingua franka) అనిపించు కొంటుంది ఇది ఎవ్వరి 'దేశీయభాష కాదు'. ఇది అనేకభాషల సాంకర్యభాష. ఇది ఏవర్గంవారికి సంబంధించిన భాషగా ఉండదు. చైనీయులు ఐరోపీయనులతో వ్యాపారం చేసేటప్పుడు వాడే ఆంగ్ల భాషను 'మిశ్రమాంగ్లం' (pidgin English) అంటారు. ఆంగ్లం,

వివిధ భారతీయ భాషలు, చైనూక్ భాషను 'చైనూక జార్గన్' అంటారు. బానిసలు మాట్లాడేభాషను 'నిర్వాసితభాష' (creolized language) అంటారు. ఇది వారి నాయకులభాషకు నీచానుకరణం.[1] అపభాష (patois) అనేది యిట్టిదే.[2]

(4) వర్గభాష (Cant): ఒక మతానికి చెందిన వర్గంలోని ప్రజలుపయోగించే పదసమూహం.[3] నియతమైన పదజాతం.[4] పవిత్రమైన భాషలోని మాటల్ని తమకో సంకేతంగా హాస్యోపేతంగా ఉపయోగించటం.

దీనికి పురోహిత వర్గానికి చెందిన బ్రాహ్మణులు కావించుకొనే సంభాషణల్ని ఉదాహరణగా తీసుకోవచ్చు. వీటిని పరిశీలించి, కీ. శే. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు 'వైదికుల పరిభాషల'నే అద్భుతమైన వ్యాసాన్ని వృషసంవత్సరాది సంచికలో ప్రచురించారు. ఈ వ్యాసం ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవంలోకూడ పునర్ముద్రితమైంది.

'ఈవేళ వయం దేవస్య ఎక్కడ?' అని ప్రశ్నిస్తే - భోజనమెక్కడని అర్థం. 'వయందేవస్య భోజనం'అనే మంత్రం. 'తేజోవా' అంటే ఆజ్యం. తేజోవై అజ్యమని మంత్రం. నిమంగిణిగాళ్ళు అంటే వారిభాషలో దొంగలు. 'నిమంగిణ ఇషు ధీసుతే తస్కరాణాం పతయేనమః' అని రుద్రం. 'వాయువ్యం' అంటే రూపాయి. వాయు

1. Bloomfield – Language, pp. 472–474
2. a dialect other than the standard or literary dialect; illiterate or provicial speech ; the characteristic special language of an occupational or social group. (web.)
3. The phraseology peculiar to a religious class or sect.
4. a set or stock phrase. (web)

వ్యగ్ శ్వేతమాలభేత. యువాసు=వస్త్రం యువాసు వాసాం పరివీత ఆగా. సుఖంచమే-పడుకొన్నాడు. సుఖంచమే, శయనంచమే. ఆ మాయాంతుగాడు=బ్రహ్మచారి. ఆ మాయాంతు బ్రహ్మచారిణః స్వాహా. యోగశ్చ=కరణం : యోగశ్చకరణం చైవసర్వంవిష్ణుమయం జగత్ అని ఆబ్దీకమంత్రం.

అధర్మాయ-చెవిటివాడు : అధర్మాయ బధిరం,

స్వాహాయ - అంధుడు : స్వాహాయాంధం

అగ్నిర్హిమస్యభేషజం అని మంత్రం. అగ్నిర్హిమస్య కేలోటు లేదంటే - భేషజానికేం తక్కువలేదని. 'అయస్వై' అంటే క్షవరం - 'అయం వై లోక ఆవపనం మహత్' అని శ్రుతి.

'భూర్భువస్సువరోం' అన్నావట్టా అంటే ప్రారంభమైందా అని అర్థం. మంత్రాలనే ఇలా సంకేతించుకొంటారు: పైపదమే సాధారణంగా దాని అర్థమౌతుంది.

ఈరీతిగా దొంగలు, వ్యాపారస్తులు, సంకేతాత్మకంగా వ్యవహరించుకొనే భాషను, వారితో పరిచయం చేసుకొని వ్యాసాలుగా అందిస్తే భాషాస్వరూపం తెలిసికోని ఆనందించటానికి అవకాశం కల్గుతుంది. బహుముఖీనమైన భాషాస్వరూప సాక్షాత్కారం ఆనందదాయకమే కాక, నవలారచనలకు, రూపక నిర్మాణానికి ఎంతో తోడ్పడినట్లౌతుంది

వ్యవస్థలేకుండా ఏ భాష ఉండదు. దాన్ని గ్రహించటమే భాషాశాస్త్ర విద్యార్థి కర్తవ్యం. శబ్ద పరిణామాల్ని గ్రహించాలన్నా అర్థవైఖరుల్ని అవగాహన చేసుకోవాలన్నా నిరసించకుండ, ఎఱుకలవారు, ఏనాదులు, లంబాడీలు, దేశదిమ్మరులు ఎవరుగాని కావించే

వ్యవహారాల్ని రికార్డుచేసి, వాని వివిధవైఖరుల్ని అవగతం కావించుకొని వివరించుటకే భాషాశాస్త్రజ్ఞుని కర్తవ్యం. ఇది హోమర్ సారస్వతావగాహనం కంటె గొప్ప కృషి అని కొందరి భావన.[1] మన్నారుదాస విలాసమనే యక్షగానంలో ఎన్నో వృత్తి సంబంధమైన మాండలికాలున్నాయి. అవి ఆ యక్షగాన రచనకు జీవం పోశాయి. ఇలాంటి మాండలికాల్ని వ్రాసుకొనేటప్పుడు ధ్వనాత్మ లేఖనను (Phonetic Transcription) కావించాలి. విశాఖ మాండలికంలో రచించిన తన కన్యాశుల్కాన్ని ముద్రించటానికి తానెంతో బాధపడ్డట్లు, అనునాసికతకు చిహ్నంగా సారస్వత భాషలో నిర్జీవధ్వని (Static sound) వ్యర్థంగా వాడబడే ఖండ బిందువునే ఆశ్రయించ తప్పలేదని అప్పారావుగారు చెప్పుకొన్నారు. వ్యవహారిక భాష ఇంత వ్యాప్తిలోకి వచ్చినా అప్పారావుగారి కాలానికున్న దురవస్థను ఇప్పటికి మనం అతిగమించలేదనే చెప్పాలి.[2]

ఆంగ్ల భాషా చరిత్రతోను, ఆంగ్లంలోని వివిధ మాండలికాలతోను, ప్రాకృతాలతోను, పరిచయమున్నవారెవరు మాండ

---

1. 'Dialects which have never produced any literature at all the jargons of the sawage tribes, the chiefs of Hottentos and the vocal modulations of the Indo-chinese, are as important, nay, for the solution of some of our problems. more important than the poetry of Homer and the prose of Cicero–Max Muller, Science of Language, Vol. I Lecture—2.

2. "I had to contend with one difficulty in printing this book. There are many sounds in the spoken dialect which are not represented in the Telugu alphabet. In the present state of Telugu phonetics, I had to contend myself indicating such sounds by a horizental line placed over the nearest symbols and I employed the 'ardhanuswara' after a nasal. The creation of new symbols and their adoption into type can be effected only after a more widespread recognition of the spoken Telugu" — Preface to second Edition of Kanyasulkam.

లికాలను వ్యతిరేకించరు. యథాశక్తిని మాండలికాల్ని సేకరించి భాషాస్వభావ గ్రహణాన్ని పెంపొందింప చేసుకొంటాడు. దేశాన్ని చూచి కోశాలు తయారైతేకాని మన భాషా సంపద ఎంతటిదో మన కవగతం కాదు. సంస్కృతాంగ్ల భాషాధీనత తగ్గదు. వివిధ నక్షత్రాలకు పామరజనులు కల్పించినపేళ్ళు స్మరిస్తే మనజాతికిగల కల్పనమెట్టిదో తెలుస్తుంది. ఇప్పుడు శాస్త్రీయపదాలన్నీ సంస్కృత మయంగానే వస్తున్నాయి,

| | | |
|---|---|---|
| పూర్వోత్తరా షాఢలు | — | అక్కాచెల్లెలు చుక్కలు, |
| పుబ్బ, ఉత్తర | — | అత్తాకోడలు చుక్కలు |
| శుక్రుడు | — | ఆల బొద్దు |
| శతభిష | — | ఆవుల దొడ్డి |
| బృహస్పతి | — | కాపు చెరువుచుక్క |
| రోహిణి | — | కుమ్మర సాలె |
| ఆరుద్ర | — | గోడు కొయ్యలు |
| సప్తర్షి మండలం | — | పట్టెమంచం |
| milk | — | పాలబాట |

## 34. 14. మాండలిక పద సేకరణ పద్ధతులు

మాండలిక పద సేకరణకు రెండు పద్ధతులు ప్రచురం.

(i) ప్రశ్నావళి పద్ధతి : విస్తృతమైన ప్రశ్నావళిని సంసిద్ధం చేసుకొని, దాన్ని ఆయా ప్రాంతాలలో నిర్ణీతమైన వ్యక్తులకు పంపించి వారినుండి సమాధానాలు రాబట్టటం. గ్రియర్సన్ తన లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియాలో చాలవరకు ఇట్టిపద్ధతినే అవలం బించాడు.

(ii) పర్యటన పద్ధతి : భాషాశాస్త్రంలో శిక్షణ పొందిన వ్యక్తినిగాని వ్యక్తుల్నిగాని వివిధ ప్రాంతాలకు పంపించి వీలయినంత ఎక్కువమంది ద్వారా విషయ సేకరణం గావించటం. ఇది తొలిదాని కన్న మిన్న. సమాధానాలు వ్రాసి పంపేటప్పుడు అతి ప్రామాణిక బుద్ధి కొందరికి ఉండవచ్చు. (Hyperstandardization) అందుచేత సామాన్య జన వ్యవహారాన్ని ఉచ్చారణ విధేయంగా వ్రాసుకొని ధ్వనివిపర్యయాల్ని గ్రహించటానికి వీలుంటుంది.

అయితే రెండో పద్ధతిలోకూడ కొంత లోపం గోచరిస్తుంది. ఒక వ్యక్తి భిన్నప్రాంతాల్ని పర్యటించటం కష్టం. భిన్న వ్యక్తుల్ని పంపితే వారి వారి స్థాయిభేదాల్నిబట్టి సేకరణలో భేదాలుండవచ్చు.

భద్రిరాజువారు రెండోపద్ధతి ననుసరించే వ్యవసాయ వృత్తి పదకోశాన్ని శాస్త్రీయ పద్ధతులపై రచించారు. ఇందుకు తూమాటి వారు అండ దండగా నిల్చారు. పర్యటనలోగూడ ప్రశ్నావళి ఉంటుంది. సమాధానాలు రాబట్టి సుశిక్షితులు వ్రాసుకొంటేనే మంచిది. పై రెండు పద్ధతులు మిళితం చేయవచ్చు. పెద్దగా మార్పులుండవనుకొంటే, ధనాన్ని కాలాన్ని వ్యయం చేయకుండ ప్రశ్నావళిని పంపవచ్చు. సేకరించిన విషయాన్ని వివిధ శీర్షికల క్రింద వింగడించి, సామాన్య నియమాల్ని ఏర్పరచటంలో పర్యవేక్షకుని శాస్త్ర పటుత్వం విదితమౌతుంది.

34. 14. ప్రయోజన దృష్టినిబట్టి మాండలికాల్ని అనేక విధాల పరిశీలించవచ్చు.[1]

---

1. ఈ సూచనలు ఆచార్య భద్రిరాజు వారు విశేషంగా తమ తెలుగు భాషా చరిత్ర: తెలుగు మాండలికాలు: ప్రమాణ భాష (14. 3, 4)లో కావించినవి.

(i) అర్థప్రాధాన్య సేకరణం: (చూ. 34.6) పొలాన్ని దున్నే పని ముట్టును ఏమంటారో పలు ప్రాంతాలు పర్యటించి పదాలు సేకరించటం. నాగలి, నాగేలి, నాగేలు, నాగేల, నాంగలి అనేవి ఉచ్చారణలోని భేదాలు. (Phonetic Variations) ఇవన్నీ ఒకే ఒక మూల రూపం-*నాఙ్గేల్ నుండి వచ్చినవి. శబ్దంతో సామ్యంలేనిది ఒక్క-టే-మడక. ఇది పర్యాయ పదం (Synonym)

(ii) శబ్ద ప్రాధాన్య సేకరణం: ధ్వని భేదాలు ఏరీతిగా ఉంటాయో వివిధ ప్రాంతాలలో పర్యటించి తెలుసుకోటం రేగడి, రేగడ, రేగిడి, రేవడి, రేవడ: రాగడి, రాగిడి: ఇందులో ఏ-/ఆ-;-ఇ/-అ;-గ-/వ- ధ్వని విపర్యాయాలున్నాయి. వివిధ శబ్దాల్లో ఇలాగే ఉంటే మాండలిక ధ్వని సూత్రాలు రచించవచ్చు.

(iii) వ్యాకరణ ప్రాధాన్య సేకరణం: ఏవో కొన్ని వ్యాకరణ ప్రక్రియలు వివిధ ప్రాంతాలలో ఎలా వ్యవహృతమో సేకరించటం.! ఉదా: భూతార్థ క్రియా రూపాలు: చెప్పాడు, చెప్పినాడు, చెప్పిండు (ప్/ఇనా/ఇణ్/) ఈ విధంగానే వివిధ సంధులు, విభక్త్యులు, కారకాలు, కృత్తద్ధితాంతాలు నిరూపించవచ్చు.

ఈ విధంగా చూస్తే 'భాషా పటాల సంపుటి' (Linguistic) (atlas)[1] త్రివిధాలుగా ఉంటుంది.

(i) పద పట సంపుటి (Word atlas) ఇవి పదాలు ప్రధానంగా గీసినవి.

(ii) ధ్వని పట సంపుటి (Phonetic atlas) ఇవి ధ్వనులు ప్రధానంగా గీసినవి.

---

1. a publication containing a set of maps on which speech variations are recorded—called also dialect atlas (Web)

(iii) వ్యాకరణ పట సంపుటి (Grammatical atlas) వ్యాకరణ విశేషాలు లక్ష్యంగా గీసినవి.

తొలివి మాండలిక కోశరచనకు, మలివి మాండలిక వ్యాకరణ రచనకు తోడ్పడుతాయి. ఈ విధమైన కృషి ఇంకా ఎంతో మన భాషలో జరగవలసి వుంది.

ఒక వర్గానికి చెందిన మాండలికాన్ని 'వర్గమాండలికం' (Class dialect)అంటారు. దీన్ని నిలువగీతల (Vertical lines) మధ్య నిరూపిస్తారు. ఉదా :-

| | |
|---|---|
| వెళ్ళుద్ది | వచ్చాడు |
| పోద్ది | పోయినాడు |
| వచ్చుద్ది | * * * |
| మొ|| | తించాడు |
| | ఉంచావా |
| | (వైదికుల మాండలికం) |

ఒక ప్రాంతాన్ని ఆశ్రయించుకొన్న మాండలికాల్ని ప్రాంతీయ మాండలికాలంటారు. (Regional dialects) వీటిని అడ్డగీతల మధ్య (Horizontal lines) నిరూపిస్తారు.

| | | | | |
|---|---|---|---|---|
| నాగలి | పెండ | మోట | తువ్వ | |
| నాగేలి | పేడ | కపిల | దుబ్బ | మొదలైనవి |
| మడక | | | | |

## 35. 0. భాషాభేదాలు: ప్రమాణీకరణ సమస్యలు :

(Language Varieties and Problems of Standardisation)—మౌఖిక, లేఖక భాషలు: అక్షరాస్యం కాని సంఘంలో భావ ప్రకటనం మౌఖికంగానే ఉంటుంది. ఆ సంఘం లోని వారికి

పూర్వ భాషా భేదం తెలియదు. భూత భవిష్య ద్వర్తమాన భాషా భేద పరిజ్ఞానం వారికి శూన్యం.

లేఖనం మూలంగా భాషకు గల ప్రాచీన స్వరూపం అవగత మౌతున్నది. సాంఘిక చరిత్ర కారులు, శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా అభివృద్ధి గాంచిన మానవ నాగరకత భాషకు లిఖిత చిహ్నాలు కనిపెట్టటం మూలంగానే కల్గిందని భావిస్తున్నారు.

మానవుడెంత ప్రాచీనుడో! భాష కూడ అంతే ప్రాచీనం. కాని మానవ నాగరకత నాలుగు వేల సంవత్సరాల నుండి మాత్రమే ఏర్పడిం దంటున్నారు[1] సింధూ నాగరకత అత్యంత ప్రాచీనమైంది. కాబట్టి యిందులోని లేఖన పద్ధతి కూడ ప్రాచీన మైందనే అనుకోవాలి. చిత్రలిపి నుండి వర్ణాత్మక లిపి అప్పటికే పరిణమించిందిగా భావించాలి. ఇందులో వ్యాప్తమైన ధ్వనులకు స్థిరమైన ప్రతినిధ్యం కల్గింది.

ముద్రణ యంత్రాల మూలంగాను; సమస్త విజ్ఞానం మాతృభాష ద్వారానే బోధింప బడాలనే ఆశయం వల్ల ప్రజా స్వామ్యం సాధ్యమని, సకల ప్రజలలో వ్యాపిస్తుందనే ఆశయం నెరవేరుతుం దనిపిస్తున్నది.

35. 1. వ్యాకరణ సమ్మతి:[2] ప్రామాణిక భాష:

మౌళిక ధ్వనుల వ్యవస్థే భాష. ఈ వ్యవస్థను సమగ్రంగా

---

1. The nearest approach : o an explanation of 'good' and 'bad' language seems to be this, then that by a cumulation of obvioes superioritius, both of Charater and standing as well as of language, some persons are felt to be better models of conduct and speech tnan others oom field P 3/6

2. యద్య దాచరతి శ్రేష్ఠస్త త్తదేవేతరో జనః సయత్ప్రమాణం కురుతే లోక స్తదను వర్తతే, భగవద్గీత — iii — 21

నిరూపించేది వ్యాకరణం, మూడు నాలుగేండ్ల ప్రాయం వచ్చేటప్పటికే సామాన్యంగా ప్రతి వ్యక్తి, తన పరిసరాల్లోని వృద్ధుల భాషణాల్ని ఆలకిస్తు, తనలోని గుప్త వ్యాకరణ (deep grammar) ప్రేరణంతో భాషిస్తుంటాడు. వయసుతోపాటు, పరిసరాలతో పాటు అతని పదజాతం (Vocabulary) పెంపొందించు కొంటాడు. పదాలకు గల అర్థాల్ని, అర్థచ్ఛాయల్ని ఆకళింపు చేసుకొంటుంటాడు. సాంఘిక పరిజ్ఞానంతో, సందర్భోచితంగా పదాల్ని ఎన్నిక చేస్తు కతిపయ పదప్రయోగం పట్ల ప్రీతిని, ప్రకటిస్తాడు, అంటె అతనిలో ప్రమాణీకరణం (Standardisation) ప్రారంభమైందన్న మాట. తన భాషణంలో (Speech) ఎదుటి వారి అంతస్తును బట్టి శైలి భేదాల్ని కూడ క్రమంగా సాధిస్తు ఉంటాడు.

సామాన్య భాషా వ్యవహర్త ఎవడుగాని గుప్త వ్యాకరణ నియమాలకు విరుద్ధంగా భాషించడు. భాషావ్యవహర్తలభాషణమాధారంగా శాస్త్రజ్ఞు లీభాషణను వర్ణిస్తాడు. (Surface grammar) అనంతముఖాలుగా ఉండే భాషణను పూర్తిగా అభివర్ణించటం ఎవరి శక్యం కాదు. పాణిని సంస్కృతాన్ని కొంతవరకు సంపూర్ణంగా అభివర్ణించాడు. అతను వర్ణించని విషయాల్ని వార్తికాలు, వాటిలోని అసమగ్రతను మహాభాష్యం పూరించటానికి యత్నించాయి అప్పటికే ఆభాష వ్యవహారం నుంచి వైదొలగి పరిమిత భాషగా మారి ఉంటుంది.

ఏ భాషకైనా వ్యాకరణం లిఖితం కాకపోతే, ఆ భాషకు వ్యాకరణం లేదని అర్థంకాదు. పంచాంగాలు లేకపోతే గ్రహగతు లాగవు. న్యూటన్‌కు పూర్వం గురుత్వాకర్షణం లేదనలేం కదా !

భాషించే వ్యక్తుల సాంఘిక తిగతుల్నిబట్టి, వారిభాషకున్న అవ్యక్త వ్యాకరణ సమ్మతినిబ కొంతమంది వ్యక్తుల భాష

'మంచిద'ని, కొంతమంది భాష 'చెడ్డద'నే పరిగణనసంఘంలో ఏర్పడుతుంది. ఆచార వ్యవహారాలనుబట్టి కొందరు శ్రేష్ఠులుగా అనుకరణ యోగ్యులుగా తక్కినవాళ్ళచే భావింపబడతారు. వారి భాష కూడ అన్యులకు అనుకరణయోగ్యమే అవుతుంది. ఈవిధంగా ప్రమాణీకరణం ప్రజానీకంలోనే ఏర్పడుతుంది. కొందరు, మొదటి శ్రేణిలోని వారు అందుబాటులో లేకపోతే, వారి ననుకరించే రెండవ శ్రేణిలోని వారి ననుకరిస్తారు. ఈవిధంగా ప్రామాణిక, ఉప ప్రామాణిక, ఉపోప ప్రామాణిక భాషలు ఏర్పడుతుంటాయి.

## 35. 2. ప్రమాణీకరణంలో పరిశీలనాంశాలు :-

ప్రామాణిక భాషాలక్షణాలు ముఖ్యంగా రెండు :

(i) మృదువైన స్థిరత్వం (Flexible stability)

(ii) మేధావీకరణం (Intellectualisation) ఈ అభిప్రాయాల్ని పాల్ గార్విన్ ఇలా వివరించారు :

ప్రామాణిక భాష మార్పు నాహ్వానిస్తు, ఆ మార్పు నంతర్భుక్తం చేసుకొంటు, స్థిరంగాను ఉంటుంది. ఇట్టి స్థిరత్వం సముచితమైన క్రోడీకరణం మూలంగా సంభవం. సాంస్కృతికమైన పరిణామాల వలన ఈ క్రోడీకరణంలో మార్పులు రావచ్చు. అట్టి అవకాశాల్ని కల్పించటమే మృదుత్వం.

మేధావీకరణమంటే కేవలం సామాన్యంగా సంభాషణ స్థాయిలోఉన్న మాండలికం దైనందిన వ్యవహారస్థితి నతిక్రమించి ఉన్నత వైజ్ఞానిక వ్యవహారస్థాయి నందుకోటం. ఇటువంటి ఉన్నతోన్నత ప్రయోజనాల్ని సాధించటానికి ఉపయోగించుకోటంలోనే మానవులు నాగరకులైనారని అనిపించుకొంటారు. ఈ విధానానికి అంతంలేదు. ఇది నిరంతరం సాగుతూ ఉండేది.

35. 3 గార్విన్ అభిప్రాయం ప్రకారం ప్రామాణిక భాష ఈ క్రింది ప్రయోజనాల్ని సిద్ధింపచేయాలి.

(i) సమైక్య సాధనం (The unifying function)

ప్రామాణిక భాష వివిధ మాండలిక వ్యవహార ప్రాంతాల్ని అనుసంధానించుకొని ఏక భాషగా గోచరింప చేయటం చేత, పరిసర భాషలలాగే స్వతంత్ర భాషా ప్రతిపత్తిని నిరూపింపజేసుకొంటుంది. ఇది లేకపోతే అన్నీ మాండలికాలే అవుతాయి భాష అనే వ్యవహారాని కాస్కారం ఉండదు.[1]

(ii) ప్రతిష్ఠా సాధనం (Prestige function)

ప్రమాణేతర స్థానిక మాండలికాల కన్న ప్రామాణిక భాష ప్రతిష్ఠా కరమైంది. దాన్ని నేర్చినవారు, నేర్వని వారి కన్న సాంఘిక గౌరవం విశేషంగా సంపాదించుకో గలుగుతారు. ప్రామాణిక భాషా నైపుణ్యం ఎంత అధికంగా ఉంటే అంతగా గౌరవ ప్రతిపత్తి అతిశయిస్తుంది. ఉన్నతోద్యోగాలు, పదవులు సమకూరుతాయి.

(iii) అనుసంధాన సాధనం : (The frame of reference function)

వివిధ సాంఘిక సన్నివేశాల్లో సమ్యగౌచిత్య నిర్ణయానికి, తరతమనిర్దుష్టతా సాధనకు ప్రామాణిక భాష ఉపయుక్తం.

---

1. The modern standard languages, which prevail within the bounds of an entire nation supersede the provincial types. These standard languages become more and more uniform as time goes on. In most instances, they have grown out of the provincial type that prevailed in the upper class of the urban centre that became the capital of the unified nation—Bloomfield, pp. 482-483

నాగర కోపేతమైన ఏజాతి ప్రయత్న పూర్వకంగానో, అప్రయత్నంగానో తన భాషలో, రాజకీయంగానో, సాంఘికంగానో, సాంస్కృతికంగానో, లేక త్రివిధాలుగానో ప్రాముఖ్యాన్ని పొందిన తన మాండలికాలలో ఏ ఒక్కదానిలోనో తన సాంస్కృతిక, సాంఘిక రాజకీయ, విద్యా సారస్వత, వైజ్ఞానిక వ్యవహారం సర్వం కల్పించుకోని, జాతి సమైక్య జీవనాభివృద్ధిని చేకూర్చుకోని, మరింత నాగరకోపేతం కాకుండ స్తబ్ధంగా ఉండలేదు. ఇది, వివిధ ప్రాదేశిక భాషలలో (Regional languages) ప్రసిద్ధమైనదాన్ని అధిక సులభమైనదాన్ని జాతీయ భాషగా (National language) ఏర్పాటు చేసుకోటం వంటిదిగానే భావించాలి. జాతిసమైక్య సాధనంలో (National integration) ఇవన్నీ సోపానాలు.

ఒక మాండలికాన్ని ప్రమాణీకరించినంత మాత్రాన ఇతర మాండలికాల్ని తృణీకరించటం కాదు. భాషాతత్త్వజ్ఞులు[1] నిరంతరం మాండలికాల్ని పరిశీలిస్తునే ఉంటారు. కృతకమైన ప్రామాణిక మాండలికం పైకన్న, వారి చూపు నిసర్గ లక్షణోపేతమైన మాండలికం మీదనే మిన్న[2]. అంతేకాదు. ప్రామాణిక మాండలికంలోని లోపాల్ని కూడా పూరించగల శక్తి వీటికున్నది. వ్యుత్పత్తులు తెలియని అనేక పదాలకు వ్యుత్పత్తుల్ని మాండలిక పరిశీలనం చేకూరుస్తుంది. మాండలికాల్ని అంతర్భుక్తం చేసికొన్నందువల్ల ప్రామాణిక మాండలికం సుసంపన్న మౌతుంది.[3] సారస్వత

(1) For philologists study of dialect may be useful to investigate phonetic laws (Jesperson)

(2) Dialect is the natural state of language – Science of language, Max Muller.

(3) Certain words in dialectal speech show how a cultivated language can enrich itself by drawing on dialects. There are several words which will even fill a gap in standard speech. The Poetic Approach to Language, V. K. Gokak.

భాషను పుష్టిమంతం చేయటానికి కూడ మాండలికం [1] ఉపయోగ పడుతుంది.

మాండలికానికి ఎంత ప్రాముఖ్యమున్నా సంఘ శ్రేయస్సు నాశించి, వైవిధ్యాన్ని అరికట్టటానికి, సమైక్యాన్ని సాధించటానికి, మాండలికం కొంత దెబ్బతిన్నా జాతి కంతటికి ఉపయోగ పడే రీతిగా ఒకానొక సామాన్య భాషను వ్యాప్తి చేయకతప్పదని, ఎస్పరసన్ పండితుని [2] ఉద్బోధ.

ప్రామాణిక, ఉప ప్రామాణిక, అప్రామాణిక మాండలికాల కెప్పటి కప్పుడు ఘర్షణ కల్గుతునే ఉంటుంది. ఒకప్పుడు అప ప్రామాణిక మనుకొన్నది వాడుకవల్ల ఉప ప్రామాణిక స్థాయినందుకోవచ్చు. ఉపప్రామాణిక మనుకొన్నది ప్రామాణికం కావచ్చు. శక్తిమంతులైన కవులు మాండలికాల్ని ప్రయోగిస్తే, నిఘంటువులు వాటికి అర్థాలిస్తే, వాటిని ప్రమాణంగా ఇతర కవులు కూడ వాడుతారు. ఆ విధంగా అవి ప్రామాణిక భాషా భాగమౌతాయి. ఎంత చెప్పినా సమగ్రంగా ప్రామాణ్యాన్ని సాధించట మనేది ఎక్కడా మానవ చరిత్రలో జరగలేదని బ్లూమ్ ఫీల్డ్ [3] అభిప్రాయం

1. Dialects have always been the feeders rather than channels of a literary language — Science of Language : Max Muller.

2. "So for the good of society it is our duty to work in the direction which natural evolution has already taken, i. e. towards the diffusion of the common language at the cost of the local dialects" Mankind, Nation & Individual from Linguistic point of view–Jesperson.

3. ... So far in the history of mankind, complete standardisation seems nowhere to have taken place : Bloomfield : Literate & illiterate speech P. 393 from Bh. K.'s paper.

నాల వల్లగాని, సంఘనివేదికల వల్లగాని ప్రమాణీకరణం సాధన భావించరాదు.

4. ప్రమాణీకరణ వ్యాప్తి విధానాలు : (Ways of Standar ition) :- వ్యాప్తి అనేది రెండు విధాలుగా జరుగుతుందని స్త్రాలు నిరూపిస్తున్నాయి.

(1) కేంద్రీకృత శక్తి వ్యాపనం : (Centrifugal [1] elopment[2]: Centrum-centre, fugue-to flee) అన్ని విధాల రణోపేతమైన ఒక మహానగరంలో వ్యవహృతమయ్యే మాండ , వివిధ సారస్వత, విద్యా, న్యాయ, రాజకీయ, వైజ్ఞానిక, స్కృతిక రంగాలలో ఉపయుక్తమౌతు ప్రామాణికంగా పరి ంపబడుతు, క్రమంగా దేశమంతట ప్రజలచేగుర్తింపబడి వాడబడే ది సామాన్యంగా పైన పేర్కొన్న వివిధ రంగాలలో నిష్ణాతు న మేధావులు, నగరాలలోనే ఉంటారు. అందు చేతనే లండన్, స్, రోమ్ నగరాలలోని భాష ప్రామాణికమై క్రమంగా గ్లండు, ఫ్రాంసు, ఇటలీ దేశా లంతటా వ్యాపించాయి.

ప్రామాణిక మాండలికం తొలుత తన్ను పరివేష్టించిన ండలికాన్ని ప్రభావితం కావించి, క్రమంగా దేశం లోని ముఖ్యమైన నగరాలకు వ్యాపించి, క్రమంగా జిల్లా, తాలుకా, ా కేంద్రాలైన వివిధ పట్టణాలకు వ్యాపిస్తుంది. నాగరకులైన ళ్ళు, కావాలను కొనేవాళ్ళు ఈ మాండలికాన్నే ఆదరిస్తారు. అభిమానం వారి సంతతిలోను వ్యాపిస్తుంది.

---

Proceeding or acting in a direction away from a centre or axis using or acting by centrifugal force (web)

Produced or developing successively farther away, from the centre. (Anatomy of seed plants) glossary

మాండలికాలు, ప్రామాణిక మాండలికం లోనికి లీనమయ్యే పరిణామ దశలో 'ఉప ప్రామాణిక మాండలికాలు' ఏర్పడుతాయి. (Sub-standard dialects) ఆంగ్ల దేశంలో ఇట్టి ఉప ప్రామాణిక భాషా వ్యవహర్తల్ని చిన్నచూపు చూస్తారు. అట్టి అవమానం సంభవించకుండ త్వరితంగా ప్రామాణిక భాషా వ్యవహార స్థాయి నందుకోటానికి యత్నిస్తారు.

లండన్, పారిస్, రోమ్ వంటి నగరాలను 'అత్యున్నత భాషా కేంద్రాలు' (Supreme Speech Centres) అంటారు.

(ii) వ్యాప్తి శక్తి, కేంద్రీకరణం (Centripetal[1] Development) [2] ఇది పై విధానానికి వ్యతిరేకమైంది. ఒక ప్రాంతంలో వ్యవహారంలో ఉన్న మాండలికం వివిధ విద్యావంతులచే అభిమానింపబడగా ప్రామాణికమై అన్ని నగరాలకు, రాజధానులకు వ్యాప్తమై ప్రభుత్వ వ్యవహారాలకు, న్యాయస్థాన వ్యవహారాలకు యోగ్య మావటం.

దీని కుదాహరణం: జర్మన్ ప్రామాణిక మాండలికం. ఇది తొలి విధానంలో రూపొందింది కాదు. జర్మన్ భాషకు రెండు ప్రధాన మాండలికాలు. (i) హైజర్మన్. (ii) లో జర్మన్. హైజర్మన్ భాష ప్రామాణిక భాషగా పరిగణనాన్ని పొంది రాజధాని నగరానికి, తదితర నగరాలకు వ్యాపించింది. కాని ఈ పద్ధతి అంత ప్రచురం కాదు.

---

1. Centri + petere – to go to, seek : proceeding or acting in a direction toward a centre or axis. Centripetal force – the force that tends to impel a thing or parts of a thing inward toward a centre of rotation. (Web ...)

2. Produced or developing successively closer to the centre (Anatomy of seed plants—Glossary.

35. 5. కొన్ని ముఖ్య భాషలు - ప్రమాణీకరణం :

35. 51. గ్రీకు భాష : ఈభాషలో సుమారుగా ఇరువది మాండలిక భేదాలున్నాయి. ఇందులో ఎయోలిక్, లెబ్బియన్, అటిక్, ఇయానిక్, డోరిక్, డెల్ఫి, వెస్ట్ గ్రీకు పరిగణింప దగినవి. గ్రంథ రచన అన్నిమాండలికాలలోను సాగింది. ఇంతలో ఏథెన్సు నగర మభివృద్ధి చెందింది. దానివల్ల అట్టిక్ మాండలికానికి ప్రాముఖ్యమేర్పడ్డది. దేశమంతట రోమను సామ్రాజ్యం స్థాపితమైంది. అట్టిక్ మాండలికమే ప్రామాణికంగా స్థిరపడింది. లెక్కనవి నామ మాత్రంగా వ్యవహృతాలు.

చిన్న చిన్న రాజ్యాలు ఉన్నప్పుడు ఆయాస్థానిక మాండలికాలే కవుల కుపాదేయాలైనాయి. రోమక సామ్రాజ్య స్థాపనంతో చిన్న చిన్న రాజ్యాలు తుడుచుకొని పోయాయి. మాండాలికాలకు స్థానమే లేకుండ పోయింది. విద్యా వంతుల భాషగా 'అట్టిక్' వ్యాప్తిలోకి వచ్చింది[1]

35. 52. జర్మన్ భాష : ఇది ప్రధానంగా రెండువిధాలు: (i) హై జర్మన్ (ii)లో జర్మన్ లు. ఈ రెండు అనేక మాండలిక భేదాల్ని కలిగి ఉన్నాయి ఇన్ని మాండలికా లుండటం శ్రేయం కాదని ప్రామాణిక భాషను రూపొందించటానికి ఎందరో కృషి చేసారు.

క్రీ. శ. 1400 ప్రాంతంలో బొహీమియా ప్రాంతానికి ప్రభువు, ఆ ప్రాంతపు జర్మన్ మాండలికాన్ని రాజ భాష కావించాడు. రచయితలప్పుడు డీప్రాంత భాషలోనే రచనలు సాగించారు. ఆ తరువాత అచ్చుయంత్రం వచ్చింది. వివిధ మాండలికాలలో అచ్చువేయుటం కన్న సులువైనదాన్ని ప్రమాణంగా స్వీకరించి,

1. The Greek Language P. 197; Atkinson

ఆ భాషలో గ్రంథాలు అచ్చువేయించటం సముచితం అని ఆర్థికంగా లాభదాయకమని భావించారు. భాషా ప్రామాణిక నియమావళిని రూపొందించడానికి యత్నించారు. హైజర్మన్ మాండలికంలోనికి బైబిల్ అనువాదం పొందింది. కొన్ని మాండలికాలు నిలువ ద్రొక్కుకొన్నాయి. వాటిలోను గ్రంథ రచనలు కొందరు చేస్తునే ఉన్నారు. కాని భాషా వేత్తలు, విద్యాధికులు పలువురు హైజర్మన్ భాషనే ఉపయోగిస్తువచ్చారు. 'స్కాటెలియస్' అనే అతను ఈ ప్రామాణిక భాష కో వ్యాకరణం కూడ వ్రాసాడు. కొన్ని పరిమత్తులు స్థాపించ బడ్డాయి. ఇవి ప్రామాణిక భాషను పరిరక్షిస్తు వచ్చాయి.

జె. సి. గాట్‌స్కెడ్ (Gottsched) విద్యాధికుల వ్యవహారమాధారంగా హైజర్మన్ భాషను సంస్కరించాడు. అయినా వివిధ మాండలికాలు తమ ప్రాముఖ్యాన్ని కోల్పోలేదు. ఆ కారణంగా ప్రభుత్వం 1898లో సర్వజనాంగీకార యోగ్యమైన ప్రామాణిక భాషను రూపొందింప జేయటానికి ఒక సంఘాన్ని నియమించింది. అందులో విశ్వవిద్యాలయాచార్యులు, వివిధ మాండలికాలకు చెందిన పండితులు సభ్యులు. వారో ప్రామాణిక భాష నేర్పరిచారు. దీని కాధారం హైజర్మన్ మాండలికమే. అప్పటినుండి అదే రాజ భాష. సకల విద్యాలయాలలో బోధన భాష. ఆంగ్లం ఫ్రెంచి ప్రామాణిక భాషలకన్న జర్మన్ ప్రామాణిక భాషలోనే మాండలిక వైవిధ్యం గోచరిస్తున్నదంటారు [1]

35. 53. ఆంగ్ల భాష : దీనికి మూడు ప్రధాన ప్రాంతాలు ఉత్తర, దక్షిణ, మధ్య ప్రాంతాలు. వీటిలో అనేక మాండలికా

---

1. German Language PP. 364 - 397 by R. Priebsch, W. E. Collinson.

లున్నాయి. 7, 8 శతాబ్దాలలో నార్తమ్‌బ్రైన్ మాండలికంలో కావింపబడ్డ కొన్ని రచనలున్నాయి.

'ఆల్‌ఫ్రెడ్' పడమటి సాక్సన్ భూభాగాన్ని ఆక్రమించుకొని క్రీ. శ. 671 నుండి 901 వరకు పాలించాడు. సాక్సన్ మాండలికంలో రచన సాగించాడు. క్రీ. శ. 1300 వరకు ఈ మాండలికంలో రచనలు కావింపబడుతునే ఉన్నాయి.

క్రీ. శ. 1060 లో నార్మనులు బ్రిటన్ దేశాల నాక్రమించి రెండు శతాబ్దాలు పాలించారు. వీరు ఫ్రెంచి భాషనే రాజకీయభాష కావించుకొన్నారు. ఇంగ్లీషు నిత్య వ్యవహారంలోనే ఉండేది.

నార్మనులు, ఇంగ్లీషువారు కలిసి పోయారు. క్రమంగా ఫ్రెంచి భాషపై ఆదరం తగ్గింది. క్రీ. శ. 1362 ప్రాంతంలో మూడవ ఎడ్వర్డుల న్యాయస్థానాలలో ఆంగ్లం వాడటాని కనుమతించాడు.

క్రీ. శ. 1340 ప్రాంతంలో పుట్టిన ఛాసర్ తన యుక్త వయస్సులో లండన్ మాండలికంలో గ్రంథరచన కావించాడు. అదృష్టవశాత్తు భౌగోళిక రాజకీయ కారణాల్నిబట్టి, ఆ మాండలికమే ఇంగ్లాండు కంతకు కావ్యభాష (literary dialect) అయింది. అనేకులు ఇందులోనే గ్రంథాలు రచించారు.

ఆ లండన్ మాండలికమే కొన్ని మార్పులతో, చేర్పులతో క్రీ.శ. 1500 ప్రాంతంలో 'ఆధునికాంగ్లం' గా (Modern English) రూపొందింది. అదే ప్రామాణిక భాష. విద్యా రంగంలోను, ప్రభుత్వ న్యాయ రంగాలలోను ఇదే వాడబడుతుంది. ఒక్క స్కాచ్ మాండలికం తప్ప తక్కినవన్నీ ఉండీ ఉండనట్లే. జానపద వాఙ్మయం ఉందన్న కారణంగా స్కాచ్ మాండలికం కొంత

ప్రాముఖ్యం సంపాదించుకొన్నది. ఈ మాండలికం వారు కూడ శాశ్వత రచనల్ని ప్రామాణిక భాషలోనే చేస్తారు. నిత్య వ్యవహారంలో మాండలికం ఉన్నా, వాఙ్మయ రంగంలోను, విద్యాధికుల వ్యవహారంలోను మాండలికాలకు స్థానం లేదు[1].

35. 54. నార్వే విషయం : చాల శతాబ్దాలుగా నార్వే, డెన్మార్కుకు రాజకీయ దాస్యంచేసింది. ప్రామాణిక డేనిష్ భాషే ఇక్కడా ఉపయుక్తం. నార్వీజియనులు ప్రామాణిక డానిష్ భాషను నార్వీజియన్ భాషా రూపాల కనుకూలంగా మార్చుకొన్నారు. ఇదే డానో—నార్వీజియన్ రిక్షమాల్ అనే జాతీయ భాష. విద్యావిహీనులైనసామాన్య ప్రజల కిది విదేశ భాషతో తుల్యమే.

క్రీ. శ. 1813 లో నార్వే, డెన్మార్కు నుండి విమోచనాన్ని పొందింది. అప్పటినుండి వారి రిక్షమాల్ (రాజ్యభాష) నార్వీజియన్ మాండలికాలలో లీనమయింది. 1840లో ఇవర్ ఆసేన్ (Ivar Asaen) అనే భాషా శాస్త్రవేత్త 'డానో—నార్వీజియన్' భాషా స్థానంలో, నార్వీజియన్ మాండలికాలతో ప్రామాణిక భాష నొకదాన్ని రూపొందించాడు. పెక్కు మార్పు కూర్పులతో రూపొందిన ఈ నవీన ప్రామాణిక భాషను వారు 'లాండ్స్మాల్' (Landsmaal) అంటారు. అంటే 'దేశీయ భాష' (Native Language) అని అర్థం. ఇది నార్వీజియనుల కభిమాన పాత్రమైంది.

35. 55. భారతీయ భాషల పరిశీలనం — తమిళం : భారతీయ భాషలలో సంస్కృతంతరువాత అత్యంతప్రాచీనమైన సారస్వతంగల భాష తమిళమే. ఈ సారస్వత భాషే సకల రచనా వ్యాసంగాలకు, రేడియో ప్రసంగాలకు, పత్రికా రచనలకు, పాఠ్యబోధనానికి, ఉపన్యాసాలకు ఉపయుక్తం. కేవలం దైనందిన వ్యవహారానికే మాండ

1. The History of English Language - G. F. Emerson.

లిక ముపయుక్తం. ఈ సారస్వత భాష కాలానుగుణ్యంగా కొలది మార్పులకు లోనౌతున్నా అన్య భాషను నేర్చినట్లుగా బడిలో దీన్ని అభ్యసించాలి. ఇదే తమిళానికి ప్రామాణిక భాష. ఆంగ్లం, ఫ్రెంచ్ భాషలకు లాగా ఏదో ఒక మాండలికం—అంటే సమకాలీన భాష, తమిళుల ప్రామాణిక భాష కాదు. అక్షరాస్యత బాగా అభివృద్ధి చెందితే, ఈ ప్రామాణిక భాషకు అధిక వ్యాప్తిలో ఉన్న మాండలికానికి సంఘర్షణ కలుగవచ్చు. అప్పుడు రెండు విధాలైన భాషలు దేశంలో వ్యాప్తిలో ఉంటాయి.

అరబిక్ గ్రీకు భాషలకు కూడ ఇటువంటి స్థితే. దీన్నే ద్వభాషా సంఘర్షణ స్థితి (Diglossia) అంటారు.

'ఫర్ గూసన్' దీనినిలా వివరించాడు. "మాండలికాలు, ప్రామాణిక మాండలికం కాకుండ, అదనంగా ఎంతో వైవిధ్య సంక్లిష్ట వ్యాకరణ నియమావళిగల భాష ఒకటి దేశంలో వ్యాప్తి చెంది ఉంటుంది. ఆ భాష కెంతో సారస్వతి మూంటుంది. శిష్టులు తమ సకల రచనా వ్యాసంగాల్ని ఈ భాషలోనే నిర్వహిస్తారు. మామూలుగా మాట్లాడుకోటానికి మాత్రం మాండలికాన్ని వాడుతారు." [1]

---

1. Diglossia is a relatively stable language situation, in which. in addition to the primary dialects of the languages (which may include a standard, or regional standards) there is a very divergent, highly codified (often grammatically more complex) superposed variety, the vehicle of a large and respected body of a written literature, either of an earlier period or in another speech community, which is learned largely by formal education and is used for most written and formal spoken purposes; but is not used by any sect or of the community for ordinary conversation. (*F*urguson — Diglossia, P. 435, from **Bh. K's paper**)

దైనందినోపయోగానికి ఒక భాషను, ప్రత్యేక ప్రయోజనానికి వేరే భాషను ఉపయోగించటం. భాషా సంఘర్షణ స్థితి సంస్కృతాన్ని మతపరమైన కార్యాలకు, ఆంగ్లాన్ని ప్రభుత్వ వ్యవహారాలకు, ప్రాంతీయ భాషల్ని దైనందిన కృత్యాలకు ఉపయోగించటం ఇటువంటిది[1] కాదు. ఎవరో పురోహితులు మత కార్యాలకు వాడుతారు కాని శిష్టులందరు వాడరు. ఇవి భిన్న భాషలు. తమిళం, అరబిక్ భాషలలో అలా కాదు. ప్రాసేటప్పుడు వాడేది ఆ భాషలే. అవి కరడు కట్టుకొని సామాన్య జనావగాహనానికి అందుబాటులో లేని సారస్వత భాషలు.

డి. యం. కె. ప్రభుత్వం వచ్చిన తరువాత ఈ పరిస్థితి తొలగుతున్నది. ఉపన్యాసాలకు, సినిమాలకు, రేడియోలకు, పత్రికలకు తమిళ మాండలికమే (బహుశః మదరాసు నగర మాండలికమే?) వాడబడుతున్నది.

తెలుగులో గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషోద్యమాన్ని నిర్వహించకపోతే, సారస్వత భాషే ఉపయుక్తమయ్యేది. ఈ పరిస్థితి తప్పించారు.

35. 56 వంగ భాష: కలకత్తా నగరంలోని విద్యాధికుల వ్యవహార భాషే ఆధునిక ప్రామాణిక వంగ భాష. దీన్నే 'కాలిట్ — భాషా' అంటారు. ఇది క్రమంగా 'సాధు భాష'ను వైదొలగించింది. ఈ రెండు తెలుగు లోని 'వ్యవహారిక' 'గ్రాంధిక' భాషల్ని పోలినవి. పాశ్చాత్య భాషా వాఙ్మయ ప్రభావాలవల్ల, కాలాను గుణ్యంగా, నూతన సాంఘిక ప్రయోజన సిద్ధికై ఏర్పడ్డదే ఈ ఆధునిక ప్రామాణిక భాష.

---

1. Linguistics and language Teaching P. 116 by V. Rama Murthy.

35. 57. హిందీ : ఏది ప్రామాణిక హిందీ ? అని ప్రశ్నిస్తే విద్యాధికులైన హిందీ వారికికూడ సమాధానం చెప్పటం సులభ సాధ్యం కాదు. మైథిలి, అవధి, భోజ్‌పురి, మాగధి, రాజస్థాని, పహారి అనే మాండలికాలున్నాయి. ఇందులో కొన్నింటికి సారస్వతం ఉంది. కొన్నింటికి లేదు. ఇవి కాక, ఢిల్లీ నగర పరిసరాలలోని ఖడీ బోలి అనే మాండలికం ప్రామాణికంగా స్వీకరించారు. దేశం స్వాతంత్ర్యం పొంది నప్పటినుండి హిందూస్థానీ పదాల్ని తొలగించి, వాటి స్థానంలో సంస్కృత పదాల్ని వాడే ప్రయత్నాన్ని పండితులధికంగా కావిస్తున్నారు.

35. 58. తెలుగు : రేనాటి చోళుల ఎఱ్ఱగుడిపాడు శాసనం (క్రీ. శ. 575) తెలుగులో వెలసిన తొలిశాసనం. దీన్నిబట్టి ఆ నాటి రాజకీయభాష తెలుగని తెలుస్తుంది. చాళుక్యులు తెనుగు భాష నాదరించారు. సంస్కృతాభిమానం కూడా ప్రకటిస్తునే వచ్చారు. నందంపూడి, కోరుమిల్లు సంస్కృత శాసనమును ఇందుకు నిదర్శనం.

క్రీ. శ. 11వ శతాబ్దాకి తెనుగులో భారతరచన మేర్పడింది. సాంస్కృతికంగాను, రాజకీయంగాను సుసంపన్నమైన రాజమహేంద్ర నగర మాండలికాన్నే నన్నయ ప్రమాణీకరించి సారస్వత ప్రయోజానాన్ని సాధించాడనాలి. అప్పటినుండి తిక్కసుధీమణి మొదలైన తెలుగు కవులకు 'ఆమూడు పర్వములలో ఆ మాన్యుని నుడులే' పరమప్రమాణాలైనాయి.

కవులెంతగా ప్రామాణిక భాషాబద్ధులైనా వారి వారి మాండలిక భాషలు వారిని ఏ కొంతగానో ప్రభావితుల్ని చేసాయనే చెప్పాలి. ఇందుకు కొన్ని ఉదాహరణలు :

1. ఇలువరుస : ఇంటికొలరు చొప్పున అన్నానికి పిలవటం
భార. 1. VI-264.

2. గోచిపాతరాయుడు : నిరుపేద కుచేలోపాఖ్యానం. I-56.

3. చీలి : మాటకు ముందు ఏడ్చువాడు. అడిదం సూరకవి ప్రయోగం.

'జగడాల చీలివై సవతితో పోరాడి'

4. నెయ్యాలు = పేలాలు. మచ్చు వేంకటకవి - శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్ర.

5. బత్తల : నగ్నం. శివతత్త్వసారం. ఇలాంటి వెన్నో ఉంటాయి. ఈ పదా లిప్పటికి నెల్లూరు, విశాఖ, గంజాం మొదలైన వివిధ మాండలికాలలో వాడుకలో ఉన్నవే. వీటిని సేకరించటం ప్రత్యేక పరిశోధన.

ఇలాంటి మాండలికాలవల్ల ప్రామాణిక భాషకు విస్తృతి చేకూరింది. ఈ విధంగా రూపొందిన సారస్వత ప్రామాణిక భాషకే వ్యాకరణాలు, నిఘంటువులు ఏర్పడ్డాయి. గ్రంథ రచనోపయోగమైన ఈ భాషకే 'గ్రాంథికభాష' అనే వ్యవహారం రూఢమైంది. ఇప్పటికీ పద్యరచన ఈ గ్రాంథిక భాషలోనే సాగుతున్నది. ఈ సారస్వత మాండలికం వ్యవహారంలోని జీవద్భాషకు దూరంగానే ఉంటుంది.[1] దీన్ని విద్యాలయాలలో అధ్యయనం చేయక తప్పదు.

---

1. It is remarkable peculiarity of the Indian Languages, that, of as soon as they begin to be cultivated, the literary style evince a tendency to become a literary dialect, distinct from the dialect of common life with a grammar and vocabulary of its own—Caldwell.

శిష్టులు వ్యవహరించుకొనే భాషకు, దీనికి, చాల వ్యత్యాస ముంది. ఈ సారస్వత భాషలో వ్రాయాలంటే పాండిత్యం కావాలి మహాకవుల కావ్యాలలోనే వ్యాకరణ విరుద్ధప్రయోగా లున్నాయనే విమర్శలుంటే, ఇక సామాన్యుల మాట చెప్పాలా ?

ఆంగ్ల దేశంలో శిష్టులు వ్యవహరించుకొనే భాషకు, సారస్వతోపయోగమైన భాషకు తారతామ్యం లేశమాత్రమే. తెలుగులో ఇలా ఎందుకుండాలని, గిడుగు రామమూర్తిగారు శిష్టవ్యవహార భాషలోనే రచనా వ్యాసంగాలు సాగాలని ఉద్యమం లేవదీశారు. గ్రాంథిక భాషలో దోషరహితంగా ఎవ్వరు వ్రాయలేరని ఆయన సవాలుచేసారు. గిడుగువారికి తోడుగా గురజాడవారు వ్యావహారిక భాషలో రచనలు కావించారు.

మొత్తంమీద ముద్రణ యంత్రం,[1] దాని కారంగా పత్రికలు ఏర్పడడం, తెల్లవారేటప్పటికి ఎన్నో రచనలు కావలసి రావటం, పరిస్థితుల ప్రాబల్యం. కాలప్రభావాని కనుమూలంగా నవలలు, నాటకాలు, కథలు, వ్యాసాలు విరివిగా ఇప్పుడు శిష్టవ్యవహార భాషలోనే వస్తున్నాయి. నియమాల్ని అంటిపెట్టుకొనే తీరు బాటు తగ్గిపోయింది.

---

1. "The Printing Press began the decentralisation of scholarship by impairing the powers of the universities. The intellectual exclusiveness was destroyed once for all, the umblest man who could read became a citizen of the New Republic of letters and a tremendous impulse was thus given to the spread of the lay spirit"

Hudson's 'Story of Reniassance : చూ. డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ 'వ్యావహారిక భాషా వికాసం' - పుట 77.

అయితే శిష్టులంటే ఎవరు? అనే ప్రశ్న. శిష్టి కలవారు శిష్టులు. 'శిష్టి' అంటే వ్యాకరణం. వ్యాకరణజ్ఞులని అర్థం. "కేపునః శిష్టాః? వైయాకరణాః" అని మహాభాష్యం. 'కుత ఏతత్? శాస్త్రపూర్వికాహి శిష్టిః వైయాకరణాశ్చ శాస్త్రజ్ఞాః' అనికూడా భాష్యకారుడుద్ఘాటించాడు. శాస్త్ర ప్రామాణాన్ని అంగీకరించేవారంతా శిష్టులు. వైయాకరణులే కాక బహులక్ష్య జ్ఞాతలు, దేశకోశాది నిరంతర పరిశీలనారతులు, శిష్టులనవచ్చు. "నిర్దుష్టంగా మాట్లాడాలనే ఆశయంతో వ్యాకరణాధ్యయనం చేసేవారు శిష్టులని సంస్కృత వ్యాకరణ కోశం[1]. విస్తృతంగా ఆలోచిస్తే, శబ్దస్వరూపంమీద చూపు గల్గి, ప్రామాణిక దృష్టితో రచన చేసేవారిని, మాట్లాడేవారిని, లేదా అలాచేయాలనే ఆశయం గలవారిని; చదువు 'సంస్కారం'[2] గలవారిని శిష్టులనవచ్చు. శిష్టుల భాష పరమప్రమాణమని, వారిని నిందింపరాదని దండ్యుక్తి. - "శిష్టోక్తిర్న దుష్యతి". "శిష్టైః సాధుభిః అభిమతతయా వ్యవహృతస్తు నదోషాయ భవతి" అని వ్యాఖ్యానం. అంటే 'శిష్టులచేత వ్యవహరింపబడే భాష దోషాన్ని పొందద'ని అర్థం. అంతేకాక 'శిష్టుల భాషను సరిగా శాసింపకపోతే శాసనకర్తలే దండనీయు'లనికూడా దండి వచన.[3] కాబట్టి శిష్టుల భాష సర్వదా, సర్వథా శిరోధార్యం.

1. A Dictionary of Sanskrit Grammar by Abhayankar – Baroda university.
2. "సంస్కారో లోపాగమవర్ణ వికార ప్రకృతి భావలక్షణః" వాజసనేయ ప్రాతిశాఖ్య. వర్ణలోపాగమాదుల నెరిగినవాడు. శాస్త్రబద్ధమయిన మార్పులుదక్క తానుగా అట్టిమార్పులు కలిగించనవాడు.
3. "శిష్టానామ్ ఉక్తే, సూత్రాణామ్ అభావే అనుశాసనకారిణ ఏవ దండనీయాః" అని దండిచెప్పినట్లు శ్రీ గిడుగువారుద్ఘాటించారు. బాలకవి శరణ్యం (ద్వి. ము.) పుట 260

అయితే ఏ మండలంలోని శిష్టుల భాషను ప్రమాణీకరించాలి? అనే ప్రశ్న. ఇంతకు పూర్వమే ఉభయ గోదావరి, కృష్ణ, గుంటూరు మండలాలలోని భాష 'మిశ్రమాండలిక'మని పేర్కొన్నాం (పుట206) అంటే ఏదేని ఇతర మండలంలో వ్యవహృత మౌతున్న పదమే ఇక్కడ వ్యవహృతం. కేవలం ఈ మండలానికే చెందిన పదాలు మృగ్యం. ఇది ఇతర మండలాలతో ఏదో విధమైన సంబంధం కలిగి ఉందని దీని అర్థం: అందుచేత కూడ ఇది ప్రమాణీకరణయోగ్యమైం దని చెప్పవచ్చు.

అంతే కాదు. ఇతర మండలాలన్నిటికన్న ఈ మండలంలోనే విద్యా సంస్థలు, విద్యాధికులు అధికం. ఈ ప్రాంతంవారే తొలుత పత్రికలు స్థాపించి నడిపారు. అందులో పనిచేసేవారు ఈ మాండ లానికి చెందినవారే. తెలుగుభాష కాంగ్లంలో వ్యాకరణాలు వ్రాసిన బ్రౌన్, గార్డెన్ మొదలైనవారు [1] ఈ మాండలికనే (పై కారణాలను బట్టే కావచ్చు) పరిశుద్ధము, ప్రామాణికము అయిన మాండలికంగా పేర్కొన్నారు. ఇతర ప్రాంతాలకు చెందిన రచ యితలు కూడ చాలవరకు ఈ మాండలికంలోనే రచిస్తున్నారు. ఇదే 'ఆధునిక ప్రామాణిక భాషగా' (Modern standard Lan-

---

1. The dialect spoken in the northern circars is sesually conside-red the purest form of the language - Grierson & Stenknow Linguistic Survey of India. Vol. IV. p. 577

" ... the gentoos spoken by the higher classes in the Northern Circars. particularly the better educated Rajah Caste in the Visa*k*hapatnam province may be considered the most refined and perhaps the most perfect gentoos spoken at present day" — preface p. ii C. P. Brown.

" The Telugu spo*k*en in the Krishna and Godavary districts which is the purest and most largely used, has been taken as the standard, A. H. Arden, preface p. vi.

guage) అంగీకరింపబడినట్లు భావించవచ్చు. ఈ విధంగా ఒక ప్రాంతంలోని భాష ప్రమాణీకరింపబడటం 'వ్యాప్తశక్తి కేంద్రీకరణం'గా (Centripetal development) గ్రహించాలి.

25-13. వ్యాకరణం వల్ల ఏమి ప్రయోజనం లేదని, ప్రయోగమే తప్పొప్పుల్ని నిర్ణయించేదని, ఆధునికుల అభిప్రాయం. కీ. శే. గిడుగు రామమూర్తిగారు 1912 లో A memorandum on modern Telugu అనే చిన్న పుస్తకం ప్రచురించారు. అందులో ప్రాచీనాంధ్రానికి, నవీనాంధ్రానికి గల తారతమ్యాల్ని సూచించారు. పాతవడ్డ భాషను నేర్చుకోమని నిర్బంధించటం క్రూరమని వారందులో పేర్కొన్నారు.[1] వాటిలో ముఖ్యమైన వాటిని పేర్కొనటం సముచితం. భాషాశాస్త్రాభివృద్ధి దృక్పథంతో వీటిలో కొన్ని పునరాలోచించాలి. కొన్ని సంస్మరించాలి.

(1) ధ్వనులు: (క) వచ్చాను, తాటాకు మొదలైన సంధించిన పదాలలో వినవచ్చే ధ్వనిని గుర్తించాలి. ఇది+ఆ→ ఇదా! మేక, మెట్ట : వీటికి ప్రత్యేక చిహ్నాన్ని ఉంచాలంటారు. కానిలిపిలో దీనికో నిర్దేశం అక్కరలేదు. ఏ అనే వర్ణానికది ధ్వని భేదమే. ఎలా వ్రాసినా తెలుగువాడా రీతిగానే పలుకుతాడు. విదేశీయులకు, తెలుగును ద్వితీయ భాషగా అభ్యసించేవాళ్ళకు అవసరం కావచ్చు.

(గ) చీమ, గుఱ్ఱము, చిలుము-హ్రస్వమకారాలు. ముపర్ణకాంతాలన్నీ 'ం' తోనే వ్యవహారభాషలో నిరూపితం. చీమ-చీఁవఁ అని అనునాసికంగా పలుకుతాం, 'మ' కారాన్ని రెండచ్చుల

1) ... it would be wicked to force every one to learn the obsolete language which even the pandits who devote all their life and energy to it have not succeeded in mastery; the chicanes of old usage are so capricious. (P. 55)

మధ్య (చూ. పుట 98) లిపిలో దీన్ని నిరూపిస్తే అది ధ్వన్యాత్మక మౌతుంది. (Phonetic script).

(ట) పదమధ్యలో అచ్చులు బలహీనమై లోపిస్తాయి.

వలవదు → వల్దు — వద్దు

వలె → ఆలి. (కావాలి, చేయాలి మొ.)

(త) అర్ధానుస్వారం తొలగించాలి: ఈమధ్యనే ముద్రణంలో ఇది వర్పడ్డది - నిర్జీవధ్వని చిహ్నంగా. ఇప్పుడసలైన అనునాసికోచ్చారణానికి చిహ్నంగా ఉపయోగపడుతున్నది గురజాడ వారు దీన్ని ఎలావాడుకొన్నది పేర్కొన్నాం. (చూ. 226) పూర్వం లాక్షణికులు నిరూపించిన మాటలలో — చీఁకటి, ఆఁకలి, వీఁపు, మఱఁదలు ఇత్యాదుల్లో దీన్ని తొలగించవచ్చు.

(2) వ్యాకరణాంశాలు (morphology)

(క) పొంటె, కోలె, మెయి, కై, అందు మొదలైన విభక్తులు నవీన భాషలో మృగ్యం.

ద్వితీయాది విభక్తులలో మార్పువచ్చింది.

| | |
|---|---|
| రాముని (ప్రా. తె.) | రాముణ్ని (న. తె.) |
| రామునితో (ద్వి+తృ.) | రాముడితో (ప్రథమ ద్వితీయాది విభక్త్యంగం - oblique case) |
| రాముని కొఱకు, కై (చ) | రాముడుకోసం (వ్రమాద) |
| రాముని వలన (పం.) | రాముడి / రాముడువల్ల |
| రామునియందు | రాముడ్లో |

ఒక విభక్తి కింకోవిభక్తి నుపయోగించటం నవీనభాషలో సరిపడుతున్నా, కొన్నిట్లో సరిపోదు,

వాడు పూలు తెచ్చెను — వాడు పూలు తెచ్చాడు : ద్వి తీయకు ప్రథమ వాడటం వ్యవహార భాషాప్రభావమే.

నా చెప్పిన మాట — నేను చెప్పినమాట

(చ) పరస్థానికాలు, విభక్తులస్థానంలో ప్రయోగించటం.

నాకు నలిగి, నాతోడ నలిగి } నామీద అలిగి

(ట) గౌరవార్థం వారు, గారు, ఆమె, అతను, మీరు మొదలైనవి నవీన వ్యవహారంలో ఏర్పడ్డవి.

(త) క్రియారూపాలు :

చదివితిని (భూత) చదివాను, చదివినాను

రాగలను, (భవి. వర్త)
వత్తును. వచ్చెదను — వస్తాను

వచ్చుచున్నాను(వర్త)
వచ్చెదను (కేతన) } వస్తున్నాను.

(ప) కర్మార్థక ప్రయోగాలు పడ్వనుబంధంతో నవీన భాషలో లేవు.

(గ) నవీనభాషలో నూతన క్రియారూపాలు గమనించవచ్చు.

పోతాము - we shall go

పోదాం - Let us go

కొంటే కొంటాను, తింటే తింటాను వంటివి వ్యవహారంలో విశిష్టం.

(జ) అవధారణార్థకం 'అ' పోయి ఏ అనేవి అర్వాచీన కావ్య

భాషలో వికల్పంగా ఏర్పడ్డది. నవీనభాషలో 'అ' పూర్తిగా తొలగిపోయింది.

నీవ ఈపనిచేయవలెను ... నీవే ఈ పనిచేయాలి.

(డ) న. తె. లో కడపటి అచ్చు దీర్ఘం చేయటంచేత ప్రశ్న పుడుతుంది.

ఆ పని చేసింది నీవే. (ఏవార్థకత)

ఆ పని చేసింది నీవే? (ప్రశ్నార్థకం)

వచ్చిందీ?, తిన్నావా? ( ,, )

ప్రా. తె. లో. వచ్చినది+ఆ=వచ్చినదా ( ,, )

తింటివి+ఆ = తింటివా ( ,, )

(ఢ) ప్రా. తె. లో భావార్థకం ట. న. తె. లో టం/డం

చేయుట, వెడలుట ... చేయటం / చేయడం.

వెళ్ళటం / వెళ్ళడం.

(ణ) విలక్షణ వ్యతిరేక క్రియలు:

నీవు రాని నాడు
నీవు రాని వేళ

నీవు రాకుంటే
నీవు రానప్పుడు,
నీవు రాకపోతే

(త) సహాయ క్రియా ప్రయోగాలలో అర్థభేదం.

ప్రా. తె. బ్రదుక లేదు (భార. శాం. I. 245) = ప్రాణము లేదు

న. తె. ,, = జీవింపలేకున్నాడు

ప్రా. తె. తొలగింపఁగూడునే = తొలగింపశక్యమా?

న. తె. తొలగించవచ్చా?

(థ) తుమున్నాద్యర్థకమయిన - 'అన్' వాడుకలో పోయి -కా/-గా

అనేవే అనుప్రయుక్తం: చేయన్-చేయగా, కొట్టన్-కొట్టగా, కొన్నిచోట్ల దీర్ఘాలు — నిండన్-నిండా, కూడన్-కూడా.

(ఐ) 'దగ్గఱు' అనే క్రియ - దగ్గరన్, దగ్గరకు, దగ్గిరికి అనే రీతిగా వాడుక కెక్కాయి :

(ప్రా. తె.) నన్ను దగ్గరి వచ్చెను.

(న. తె.) నా దగ్గరికి వచ్చాడు. నాదగ్గర దమ్మిడి లేదు.

(స) - ఎడు, - ఎడిగాగమ ధాతుజవిశేషణ రూపాల స్థానంలో ఏకారాంత ధాతురూపాలు నవీన భాషలో ఉంటాయి.

వచ్చెడి/వచ్చెడువాడు ... వచ్చేవాడు
తినెడి/తినెడు అన్నం... తినే అన్నం

(హ) 'రాడు' అనే వ్య. క్రి. కు త్రైకాలిక వ్యవహారం లేదు.

(న తె.) రాడు- he willnot come; రాలేదు- he didnot come; రావడం లేదు - he is not coming.

(ప్రా. తె.) రాడయ్యె - he was a non-comer.

(న. తె.) వచ్చాడుకాదు.

(క్ష) నవీన తెలుగులో కొన్ని సహాయ క్రియలుచేరి అర్థాన్ని విశదం చేస్తున్నాయి.

(ప్రా. తె.) వాడుప్రేలెను ... (న. తె.) వాడు వేలాడాడు
,, వాడు పాఱెను ... ,, వాడు పారిపోయాడు
,, నాకది వలయును... ,, నాకది కావాలి

(ర) కొన్నిక్రియలు సకర్మకాలు అకర్మకాలుగాను, అకర్మకాలు సకర్మకాలుగాను మారుతుంటాయి.

(ప్రా. తె.) నన్ను నగిరి ... (న. తె.) నన్ను చూచి నవ్వారు
,, నాకుం గరుణింపుము ,, నన్ను కరుణించు.

(ల) ప్రేరణ రూపాలు వేరుగా ఉపయుక్తం

(ప్రా. తె.) నిన్ను నాకు కనిపించు

(న. తె.) నీవు నాకు కనిపించు

(వ) అనక, నాక, అనవుడు, నావుడు మొదలైన క్రియలు నవీన తెలుగులో లేవు.

ఈ విధంగా అనేక విషయాలు పంతులుగారు పరిశీలించి, పాత తెలుగు, క్రొత్త తెలుగులకున్న తారతమ్యాల్ని నిరూపించి, పాత తెలుగులో వ్రాయడం రోత కాదా? అని ప్రశ్నించారు. నవీన భాషలో రచనా వ్యాసంగం సాగాలని ప్రబోధించారు. విశ్వ విద్యాలయాలలో కూడ నవీన భాషే సకల కళా వ్యాసంగాలకు ఉపయోగం కావటంతో గిడుగువారి ఆశయం సిద్ధించినట్లే. 'భయాన్మా అభయంగనుయు' అనే వారి నినాదం అన్ని రంగాలలో లాగా భాషారంగంలో కూడ మార్మ్రోగుతున్నది

ఈ ఆధునిక భాషాస్వరూపాన్ని 'తెలుగు భాషా చరిత్ర' గ్రంథంలో అభివర్ణించారు - డాక్టర్ చేకూరి రామారావు (పుటలు 350 - 357, సాహిత్య అకాడమి) ప్రాంస్వత భాషాస్వరూపాల్ని స్మరించుకొంటు, ఈ ప్రకరణాన్ని పఠిస్తే ఆ రెండిటి తారతమ్యాన్ని గూర్చిన పరిజ్ఞానం ఏర్పడుతుంది.

35-14 శిష్ట, శిష్టేతర భాషాభేదాలు : ఉచ్చారణలో శిష్టులకు, శిష్టేతరలకు (జానపదోచ్చారణ మనటం భావ్యం కాదేమో!) ఉచ్చారణలో ఎనిమిది ముఖ్య భేదాలు ప్రదర్శించారు- ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు. (తెలుగు భాషా చరిత్ర పుటలు 398-399) శిష్టేతర భాషలో (క) (i) ఒత్తులు, (ii) హకారం, (iii) ఇ, ఈ, ఎ, ఏ

లతో కూడి వకారం లోపిస్తాయి. ఉదా : భాగవతం, దర్మం, అరిల్లు, తోయిణి; యిల్లు, యీరాది, యెండ, యేడి.

(చ) సంయుక్తాలు : సమీకరణం పొందుతాయి : బత్తి, సేత్తాడు

(ట) స్వరభక్తి : కలకటేరు, రగితి, పలసన

(త) చ → స : సవుడు, సుక్క, పలసన

(స) శ,ష → స : సేత్రి (శాస్త్రి), బాస

(గ) ళ → ల : పల్లెం, కల్లెం, వాల్లు (వాళ్లు)

(జ) ణ → న : వాన్ని (వాణ్ణి), కనితి (కణితి)

(డ) ఆంగ్లఫకారం → ప : ఆపీసు, కాపి

(ద) అ → ఎ : గట్టు - గెట్టు; గడ్డ - గెడ్డ, గండి - గెండి; గడ్డం-గెడ్డం మొ॥

చదువుకోని, శిష్టులయితే ఒత్తులు నిలుపుతారని అంటారు గాని, చదువుకొన్న వాళ్లని చూస్తే ఆ మార్పు గోచరించటం లేదు. దీనికి తోడు దినపత్రికలు కూడ చాలవరకు ఒత్తులు తొలగించాయి. ఉదా : గాడంగా; ప్రౌడంగా వీటిని 'నవీన తద్భవాలు' గా అంగీకరించటం సమురసజీవనం (modern assimilated loan-words)

విధ్య, పధ్యం, మధ్యం (మద్యం) మొదలైన వాటిలో లేని ఒత్తులు చేర్చటం 'అతి ప్రామాణిక' దృష్టికి చెందింది. (hyper-standardisation)

ప్రామాణిక భాషలోని వైవిధ్యాన్ని, ప్రామాణిక భాషావశ్యకతను, ఆచార్య భద్రిరాజువారు నొక్కి వక్కాణించారు. (పై వ్యాసం-పుట 404) ఇదేదో ఒకరిమీద రుద్దినట్లు కాకుండా ఏ వ్యక్తి కా వ్యక్తి తన్ను మాండలికాతీతుడుగా కూడ రూపొందించు

చేసుకొని, తన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకొనే ఉదాత్త కార్యక్రమంగా భావింపచేయాలి. "వర్థమాన భాషల్లో ప్రమాణభాషను మాండలిక సమ్మేళనంతో సులభ గ్రాహ్యం చెయ్యటం అవసరం"[1]

35.15. ఆధునిక ప్రామాణికాంధ్రభాష ఇంకా ఒక స్థిరాకృతిని పొందవలసిఉందని, ఇదమిద్ధంగా దాన్ని ఆపేరుతో వ్యవహరించాలో లేదో స్పష్టపడటంలేదని[2] భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఇది పుష్కరం నాటిమాటైనా అభిప్రాయంలో మార్పేమైనా గోచరిస్తుందా? అంటే పరిస్థితుల్లో మార్పు ఉంటేగదా!

సెంట్రిపెటల్ అభివృద్ధి కన్న, సెంట్రిఫ్యూగల్ అభివృద్ధి బలీయంగా కనిపిస్తుంది. మద్రాసు నుండి విభక్తం కాగానే తెలుగునాడు రాజధాని గుంటూరు - బెజవాడల మధ్య కట్టిఉంటే




ముప్పై చ. మై. విస్తృతిలో ఏర్పడిఉండేది. అప్పుడీ ప్రాంతపు భాష సెంట్రిఫ్యూగల్ శక్తితో అన్ని ప్రాంతాలకు వ్యాపించేది. అప్పుడీ నగరం అత్యంతోన్నత భాషాకేంద్రం అయి ఉండేది. (Supreme Speech Centre) రాష్ట్రంలోని నెల్లూరు, గుంటూరు, చిత్తూరు, కడప, కర్నూలు, వరంగల్, కరీంనగర్, ఖమ్మం, వంటివి

1. తెలుగు భాషాచరిత్ర - ఆం. సా. అ. పుట 404 భ.కృ.

2. "Modern Standard Telugu has yet to take a concrete shape and there is no absolute concensus on what is to be called MS"
A Basic course in Modern Telugu—Introduction,
P, xii — Dr. Bh. Krishnamurthy, 1968

ఉన్నతభాషా కేంద్రాలు (high speech centres) అయిఉండేవి. తక్కిన మహాపట్టణాలు 'భాషాకేంద్రాలు' (speech centres) కాగలిగేవి. తెలుగు రాజభాషగా గుర్తింపబడ్డా ప్రభుత్వం శాస్త్రీయ విషయాలు పట్టించుకోదు.

వాదోపవాదాలవల్ల నూతన సారస్వత భాషగాని, నూతన ప్రామాణిక భాషగాని అభివృద్ధిచెందదు. విద్వద్గోష్ఠులు సిద్ధాంతాన్ని ఇస్తాయే కాని ఆచరణకు తోడ్పడవు. సిద్ధాంతాలు ఎన్నో ఉన్నాయి.

సమర్థులైన రచయితలు, కవులు, శరపరంపరగా వ్రాసి, ప్రజానీకాన్ని శక్తిమంతమైన నవీన భాషతో, ఉత్తేజితం కావించాలి. రవీంద్రుడు నవీన వంగభాషలో కావించినట్లు కావించాలి. గురజాడ వారు అట్టి ప్రయత్నంచేసి యథాశక్తిగా నవీనభాషకు దోహదం చేసారు. [1] ఎందరో ఇప్పుడు చేస్తున్నారు. అఖండ ప్రజ్ఞాధురంధరులైన మహాకవులు, మహారచయితలు ఇంకా ఆవిర్భవించి ఆధునికాంధ్ర ప్రమాణిక భాష నాదరించాలి. అస్తు!

---

1. "I know it is not arguments that will evolve a new literary dialect for Telugu. A great writer must write and makes it. Let us prepare the ground for him." Gurazada AppaRao's preface to Kanyasulkam-2nd edition.

# 9. ప్రాతిదేయ విజ్ఞానము

## (BORROWING)

0. ఒక భాషా సంప్రదాయానికి భిన్నంగా అనుసరింపబడ్డ ...భాషా మాండలిక లక్షణాన్ని భాషాప్రతిదేయత్వ[1] మంటారు. ...inguistic Borrowing)

రెండు భాషణాలకు సన్నిహితత్వం కల్గినపుడు ఈ రెండు ...రస్పరం మార్పులకు లోనుకావచ్చు. ఏ వక్త అయినా మరోవక్త ...ుకరించవచ్చు. ఇది ప్రత్యక్ష ప్రభావం. గ్రంథాలు పఠించేటప్పుడు ...టువంటి ప్రత్యక్ష ప్రభావముండదు. ప్రభావ మొక్కటే పే.

అనుకరింపబడే లక్షణాన్ని ఆదర్శం లేక మాదిరి (model) ...ంటారు. ఇటువంటి లక్షణంగల భాషనుగాని, భాషణాన్నిగాన్ని, ...వ్యక్తినిగాని 'దాత' (donor) అంటారు. ఇట్టి లక్షణాన్ని పొందిన ...గాష 'ప్రాతిదేయకభాష' (borrowing language). ఈ విధా...న్ని 'ప్రతిదేయత్వ' మంటారు. (borrowing) ధనాదులు రుణం ...గొన్నట్లుగా పదాల రుణం తీర్చేదికాదు. గ్రహీత భాషణం ...కొంతమార్పుకు లోనుకావచ్చు.

రెండు భాషణాలు ఒకే తీరుగాఉంటే ప్రతిదేయత్వ ముండదు. విభేదమున్నప్పుడే ప్రతిదేయత్వం[2]

భాషావిషయక ప్రతిదేయత్వమంటే ఒక విధమైన అను కరణం. పసిపిల్లవాడు చేసే అనుకరణానికి దీనికి భేదమేమిటి? పిల్ల

---

1. The adoption of features which differ from those of the main tradition is linguistic borrowing (Bloomfield- p. 445)
2. Hocket's A Course in Modern Linguistics—p.p. 402—403

వాడనుకరించేది తనహృదిలోవాసనా మాత్రంగాఉన్న భావను. కాని పెద్దవాళ్ళనుకరించేది అన్యపైతృకభావను. తనభావణాన్ని మరింత సంపూర్ణం కావించటానికి చేసే ప్రయత్నమిది.[1]

## 36.1 ప్రతిదేయత్వం ఎందుకు కల్గుతుంది ?

ఒక మాదిరి పదాన్నిగాని, ఉచ్చారణాన్నిగాని, విన్నప్పుడు అది తనకు ఆదర్శప్రాయ మైందని భావించి, ఆ పదాన్ని తనసొంత పదంలా వాడుకొన్నందువల్ల, లేదా ఆ ప్రకారంగా తాను ఉచ్చరించినందువల్ల తనకు నలుగురిలో ప్రతిష్ఠా గౌరవాలు పెరుగుతాయనో; లేదా పదిమంది గౌరవార్హులలో తాను ఒకడుగా సంచరించవచ్చుననో, లేదా తనకున్న ఏదోలోపం పూర్తిఅవుతుందనో ఆశగాని, ఆశయంగానికల్గి శ్రోత వాటిననుకరించటమే ప్రతిదేయత్వానికి హేతువులు.

అనుకరణం ఎందుకు చేయాలి? ఇది మన స్తత్వశాస్త్ర సంబంధి ప్రశ్న. 'అనుకరణం హి శిష్టస్య సాధుః భవతి' అని ఆర్షోక్తి. శిష్టానుకరణం సమ్మతమే!

పశువులకు సహజాతాలు (instincts)[2] బ్రతకటానికి తగిన ఆహారాన్ని సంపాదించుకోటంవరకే పరిమితం. అందుకు వాటిఅవయవాలు తగురీతిని తోడ్పడుతాయి. మానవుడారీతిగా తన అవయవాలను

---

1. Linguistic borrowing is really nothing but imitation and the only way in whiich it differs from a child's imitation of its parent's speech is, that here, something imitated which forms a part of speech that is not limited as a whole.

Jesperson's Language, its nature, Development and Origin, —p. 208.

2. Instincts are the inborn inherited mental dispositions, impelling the organism to behave in ways directed to fulfil the biological aims of life.; psychology.

ఆహార స్వీకారాదుల కుపయోగించు కొంటున్నా వాటిని సామాన్య ప్రయోజనాలకే కాక ఉన్నత ప్రయోజనాలకుకూడ మలుచు కొంటు న్నాడు. ఇందుకు 'నాలుక' నే చెప్పాలి. భాషించటానికని ఏ నిర్ణీతావయవం లేదు ఆహార చర్వణానికి తోడ్పడేదిది చివరకు భాషకే పర్యాయ పదమైంది.

మానవుని సహజ ప్రవృత్తులాతనిలో కొన్ని ప్రేరణలు కలిగి స్తాయి. ప్రేరణలు కొత్త భావాల్ని పుట్టిస్తాయి. భావాలు క్రియాత్మక మౌతాయి. అట్టి చర్యలే అలవాట్లుగా మారి ఆతని శీలాన్ని తీర్చి దిద్దుతాయి[1]. మానవునకున్న అనేక ప్రేరణలలో ముఖ్యమైనవి :

i) ప్రతిష్ఠాప్రేరణం (The Prestige motive) :

గౌరవాన్నో ప్రతిష్ఠనో సముపార్జించాలనే ఆశయం ప్రతి దే యత్నాన్ని ప్రేరేపిస్తుంది. యూరోపియనులలో అమెరికాకు వలస పోయినపుడు అనేకాంగ్ల పదాలు రెడ్ ఇండియన్ భాషలలో ప్రవే శించటానికి కారణమటువంటి ప్రేరణే. భారతీయ భాషలలో పూర్వం అనేక సంస్కృత పదాలు చేరటానికి, ఈ మధ్యకాలంలో ఆంగ్ల భాషాపదాలు చేరటానికి కారణం - ఆ భాషలపట్ల ప్రజానీకానికిగల గౌరవభావనే.

ii) కలిసి జీవించే ప్రేరణ (The social unity motive) :

పదిమందితో కలసిజీవించే ప్రేరణ, ప్రతివ్యక్తిలోను సహజంగా ఉంటుంది. ఏకాకి జీవితందుర్భరంకదా! ఎప్పటి కప్పుడు కొత్తకొత్త వాతావరణాలు, పరిచయాలు కలుగుతుంటాయి. అట్టి పరిస్థితుల

1 "Insticts impel; impulses ideate; ideas act; actions habituate habits characterise, and character leads the man to the goal of life". Swami Rajeswarananda's article in kalyan on Service.

కనుకూలంగా జీవించాలంటే వారివారి భాషణ వైఖరుల్ని అనుక రించాలి.

కళాశాలలో చేరిన ఆంగ్ల విద్యార్థి 'me and John are going' అని అనటం మానేసి, I and John are going అని అనకలిగే స్థితి లోకివస్తాడు. తెలుగువాడు 'నిద్రలెగుస్తున్నావ్రా?' అనకుండ 'నిద్ర లేస్తున్నావురా?' అనకల్గాలి. తెల్లారింది అనటంమాని 'తెల్లవారింది' అనాలి. అప్పుడే సాంఘికంగా కొంత గౌరవం. లేకపోతే సాటి విద్యార్థుల్లో హాస్యభాజనుడౌతాడు.

iii) అవసరపూర్ణ ప్రేరణ (need filling motive) :

వక్త తన భాషణంలోని అవసరాన్ని పూర్తి చేసుకోటానికి అన్యభాషాపదాల్ని గాని, అన్యమాండలికాన్ని గాని ఎరవు తెచ్చుకో వచ్చు. ఇది ఏభాషాపదమని ఆలోచించేటంత ఓర్పు వక్తకుండదు. నేర్పుగా ఆసమయానికి స్ఫురించిన ఏ భాషాపదాన్నైనా ఉపయో గిస్తూ అవసరాన్ని తీర్చుకొంటాడు.

టీ, కాఫీ, టొబాకో, షుగర్, కోకో, ఛాకొలెట్, టొమెటో పొటేటో వంటి పదాలు ఆయా వస్తువులతో పాటు ఇంచుమించు ప్రపంచ భాష లన్నింటిలో ప్రవేశించాయి. రైస్, కర్రీ వంటి తమిళ పదాలు ఇంగ్లీషులో చేరాయి.

అన్నివిధాల సుసంపన్నమని భావించబడే సంస్కృత భాషలోకి సుమారు ఏడునందలదాకా ద్రావిడపదాలు చేరాయని ఆచార్య బరో పరిగణించారు. [1] ఇందులో చాలపదాలు ఈ రీతిగా సంస్కృ తంలోని లోపాన్ని పూర్తిచేయుటానికి ఏర్పడినవే.[2]

---

1. Sanskrit – Last Chapter : Borrowing See Prof. T. Borrow.
2. The prestige Motive; the need filling Motive – Hocket's A course in Modern Linguistics : 47.4&5

## 36.2 త్రివిధ ప్రతిదేయత్వాలు :
(Three Types of Borrowing)

బ్లూమ్ ఫీల్డు మూడు విధాలైన ప్రతిదేయత్వాల్ని ప్రతిపాదించాడు :

2. 1. మాండలిక ప్రతిదేయత్వం : (dialect or geographi-Cal borrowing) ఒకే భాష మాట్లాడే ప్రజల్లో మాండలిక భేదాలుంటాయి గదా! ఒక మాండలిక భాషావ్యవహర్తల భాషణాల్లో అన్యమాండలికం చోటుచేసుకొంటే అది 'మాండలిక ప్రతిదేయత్వ' మౌతుంది. ప్రాంతీయమైన వ్యవహారభేదప్రాబల్యం ఇందులో విదితం. ప్రాంతానికి సంబంధించింది. కాబట్టి యిది 'భౌమిక ప్రతిదేయత్వం' కూడ అవుతుంది.

సోదర భాషల్లోలాగా మాండలికాలలోను కొన్ని పైతృకమైన సమాన లక్షణాలున్నా (Shared retentions) కొన్ని వినూత్న లక్షణాలు (Shared innovations) ఉంటాయి. ఒక మాండలికంలోని వినూత్న లక్షణాల్నింకో మాండలిక మనుసరిస్తే అది ప్రతిదేయమే అనాలి. 'సారకాయ' అనే మాండలికానికి చెందిన వ్యక్తి తన వైలక్షణ్యాన్ని ప్రకటించుకోటానికో, లేదా అన్యప్రాంతంలో ఉండివచ్చిన కారణాన్నిబట్టో 'ఆనపకాయ' అంటే, అదే అతని తమ్ముళ్ళు, పిల్లలు అనుసరించి అంటుంటే, క్రమంగా వ్యాపిస్తే అది ప్రతిదేయ మౌతుంది.

పదాలనేకాక ఒక మాండలికోచ్చారణాన్ని అన్య మండలాల లోని వాళ్ళు అనుసరిస్తే అదీ ప్రతిదేయమే.

ఒక వర్గంవారు, తమకంటె సాంఘికంగా, సాంస్కృతికంగా ఉన్నతమైన వర్గాన్ని అనుకరిస్తారు. ఒక వ్యక్తి తన వృత్తిలో

అత్యున్నత స్థాయిలో ఉన్న వ్యక్తి వృత్తాన్ని అనుసరిస్తాడు. ఈ వృత్తంలో ప్రముఖమైంది ఆతని భావనం. ఈవిధంగా తనకన్న పెద్దల్ని అనుకరించినందువల్ల తానే పెద్దఅవుతాడు. తాననుకరించే పెద్దల పరిచయ భాగ్యం లేనివారికి తానే అనుకరణ పాత్రుడౌతాడు. ఈరీతిగా ప్రతివ్యక్తి వ్యక్తావ్యక్తంగా అనేక ప్రజానమూహాల కను సంధానకర్త అవుతుంటాడు. [1]

ఆంగ్లంలో 'అయిదర్' (either) 'ఎయ్‌దర్' (either), ద (the) ది (the) అనటంలో ఏ ఉచ్చారణం ఘనమైంది? 'అయిదర్' అనే వాళ్ళు 'ఎయిదర్' అని అంటుంటే అదే ఘనమైంది. అదే ప్రతిదేయత్వమంటే.

అత్యున్నత భాషాకేంద్రాలలోని (Supreme speech Centres) ప్రజల్ని, ఉన్నత భాషాకేంద్రాలలోనివారు (High Speech Centres) అనుకరిస్తారు. వీనిని భాషాకేంద్రాలవారు (Speech - Centres) అనుకరిస్తారు. ఈ విధంగా అనుకరణం లేదా ప్రతిదేయత్వం అవిచ్ఛిన్నంగా సాగుతునే ఉంటుంది.

వ్యాపారం, పరస్పరం ఇచ్చిపుచ్చుకోటాలు, ఎక్కువయ్యే కొలది ఈ ప్రతిదేయత్వ మధిక మౌతుంటుంది. ఇంగ్లాండులోని లండన్ నగరవాసులు, వారి వేషభాషాదులు; అట్లాగే ఫ్రాంసులోని పారిస్ నగరవాసులు, తక్కినవారికి శిరోధార్యులు.

## 2.2 సాంస్కృతిక ప్రతిదేయత్వం (Cultural borrowing) :

అన్యభాషా పదాల్ని ఎరవుగొనటం 'సాంస్కృతిక ప్రతిదేయత్వం'. సాంకేతిక నైపుణ్యం, యుద్ధవిధానాలు, మతాచారాలు, అలంకరణాదులు ఒకరినుండి ఒకరు గ్రహిస్తుంటారు. దీన్నే మానవ

1. Every speaker is a mediator between various groups
— Bloomfield p. 477

వంశ శాస్త్రకారులు (ethnologists) సాంస్కృతిక వ్యాప్తి అంటారు. (Cultural diffusion)[1] ఇట్టి వ్యాప్తిని పటాల ద్వారా కూడ వ్యక్తం చేయవచ్చు.

ఫ్రెంచి భాషను మాట్లాడగల ఆంగ్లేయులు, ఫ్రాంసు దేశంలో ఉత్పన్నమయ్యే వస్తువుల్ని, ఫ్రెంచిపదాలతోనే పరిచయం చేస్తారు. అటువంటి పదాల నుచ్చరించటానికి అలవాటుపడని దేశీయులు అందు లోని విలక్షణ ధ్వని స్థానంలో, సమీపంలోని దేశీయ ధ్వనిని ప్రవేశ పెడతారు. ఇలాంటిదాన్ని 'ధ్వన్యాదేశం' [2] (Phonetic substitution) అంటారు. 'కాఫి' అనే ఆంగ్లపదాన్ని సామాన్య ప్రజ 'కాపీ' అని ఉభయోష్ఠ్యంగా పలుకుతుంది. ఒక ఆచార్యుడు 'లజ్జా విహీనుడు' అనే పదంలోని 'జ' కారాన్ని దన్తమూలీయంగా ఉచ్చరించటం ఆయన సంస్కారబలం. వ్యస్తంగా 'లజ్జ' ను దన్తమూలీయంగా ఉచ్చరిస్తే అది 'తద్భవం' కావచ్చు. సిద్ధసమాసాలలో దన్తమూలీయోచ్చారణ ముండదుకదా! అందుకే చిన్నయసూరి 'రాజు' శబ్దాన్ని దన్తమూలీయంగా తెలుగువారు ఉచ్చరిస్తున్నా దాన్ని సంస్కృత సమంగానే పరిగణించాలని ఆశించాడు.[3] ధర్మరాజు, మృగరాజు వంటి సిద్ధసమాసాలలోను దన్తమూలీయోచ్చారణం శిష్టోచ్చారణంలోను ప్రశుతం. ఇలాంటి ధ్వన్యాదేశాన్ని పూర్తిగా వర్ణ వికారంగా భావించరాదనే సూరి అభిమతం, భాషాశాస్త్ర సమ్మతం. ఇటువంటిదే 'చాటుకవిత' 'చాటుపద్యాల'లోని 'చ'. దీన్ని దన్తమూలీయంగా పలుకుతారు.

1. Bloomfield p. 445
2. In phonetic substitution, the speakers replace the foreign sounds by the phonemes of their language, "Bloomfield p.446
3. బా.వ్యా. సంజ్ఞా. 10 సూ.

ఫ్రెంచి భాషలోని అల్పప్రాణాల్ని, ఆంగ్లేయులు మహాప్రాణాలుగా ఉచ్ఛరించటం; అనునాసికాల్ని నిరనునాసికంగా పలకటం ఇట్టి 'ఆదేశపద్ధతి'కి చెందినవే.[1]

ప్రతిదేయత్వం ఎక్కువైతే అన్యభాషా వర్ణ ప్రభావం అధికమౌతుంది. అందుచేత ఇతర భాషాపదాల్ని తమిళాది భాషలు యథాతథంగా తీసుకోక, తమ భాషావర్ణవ్యవస్థ కనుకూలంగా మార్చుకొంటాయి. ఆంధ్రభాష సంస్కృత భాషాపదాల్ని యథాతథంగా స్వీకరించటంచేత[2] దాని వర్ణవ్యవస్థ పెద్దదైంది. 36 నుండి వర్ణాలు 55 కు పెరిగాయి. అన్యవిధంగా ఉచ్చరిస్తున్నా సంస్కృత పద్ధతిలోనే ఇవి తెలుగులో వ్రాయబడటంచేత వీటిని బ్లూమ్‌ఫీల్డ్ 'గ్రాఫిక్ లోన్స్'[3] అన్నాడు. ఉదా : ఋతువు, క్షత్రము, రథము, మొదలైనవి. వీటినే బ్లూమ్‌ఫీల్డ్ ఇంకో సందర్భంలో 'అధ్యయన పదాలు' (learned words) అంటారని4 పేర్కొన్నాడు.

వ్రాత ఉచ్చారణాన్ని ప్రభావితం చేస్తుందనటానికి ఊరి పేర్లు నిదర్శనం. ఆంగ్లోచ్చారణానికి విధేయంగా రాజమండ్రి, కోకినాడ, ఆడోని, మద్రాసు, అనంతపూర్, గుట్టిఅని విచిత్రంగా పలుకు

---

1. This phonetic substitution will vary in degree for different speakers and on different occasions; speakers who have not learned to produce French phonemes are certain to make it. The historian will class it as a type of adaptation, in which the foreign form is altered to meet the fundamental phonetic habits of the language." Bloomfield, pp. 445–446

2. 'అన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్' —
ఆంధ్రశబ్దచింతామణి సంజ్ఞా - 5

3 In the languages of India, graphic loans from Sanskrit are known as Tatsama (Like – to – it) p. 495.

4. These borrowings from the written languages are known as learned words'—Language : p. 491.

తుంటారు నాగరికులు. ఇట్టివాటిని 'స్పెల్లింగ్ లోన్సు' (Spelling-loans) అనవచ్చు.

సంస్కృతాంధ్రవర్ణాలు క్షీర నీరన్యాయంగా కలిసిపోయాయి. సాంఘికంగా 'కాఫీ' మనజీవితాన్ని ఎంతగా ప్రభావితం చేసిందో, అంతగా అందులోని దంతమూలీయోష్మఫకారం మన ఉభయోష్మ్య 'ఫ'కారాన్ని ప్రభావితం చేసింది. ఒక సంస్కృత కళాశాలాధ్యక్షుడు 'మన ఫలితాలు ప్రచురించారా ?' అన్నాడు. శిష్ట వ్యవహారమే ఇలావుంటే ఇక సామాన్యులమాట చెప్పాలా ? కొట్ల వారు 'ఇచ్చట కాఫీపుస్తకాలమ్మబడును' అని బోర్డుపై వ్రాయటం గమనించి ఆశ్చర్యపడ్డాను. 'కఫం' 'ఫలం' 'సఫలం' 'విఫలం' 'సుజలాం సుఫలాం' అనే పదాల్లో ఆంగ్ల ఫకారమే విశ్రుతం. సంస్కృతం ద్వారా తెలుగులో స్థిరపడ్డ ఈ ఉచ్చారణ వ్యవస్థ ఆంగ్లోచ్చారణం చేత పూర్తిగా మారటం గమనార్హం.

## 2.21. అనువర్తిత ప్రతిదేయత్వం (Loan translation)

విదేశీయ పదాల్ని యథాతథంగానో, యత్కించిద్వికారంతోనే, స్వీకరిస్తుంటాం. కాని అలా స్వీకరించటానికే కతిపయ భాషా వ్యవహర్తలు సన్నద్ధులు కారు. కొందరు సాధ్యమైనంతవరకు తమభాషలో ఆ భావాన్ని ఇముడ్చుకోటానికి ప్రయత్నిస్తారు. ఆ పదం శ్రవణ సుభగంగా ఉంటే అది చెలామణి అవుతుంది. 'లోన్ వర్డ్' అనేదే జర్మన్ భాషలోని (Lehn wort) అనేదానికి అనువర్తిత ప్రతిదేయం.

ఈ అనువాదాలు జాతికి గల కల్పనాశక్తిని కూడ నిరూపిస్తాయి. 'ట్రైన్' అంటే 'మరబండి' అన్నాడొక్కడు మొదట చూచినపుడు. దానిమీద 'మరాబండి దాడు జూడండి' అని ఒక జానపదుడు. ఓడ పరిచితమే. స్టీమరున్ను చూచినపుడు ఓడల్లాంటి

దీనిలో అదనంగా కనిపిస్తున్నది పాగ. అందుచేత దీన్ని 'పాగ ఉడ' అన్నాడు. ఇంజన్ను — ఆవిరియంత్రమని, స్ప్రిన్గుకు 'రోదసీ నౌక' అని వ్యవహరించటంలో ఎంతో స్ఫూర్తి గోచరిస్తుంది.

కాని 'వైట్ పేపరు' (పార్లమెంటుకు అత్యంతక్లిష్ట పరిస్థితుల్లో ప్రభుత్వం సమర్పించేది.) అనేదాన్ని 'శ్వేతపత్రం'అంటేఅర్థం స్ఫురించటం కష్టం. ఇది 'తెల్ల కాగితం' కంటె భిన్నమైంది కాబట్టి, దీనికో నిర్వచన మిచ్చుకోని రూఢం చేసుకోవాలి. 'సంస్కృతి' అనేది కల్చర్‌కు, పార్లమెంటుకు—లోక్ సభ అని, ప్రెసిడెంటును రాష్ట్రపతి అని ఇలా వ్యవహారప్రసిద్ధి కెక్కుతున్నాయి - అనూదిత ప్రతిదేయ పదాలు.

కొన్ని కొన్ని అనువాదాలు, హాస్యజనకంగా ఉండకపోవు. ఉదా : 'టై' అనేదాన్ని కంఠకౌపీనమంటేను, వైర్ లెస్సును వితంతువంటేను నవ్వుకోకుండా ఉండగలమా ? రైల్వేస్టేషన్ను — అయోమయమార్గ కేంద్రమంటే అయోమయంగానే ఉంటుంది.

2. 22. ప్రాచీన కాలంనుండి తమిళులు ప్రదర్శించే అభినివేశం, ఆగ్రహం ఈ సందర్భంలో స్మరించాలి. తక్కినవాళ్ళకు అనువాదం చేయాలని లేదు. కుదరకపోతే మూలంలోని పదమే వాడేస్తారు. కాని వాళ్ళారీతిగా వాడరు. స్వకీయ పదకల్పనంచేసి తీరుతారు. సంస్కృత వ్యాకరణ శాస్త్రసంజ్ఞలే భారతీయ భాషలన్నింటిలో యథాతథంగా చాలవరకు ప్రవర్తిల్లుతుంటే, తమిళులు వర్ణనాత్మకంగా వాటిని తమ భాషలో కనువదించుకోటం మెచ్చుకోవాలి. 'సంధి' అనేది అల్పాక్షరాల్లో అనల్పార్థాన్నిచ్చే పదం. దీన్ని మరికొన్ని సంజ్ఞలతోపాటు 'అంతర్జాతీయ సంజ్ఞగా' తీసుకొన్నామని బ్లూమ్‌ఫీల్డ్ పేర్కొన్నాడు.[1]

1. This term, like many technical terms of linguistics, comes from the ancient Hindu grammarians. Literally, it means 'putting together' Bloom field; p. 186.

'పుణర్చి' అని అనువదించుకొన్నారు. 'కూడలి' లేక 'కలయిక' అర్థం. తెలుగులో వ్యవహరిస్తే, చప్పరిస్తారు. ఎఱుత్తు-అక్షరం ఋ అనే ధాతువుకు లిఖింపబడింది అని వ్యుత్పత్తి) క్రియ - విన్నై, గాపం - తొరై (గై) విభక్తి-వేట్రుమై.

అమెరికన్ ఇండియన్లుకూడ అన్యభాషాపదాల్ని యథాంగా కాక వాటిని తమ భాషల్లోకి అనువదించుకొనే అలవాటు వారట! ఉదా :

విస్కీ - ఫైర్ వాటర్; ఎలక్ట్రిసిటి - థర్డర్ గ్లాస్సు
టెలిఫోన్ - లిటిల్ వైర్ స్పీచ్

ఒకవేళ విదేశీయపదమే వర్ణనాత్మకంగాఉంటే, ఆవర్ణనమే నువదింపబడుతుంది.[1]

గ్రీకు, లాటిన్ భాషలలో వర్ణనాత్మకంగా ఉన్నపదాలే చాల రకు యూరోపియన్ భాషలలోకి అనువదింపబడ్డాయట. ఉదా : ొన్ మన్ సెస్ : కలిసి తెలుసుకొనుట[2].

మొత్తంమీద సాంస్కృతిక ప్రతిదేయత్వమంటే ఒక దేశం ాని, భాషగాని ఇంకో దేశానికి. వారి భాషకు గురుత్వాన్ని, ార్గదర్శకత్వాన్ని వహించటమే.

ఆంగ్లభాషకులాగా అన్యభాషాపదాల్ని యథాతథంగా ినలో ఇముడ్చుకోటంలో నేర్పు మరే యూరోపియన్ భాషకు లేదంటారు[3].

---

1. American Indian languages resort to descriptive forms more often than to borrowing. Thus they render 'wiskey' as fire-water 'or' railroad 'as' fire-wagon' etc. Bloom field — p. 455
2. Bloomfield, p. 456.
3. English differs from most European languages in having a much greater propensity to swallowing foreign words raw as it were, than translating them, Jesperson-Language, Its Nature Development p. 215

స్త్రీల వేషాలంకరణ విలాసజీవితానికి సంబంధించిన పదజాలాన్ని ఫ్రెంచి భాషనుండి; ఆహార విహారాలకు సంబంధించిన పదజాలాన్ని; వేదాంత భౌతిక శాస్త్రసంబంధి పదాల్ని, జర్మన్ నుండి; సంగీతశాస్త్ర పదజాలాన్ని ఇటాలియన్ భాషనుండి; భారతీయభాషలనుండే కాక రెడ్ ఇండియన్ భాషలనుండికూడ అనేక రంగాలకు చెందిన పదాల్ని ఆంగ్లభాష ఎరవు తెచ్చుకొని అంతర్జాతీయ ప్రతిపత్తిని సంపాదించుకొన్నది. షుగర్, పెప్పర్, కారఫ్, కాఫి, టీ, టొబాకో మొదలైన ఆంగ్ల పదాలు ప్రపంచ పరివ్యాప్తినే పొందాయి.

స్కాండినేవియన్ భాషలు, రష్యన్ భాషనుండి, జర్మన్ భాష నుండి వాణిజ్య, నౌకావ్యాపారాదికానికి సంబంధించిన పదాల్ని ఎన్నింటినో ఎరవుగొన్నాయి.

తెలుగు భాషలోకి ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు, హాలండ్ భాషాపదాలు పరిమితంగాను, ఆంగ్ల పదాలు అపరిమితంగాను ఈ మధ్యకాలంలో చేరాయి. అర్వాచీన కాలంలో అరబిక్, పారసీకాది భాషా పదాలు ఎన్నో చేరాయి. ప్రాచీన కాలంనుండి సంస్కృత ప్రాకృత భాషాపదాలు తత్సమ, తద్భవరూపాల్లో తెలుగులో చేరి, ఆ భాషను సుసంపన్నం చేసాయి. ఎరవుగొనే భాషగా, ఆంగ్లానికి దాని ఆంధ్రానికి[1] ఎంతో కీర్తి ఉంది. (Borrowing Language).

---

1. You cannot keep out foreign words; as you keep out foreign manufactured goods. Perhaps Telugu accepts them more easily than any other Indian Languages and this will certainly help to make it a rival to Hindi, in teaching science, medicine and Engineering ; The Hindu : 27-11-1958 J.B.S. Haldane.

— It is adaptable, dynamic, absorptive, grammatically simple and euphonically beautiful, when using foreign words. It has never suffered from narrow provicialism :

G. Homefield, Mc. Heod, Ph. D.

Letter to the Editor—The Hindu 6th July 1958.

చూ. తె. వ్యా. వి. పుటలు — 349—356.

### 2. 3. సంసర్గ ప్రతిదేయత్వం (Intimate borrowing) :

ఒకే జాతి రెండు భాషల్ని మాట్లాడుతున్నప్పుడు ప్రతిదేయత్వం కల్గుతుంది. ఇందులో ఒకటి తనమాతృభాష. ఇంకోటి రాజకీయ ప్రాబల్యం కలది. ఆ జాతిని జయించిన జాతివారిభాష. లేదా అన్యప్రాంతానికి వలసపోతే ఆ ప్రదేశంలో అదివరకే అధిక ప్రాబల్యంగల్గి వ్యవహృతమౌతున్న భాష. ఇందు మొదటిదానికి ఉదాహరణం ఆంగ్లం. రెండోదానికి తమిళనాడులోని రాజపాలియం ప్రాంతానికి తెలుగుదేశం నుండి వలస పోయిన క్షత్రియ కుటుంబాలవారు మాట్లాడే తమిళం. తిరువనంతపురం, సేలం మొదలైన ప్రాంతాలలో ఉన్న తెలుగువారు మాట్లాడే ఆ ప్రాంతపుభాష. ఇండ్లలో వాళ్ళు తెలుగు మాట్లాడుతారు. బయట ఆ ప్రాంతభాష వ్యవహరిస్తారు.

సంసర్గ ప్రతిదేయత్వం ఎప్పుడు ఏకపక్షంగానే ఉంటుంది. విజేతలు, విశేషాధికార సంపన్నులు అయిన వారిభాష ఉన్నత భాష, ప్రాబల్యంగల భాష, (Upper or dominant language) ఈ భాషాప్రాబల్యంక్రింద వ్యవహృతమయ్యే భాష 'నతభాష', 'బలహీనభాష' (Low language)

సుమారు రెండువందల సంవత్సరాలు భారతదేశంలో ఆంగ్లభాష, ఉన్నతము, ప్రాబల్యముగల భాషగా ఉంటే, భారతీయ భాషలు దాని అడుగులకు మడుగులొత్తుతూ వచ్చాయి. ఇప్పటికి స్వాతంత్ర్యం వచ్చి మూడు దశాబ్దాలు పైబడ్డా ఆదుర్దశ తొలగలేదు. ఇప్పుడు సాంస్కృతికము, అంతర్జాతీయము అయిన భాషాప్రతిపత్తితో బైతాయించింది. తగినట్లుగా రాష్ట్రభాష రూపొందక పోవటంచేత దాని అవసరం అనివార్యమౌతున్నది.

ఉన్నత భాషాపదాలు వాడటం తనకెంతో గౌరవప్రతిష్ఠల్ని చేకూరుస్తుందనే నమ్మకం నతభాషావ్యవహర్తల్లో అధికం. ఇవరకు

క్షేమసమాచారాలు తెలుపుకొనే జాబులుకూడ ఆంగ్లంలో రచింపబడటం శోచనీయం. 'ఇద్దరు తెల్లువాండ్రు తమ యింటివి కష్టసుఖాలు తెల్పుకోనద్దిర మాతృభాష తగాదా!' అని కవులు విలపించవలసిన దుస్థితి. ఒకవేళ నతభాషనే మాట్లాడుతున్నా దానినిండా ఉన్నత భాషాపదాలే!

అమెరికాకు వలస పోయిన వారిలో కొన్ని కుటుంబాలవారు తొలుత తమతమ భాషలలోనే వ్యవహరించే వారట. ఆంగ్ల పదాల్ని పరిహరించేవారట. కాని క్రమంగాఅందరు ఆంగ్లాన్నే వ్యవహరించవలసిన ప్రాబల్య మేర్పడింది. వలసిపోయినవాడు భాషా విషయంలో ఏకాకియై, తన భాషను సాంస్కృతికస్థాయి తక్కువైనట్లు గ్రహించినవుడుగాని; ఆంగ్ల భాషను వ్యవహరించే స్త్రీని పెండ్లాడినవుడుగాని తన మాతృభాషను వదలి ఆంగ్లాన్నే మాట్లాడాడు. అతని బిడ్డలకు ఆంగ్లమే శరణ్యమౌతుంది. అమెరికాలో ఈరీతిగా ఆంగ్లం ప్రాబల్యం వహించింది. డచ్, ఫ్రెంచి, స్పానిష్, భాషల్ని అధఃకరించి ఆంగ్లం ప్రవర్తిల్లింది. ఆయా భాషాపదాలు కొన్ని ఆంగ్లంలో ప్రవేశించాయి

## 2. 31. విచిత్ర ప్రతిదేయత్వం : (Abberant borrowing)

బ్లూమ్ ఫీల్డ్ [1] ఇటువంటి ప్రతిదేయత్వాన్ని పేర్కొన్నాడు. జిప్సీలు తమ భాషల్ని మరచిపోయి, ఉప ప్రామాణికాంగ్లాన్ని మాట్లాడుతారు. ఈభాషలో అక్కడక్కడ తమ భాషాపదాల్ని (అన్ని కొన్ని వందలు మాత్రముంటాయి) ఆంగ్లోచ్చారణంతో పలుకుతారు. ఈ విషయం వింటుంటే ఈసంగతి జ్ఞప్తికివస్తున్నది. తెలుగుదేశంలో కొన్ని మహమ్మదీయకుటుంబాలు, తెలుగు మాటల్ని ఉర్దూలాగా అదే ఉచ్చారణతో అక్కడక్కడ ఉర్దూపదాలతో మిళితంచేస్తారు.

---

1. Bloomfield p. 471.

ఇందులో ప్రసిద్ధవాక్యం - "వందిర్ మీాది చొప్పాగడ్డి బైస్కు-దాలొరే". తమ భాషానుగతమైన యాసతో, అన్యభాషాపదాన్ని అక్కడక్కడ తమపదాలతో మిళితం చేయుటం విచిత్రమనక తప్పదు.

## 2.32 బాలభాషణం (Baby Talk)

మనం చిన్నపిల్లలతో మాట్లాడేటప్పుడు వాళ్ళ పదజాలంలోని పదాలు ఆపి ఆపి వాళ్ళు మాట్లాడే ధోరణిలోనే వాళ్ళను పలకరిస్తాం. 'లాలపోసుకొంటారా? తాయం తింటారా?' అని ప్రశ్నిస్తాం. ఇదే రీతిగా ఆధిపత్యంగల యజమానుల భాషను, బానిసలు నేర్వలేనప్పుడు యజమానులే బానిసలతో బానిసల భాషాధోరణిలోనే మాట్లాడుతారు. దానిని 'బాలభాషణం' (Baby Talk) [1] అని బ్లూమ్ ఫీల్డ్ వ్యవహరించారు. ఇన్ జక్షన్ అంటె సూది. ముల్లు - పెండ్యూలమ్ ఇత్యాదులు.

ఈ విధంగా అనేక విధాలయిన ప్రతిదేయత్వాల్ని బ్లూమ్ ఫీల్డ్ పేర్కొన్నారు. ఇట్టివి మనభాషలోకూడ ఉంటాయేమో పరిశీలించటాని కివి మార్గదర్శకాలు.

37.0. హాకెట్ మహాశయుడు అయిదు విధాలైన ప్రతిదేయత్వాలు పేర్కొన్నాడు. వాటినికూడ సంక్షిప్తంగా తెలుసుకోవాలి.

## 37.1 ఆగత పదాలు (Loan Words)

ఒక వస్తువుతోపాటుగాని, ఆచారంతోపాటుగాని దానికి సంబంధించిన పదంకూడ దాతభాషనుండి గ్రహీత భాషలోనికి ప్రవేశి

1. Speakers of a language may make so little progress in learning the dominent speech, that the masters, in communicating with them resort to "baby talk". This "baby talk" is the master's imitation of subjects, in correct speech.
— Bloomfield, p. 472.

స్తుంది. అట్టివే 'ఎరవుపదం'. సామాన్యంగా ఎరవుగా తీసుకొనేవి అనిబద్ధపదాంశాలుగానే ఉంటాయి. ఉదా : కాగితం, కలం, కాపి, కాఫీ మొదలైనవి. నిబద్ధపదాంశాలు చాల సకృత్తుగా ఉంటాయి. ఉదా : పనిమంతురాలు ఖానిసత్వం, పోగులమయం మొదలైనవి.

## 37.2 ఆగత పరివృత్తులు (Loan-shifts)

నూతనవస్తువులు కాని, ఆచారంగాని తారసిల్లితే వాటితో పాటు పైరీతిగా వాటిని తెలియజేసేదాన్ని కూడ స్వీకరించకుండ వాటిని స్వకీయభాషాపదాలతో వ్యవహరిస్తారు కొందరు. అట్టివే 'ఆగత పరివృత్తులు' (loan shifts) వీటినే బ్లూమ్‌ఫీల్డ్ 'అనువర్తిత ప్రాదిదేశము'న్నాడు. (చూ. 36.2లో 21) మొత్తంమీద ఆ క్రొత్తవస్తువుల మూలంగా ఒక క్రొత్త పదకల్పన జరుగుతుంది ఈ కల్పనం అన్యభాషాపద ప్రభావంగా ఏర్పడుతున్నది కాబట్టి యిట్టి దాన్ని 'ఆగత పరివృత్తి' అనాలి. ఇందుకు పూర్వమే ఉదాహరించాం. (చూ. 36.2లో 22)

## 37.3 ఆగత మిశ్రాలు (Loan blends)

ఆగత పదాలలో కొంతభాగం పరివృత్తి కలిస్తే ఏర్పడేది ఆగత మిశ్రం. (1+2) ఉదా: ఎక్సర్‌సైజ్ పుస్తకం (Excercise book) గవర్నమెంటు వైద్యశాల (Government hospital) లింగ్విస్టిక్సు పాఠ్యగ్రంథం (Linguistics text book ) భాషా శాస్త్ర పాఠ్యగ్రంథమంటే పూర్తిగా ఆగత పరివృత్తి అవుతుంది. హోటల్ భోజనం (hotel meal) అయితే వీటిలో సంస్కృత పదాలుకూడ ఆగతాలే కదా అనే సందేహం కలుగుతుంది. అవి ఎరవుగొన్నవనే భావన పోయింది. మన భాషలో కలిసిపోయాయి. ఆంగ్ల పదాలకు సందర్భాల్లో పరివృత్తాలుగా వ్యవహరిస్తున్నాయి.

## 37.5 ఉచ్చారణ ప్రతిదేయత్వం
## (Pronunciation borrowing)

ఒక భాషా వ్యవహర్త సుపరిచితమైన ఇంకో వ్యవహర్త భావణవిధానాన్ని అనుకరిస్తే అది 'ఉచ్చారణ ప్రతిదేయత్వం'. ఇందుకు కారణం ప్రతిష్ఠా ప్రేరణమే. తక్కువహోదాలో ఉన్న వాడు, తాపీగా దీర్ఘాలతో 'ఏమండీ! ఎప్పుడువచ్చారు?' అని పలకరించటం.

## 37.6 వ్యాకరణ ప్రతిదేయత్వం (Grammatical borrowing)

సంస్కృతంలో అకారాంతశబ్దాలపై మతుబర్థంలో - వంత అని, అకారేతరాలపై-మంత అనే పదాంశాలు చేరుతాయి. పని అనేది తెలుగుపదమైనా 'ఇ' కారాంతం కాబట్టి దీనిపై మంత అనే పదాంశంచేర్చి 'పనిమంతురాలు' అనే పదకల్పనం చేయటం చాల చిత్రమైంది. దాన్ని సరిదిద్దాలన్నా వీలుపడదు. 'మయట్' ప్రత్యయం ప్రాచుర్యార్థంలో తెలుగు పదాలపై ప్రచురంగా వాడబడుతున్నది. ఉదా : పోగులమయం, మాటలమయం, నెత్తురుమయం మొదలైనవి[1]. ఉపమ్నార్థంలో తెలుగులో వాడబడే బంటి ప్రత్యయం, 'కటి' అనే సంస్కృత పదంపై చేర్చి 'కటి బంటి' అని వ్యవహరించటం నిరూపితం[2]. నిర్మోహమాటం, అతిమంచి, అతితెలివి, అతితక్కువ ఇత్యాదులిట్టివి. అన్నిటికన్నా ఆశ్చర్యం గొల్పే ఉదాహరణం ;- 'రుబ్బింగ్' అనేపదం. 'రుబ్బు' అనే తెలుగు ధాతువుపై ఇంగ్ (ing) అనే ఆంగ్లపదాంశాన్నిచేర్చి 'రుబ్బింగ్' అనే పదకల్పనం కావించారు. గుంటూరులో చాలాచోట్ల 'పిండి రుబ్బింగ్ మిషన్'

---

1. ప్రౌ. వ్యా. తద్ధిత. 18.
2. 'కటిబంటి నెత్తురుల్ కాలువల్ కార' రామాభ్యుదయం ప్రౌ. వ్యా. తద్ధిత. 17.

అనే బోర్డులు చూచి ఆశ్చర్యపడ్డాను 'రబ్బుడు' అని అనవచ్చు కాని ఇంగ్ అనే పదాంశముతో గల పరిచయం ఈరీతి పదకల్పనకు తోడ్పడినట్లు తోస్తుంది. వినబుల్, తినబుల్, కొట్టబుల్, తిట్టబుల్ అని చమత్కారంగా అంటుంటారు. వినటానికి ఎబ్బెట్టుగా లేదు. ఏమైనా నిబద్ధపదాంశాలు చాల పరిమితంగానే ఎరవు తెచ్చుకోటం జరుగుతుందే భాషలోనైనా. నైఘంటికస్థాయిలోనే అధికంగా ప్రతిదేయత్వం కలుగుతుంది. వ్యాకరణస్థాయి చాల నకృత్తు.

### 37.61 అనువర్తిత వ్యాకరణ ప్రతిదేయత్వం

(Translated grammatical borrowing)

ఇట్టిది హాకెట్ పేర్కొనలేదు. కాని ఊహించవచ్చు. ఒక భాషలోని ఒక పదాంశాన్ని అనువదించుకోని ఇంకో భాషలో వాడుకోటాన్ని ఈ పేరుతో వ్యవహరించవచ్చు. ఉదా: ఆంగ్లంలో 'a' అనే ఆర్టికల్ ఏ. వ. లోని నామరూపాలకన్నిటికి వాడాలి. 'దిస్ ఇజ్ ఎ బుక్' అనాలి. తెలుగులో 'ఇది ఒకపుస్తకం' అని అంటే అది ఆంగ్లవాక్యానువాదం. 'ఒక' అనేది అనువర్తిత వ్యాకరణ ప్రతిదేయత్వం. 'అది ఒకపూలతోట'. 'బ్రతుకు ఒకపూలబాటకాదు' ఇత్యాదుల్లో ఆధునికులిట్టి ప్రతిదేయత్వాన్ని చేస్తుండటం గమనించవచ్చు.

ఇదే రీతిగా 'and' అనేదాన్ని 'మరియు' అని అనువర్తించుకొని వాడటం. 'కాఫీ మరియు భోజనశాల' 'రాముడు మరియు కృష్ణుడు' వచ్చారు వంటివి అసకృత్తుగా తగులుతుంటాయి.

సంస్కృతంలోని చతుర్థీవిభక్తిని 'కొఱకు' అను తెనుగువిభక్తికిగాను; పంచమిని 'వలన' అనే విభక్తిగాను అనువదించుకోటం ఇట్టి ప్రతిదేయత్వమే. ఉదా; రామునికొఱకు కన్యనిచ్చెను; అధ్యా

వక్తునివలన విద్యబడెను. ఇట్టి వాక్యాలు ప్రారవ్వతభాషల్లోనే ఉంటాయి. వ్యవహారంలో ఉండవు.

### 37.7. వాక్యనిర్మాణ ప్రతిదేయత్వం (Syntax borrowing)

నైఘంటిక ప్రతిదేయత్వం కన్న (lexical borrowing) వ్యాకరణ ప్రతిదేయత్వం (grammatical borrowing) తక్కువ. అంతకన్న తక్కువ వాక్యనిర్మాణ ప్రతిదేయత్వం (Syntax borrow-ing) అంటుకే హాకెట్ దీన్ని పేర్కొలేదేమో!

తెలుగులో ప్రాఙ్నన్నయ యుగశాసనాలలో రెండుచోట్ల యత్తదర్థకోపయోగం కావించిన వాక్యాలు లభించాయి. (Relative construction) ఇట్టివాక్యనిర్మాణం సంస్కృతంలోను, ఆంగ్లాది భాషలలోను అధికం. శాసనప్రయోగాలు : i) వేంగి నాట్టికెవ్వరు రాజులైరి, వారుంబూర్వక్ స్థితిందప్పక పాలించువారు- క్రీ.శ. 1006 ఆహారమల్ల దేవుని కాలానికి చెందిన శాసనం ii) వక్రబు వచ్చువారు... వారణాసి వేకవిళానఉచ్చువారు.

నన్నయ ఇట్టి ప్రయోగాలాధారంగానే తన భాషలో 25 ప్రయోగాలు కావించాడని పరిశీలకులు లెక్కగట్టారు (ఆంధ్రభాషా వికాసం- ద్వి. ము. పుట 152)

37.71. (కర్మార్థక) కర్మార్థక నిర్మాణం : (passive construction) ఇట్టిది సంస్కృతం ఆంగ్లంవంటి ఇండో యూరోపియన్ భాషలలో అధికం. 'వైదంబుళచేత పట్టమ్ కట్టుబడినవారు' వంటివి రెండే పద్యనుబంధంతో కనిపించాయి, శాసనాల్లో. నన్నయ కావ్యభాషలో ఇట్టివి 51 దాకా ఉన్నాయి. (ఆం. భా. వి. పుట 154)

37.72 సంస్కృతాంగ్లాది భాషల్లో అస్త్యర్థక క్రియా ప్రయోగమధికం. ఆంగ్లంలో వీటిని to be forms అంటారు. ప్రాచీనాంధ

శాసనాలలోను నిట్టివి బాగా పొడకట్టాయి. ఉదా : అశ్వమేధమ్మున ఫలమ్ములగు; పాతకున్ను అగు ఇత్యాదులు. నన్నయభాషలోను ఇట్టివి విశేషంగా పొడగట్టుతాయి. 'రమ్యమగు సభాపర్వమిలన్, ధర్మార్థసంసిద్ధియగున్, గాకున్న దయ్యేనేని' ఇత్యాదులు (ఆం. భా. వి. పుటలు 149, 150)

37.73 సంస్కృతంలో విశేష్యాలేలింగంలో, ఏవిభక్తిలో, ఏవచనంలో ఉంటాయో విశేషణాలుకూడ అవే లింగవచన విభక్తుల్లో ఉంటాయి. తెలుగు మొదలైన ద్రావిడ భాషల్లో ఇటువంటి నియతి లేకపోయినా కావ్యభాషలో కనిపిస్తే అది ప్రతిదేయమే అవుతుంది. ఉదా : 'అనమత్సురాసుర మకుటాగ్రరత్న రుచిశోభిత పాదునకు న్బినశశాంకశేఖరునకు భూషణంబయిన వాసుకి, (భా. ఆది I-1[illegible]).

37. 74. సంస్కృతంలో అస్త్యర్థక క్రియావిరహితంగా వాక్య రచన కావిస్తే అది ద్రావిడభాషాలక్షణం. దాన్ని సంస్కృతం స్వీకరించినట్లు గ్రహించవచ్చు. వంగభాషలోని ఇటువంటి లక్షణాల్ని ఆ భాష ద్రావిడభాషనుండి గ్రహించినట్లు కీ.శే. సునీతకుమార ఛటర్జీగారు వంగభాషాచరిత్రలో ఉదాహరించారు.

37.75 అనువర్తిత వాక్యనిర్మాణ ప్రతిదేయత్వం (Translated syntactical borrowing) అన్యభాషలోనివాక్యాన్ని అనువదించుకొని వాడుకోటం ఇట్టిది. ఆంగ్లంలో ఒక వస్తువునుజూపి 'What is this called ?' అని ప్రశ్నిస్తారు. తెలుగులో 'దీన్ని ఏమని పిలుస్తారు' అని అంటున్నారు. ఇది అనువర్తిత వాక్యప్రతిదేయత్వం. కాని 'పిలుచు' అనే తెనుగు ధాతువుకు 'ఆహ్వానించు' అని అర్థం. నిజానికి 'దీన్ని ఏమంటారు?' అని ప్రశ్నించాలి. (చూ. ఆం. భా. వి. పుట. 145).

37.8. ఏ భాషకైనా 'ప్రతిక్షేపయత్వం' లేకుండ ఉండ లేదు. ఎంతో స్వతంత్రమైన భాష సంస్కృతికి అందులోను కొన్ని వందల ద్రావిడ భాషాపదాలున్నాయని ఆధునిక పరిశోధనలవల్ల తెలుస్తుంది. మోనియర్ విలియమ్స్ అనే సంస్కృత నిఘంటువు చూస్తే ధాతువుల్ని గుర్తించలేని పదాలనేకం లభిస్తాయి. వాటిని 'Lexical' (L.) అని గుర్తిస్తుందా కోశం. అటువంటి పదాలు చాలవరకు ద్రావిడ పదాలని పరిశీలిస్తే తెలుస్తుంది.

పదాలను యథాతథంగా స్వీకరించుకొనే భాషలే అధిక సంఖ్యలో ఉంటాయి. తమిళంవంటి భాషలు కొన్నిమాత్రం స్వభాషా పరివర్తితం కావించుకొంటాయి. యథాతథంగా ఏ పదాన్నీ స్వీకరించవు. ఇది చాల నిష్ఠురనియమం. ఇది కొందరికి ఛాందసంగా అనిపించవచ్చు. అయినా ఆ భాషకేమీ కొరత కలిగినట్లు కనిపించదు.

అతివేలమైన యథాతథ ప్రతిక్షేపయత్వంవల్ల భాషాసాంకర్యం ఏర్పడుతుంది. భాషావ్యవస్థ బాగా [illegible] చెందుతుంది. దేశీయమైన పదాలెన్నో మరుగుపడిపో[illegible] మధిక మాతోంది. అదే భావదా[illegible] 34 వర్ణాలుకలిగిన (దన్త్యచజలు వేరే వర్ణా[illegible]చాలి) తెలుగు వర్ణమాల, 53 దాకా [illegible] కావటం తద్భాషావ్యాకరణాలు నిరూపించా[illegible] ఆంధ్రభాషగా అభి

1. ఉత్తర దక్షిణ దిగ్వాచకాలే తెల్లుగుల్లో లుప్తమైనాయి. నడగాలిలోను, దారిదెన్ను అనే జంట పదాలలోను వాటిని చూడవచ్చు.
2. బా. వ్యా. సంజ్ఞ 3.
3. ప్రౌ. వ్యా. సంజ్ఞ. 1.

వృద్ధిగాంచబడ్డ భారతంవంటి మహేతిహాస రచన కనువైనదని భావించేవారున్నారు. నిజమేననిపిస్తుంది. కాని తమిళంలో నన్నయకు పూర్వమే భారతరచన రాలేదా? 'భారతం పాడియపెరుందేవనార్' అనే సూక్తి ఇప్పటికీ ఉన్నదిగదా!! కాబట్టి అది సరియైన హేతువు కాజాలదు అనాలి.

37.8 : అయితే మహాప్రాణాలతో కూడిన సంస్కృత భాషా వ్యవస్థవల్ల ప్రయోజనమే లేదా? అంటే బొత్తిగా లేదని అనటం భావ్యంకాదు. భావాలు రెండువిధాలు i) సుకుమార భావాలు ii) తీవ్రగంభీర భావాలు. అల్పప్రాణ సంఘటిత పదాలు సుకుమార భావప్రకటనానికి, మహాప్రాణ సంఘటిత పదాలు తీవ్ర గంభీర భావావేశ నిరూపణానికి ఉపయోగిస్తే ప్రభావం తీవ్రంగా ఉంటుంది. ఇందుకు ద్రౌపదీ వస్త్రాపహరణమప్పుడు భీముని తీవ్ర ప్రతిజ్ఞను నిరూపించే నన్నయ్యగారి ఈక్రింది పద్యమే నిదర్శనం.

కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్
చూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రౌపది నిట్లు చేసిన ఖలున్
దుశ్శాసనున్ లోక భీ
కర లీలన్ వధియించి తద్విపుల
వక్షశ్శైల రక్తౌఘముని
ర్ఝరముర్వీపతి చూచు చుండ నని
నాస్వాదింతు నుగ్రాకృతిన్

ఇందులో ఆవృత్తమౌతున్న మహాప్రాణాలు భీముని రౌద్ర ప్రవృత్తిని ధ్వనింపజేస్తాయి. దీన్నే 'ధ్వనులవల్ల ప్రతిధ్వనించే అర్థమం' టారు. (Sound echoing the sense)

కావ్యభాషలో ఇలావుంది సరే. వ్యవహారంలో ఇలాంటి భాషను వాడం కదా! అని ప్రశ్నించవచ్చు. నన్నయ్యగారి భీము డిట్లా పలికినా, అసలు భీముడు తెలుగువాడైతే 'ఒరేయ్, దుశ్శాసనాయ్, నీ గుండెలు చీలుస్తానురా. నీ రక్తంతాగుతానురా' అంటూ మహాప్రాణాలు లేకపోయినా, ఆవేశంతో ఒత్తిఒత్తి పళ్లు కొరుకుతూ పలుకుతాడే గాని, తేలికగా చప్పగా పలకడుగదా! కాబట్టి ఒత్తటమో, ఒత్తక్షరాలో, తీవ్రభావాల కవసరం.

నన్నయ్యగారి పద్యాలే నాలుగు మచ్చుతునకలు సుకుమార భావాలకు నిదర్శనాలు. అవి నాగస్తుతికి సంబంధించినవి. అవి :

i) బహువన పాదపాబ్ధికుల (భార. ఆది I-105)

ii) అరిది తపోవిభూతి ( ,, ,, I-106)

iii) దేవమనుష్యలోకముల ( ,, ,, I-107)

iv) గోత్రమహామహీ ( ,, ,, I-108)

వీటిలో మహాప్రాణాలసలుండవనిగాదు, వాటి పునరావృత్తి ఉండదు. ఈ సందర్భంలోనే ఇంకోమాటకూడ చెప్పుకోవాలి. భావానుకూలమైన భాష ఉన్నట్లే, ఛందస్సుకూడ ఉంటుంది. కొన్ని వృత్తాలు-మత్తేభశార్దూలాదులు తీవ్రభావాలకు; చంపకోత్పలాదులు మృదుల భావాలకు రంజకంగా ఉంటాయి. ఈ నియమాన్ని నన్నయ చాలవరకు పాటించాడనటానికి పై పద్యాలే నిదర్శనం. స్తోత్రానికి చంపకోత్పలాల్ని, తీవ్రప్రతిజ్ఞలకు మత్తేభాదుల్ని ఉపయోగించారు. అంతేకాదు. కరుణరసోల్లసితమైన నలోపాఖ్యానంలో గల 223 పద్యాలలో మచ్చుకో మత్తేభంగానీ, శార్దూలంగానీ లేకపోవటంగమనార్హం.

ఈ విషయాలన్నీ ఇప్పుడు 'శైలీశాస్త్రం' క్రింద ప్రత్యేకంగా పరిగణితం (Stylistics)[1]

తనభాషారూపొందిన వ్యవస్థలోని వైలక్షణ్యాన్ని కవి లేక రచయిత తన వ్యక్తిత్వం కొలది రసభావ పరిపోషణాని కనుకూలంగా తీర్చిదిద్దుకోటాన్ని నిరూపించటమే 'శైలీశాస్త్ర' విషయం[2]. నన్నయ లాగా తరువాతి కవు లీరీతిగా రసభావ పరిపోషణం చేయలేకపోవటం వారి వ్యక్తిత్వంలోని న్యూనతాగుణం.

సంస్కృతంలోను ఇటువంటిపద్ధతి గోచరించదు. ఉంటే కాళిదాసు 'అనాఘ్రాతంపుష్పం' అని సంయుక్తమహాప్రాణాని వాడేవాడు కాడు. శకున్తలా సౌందర్యం ఈఉచ్చారణవల్ల ఎగిరిపోతుంది. 'శ్రీభూపుత్రీ వివాహావేళ' అనేపద్యాన్ని రామలింగ డిందుకే ఆక్షేపించాడంటారు. తెలుగు కవుల కిటువంటి నియమాలమీద లక్ష్యముండటానికి కారణం తెలుగు కవికి తన భాషావ్యవస్థతో కలిసిపోతున్న సంస్కృతభాషావ్యవస్థలోని ప్రత్యేకలక్షణాన్ని రసభావానుకూలంగా ఉపయోగించుకోవాలనే ఉత్కంఠే కావచ్చు.

37.82 దీర్ఘసమాసాల్ని సంస్కృతంనుండి ఎరవు తెచ్చుకొని తెనుగు తన నిసర్గసౌందర్యాన్ని భంజకం కావించింది. పాలల్లో నీళ్ళ

---

1. a) An aspect of literary study that emphasizes the analysis of various elements of style (as metaphor and diction) b the study of the devices in a language that produces expressive value (as rhetorical figures and syntactical patterns. (webster)
2. a) The choice which an author makes among the possibilities available to him in the way of syntactic framework and lexical elements is the subject — matter of stylistics :

   Introductory Linguistics : A. Hall (Jr.) p.409

   b) Stylistics : branch of language study concerned with the free selection of forms ,

   Glossary : Language in the Modern world

కలపటమా? నీళ్ళలో పాలు కలపటమా? అనేది సమస్య. తెలుగులో సంస్కృతం అలీనంగాను, (unassimilated) విలీనంగాను (assimilated) ఎంతో కలిసింది. ఏది తెలుగో, ఏది సంస్కృతమో వేరుపరచుకోలేము. సాంకేతిక పదాలన్నీ ఇప్పుడు సాంస్కృతికమైన తెనుగులోనే అనువాదాల్ని పొందాయి. ఇందువల్ల ఒక లాభం. అన్ని ప్రాంతాలవారు వీటిని అవగతం చేసుకోగలరు.

37. 83 తెనుగును ముంచెత్తే సంస్కృతసమ భాషా ప్రవాహాన్ని అరికట్టటానికి ఒక ఉద్యమం 17వ శతాబ్దంలో ఆరంభమైంది. అదే అచ్చ తెలుగు ఉద్యమం. సంస్కృత సమేతరమైన భాషంతా అచ్చ తెలుగుగా నిర్వచించబడింది. అంటే i) ప్రాకృతసమాలైన సిరి, రాణి, అగ్గి, గారవం మొదలైనవి ii) సంస్కృత భవాలైన ఆగం ఉవిద, ఉగాది మున్నగునవి iii) ప్రాకృత భవాలైన జన్నం, లచ్చి అచ్చెర మున్నగునవి iv) దేశ్యములైన తల, నెల, వల, యిత్యాదులు 'అచ్చ తెనుగు'గా పరిగణింపడ్డాయి. ఇందులో (i) (ii) (iii) విలీనాలైన ఎరవు పదాలు. (assimilated loan-words) వీటి నిర్మాణం [illegible] కృతితో తుల్యం. ఇటువంటి శబ్దజాలంతో తో[illegible] నిర్మింపబడ్డ తొలికావ్యం—పొన్నకంటి తెలగన్న విరచిత 'యయాతి చరిత్ర'. తరువాత ఎందరో కవులీరీతిగా అచ్చ తెనుగు కావ్యనిర్మాణానికి తమ శక్తియుక్తుల్ని ధారపోసారు. కాని సంస్కృత పదభూయిష్ఠమైన భాషే ప్రజలకు సులువుగా అర్థమౌతు వచ్చింది. దీనిపై ప్రజలకు మక్కువ ఎక్కువ. ఆధునికులు కందుకూరి వీరేశలింగం గారు కూడ సారస్వత జీవితం తొలిదశలో 'నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర నైషధం' రచించారు. తరువాత అట్టి రచనకు స్వస్తి చెప్పారు.

ఈ భాషలో పదాలకర్థం సులభంగా బోధపడదు. 'సీత' అనే రెండక్షరాల పదం— కదలి మొలనూలి చేడియ గనిన పడుచు అంటే అవగాహన ఎంతసేపటి కవుతుందో!! అప్పకవి[1] వీటిని 'తెనుఁగు మఱుఁగు' అని పేర్కొన్నాడు. అంటే ఈ అనువర్తితమైన రీతి చాలా డొంకతిరుగుడుగా ఉంది. అనువర్తిత ప్రతిదేయపదాలు సద్యఃస్ఫూర్తి కలిగివుండాలి. లేకపోతే వాటికి ఆదరణముండదు.

జాను తెనుఁగు, అచ్చ తెనుగు కాదు. జాను తెనుగులో సంస్కృత సమాలు పూర్తిగా నిషేధించాలని లేదు. అర్థస్ఫూర్తి గలిగిన వాటిని సముచితంగా ఉపయోగించవచ్చు. తెనుగు పదం లభిస్తుంటే సంస్కృతాన్ని వాడటం తెలివితక్కువ. సొంతసొమ్ములైనప్పుడు పరులసొమ్ముల కంటె అందమైనవే. ఎరవు సొమ్ములు బరువు చేటు.

ఎరవుపదాలు (loan-words)
- అలీనాలు (తత్సమాలు) (unassimilated)
- లీనాలు (తద్భవాలు) (assimilated)
  - ప్రాచీనాలు (ancient)
  - అర్వాచీనాలు (medieval)
  - నవీనాలు (modern)

1. అప్పకవీయము - I - 112

# 10. భాషా ప్రయోజనాదిక విజ్ఞానం

## 38.0. జాతి - భాష (Race and Language)

మానవుల్ని వేరుచేసే అంశాలు అయిదు, అవి (i) జాతి (ii) మతం (iii) సంస్కృతి (iv) భాష (v) జాతీయత. ఇవి ఒకదానితో ఒకటి పూర్తిగా వేరుపడి లేవు. పరస్పర సంబంధాన్ని కలిగే ఉన్నాయి. ముఖ్యంగా మతానికి-సంస్కృతికి చాల దగ్గర సంబంధం. మతమంటే ప్రజల దైవారాధనవిధానాలు, వాటికి సంబంధించిన విధి నిషేధాలు, ధర్మాచరణ పద్ధతులు మొదలైనవి. ఇవి సంస్కృతిలో కూడ భాగాలే. ఒక్కొక్క జాతికి ఒక్కొక్కమతం. మహమ్మదీయ జాతికి ఇస్లాంమతం, హైందవులకు హిందూమతం. ఈ విధంగా జాతికీ మతానికీ సంబంధముంది. ఒకో జాతి ఒకో భాష మాట్లాడుతుంది. ఆర్య భాషలు, ద్రావిడ భాషలు అనే వ్యవహారం వింటుంటాం. ఈ అయిదింటినిబట్టి పరస్పరకలహాలు, యుద్ధాలు జరగటం చరిత్ర పేర్కొంటుంది. జాతికి భాషకు గల సంబంధాన్ని ఇక్కడ మనం పరిశీలించాలి.

## 38.1. జాతి అంటే ఏమిటి?

'జా' అంటే పుట్టటం. పుట్టింది జాతి. ఒక మూలంలోనుండిగాని, కుదురులోనుండిగాని జనించిన ప్రజల సమూహాన్ని, వారి సంతతిని 'జాతి' అంటాం. ఈ సమూహం కొంత భూభాగాన్ని ఆక్రమించుకొని కొన్ని సమానాశయాలకై తమ మనుగడని సాగిస్తుంది. కొంతమంది ప్రజల్లోగల సమాన లక్షణాలే జాతి నిర్ణయాని కుపకరిస్తాయి. అంతమాత్రంచేత వైవిధ్యమే ఉండకూడదని కాదు. వైవిధ్యమున్నా, సామ్యం

ఉంటేనే జాతి. (unity in diversity) సమైక్యమంటే ఏకత్వం కాదు. వైవిధ్యంలో గోచరించే కొన్ని సమాన లక్షణాలకలయిక[1].

38.11 బర్జస్ నిర్వచనానుసారం ఒక ప్రదేశంలో నివసించే వర వర్గ - ఏకత్వోపేత (ethnic unity) జనసమూహాన్ని 'జాతి' అన వచ్చు.

ఫ్రెంచి రచయిత ప్రదిర్ - పాదరి (Prodier Pedere) జాతికి రాజకీయమైన ఏకత్వంకన్న వరవర్గ ఏకత్వం ముఖ్యమంటాడు.

భాష, సాహిత్యం, చరిత్ర, సంప్రదాయం, సామాజిక ఆచార వ్యవహారాలు మొదలైనవి వరవర్గ - ఏకత్వానికి ముఖ్య లక్షణాలని అతని అభిప్రాయం.

భాష, సంస్కృతి, చరిత్ర మొదలైనవి జాతీయతకు ముఖ్య లక్షణాలుగా భావింపబడుతున్నా, కేవలం వీటివల్లనే 'జాతి' ఏర్పడుతుందని చెప్పలేం. స్విట్జర్లాండు ప్రజలు ఒకే భాష మాట్లాడరు. అయినా రాజకీయంగా వారిని ఒకేజాతిగా పరిగణిస్తారు.

రక్తసంబంధాలు, సమానభాష జాతీయతకు దోహదం చేసేవి. అయినా జాతిని రూపొందించే ఇతర విషయాలుకూడ ఉన్నాయి. వారసత్వం, కీర్తికాంక్ష, కష్టాలు, త్యాగాలు, నష్టాలు, వాటి స్మృతులు, ఒకే పాలనలో కలిసి జీవించాలనే ఆకాంక్ష, మొదలైన వాటి మూలంగా జాతీయత అభివృద్ధి చెందుతుందని 'రెనాన్' అనే రాజకీయ శాస్త్రజ్ఞుడు 1818 లో పేర్కొన్నాడు.

ప్రజలకు కలిసి జీవించాలనే అభిలాష మూలంగానే 'జాతి' ఏర్పడుతుంది కాని, ఒక భాష మాట్లాడినందువల్ల కాదని 'రెనాన్' అభిప్రాయం.

1. Unity is not uniformity but harmony in diversity.

'రాజకీయంగా సుసంఘటితమై స్వతంత్రంగా ఉంటున్నట్టి లేదా ఉండాలనే ఆకాంక్ష కలిగినటువంటి, జాతీయ భావవిలసితమైన జనసమూహమే జాతి' అని లార్డ్ బ్రైస్ నిర్వచనం. ఇందులో ఒకే కుటుంబంలో నుండి జనించాలనే విషయం లేదు.

28.12. తత్త్వవేత్తలనేకులు, శాస్త్రజ్ఞులు జాతీయత వర్ధిల్లటానికి ఒకే భాష మాట్లాడటం అత్యవసరమని భావించారు. ఇట్టివారిలో అగ్రగణ్యుడు 'హెర్డర్'. ఈ భావాన్ని విశేషంగా సమర్థించినవాడు 'హంబోల్ట్'. భాష, జాతికి సంబంధించిన సంస్కృతికి మంచి దర్పణమని ఇతని అభిప్రాయం.

ఒకేజాతి ఒకేభాష మాట్లాడాలనికాని, ఒకేభాష మాట్లాడేవారంతా ఒకేజాతికి చెందినవారంటానికి కాని వీలులేదు. ఈ అభిప్రాయాలకు భిన్నంగా ఉదాహరణలున్నాయి. స్విట్జర్లాండులో ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్ భాషలున్నాయి. ఈ మూడింటినీ ఆ దేశీయులు జాతీయభాషలుగా పరిగణించారు. అయినా సుసంఘటితమైన జాతిగా వారు ఉంటారు. ఆంగ్లభాషను బ్రిటిష్‌జాతి, అమెరికనులు, కెనడియనులు, ఆస్ట్రేలియనులు, న్యూజీలాండ్లు మాట్లాడుతారు.

భారతీయులొకేజాతిగా పరిగణింపబడుతున్నారు. ఈ దేశంలో భిన్నభిన్న కుటుంబాలకు చెందిన భాషల్ని మాట్లాడేవారున్నారు. (చూ. పుటలు 43 నుండి 47) అందుచేత దీన్ని కే.యం. ఫణిక్కర్ (ప్రొఫెసర్ గాడ్గిల్ మొదలైనవారు 'అనేక - జాతీయ రాజ్యం' గా పేర్కొన్నారు. (multi-national-state) ఇట్టి నిర్ణయాలు జాతి వైరుధ్యాలకి దారితీస్తాయి.

౩౩.౨౦. జాతినిర్ణయానికి సరైన ఆలోచన :

ఏ జాతిని పూర్తిగా పరిశుద్ధమని చెప్పలేం. జ్యూలు, యూరోపియనులు అనేకజాతుల సాంకర్యం. నార్డిక్, మెడిటరేనియన్, ఆల్పైన్ మొదలైన జాతుల వారు ఒకప్పుడు కలుషితులుగా ఉండేవారు. కాని తరువాత అవికూడా సంకరమైనాయనే అంటున్నారు.

అసలు 'జాతి' అనే పదమే సశాస్త్రీయం కాదంటారు. అందుకే దీనికి జీవశాస్త్ర విభజన శాస్త్రంలో (Taxonomy)[1] పరిగ్రహణం లేదు. ప్రకృతి—జీవ, వృక్ష, ఖనిజాలని త్రివిధాలు. ఇందులో ఒక్కొక్క దానిలో ఏడువిధాలైన అంతరువులున్నాయి. ఇందులో మానవుడు 'హోమో'కు చెందినవాడు. కోతులు, కొండముచ్చులు, గొరిల్లాలు, చింపంజీలుకూడ ఈ అంతరువుకు చెందినవే.

౩౩.౨౧. చర్మం రంగునుబట్టి జాతిని నిర్ణయించే ప్రయత్నాలు జరిగాయి. ఉదా: తెల్లనివారు కాకేషియనులు, పసుపుపచ్చనివారు మంగోలియనులు, నల్లనివారు ఇథియోపియనులు

మానవుని పుర్రెల్ని అస్థిపంజరాల్ని బట్టి 'జాతి' నిర్ణయించే ప్రయత్నం జరిగింది. ఈరీతిగా ముక్కునుబట్టి, జుట్టునుబట్టి, కండ్లనుబట్టి పక్కరీతులుగా 'జాతి' నిర్ణయాలు జరిగాయి. మానవజాతిలో అంతర్విభాగాల్ని గావించటానికి మానవ చరిత్రకారులు ఎన్నో ప్రయత్నాలు కావించారు. కాని వారి నిర్ణయాలన్నీ దోషభూయిష్ఠాలైనాయి. ఇంతలో జీవశాస్త్రంలో ఒక భాగంగా 'వారసత్వ వాతావరణానుకూల పరిశీలనం' (genetics)[2] వృద్ధిగాంచింది.

---

1. The study of the general principles of scientific classifications; Systematic orderly classification of plants and animals according to their presumed natural relations. (webster)
2. A branch of biology that deals with the heredity and variation of organisms and with the mechanism by which these are effected. (webster)

వారసత్వాన్ని గూర్చి, జాతిని గూర్చి శాస్త్రీయమైన అభిప్రాయాలు వ్యాప్తిలోకి వచ్చాయి.

38.22 వారసత్వమంటే ఒకే రక్తం పంచుకోటమనే అభిప్రాయం అరిస్టాటిల్ కాలంనుండి వ్యాప్తిలో ఉన్నది. అది సరియైన అభిప్రాయం కాదని తేలింది. రక్తంవల్ల గాకుండ క్రోమోజోన్సులోని 'జీన్స' (genes) వల్ల వారసత్వ మేర్పడుతుందని దృఢమైంది. తల్లి రక్తబిందు వొకటైనా బిడ్డకు సంక్రమించదు. బిడ్డకు గల ప్రతి 'సెల్' లోను 23 జతల క్రోమోజోములుంటాయి ఇవి తల్లిదండ్రులనుండే కాకుండ ఏనిమిది తరాల పూర్వం నుండి సంక్రమించవచ్చు. ఎవరి నుండి ఎట్లా సంక్రమించాయో నిరూపించటం సాధ్యంకాదు.

అందుచేత 'జాతి' పదం మిధ్యాజ్ఞానకల్పితం. 'రేస్' అనే పదం పుట్టుకకూడ చిత్రమైంది. అరబిక్ 'రా' అనే ధాతువునుండి ఇది ఏర్పడింది, ఇది తొలుత ఒకే ఒక మగసంతతికి చెందిన జంతు సమూహానికి సంబంధించిందనే అర్థంలో ఉపయుక్తం. తరువాత ఇది మానవులకుకూడ ఉపయోగమైంది.

38.23 మాక్సు ముల్లర్ 1848 లో ఆక్సు ఫర్డ్‌లో స్థిరపడి, 'ఆర్యన్' అనే పదాన్ని ప్రజకు, భాషకు విశేషణంగా ఉపయోగించాడు. ఇంతకు పూర్వం సర్ విలియం జోన్సు ఈ పదాన్ని భారతీయ భాషల్ని మాట్లాడే ప్రజలకు మాత్రమే ఉపయోగించాడు. మాక్సుముల్లర్ 'ఆర్యభాష' 'ఆర్యజాతి' అని ద్వివిధాలుగా పేర్కొన్నాడు. 'ఆర్యజాతి' అంటే సుందర దీర్ఘకాయులని, పెద్ద శిరస్సు గలవారని, ఆజానుబాహులని, అతడభివర్ణించాడు. కాని అతడు తన దోషాన్ని తరువాత గ్రహించి, "ఆర్యులంటే రక్త, కేశ, కపా

లాస్థి పంజరాదులు కారు; కేవలం ఆర్య భాషల్ని మాట్లాడేవారు మాత్రమే. వారి శారీరక నిర్మాణ లక్షణాల్ని గూర్చి ఈ పద మేమీ తెలియజేయదు'' అని ఉద్ఘాటించాడు. ఆర్యజాతి, ఆర్యరక్తం, ఆర్య నేత్రాలు, ఆర్య కేశాలు అని అభివర్ణించే మానవ శాస్త్రజ్ఞు డెంతో దోషో! ఆర్యభాషా నిఘంటువు, అనార్యభాషా వ్యాకరణ మని వ్యవహరించే భాషావేత్త అంతటి దోషి అని అతని వక్కాణ.

38.24 నేడు 'ఆర్య' పదం జాతిపరంగానే ఉపయుక్తం. 'ఇండో-యూరోపియన్' అనే పదం జాతిపరంగాను, భాషాపరంగాను కూడా ఉపయుక్తం. కెల్టిక్ జాతి - కెల్టిక్ భాష, ఐరిష్ జాతి - ఐరిష్ భాష అన్నట్లుగా, ద్రావిడజాతి - ద్రావిడ భాష అనటానికి వీలుకలిపించదు. ఆర్యభాషలకన్న భిన్నంగా ద్రావిడభాషలున్నాయి కాని, ఈ భాషల్ని మాట్లాడేవారందరు ద్రావిడజాతివారని ఉద్ఘాటించలేం.

ఒకేజాతి, ఆజాతిపేరట నున్న భాషనే వ్యవహరించాలనే నియమం లేదు. ఒక పదం జాతిపరమో, భాషాపరమో గ్రహించాలి. జాతిని, భాషను, వేరుపరచుకొని చూడటం శ్రేయస్కరం. ఈ రెండింటినీ ఏకంచేసినందువల్ల అనేక అనర్థాలు చేకూరుతాయి.

నేడొక జాతిగా పరిగణింపబడేది, ఒకప్పుడు అనేక జాతుల సాంకర్యం మూలాన ఏర్పడిందని తెలుసుకొంటె ఆశ్చర్యం కలుగుతుంది. ఉదా : ఆంగ్ల జాతి. ఆంగ్లో+సాక్సన్ జాతి. సాక్సన్. ఫ్రెంచి+స్కాండినేవియన్,+కెల్టిక్+ప్రి-కెల్టిక్కుల కలయిక. ఒకే జాతివారు భిన్న భాషల్ని మాట్లాడవచ్చు. ఉదా : స్విస్ ప్రజలు.

ఒకే జాతివారు ఆ జాతిపేరట వరిగే భాషనే మాట్లాడేవారయితే మంచిదే కాని, అంతటా అలా ఉండాలని లేదు. జాతినిబట్టి భాషనుగాని, భాషనుబట్టి జాతినిగాని నిర్ణయించటం ప్రమాదం.

"'జాతి' అనే పదం జీవశాస్త్రంలోను, భాషాతత్త్వశాస్త్రం లోను పూర్తిగా భిన్నం. మంగోలులు, టర్కులు భిన్నజాతివారు. అయినా వారు సన్నిహిత సంబంధంగల భాషల్ని మాట్లాడుతారు. యూరోపులో నివసించే జ్యూలు, అరేబియాకు చెందిన బెడొమియనులు జాతిరీత్యా దగ్గరవారే అయినా, భిన్నభాషలు మాట్లాడుతారు. జాతినిబట్టి సన్నిహిత సంబంధం ఉన్నప్పుడు, భాషాపరమైన సన్నిహిత్యం దానికి ఉపబలకంగా తీసుకోవచ్చునేకాని, దానికి విపరీతంగా భాషనుబట్టి జాతిని నిర్ణయించరాదం"టాడు సైస్ పండితుడు.[1]

**24.0. భాషా ప్రయోజనాలు :** చిత్రలేఖనానికి రంగులు శిల్పానికి శిలలులాగా వాఙ్మయానికి శబ్దాలు కావాలి. వాఙ్మయాని కుపయోగపడే భాషకు, శిష్టజనవ్యవహారంలోని భాషకు తారతమ్యం ఎంత తక్కువుంటే అంతమంచిది. తారతమ్యం అధికమయ్యేకొద్దీ వ్యవహారంలోని భాష అలిఖితమై, కొన్నాళ్ళకు దాని స్వరూపం తెలియకుండా పోతుంది. వాఙ్మయభాష పాతవడ్డ పదాలతోనే, నిలవవున్న నీళ్ళులాగా అయిపోతుంది. భాష మహాప్రవాహం. 'ప్రవాహినీ దేశ్యా' అనికదా! చింతామణ్యుక్తి. ప్రవాహజలం ఎంత మలినమైనా పానయోగ్యం. నిలువనీళ్ళు అనారోగ్యం.

---

1. Race in physiology, and race in philology are two totally different things. Races physiologically as distinet as the Mongoles and the Turks may be found speaking allied tongues (Turkish languages) while races physiologically related like these Jews of Europe and the Bedomians of Arabia may be found speaking unallied ones.

   If ethaoloy demanstrates kinship of race, kinship of speech may be used to support the argument. But we cannot reverse the process and argue from language to race."

   Introduction to the science of Languages — Prof. syce. part II — pp. 365-368.

ప్రాచీన భాషా రూపాలు వాఙ్మయంలో నిలిచిఉంటాయి. కాబట్టి చారిత్రక భాషాశాస్త్రజ్ఞునకది విశేషంగా ఉపయోగపడుతుంది. ఏపదాన్ని ఏకవి లేక రచయిత ఎప్పుడే అర్థంలో ప్రయోగించాడో నిరూపించే చారిత్రక నిఘంటువు (Historical lexicon) ఇంగ్లీషు కున్నట్లు ప్రపంచంలో చాల భాషలకు లేకపోవటం శోచనీయం. అట్టి భాషలలో తెలుగు ఒకటి. అకాడమీలు, విశ్వకళాపరిషత్తులు ఇట్టి క్లిష్టదీర్ఘకాలిక కార్యక్రమాలు చేబట్టి నిర్వహించటంలోనే జాతి గౌరవ నిరూపిత మౌతుంది.

39. 1. వాఙ్మయభాషల్లో ద్వివిధలక్షణాలు కూడగట్టుకొంటాయి: i) అత్యంతాద్భుతత్వం. ii) ప్రత్యేకశైలి.

39.11. అత్యంతాద్భుతత్వం : (excellence of language)

ఇట్టి అద్భుతత్వం కొంత వక్తృత్వంలోను కనిపిస్తుంది. పెద్దపెద్ద పదాలు, మారుమూలపదాలు ఉపయోగించి, సంస్కృతప్రాయంగా మాట్లాడుతుంటే శ్రోతలాశ్చర్యచకితులై పోతారు. కొంతమంది వ్యక్తులు తమ ఆధిక్యాన్ని ప్రకటించుకోటానికి కూడ ఇటువంటి పదజాలాన్ని ఉపయోగిస్తారు. ఇట్టివారి భాషను తెలుగువారు 'పిల్లి' అంటానికి 'మార్జాలం' అన్నట్లుగా ఉందని విమర్శిస్తారు. "పొద్దెక్కింది" అంటానికి "కాలాతీతమైందని"; మబ్బుపట్టిందనటానికి "మేఘావృతమైందని"; "చదువురానివాడ"నటానికి "నిరక్షరకుక్షి" అని వ్యవహరించటమిటువంటిదే. తమకంటె చాలపెద్దవాళ్ళతో మాటాడేటప్పుడిట్టివంటి ధోరణి ప్రదర్శిస్తారు. అది వారి వినయానికి నిదర్శనం. "తమ దర్శనానికేతెంచాను." "చిత్తం తాము సెలవిచ్చినట్లే" అనటం వింటుంటాం. తమిళంలో "పొఱుదు" అంటానికి "సూర్యన్" అని, "నిలై" అంటానికి "శందిరన్" అని వ్యవహరిస్తే అటివారి ధోరణిని ఇతరు లేవగించుకొంటారు. కొంతమంది గొప్పగా భావించేవారి

ఉంచి, అద్భుతోపేత భావకిది మంచి ఉదాహరణం. ఈ విధమైన అద్భుతత్వంవల్లనే సారస్వతభావ కృతక ధర్మాన్ని పొందింది. కాని ఏవో కొన్ని వ్యవహారభిన్నాలైన క్రియాపదాలవల్ల కాదని గ్రహించవచ్చు.

## ౩౯.12. పృథక్శైలి (Special Style)

ఒక వ్యక్తి భావనానికి, మరోవ్యక్తి భావనానికి ఎంతో కొంత భేదమున్నట్లే, ఒక కవి కావ్యభావకు, మరోకవి కావ్యభావకు తారతమ్యం గోచరిస్తునే ఉంటుంది. వాక్య యోజనంలో, అలంకారిక ప్రయోగంలో, సమాస కల్పనంలో, ఆలంకారిక ప్రయోగంలో, సమాస కల్పనంలో భేదముంటుంది. ఈవిధంగా ఒక్కొక్క కవి, తన స్వభావాని కుచితంగా తన కావ్యభావనాన్ని నిర్వహించే విధానాన్నే 'శైలి' (Style) అంటారు.

ఒక్క కవికి 'వ్యస్తశైలి' (absolute style) పై మక్కువ. ఇంకో కవికి 'సమస్తశైలి' (relative style) పై యిష్టముంటుంది. సమస్తశైలికే 'సమాసశైలి' అనిపేరు. సమాసమంటే, ఒక పదం మరోపదంతో అన్వయించి యేర్పడేది. ఒకపదం ఒక చిత్రమైతే, సమాసంవల్ల అనేక చిత్రాల సమాహారరూప మేర్పడతుంది. గజిబిజి అవుతుంది ఆ చిత్రం. వ్యస్తశైలిలో స్పష్టదర్శనం ఎక్కువ.

సామాన్య కవులు ఎప్పుడు ఒకేవిధమైన శైలిని నిర్వహిస్తారు. కాని మహాకవులు సందర్భోచితంగా శైలిని నిర్వహిస్తారు. త్రివిధ శైలులు ప్రసిద్ధమైనవి (i) కథాకథనశైలి (narrative style) (ii) వర్ణనాత్మకశైలి (descriptive style) (iii) నాటకీయశైలి (dramatic style) ఈ మూడింటిలో 'నాటకీయశైలి' మహోత్కృష్టమైంది. మహాకవులకే యిది సాధ్యం, బొమ్మకట్టించేరచనారీతి. వట్టి బొమ్మ కాదు. కదిలే బొమ్మను మనోనేత్రాల ముందు కట్టించటం.

## 40.0. జీవితం - భాష - వాఙ్మయం :

## (Life, Language and Literature)

మానవులు కేవలం పశువుల్లాగే జీవించేవాళ్ళే కారు. జీవితాన్ని నిర్వహించే యోగులు. జీవిత మోకళ తత్కాల ప్రవృత్తులు కావాలనీ ఆశిస్తారు. జీవిత మెంతగా అనుభవ సాంద్రమైతే, తన్నిర్వాహకు లంతగా ఆలోచనాత్మకులౌతారు. ఆలోచన, నిశితభావాలకు దారి తీస్తుంది. భావాలు భాషమూలంగా ప్రకటితమౌతాయి. తీవ్రభావం తీవ్రభాషాస్వరూపాన్ని ధరిస్తుంది. అదే వాఙ్మయం. విస్తృతమైన జీవితాన్ని నిర్వహించే వ్యక్తిలో భావకూడ విస్తృతంగానే ఉంటుంది. అట్టి వ్యక్తిలో సృజనాత్మక ప్రతిభవుంటే, అతని తీవ్రానుభవాల్ని తీవ్రభావలో ప్రకటించి, లోకాన్ని ఉత్తేజితం చేస్తాడు. కాబట్టి జీవితం చాల విస్తృతానుభవపూరితమైంది. అందులో కొంతే భాషాస్వరూపం దాలుస్తుంది. అందులో కొంతే కొంతమందిలో వాఙ్మయత్వం వహిస్తుంది.

40.1. ప్రతిమాట చాటున భావం ఉంటుంది. పదాన్ని విచ్ఛేదం చేస్తే అందులో నిహితంగా ఉన్న భావం బహిర్గతమౌతుంది. ఆ భావాన్ని బద్దలుకొడితే దాని చాటునగల ఆలోచన వ్యక్తమౌతుంది. ఆలోచనను విదలిస్తే దానిచాటు భావచిత్రం వెల్లడి అవుతుంది. ఆ భావచిత్రాన్ని చీలిస్తే అందులో దాగివున్న అనుభవసారం అవగతమౌతుంది. దాన్ని విశ్లేషిస్తే అనుభవం అర్థమౌతుంది.[1] దీన్నిబట్టి

1. Break the word and free the thought.
   Break the thought and free the idea.
   Break the idea and free the image.
   Break the image and free the concept
   Break the concept and free the experience.

ఒక్కొక్క పదం జీవితానుభవ సంభవమని విదితం. జాతి తన అనుభవంకొద్ది నిర్మించుకొన్నది భాష.

40.2. మహాకవులు 'భాషాశిల్పులు' (architects of language) అనే ప్రఖ్యాతి ఉంది. షేక్స్పియర్, మిల్టన్ వంటి ఆంగ్లకవులు భాషా నిర్మాతలని, ఆంధ్రభాష నన్నయాదివుల సృష్టియని భావించటం భ్రాంతిమూలకం.

కవుల ప్రయోగాల్ని ప్రజలు తమ భాషణంలో మధ్య మధ్యలో వాడుతుంటారు. 'To be or not to be' 'the most unkindest cut' వంటి మాటలు సందర్భోచితంగా వాడతారు. అట్లాగే "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్" 'ఉత్పలమాలిక నీటికొలది తామర సుమ్మీ' 'కలంచునే సతుల మాయలు ద్రోచి తంబులన్' "ఏగతిరచియించిరేని సమకాలము వారలు మెచ్చరే గదా" మొదలైన సూక్తులెన్నో ఉన్నాయి తెలుగువారు వాడేవి. సామాన్యప్రజలిట్టివాటిని బట్టి కవులే భాషాసృష్టికర్తలనే భ్రాంతిలో నాతూవుంటారు. నిజానికి కవులు భాషానిర్మాతలు కారు. ప్రజలే భాషానిర్మాతలు.[1] ప్రజానీకం వాడే పద్ధాల్నే విన్నూతనశక్తితో కవులు ప్రయోగిస్తారు.

కవులలో గల శైలీభేదాలు, ఆయా భాషా పరిధుల్లో ఉంటాయి గాని, వాటి నతిక్రమించవు. వారి ప్రయోగ స్వేచ్ఛకూడ పరిమితమే. మహాకవికూడ తమ భాషనుండి అత్యధికంగా స్వీకరించేవారే కాని, భాషకు ప్రదాతలు కారు.[2] వ్యవహారంలో ఉన్న అత్యంత భాషాస్వరూపం తెలియ పోవటంచేత అటువంటి భ్రాంతికలుగుతుంది.

1. The architects of our language are not literary artists, but the masses of people who use the language for everyday purpose – Hocket – p. 564.

2. " .... So far as language is concerned, the greatest of literary artists is infinitely more a receipient than a donor – Hockett – p. 564.

సన్నతయ సహార్థంలో ఉన్న 'తోడ' వర్ణకాన్ని ఉపయోగంలో యోగించాడు.[1] ఇది కవి కల్పనకాదు. ఉన్నత ప్రయోజనాన్ని ంచటం (Sublimation). భాషాప్రభావమే వాఙ్మయంపై కం. వాఙ్మయ ప్రభావం చాల స్వల్పం. ఈ విధంగానే జీవితంపై డ వివిధ కళావాఙ్మయాల ప్రభావం చాల తక్కువ. జీవితాన్ని ర్శించేదే కవిత్వమన్న ఆర్నాల్డ్[2] అభిప్రాయాన్నిబట్టి జీవితం ల విస్తృతమైందని, అందులోని ఏకదేశాన్నే కవి గ్రహించి, రస ణం చేస్తాడని గ్రహించవచ్చు.

జాతి కల్పించుకొని, తరతరాలుగా అనుకరించే నైతిక జీవిత నాన్ని వాఙ్మయం పోషిస్తుంది. 'కలంచునే సతుల మాయల్ చిత్తంబులన్' అనే అర్థాంతర న్యాసాన్ని జాతికిగల నైతిక జీవిత మాణిక బుద్ధి కనుకూలంగానే చేయగలిగాడు, అల్లసాని పెద్దన గామైథునాది అవైదికాచారాల్ని ప్రచారం చేసిన కళాపూర్ణోదయ వ్యాన్ని సమకాలీనులు మెచ్చుకోలేదు. వైదికాచారాలు సడలి, ర్యాచార సాంకర్యమేర్పడ్డ ఈ కాలంలో దానికి విశేషప్రాచుర్య ర్పడ్డది.

3. వాఙ్మయ భేదాలు : వాఙ్మయం ముఖ్యంగా రెండు కాలు (i) నాగరక వాఙ్మయం (ii) జానపద వాఙ్మయం. ఒక నాణా బొమ్మ, బొరుసు లాగా ఒక జాతి చేవ గ్రహించాలంటే కేవలం గరక వాఙ్మయ పరిశీలనమే చాలదు. జానపద వాఙ్మయాన్ని ధ్యయనం చేయాలి. నాగరక వాఙ్మయం విశేషంగా బౌద్ధికం,

---

ఉపయోగంబునం దాఖ్యాతకు తోడవర్ణకంబగు - బా. వ్యా. కారక. 9. చూ. వికాస వ్యాఖ్య.

Poetry is the Criticism of life - Mathew Arnold,

(Intellectual) జానపద వాఙ్మయం హార్దం. (emotional) నాగరక వాఙ్మయం కృతక మనోహరం. జానపదం నిసర్గమనోహరం.

40.31. జానపద వాఙ్మయంలోని ఉపశాఖలు : (i) సామెతలు (Proverbs) (ii) పొడుపుకథలు (riddles) (iii) జానపద కథలు (folk tales) (iv) పౌరాణిక కథలు (myth) మొదలైనవి.

40.32. అసామాన్య ప్రయోజనం, ప్రాముఖ్యంగల భావ ప్రకటనమే వాఙ్మయం.[1] అసాధారణ తీవ్రభావప్రకటనం ఉద్రిక్తత మూలాన కల్గుతుంది. సాధారణ భాషావ్యవహర్తకుకూడ నిత్య జీవితంలో కోపోద్రేకాలు కల్గుతాయి. అప్పుడతని భాష తీవ్రరూపం దాలుస్తుంది. కాని అది ఉత్తమ ప్రయోజనరహితం కాబట్టి పరిహరణీయం. 'విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశం' కావాలి.

అంతఃకరణ ప్రవృత్తి (intuitive behaviour) కవులలో విశేషంగా ఉంటుంది. ఇటువంటి ప్రవృత్తి ఎంత అధికంగా ఉంటే, కల్పనాధికంకూడ అంత ఉన్నత ప్రమాణాన్ని అందుకొంటుంది. ఎంతగా రాగాలాపనంలో నిమగ్నుడైన సంగీత విద్వాంసుడైనా శ్రుతిని అతిక్రమించలేనట్లుగానే, కవులు ఎంతగా 'భావాంబర వీధి విశ్రుతి విహారు'లైనా స్వకీయ భాషానహజ శేముషిని (genius) అతిక్రమింపరు.

40.33. ఒక భాషానహజ శేముషిని, ఇంకో భాషలోకి తీసుకురావటం దుస్సాధం. అందుచేతనే అనువాదాలు ఆనంద జనకాలు కావు. 'అనువాదకులు సరిదిద్దరాని దోషకారుల'ని శ్రీ అరవిందు

1. when the expressio n is of unusual significance, we call it literature. Sapir-Language, p.22.

మానవుడీనాడు వసుధైక కుటుంబ సభ్యుడుగా జీవించాలనే ఆకాంక్ష కలిగి ఉన్నాడు. విశాల ప్రపంచాన్నొక్క రోజులో పర్యటించి వస్తున్నాడు. అయినా భాషావరోధాన్ని అతిక్రమించలేక పోతున్నాడు అంతర్జాతీయ భాషల్ని కల్పించగలుగుతున్నాడే (చూ.40.6) కాని ఆభాషల్లో ధారాళంగా మాట్లాడలేకపోతున్నాడు. అందుకు కారణం- భాష కేవలం మేధావ్యాపారం కాదు. దానికి హృదయోద్వేగంతో విశేషసంబంధముంది. దీన్నే 'ఉద్రిక్తత' (Emotive element) (చూ. 32. 45) అంటాం. ఆభాషల్లో అది లోపించటం చేతనే అవి వ్యవహారయోగ్యాలు కాకుండా ఉన్నాయి.

40.34 మాతృభాషనుగాని, ప్రాంతీయభాషనుగాని ఆశ్రయించక తప్పదు. సాంఘిక రాజకీయ సాంస్కృతిక రచనలు అక్లిష్టమైన సరళవచనంలో చేస్తే సుకరంగా ఆయా భాషలలోకి అనువదింపబడతాయి. ఇట్టి రచనలే కాక సృజనాత్మక రచనలు కూడా ఆయా ప్రాంతీయ భాషాసమయాల్ని (conventions) పరిహరించిన భాషలోనే విరచితం కావాలి. సామెతలు, జాతీయాలు, సుదీర్ఘసమాసాలు కూడ రానీకూడదు. ఉపమారూపకోత్ప్రేక్షాది విశ్వజనీనాలంకారాలు ఉండవచ్చు. అనేకశబ్దార్థాలంకారగర్భితం కాకుండ రచిస్తే అటువంటిభాష, అన్యభాషాపరివర్తనాన్ని అలవోకగా పొందుతుంది. అట్టిభాష శక్తిమంతంగా ఉంటుందా? అనే శంకకలగవచ్చు. భాషలో శక్తిభావనాబలాన్ననుసరించి ఉంటుంది. పూర్వకవులు తమ భాషనెంతో సమయబద్ధం కావించారు. అట్టి కావ్య భాషను 'నిబద్ధభాష' (bound language) అంటారు. ఆరీతిగా సమయనిబద్ధంకానిభాషను 'అనిబద్ధభాష' (free language) అంటారు.

నిబద్ధ భాషా నిర్మాణంకంటె అనిబద్ధభాషా నిర్మాణమే కష్టం. నిబద్ధభాషస్వభావసిద్ధమైంది. జాతీయాలు, నుడికారాలు, సామెతల

అలవోకగా వస్తూనే ఉంటాయి. ఆ ప్రవాహాన్ని అరికట్టటం అమిత కష్టం. 'స్వభావోదురతిక్రమః' అంటారు పెద్దలు. అదీ కాక చిరకాలంగా నేర్చుకోని, అలవాటుపడ్డ భాషను విస్మరించాలంటే సామాన్యం కాదుగదా!

40.35 విశ్వకవి రవీంద్రులు వం: భాషలో రచించి విశ్వజనీన కనుకూలంగానే ఉంది

అలంకార భారములను
త్యజియించెను నాగీతము
మరియదు కాంచనపీతాం
బర భూషాడంబరమున:

నా మైత్రైక్యమునకు
నగలాటంకములు స్వామి
నీ నా గుసగుసలను విన
నీవు నగల ఘల్లుంఘల్లులు.

కవినను నా గర్వము నీ
న్నని సిగ్గిలి కరగిపోవు;
కవివి నీవే వివిధ కుల
కడన స్వామి నా స్థానము.

బ్రదుకు నిరాడంబరముగ
వెదురు గ్రోవిగా తీరుగ
బోదివి కొందునందు ప్రభూ!
పూరింపుము నీ గానము

(2. నిరలంకృతి; కీ. శే. సింగరాచార్య అనువాదం)

'నిరాడంబరజీవనం, నిస్తుల భావన' భారతీయుల జీవితలక్ష్యమైనట్లే నిరాడంబరభాష, నిస్తులభావుకత కవితా జీవిత లక్ష్యంకూడ కావాలి. జ్ఞానపీఠ జాతీయ బహుమానాలు రావటానికిట్టిరచనలే అర్హం. షేక్స్పియార్ నాటకాల్ని అన్యభాషల్లోకి అనువదించవచ్చునని, పాత్రపోషణానికి న్యూనత కల్గించ నవసరం లేదని; కాని స్విన్‌బరన్ భావగీతాల్ని అనువదించటమంత సుకరం కాదని సపీర్ అభిప్రాయం.[1]

40.4 ప్రతిభాష కళాత్మకమైన సామూహిక భావ ప్రకటన మంటాడు సపీర్.[2] తమ భాషలోని ధ్వని విన్యాసాల్ని, లయాత్మక గమనాల్ని ప్రతిసాహిత్య సృష్టికర్త తనబుద్ధి కుశలతకొలది వినియోగించుకొంటాడు. వాఙ్మయ గమనం, నిసర్గంగా భాషలోఉన్న ఈ ధ్వనులసమ్మేళనం మీదనే ఆధారపడి ఉంటుంది.

ధ్వనులకన్న, ఆయాభాషలలోని వ్యాకరణాంశాలే ముఖ్యం. వీటినిబట్టే వాఙ్మయంలో శైలీభేదాలు కలుగుతాయి. సమాసకల్పన మెంతవరకు సాధ్యం? పదనిర్మితి సంయోగాత్మకమా? ప్రత్యయాత్మకమా? వాక్యంలో పదాలు స్వేచ్ఛా పరివర్తనం గలవా? అన్య పదాలతో అన్వయాన్ని కలిగిఉంటాయా? విశేషణ విశేష్యాల కెటువంటి సంబంధ ముంటుంది? వాక్యంలో పదక్రమ మెటువంటిది? ఈ మొదలైన అనేక వ్యాకరణాంశాలమీద శైలీభేదా లాధారపడి ఉంటాయని సఫీర్ పేర్కొన్నాడు.[3]

40.41 సంస్కృతభాషలో దాక్షిణాత్యుల శైలిలోని విశిష్టతను భాష్యకారులుసూచించారు. 'ప్రియతద్ధితాః దాక్షిణాత్యాః' తద్ధితాంశాల్ని ఉపయోగించటంలో దక్షిణాదివారికెక్కువ మక్కువ. దశర

1. Language, p. 223.
1. Every language is itself a colletive art — Language, p·225
2. Ibid—pp. 226, 227.

ని కుమారుడని అంటానికి 'దాశరథి' అంటారు. అంటే వృత్తి
బాలాన పాదపుసాధిస్తారని అర్థం.

ఇండోయూరోపియన్ భాషల్లో యత్తదర్థక ప్రయోగాలు
Relative constructions) కర్మార్థకాలు (Passive usage) అధిక
ని పూర్వమే పేర్కొన్నాం.

).42 తెలుగు మొదలైన ద్రావిడభాషల్లో ధాతుజవిశేషణాలు
ర్మాదులకుకూడ కర్తతోపాటు తుల్యప్రాధాన్యాన్ని చేకూరుస్తాయి.

'రాముడు భృత్యుని రక్షించాడు' అనే వాక్యాన్ని నామీక
రించి 'భృత్యుని రక్షించిన రాముడు' అంటాం. 'రక్షించు' అనే
క్రియ విశేషణమైంది. ద్వితీయావిభక్తిలోని కర్మకుకూడ కర్తతో
పాటు తుల్యప్రాధాన్యమివ్వాలనే వివక్ష వక్తకు కల్గితే 'రాముడు
రక్షించిన భృత్యుడు' అంటాడు. దీన్ని సంస్కృతాంగ్లాది భాషలలోకి
అనువదించలేం. ఈవిధంగానే యితర కారకవాక్యాల్లోని కరణ,
సంప్రదాన, అపాదాన, అధికరణాదుల్ని పరివర్తింపజేయవచ్చు.[1] ఇట్టి
వ్యాకరణాంశాలే ఆయాభాషలలోని పృథగ్భూతశైలికి కారణా
లౌతాయి. అంతేగాని శైలి, గ్రీకు, లాటిన్, సంస్కృతాది భాషల
నుండి యెరవు తెచ్చుకొన్నది కాదని గుర్తించటానికి యూరోపియను
లకు, భారతీయులకు చాలకాలం పట్టింది.

ఇప్పుడిప్పు డాయా భాషాకవులు, సంస్కృతాది భాషాబంధా
లనుండి విముక్తిపొంది సామాన్య ప్రజలు, అందులోను జానపదులు
నిసర్గ మనోహరంగా సృష్టించిన ఛందశ్శైలులలో రచనలు చేయటం
ముదావహం.

1. బా. వ్యా. వికాస వ్యాఖ్య పుట 373-74 లో తక్కినవి
చూచేది.

40.5. ఛందస్సు కూడ భాషలోని నైసర్గిక లక్షణాల్ని పురస్కరించుకొనే ఉంటుంది. సంస్కృతంలో విశేషంగా అక్షర చ్ఛందస్సుంటే, ద్రావిడ భాషల్లో మాత్రాఛందస్సధికం. మాత్రా ఛందస్సు గానయోగ్యమైంది. అక్షరచ్ఛందస్సులో గణనం అధికం.

తెలుగులో ఉన్నంత గేయవాఙ్మయం, తదితర ద్రావిడ భాషలలో లేకపోవటానికి కారణం, అందులోగల అజంతతా పరిణామం అనే లక్షణం. హలంత శబ్దాల్ని గేయాల్లో పాటకనుకూలంగా సాగతీయటానికి వీలుండదు.

కన్నడంలో లేని యతి, తమిళంలో లేని ప్రాస; తెలుగులో నియతంగా ఉండటానికిగల కారణం ఆ భాషలో సహజంగా అవి పొడగట్టటమే. సంస్కృతంలో యతి, కేవలం విశ్రాంతి. కాని తెలుగులోనో, సజాతీయ వర్ణావృత్తి. ప్రాస సంస్కృతంలో ఐచ్ఛికమైన వ్యంజనావృత్తి. తెలుగులో నిది నియతలక్షణం.

తెలుగు సామెతలలోగల యతి-ప్రాసలే వాఙ్మయంలో నియతంగా కవులచే పరిపోషితాలు.

అయినవాళ్ళ కాకుల్లో
కానివాళ్ళకు కంచాల్లో
కూతుళ్ళ కన్నమ్మకు కుర్చీపీటలు
కొడుకుల కన్నమ్మకు గోడపంచలు

ఇటువంటి సామెతల్లో సజాతీయ వర్ణావృత్తిగల యతి విశ్రుతం.

ఈ క్రిందివాటిలో ప్రాస నిలువనాన్ని చూడవచ్చు.

నారు పోసిన దేవుడు
నీరు పోయడా?

దేశాన్నైనా చూడు
కోశాన్నైనా చూడు మొదలైనవి. సామెతిల లోనే కాక జనపదులు సృష్టించిన గేయాలలోను యతో, ప్రాసో రెండూనో గోచరిస్తాయి :

తొలకరి ఒకమబ్బు తొంగిచూచింది
మబ్బులో ఒకమెరవు మెరసి పోయింది
పెరటిలో ఒకజల్లు కురిసిపోయింది
జల్లులో నా మనసు జారిపోయింది

జొన్నచేనులోన సొగసుక త్తెను జూచి
నిన్నటాలనుండి నిద్రరాదు
దాన్ని నన్నుగూర్చి దయచూడు మాధవా!
పొన్నపూలుదెచ్చి పూజసేతు.

ఆటవెలది తెలుగువారి రసనపై ఎలానర్తిస్తుందో నిరూపించ టానికిది నిదర్శనం.

ఒక దంపుడు పాటలో పై లక్షణాల్ని చూడండి :

అంతట రాములవారు
అంగన సీతనుగూడి
సంతసమందుచు వేగ
స్వపురమునకు చనుదెంచి
తమ్ములతోడను గూడి
నెమ్మది రాజ్యము లేలె
ధర్మముతో ప్రజలెల్ల
తామర తంపర లైరి

ఇది మధ్యాక్కరగా ఛందస్సులో నిరూపితం. ప్రాసనియమం రెండేసిపాదాల్లో గోచరిస్తుది. ప్రాసయతి కూడ ఉన్నది.

ప్రపంచ భాషలన్నిటిలోను గల వివిధ చ్ఛందోనియమాలు, వివిధ జానపదగేయాలలో గోచరించేవే అని సపీర్ పండితుని అభిప్రాయం.[1]

40.51 నిసర్గంగా భాషలోగల ధ్వనులసంసర్గరీతులు, అంతకన్న మిన్నగా ఆ భాషలోగల జీవలక్షణాలు—అంటే ఊనిక, స్వరం, కాకువు, సభంగ అభంగ విరామాది వర్ణాతీత లక్షణాలు బాగా పరిశీలిస్తే, ఆ భాషలో ఎట్టి పద్యరచనారీతి అభివృద్ధి అయిందో, లేక కావచ్చో నిర్ణయించవచ్చునని సపీర్ పండితుడే ఉద్ఘాటించాడు[2].

భాషాలక్షణాల్ని కాస్తోకూస్తో పుణికిపుచ్చుకొనే కవి తన కావ్యంలో స్వేచ్ఛగా విహారం కావిస్తాడు.[3]

నిజానికి భాషేసమష్టికళాసృష్టి[4]. కోట్లప్రజాహృదయ ప్రవృత్తులతో సంబంధం కలది ఇట్టి సమష్టి వైభవాన్ని బాగా కొల్లగొట్టి, జాతికి నిపుణంగా తిరిగి సమర్పించే వాడే కవి. ఏ భాషలోనైనా కవులు లేకపోతే అది ఆ భాషాలోపంగాదు. ఆ భాషావ్యవహర్తల

1. Each of these rythmic systems proceeds from the unconscious dynamic habit of language, falling from the lips of the folk language, p. 230

2. Study carefully the phonetic system of a language, above all, its dynamic features and you can tell what kind of a verse it has developed-or if history has played pranks with its psychology what kind of verse it should have developed and someday will.
— Language, p. 230.

3. If he is squeezed a bit here, he can swing a free arm there
— Ibid p. 230.

4. Every language is itself a collective art of expression.
— Ibid, p. 230

సంస్కృతి అటువంటి సృజనాత్మక మూర్తిని సృజించుకోలేక పోయిం దని అర్థం.

40.52 తెలుగుభాషకు ఎటువంటికొరత లేదు. గానానికి, కవితా గానానికి అత్యంత యోగ్యమైంది. కట్టమంచి రామలింగారెడ్డి గార న్నట్లు ప్రతి ఇద్దరు తెలుగువారిలోను ఒకడు కవి కావడం ఆవ్యావ హార్తల సంస్కృతికి నిదర్శనం. వీరికేవిధమైన భాషావాఙ్మయ సంకు చిత మనస్కత లేదు. వీరికి ఔత్తరాహుల కున్నంతగా ఉద్రిక్త సంపద వున్నది. దాక్షిణాత్యుల్కు కున్నంత మేధాప్రాభవం ఉన్నది. అందుచేతనే కానోవు అన్నంభట్టు అనే తమిళ పండితుడిలా అన్నాడు.

"ఆంధ్రత్వ మాంధ్రభాషాచ
నాల్పస్య తపసః ఫలమ్"

కాని ఇట్టి ప్రశంసకు పొంగితే తెలివితక్కువతన మౌతుంది. దీనికి తగినట్లు ఆంధ్రజాతి, వివిధశాస్త్ర కళాసంపదల్ని యథాశక్తిగా అభివృద్ధిచేసుకోవాలి. సారస్వతభాషాధ్యయనంతో నేతృప్తిపడకుండా మాండలికాల్ని ప్రోది చేసుకోవాలి. ప్రామాణిక భాషాస్వరూపం నిరూపితం కావాలి. తెలుగు, వైజ్ఞానిక సాంస్కృతిక బోధనాత్మక భాషగాను ఉపయుక్తం కావాలి. తెలుగు సంక్షిప్త లేఖనాన్ని (short - hand) తెలుగు సైపును బాగా ఉపయోగించుకొని, ప్రజా ప్రతినిధుల సమావేశాలలోని చర్చలు, మహనీయుల ఉపన్యాస సారాంశాలు ఎప్పటికప్పుడు పత్రికల్లో వెలువడాలి. పరిపాలనానికి చెందిన పోటీపరీక్షలు (I. A. S.) తెలుగులో కూడ నిర్వహింపబడు తున్న తరుణమిది. భాష అందుకు నిరోధకం కారాదు. ఇందుకు రాజకీయ భాషాశాస్త్రజ్ఞుల సలహా సంపదల్ని ప్రభుత్వం ఉపయో గించుకోవాలి.

టెలిగ్రాములు కూడ తెలుగులోనే రావాలి. దానికి తగిన సంకేతాలు కల్పితం కావాలి. ఇతర ప్రాంతాలకయితేనే అన్య భాషోపయోగం. తప్పొప్పులనే కొట్లాటలకు స్వస్తిపల్కి జాతి భాషా సాధనాన్ని సర్వతోముఖంగా ఆధునికంగా ఉపయోగించు కోటంలో జాతి ఉపజ్ఞత ఏకోన్ముఖం కావాలి. అందుకు భాషా శాస్త్రపరిచయం డిగ్రీ తరగతులనుండి విద్యార్థులందరికి కలగాలి. వ్యాకరణాలు ఆయాభాషా సారస్వత విద్యార్థుల అధ్యయనానికి పరిమితమైతే చాలు.

## 40.6. అంతర్జాతీయ భాషలు (International languages)

మానవు లత్యంత ప్రాచీనకాలంలో ఒకే భాష మాట్లాడే వారనటానికి బైబిల్ పాతనిబంధనాల్లో ఒక కథ ఆధారం లభిస్తుంది. అది బాబిల్ గోపుర నిర్మాణానికి సంబంధించింది. మానవులందరు స్వర్గానికి పోవాలనే ఆశయంతో ఒక గోపురాన్ని వారు నిర్మిస్తున్నారని, భగవంతుడికి తెలిసింది. వారిలా సమైక్యం కావటానికి కారణం ఒకేభాష అని గ్రహించి ఒకరిభాష ఒకరి కర్థంకారాదని భగవంతుడు శాపం పెట్టాడట. దానితో నిర్మాణం ఆగిపోయిందట. కథలోని సత్యాసత్యాలమాట అలావుంచి చూస్తే ఒకేభాష మానవ సమైక్య సాధనమని, భిన్నభాషలు తద్వ్యతిరేకమనే విషయం విదితమౌతుంది.

40.61. ప్రపంచసంగతి కాకపోయినా పూర్వం ఒక్కొక్క ఉపఖండాన్నో ఖండాన్నో సమైక్యపరచటానికి కొన్నిభాష లుపయుక్తమైనాయి. భారతదేశానికంతటికి పూర్వం సంస్కృతం ఉపయోగపడింది. ఇది అన్ని ప్రాంతీయభాషావ్యవహర్తలు నేర్చుకోవలసింది. సమానంగా కష్టమైంది. 'అమరోక్తులు సకల భూములందున వెలయున్' అని అప్పకవి. (1-61)

40.62 సంస్కృతంలాగానే పాశ్చాత్యదేశాలలో గ్రీకు, లాటిన్ భాషలు వ్యవహరించాయి. మనీషా వ్యాపారమంతా మధ్యకాలంలో లాటిన్ ద్వారానే ఇంగ్లాండునుండి ఇటలీ, స్పెయిన్‌నుండి పోలాండ్ వరకు సాగింది. ఆతరువాత 17, 18వ శతాబ్దాలలో ఫ్రెంచిభాష రాజకీయ ప్రాముఖ్యాన్ని బట్టి యూరోపియన్ దేశాల్ని సమైక్య పరచింది. ఆ తరువాత ఆంగ్ల భాష ప్రాముఖ్యాన్ని పొందింది. దాని వర్ణక్రమంకొంతలోపభూయిష్ఠమైనా, తక్కినదేశాలవారు ఈర్ష్యపడు తున్నా, ఆంగ్ల భాషావ్యాప్తి అభివృద్ధి అవుతునేవచ్చింది

ఈ విధంగా ఒకదేశభాషనుపయోగిస్తే ఆ దేశవాసుల కధిక ప్రాముఖ్యమేర్పడుతుందనే భావంతో 'కృతకభాష'ను కల్పించి, దాన్నే అందరు వాడుకోవాలనే అభిప్రాయం మేధావులలో అధికమైంది. అది నేర్చుకొంటేనే కాని ఎవరికి రారాదు. ఈ విధంగా కల్పింప బడిన భాషలోని వర్ణక్రమం ఉచ్చారణ విధేయంగా ఉండాలి. అక్లిష్టమైన వ్యాకరణ విధాన మవసరం. ఇది జాతీయ భాషల అభివృద్ధి కాటంకం కల్గించేది కారాదు.

40.63 క్రీ.శ. 16 వ శతాబ్దినుండి అంతర్జాతీయ భాషాలవి నిర్మాణాని కెందరెందరో యత్నించారు. వీరిలో మొదటివాడు ఫ్రాన్సిస్ బేకన్. సుమారు 500 భాషలు నిర్మింపబడ్డా ఏది ఆదార ణాన్ని పొందలేదు. విస్మృతమైనాయి. వీటిలో 'వోలపక్' 'ఎస్ప రాంటో' అనేరెండు భాషలు కొంత విజయాన్ని సాధించాయి.

40.64 'వోలపక్' అనేభాషను 1880లో 'మాన్సినర్ ష్లేయర్' అనే జర్మను పండితుడు కల్పించాడు. ఇందులోకి ఇంగ్లీషు, లాటిన్, రోమాన్సు ధాతువులు స్వీకరింపబడ్డాయి. జర్మన్ వ్యాకరణప్రభావం దీనిమీద అధికం. వర్ల్డు+స్పీక్ అనే శబ్దాల సమ్మేళనంచేత ఈపద

మేర్పడ్డది. ఎస్పరాంటో భాషావ్యాప్తితో ఈ భాషావ్యాప్తి సన్నగిలింది.

40.65 ఎస్పరాంటో (Esporanto)1 : దీన్ని 'జామెన హాఫ్' అనే పోలాండ్ దేశీయుడు క్రీ.శ. 1837 లో ఏర్పరచాడు. దీని వ్యాకరణ నియమాలు చాల సులువైనవి. ధ్వని విధేయమైన వర్ణక్రమముంది. గ్రీకు, లాటిన్, జర్మనిక్, రొమాన్స భాషా సంపదతో కూడినది. ఈ క్రింది కొన్ని వ్యాకరణ సూత్రాలు గమనించేది.

i) ప్రతినామరూపం ఒకారంతో అంతమొందుతుంది.
సునో-సూర్యుడు, ఫ్లోరొ—పుష్పం, ఇన్డో-యోగ్యత
టగొ-రోజు

ii) ప్రతి విశేషణం 'అ' కారాంతం :
ఫ్రెలిక-సుఖమైన, పక-శాంతమైన. ఫిక్ర-గర్వమైన.

iii) జకారాంతాలు బహువచనాంత రూపాలు: సునోజ్, ఫ్లొరొజ్.

iv) కు-ప్రశ్నార్థకం:

ల బిర్డొ కెంటెస్-ఆ పక్షి పాడుతుంది, కు లబిర్డొ కెన తస్-ఆపక్షి పాడుతుందా? మొదలైనవి మచ్చుకు ప్రదర్శితాలు.

ఇది ప్రధానంగా లాటిన్ జెర్మానిక్ భాష. తొలుత యూరప్ ఖండంలోను, తరువాత ప్రపంచ మంతటాను వ్యాపించింది. లండన్

1. Esperanto is the only one which has become really well-known and which comes to mind immediately when inter—national languages are mentioned: Introductory Linguitics, p. 457 : Hall, (Jr.)

నగరములో ఇంటర్నేషనల్ ఎస్పరాంటో లీగ్, జనీవాలో యూనివర్సల్ ఎస్పరాంటో సంఘం అనే అంతర్జాతీయ సంస్థలేర్పడ్డాయి. మొత్తంమీద ఎనభై లక్షలదాకా ఈ భాషను మాట్లాడుతారని తెలుస్తుంది.

దీనికి కొంత వాఙ్మయంకూడ ఉన్నది. దీన్ని యూరపు ఖండంలోని నెదర్‌లాండ్స్, జెకోస్లావేకియా, డెన్మార్క్, స్విడ్జర్‌లాండ్, హంగరి, యుగస్లవేకియా వంటి చిన్న దేశాలవారు విశేషంగా అభ్యసిస్తున్నారు.

ఆఫ్రికాలో దీని వ్యాప్తి చాలాతక్కువ. ఆసియా ఖండంలో జపాన్, చైనాలలో ఈ భాష ప్రచారమైంది. చైనీయులు దీన్ని క్రొత్త రీతుల్లో వాడుతున్నారు. చుంకింగ్‌నుండి యీ భాషలో పత్రికకూడ నడుపబడింది.

ఆస్ట్రేలియాలోను, దక్షిణతూర్పిండియా దీవులలోను, యుద్ధానికిపూర్వం విశేషవ్యాప్తిచెందిందీ భాష. దక్షిణసముద్ర ద్వీపాల్లో బ్రిటిష్ అధికారులు ఈ భాషలో చిన్నచిన్న పత్రికలు కూడ నడిపారు.

అమెరికాలో బ్రెజిల్ దేశంలో ఈ భాష, అధికారికంగా వాడబడుతున్నది. అర్జెంటైనా, చిలీ, క్యూబా, కెనడా, మెక్సికోలలో కూడ ఇది అక్కడక్కడ గోచరిస్తుంది.[1]

---

40. 66 ప్రాథమిక ఇంగ్లీషు (Basic English) ఆంగ్ల భాషనుండి సేకరింపబడ్డ 850 పదాలకీపేరుపెట్టారు. ఆంగ్ల భాషాధ్యయనం సులభతరంచేయటానికిది కల్పితం. 1925 లో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయానికి చెందిన సి.కె. ఆగ్డన్ దీన్ని నిర్మించటాని కారంభించాడు. విన్‌స్టన్

---

1. విశ్వసాహితి - vi - పుటలు. 598 - 99

చర్చిల్ దీని ప్రచారానికి తోడ్పడ్డాడు. ఆంగ్లంలో చాల పుస్తకాలు ఈ భాషలోకి తీసుకురాబడ్డాయి. ఇది అంధులకుకూడ పనికి వచ్చేటట్లు కావించారు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పరదేశీయుల కందరికి ఈ భాష బోధింపబడుతున్నది. దీనిసాయంతో వారక్కడ భాషాటంకాన్ని అతిక్రమించారు.

ఇందులోని 805 పదాలలో 600 నామవాచకాలు, 100 విశేషణాలు. 100 క్రియాసర్వనామాదులు. విశాలమైన భాషనుండి సంక్షిప్త భాషానిర్మాణానికిదో ప్రయత్నం [1]

**40. 67 ఏకభాష - ఏక ప్రపంచం :** మొత్తంమీద అంతర్జాతీయ భాషానిర్మాణోద్యమంగాని, ప్రచారాదులుకాని ఒకప్పుడున్నంతగా తరువాత లేవు. ఆ ఉత్సాహం క్రమంగా సన్నగిల్లింది. అందుకుకారణం ఏకభాషా ప్రపంచాలపై ప్రజలకు విశ్వాసం క్షీణించటమే. ఇది అసాధ్యమని, అనవసరమనీ ప్రజలు భావించారు[2].

ఏకభాషను సాధించటం అసంభవమైతే కావచ్చు. అనవసరం కూడ కావచ్చు. కృతక భాషావ్యవహార యంత్రంకాదు మానవుడు. భాషచాటున ఉద్రిక్తతఉంది వర్ణాతీతమైన ఛందోలక్షణాలు (Prosodical features) ఉంటేనే భాషసజీవమౌతుంది. మేధాసంప

---

1. విశ్వసాహితి - VI - పుట 743.

2. Perhaps, the major reason why the international language movememt has, on the whole, been losing momentum is that more and more members of the general Public are coming to realise that the Ideal of 'one world, one language' is so unrealistic as to be quite unattainable and is in addition quite unnecassary....Introductory Linguistics - p. 458, Hall (Jr.

నిత కృతక భాషావ్యవహారం చిరకాలముండదు. అందుకే అవి వ్యవహారోపయోగం కాలేకపోయాయి.

భాషకన్న భావం ముఖ్యం. భావసమైక్యం సాధిస్తేచాలు. అందుకు అనువాదమే శరణ్యం. బహుభాషాకోవిదుల్ని ప్రపంచ సంస్థలు పోషించి, వారిచే ప్రపంచవ్యవహారాలు అనువదింపచేస్తుండాలి. నానాత్వంలోనుండే ఏకత్వం సాధించాలి. మానవుడు భౌతికంగా చాల సన్నిహితుడౌతున్నాడు. ప్రాచీనులు పేర్కొన్న 'వసుధైక కుటుంబ సాధనం' వాస్తవికం కావలసిన సమయ మాసన్నమైంది. ఇందుకు భాష అవరోధం కాకూడదు. కొన్నిగంటల్లో ప్రపంచాన్ని చుట్టుముట్టి రాగల్గుతున్నా డీనాటి మానవుడు. ఏ క్రొత్త భావమైనా కొన్ని గంటలలో అవగతం చేసుకోగలడు. అందుకు తగిన భాషాశాస్త్రపద్ధతులున్నాయి. భాషాశాస్త్ర దృక్పథం అందుకే ప్రతి వ్యక్తికి అవసరమౌతున్నది. భాష నో వ్యవస్థగా అధ్యయనంచేసే దృక్పథం అలవడాలి ప్రతి వ్యక్తికి. శాస్త్రశేముషిగలవారి కేదీ అసాధ్యం లేదు.

—o—

# ధ్వన్యాత్మకలేఖనం
## Phonetic Transcription.

1) మంచి maɲɟi
2) గంట ɡaɳʈa
3) అఆలు aʔa:lu
4) పద్యం ajjãʋ
5) గిన్నె in̪n̪æ
6) గడప ˉɖapa
7) మామయ్య ma:ʋ̃ajja
8) సత్యనారాయణ saθan̪n̪a:ra:jaɳa
9) మధ్యాహ్నం majjha:n̪n̪aʋ̃
0) గూడు u:ɖu గోడు ɡo:ɖu
11) గూడ u:ɖa గోడ ɡə:ɖa
12) మంచం aɲɟãʋ
13) గోళ్లు(గోరు ఒక) ɡo:llu , మాంసం ma:ʋ̃saʋ̃
14) సింహం iʋ̃haʋ̃ (15) దుఃఖం duhkhaʋ̃
16) కొట్టేవ్ oʈʈe:ʋ (17) కొట్టేవ్ koʈʈæ:ʋ
18) కుంచె uɲɟæ (19) మెట్ట mæʈʈa
20) మెట్టు meʈʈu (21) ఇల్లు illu/jillu
22) ఇక్కడ jikkaɖa (23) ఊరు wu:ru
(24) గొఱ్ఱె ɡorræ (25) కంచె kaɲɟæ
(26) వాడు wa:ɖu (27) వేడి ve:ɖi
వేళ væ:la (29) కవ్వం kaʋʋaʋ̃
(3 కాయ ka:ja (31) యాతన ja:tan̪a
(3 అయ్య ajja (3 కఱ్ఱ karra
(3 కళ kala (3 కళ్లెం kalleʋ̃
(36) లాగు la:ɡu (3 మల్లె mallæ
(3 కల kala (39) దణ్ణం ɖaɳɳaʋ̃
(4 కంఠం kanthaʋ̃ (41) సంఘం sa h~ʋ̃
(4 సంగతి saɲɡati (43) అంగడి a, a, i
(44) రాజు ra:ʒu (45) సరాసరి sa : ari

(46) క్రమం kramaʊ̃ (47) తర్కం tarkaʊ̃
(48) సన్యాసి ʂanɲa:ʂi (49) అవున్రా awunra
(50) గుంజు gunʒu (51) పద్దెనిమిది pajjhenimidi
(52) రోజు ro:ʒu (53) గాజు ga:ʒu
(54) నాజుకు na:ʒu:ku (55) జూకాలు ʒu:ka:lu
(56) జడ్డిగం ʒaddigaʊ̃ (57) జేన jæ:na
(58) జిలుగు jilugu (59) జెల్ల jælla
(60) జేబు je:βu (61) గజ్జె gajjæ
(62) చిలుక ɕiluka (63) చీమ ɕi:ʋa
(64) చేప ɕæ:pa (65) చేట ɕæ:ṭa
(66) చదువు ɕaduʊ̃ (67) చుక్క ɕukka
(68) చొప్ప ɕoppa (69) సస్యం ʂaʂjaʊ̃
(70) హాస్యం ha: aʊ̃ (71) దృశ్యం druʂjaʊ̃
(72) శివుడు ʂiwu u (73) సెలవు selaʊ̃
(74) అంతఃపురం a ahpuraʊ̃
(75) శీతాకాలం ʂi:ta:ka:laʊ̃
(76) సెట్టి setti (77) సీల ʂi:la
(78) సేప్పు se:pu (79) కాఫీ ka:fi
(80) కాస్త ka:ʂta (81) దస్తూరి daʂtu:ri
(82) పుస్తె puste (83) కబురు kaβuru
(84) బొత్తిగా βottiga: (85) కస్తూరి kaʂtu:ri
(86) వస్తువు woʂtuʊ̃u (87) ఆఫీసు a:fi:ʂu
(88) ఫస్టు faʂtu (89) కధ kadha
(90) రథము radhaʊ̃ (91) ఫలము phalaʊ̃
(92) ఢంక dhaŋka (93) గాఢం ga:dhaʊ̃
(94) తీవి thi:ʋi (95) పలము palaʊ̃
(96) తనిఖీ tanikhi: (97) వగలు wagalu
(98) తగాదా tagã:dã (99) బావ βa:ʋã
(100) తబలా taβala (101) దొన్నె donnæ
(102) మామిడి ma:ʊ̃idi (103) చర్చ ɕarɕa
(104) చంద్రుడు ɕandrudu (105) శిష్యుడు ʂiʂjudu
(106) బ్రహ్మ βramha (107) చమ్డా ɕemda:
(108) బ్రాహ్మణుడు βramhaɳudu (109) పాప pa:pa

(110) వాన wə:nə (111) మ్యాపు :mæ:pu
(112) పురుగు uruʒu (113) అక్కర్లె :əkkərlæ
(114) సగం əhəʊ̃ (115) కోమటి :kəʊəti
(116) బాంబడు Bæ:mβəḍu (117) కోడలు :kə:ḍəlu
(118) రొక్కం rəkhəʊ̃ (119) విశ్వస్థ :ʋisʋəʂθə
(120) విశ్వాసం ʋisʋə: əm (121) మధ్య :məjhə
(122) ఆశ్వాసం ə:sʋə: əm (123) ఆస్థ :ə:ʂθə
(124) పరిష్కాం pəriʂ ə:rəʊ̃
(125) స్వతఃగా ʂwətəhə:
(126) అపరాహ్ణము :əpərə. ṉəʊ̃
(127) ఘ్రాత్కారం ɸu:tkə:, əʊ̃
(128) తన్నానంటావ్ :təntə:nəntəʊ̃
(129) ధిక్కారం dhiʔkkhə:rəʊ̃
(130) ఏంచేస్తున్నావు je:meje:ʂtunnə:ʊ̃
(131) నిశ్శబ్దం nissəbdəm

| | FRONT | | CENTRAL | | BACK | |
|---|---|---|---|---|---|---|
| | un-Rounded | Rounded | un-Rounded | Rounded | un-rounded | ounded |
| HIGH | i | ü | ɨ | u̇ | ï | u |
| OWER-HIGH | I | Ü | Ɨ | U̇ | Ï | U |
| HIGHER-MID | e | ö | ė | ȯ | ë | o |
| MEAN-MID | E | Ω̈ | ə | Ω̇ | Ë | Ω |
| LOWER-MID | ɛ | œ̈ | ɛ̇ | ɔ̇ | ʌ | ɔ |
| HIGHER-LOW | æ | ω̈ | æ̇ | ω̇ | æ̈ | w |
| LOW | Æ | ɒ̈ | ɑ̇ | ɒ̇ | a | ɒ |

# ప్రపంచ భాషలలోని కొన్నిముఖ్య ధ్వనులు ఐ.పి.ఏ. గుర్తులు.

| | | |
|---|---|---|
| 1. క్ — k | 16 ట్ — t | 31 భ్ — bh |
| 2. ఖ్ — kh | 17 ఠ్ — th | 32 మ్ — m |
| 3. గ్ — g | 18 డ్ — ɖ | 33 య్ — j |
| 4 ఘ్ — gh | 19 ఢ్ — ɖh | 34 ర్ — r |
| 5 ఙ్ — ŋ | 20 ణ్ — ɳ | 35 ఱ్ — R |
| 6 చ్ — c | 21 త్ — t | 36 ళ్ — r̲ |
| 7 ఛ్ — ch | 22 థ్ — th | 37 ల్ — l |
| 8 జ్ — ɟ | 23 ద్ — d | 38 వ్ — v |
| 9 ఝ్ — ɟh | 24 ధ్ — d' | 39 వ్ — ʋ |
| 10 ఞ్ — ɲ | 25 న్ — n | 40 వ్ — w |
| 11 చ్ — ʧ | 26 త్ — t̲ | 41 శ్ — S |
| 12 జ్ — j | 27 న్ — n̲ | 42 ష్ — ʂ |
| 13 ఞ్ — ɲ | 28 ప్ — p | 43 స్ — S |
| 14 చ్ — ʧ | 29 ఫ్ — ph | 44 హ్ — h |
| 15 జ్ — ʒ | 30 బ్ — b | 45 — ħ |

| | | |
|---|---|---|
| 46 — ʔ | 51 ఫ — f | 56 — G |
| 47 ళ్ — l | 52 ధ — θ | 57 — N |
| 48 ఱ — l | 53 ద — ð/s | 58 — × |
| 49 — Φ | 54 మ్ — ŋ | 59 — ɣ |
| 50 — β | 55 — q | |

## స్వరములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| i అ | a | v ఉ | u | IX ఎ | (æ) | | |
| ii ఆ | a: | VI ఊ | u: | X ఏ | (æ:) | | |
| iii ఇ | i | VII ఎ | e | XI ఒ | o | | |
| IV ఈ | i: | VIII ఏ | e: | XII ఓ | o: | | |

1. క్
2. ఖ్
3. గ్
4. ఘ్
5. ఙ్
6. చ్
7. ఛ్
8. జ్
9. ఝ్
10. ఞ్
11. చ్
12. జ్
13. ఞ్
14. చ్
15. జ్




**THE ORGANS OF SPEECH**

B — Back of the tongue
E — Epiglottis
FP — Food Passage
LL — Lips
R — Root of the Tongue
S — Soft Palate
TT — Teeth
V — Position of the vocal cords

Bl — Blade of the tongu
F — Front of the tongu
H — Hard Palate
P — Pharyngal Cavity (Pharynx)
TR — Teethridge
U — Uvula
W — Wind - pipe